శ్రీరస్తు.

# ఆంధ్రకవిత్వచరిత్రము

శ్రీబసవరాజు వేంకటఅప్పారావు, బి. ఏ.; బి. ఎల్.,

గారిచే. విరచితము.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారిచే

ప్రకటితము.

# పీఠిక.

నాగ్రంథమునకు నేనే పీఠిక వ్రాయుట, నాకు నేనే డండోరా వేసికొన్న ట్లుండును. కారణాంతరములచే నట్లు చేయవలసివచ్చె. గుణదోషవిమర్శనము రసజ్ఞులకే విడిచితిని. ఇచ్చట గ్రంథరచనయం దేనవలంబించిన పద్ధతులఁగూర్చి యొకటి రెండుమాటలఁ దెల్పనెంచితిని.

సాహిత్యవిషయమునఁ బ్రాక్పశ్చిమదేశములకు విరోధభావము తగదనియుఁ, బద్ధతులు వేఱయినను బరమార్థము రెంటికిని రసప్రతిపాదనమేయనియు గ్రహించినవాఁడనగుటచేఁ బాశ్చాత్యసాహిత్యవిశారదుల యభిప్రాయముల నచ్చటచ్చట స్థాలీపులాకన్యాయమున సూచించుచువచ్చితిని. ప్రాక్పశ్చిమసంయోగ మసంభవమనియు, 'నెవరికివారే యమునాతీరే' యనియు, నమ్మువారికి నేనవలంబించినపద్ధతి రుచింపకపోవునేమోకాని, విశాలదృష్టితో సమరసభావముతో సాహిత్యచరిత్రము నవలోకించువారికి సాహిత్య మెట్లు జీవసూత్రబద్ధమై దేశకాలపాత్రానుసారముగ మార్పులఁ జెందుచు, భిన్నపరిణామములఁ దాల్చుచు, నభివృద్ధిఁ జెందుచుండునో గోచరింపకమానదు. అదియునుంగాక, విద్యాలయములఁ గొంతవఱకుఁ బాశ్చాత్యసాహిత్యమును జదివినవాఁడ నగుటచే, నాయభిప్రాయముల నచ్చటచ్చటఁ బాశ్చాత్యవాసన లుండక

పోవు. అట్టివానినెల్ల రసజ్ఞులు నిష్పక్షపాతబుద్ధిం బరిశీలించి గుణలేశమునుమాత్రమే గ్రహించెదరుగాత!

రెండవవిషయము: పాశ్చాత్యవాసనలు నన్ను వీడక వెంటాడుచున్నను, భారతీయనాగరికతకునెల్ల మూలకందమనఁదగు సంస్కృతవాఙ్మయమును జులకనఁగఁ జూడక మూలాధారముగనే గ్రహించి సర్వత్ర వాదమునకుఁ గడంగితిని. కాని, సాంస్కృతికాలంకారికుల ప్రధానసూత్రమును మాత్రమే కయికొని, యప్రధానము లగు వానినెల్ల విడిచి సాహిత్యమునకును,రసమునకును,శైలికిని సంబంధించిన ముఖ్యసూత్రములచర్చతోడనే గ్రంథమును బూరించితిని. అప్రధానవిషయములఁగూర్చి విపులవ్యాఖ్యానము గావలసినవారికి పూర్వసంప్రదాయానుసారములగు లక్షణగ్రంథము లెన్నియేనియుంగలవు. 'చక్కనిరాజమార్గమే యుండఁగా సందులగొందుల దూఱనేలనే యోమనసా!' యనుత్యాగరాజవాక్యమునేఁ ప్రమాణముగఁ గయికొని కావ్యతత్త్వాన్వేషణమున ముఖ్యసూత్రములనే యాధారముగఁ గొని రాజమార్గముననే నడువఁ బ్రయత్నించితిని.

ప్రసంగవశమున నెచ్చటనేనిఁ బ్రస్తుతపండితులఁగూర్చి పరుషవాక్యములఁ బల్కియుంటినేని పండితులు వానిని వ్యష్టిపరముగ నన్వయించుకొని యాగ్రహింపక నేఁజేయువాదముతో సమన్వయముఁ గావించుకొనెదరుగాక! దూషణభూషణ

తిరస్కారములు ఆత్మకుఁ జెందవని నమ్ము మన వేదాంతులకు నిగ్రహము సహజగుణమే కదా!

ఈ గ్రంథరచనవిషయమున నాకుఁ బ్రేరకులయినట్టి శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికిని, సహజముగఁ బాదుపాల కన్నునుగూడ 'బద్ధకస్తుఁడ' నగు నాలోపములనెల్ల సర్దుకొని వచ్చుచు గ్రంథమునఁ జాలభాగము వ్రాసిపెట్టి మూలమును ప్రమాదరహితముగ సంస్కరించిన మన్మిత్రులగు శ్రీ పొన్నలూరి సూర్యనారాయణశర్మగారికినిఁ గృతజ్ఞుఁడ నగుచున్నాఁడను. పరుల యభిప్రాయములఁ గైకొనునపుడెల్ల వారి పేరులఁ బొందుపఱిచియేయుంటిని. కాని యెచ్చటనేనిఁ బ్రమాదవశమున నెవ్వరిపేరు లేనిఁ దెలుప మఱచితి నేని యయ్యది గ్రంథచౌర్యముగఁ బరిగణింపక ప్రమాదమాత్రమే యని కరుణాలసదృష్టితో రసజ్ఞులు వీక్షింతురుగాక!

ఈ గ్రంథమున కాచంద్రార్కస్థాయి యబ్బుగావుతమని గాని, నాకు సాహిత్యరసపోషణబిరుదము లభించుఁగావుత మని కాని కోరునంతటి ఛాందసుఁడఁ గాకపోయినను, సాహిత్యచరిత్రమును యథాశక్తిఁ బరిశీలించి సాహిత్యశ్రేయము నభిలషించుచుండినవాఁడ నగుటచే, నీనాఁటి పండితులలోఁ జాలమందికి మదీయాభిప్రాయములు సంస్కారచ్యుతిసూచకములుగను మూలచ్ఛేదకములుగను గన్పట్టినను, వెనుకటికి మహాకవి భవభూతి

శ్లో. యేనామ కేచిదిహ నః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కిమపి; తాన్ ప్రతి నైష యత్నః,
ఉత్పత్స్యతేఽస్తి మమకోఽపి సమానధర్మా;
కాలో హ్యయం నిరవధిర్విపులాచ పృథ్వీ.

యనుశ్లోకమునఁ జెప్పినట్లు నారీతి సాహిత్యవిషయముల నభిప్రాయములు గల్గువారు పుట్టకపోరని యాసించునంతటిసాహసినే! దైవకృపవలన నట్టిసమానధర్ములు ఇప్పటికే చాలమంది యుద్భవిల్లి నాకు వాఁదోఁడుగ నున్నందులకు సంతసించుచుంటిని.

బెజవాడ
1921.

ఇట్లు,
బసవరాజు వేంకటఅప్పారావు.

# విషయసూచిక.

## ప్రథమప్రకరణము.

### రసాత్మకం వాక్యం కావ్యమ్.

స్వాభావికవ్యాకరణపద్ధతి. ౧. వచనభేదములు, ౨. లింగభేదములు, 3. పురుషవిభేదములు, ౪. కాలవిభేదములు - వాడుకపదములస్వరూపమును సమర్థించువిపులవ్యాకరణ మవసరము- శాస్త్రీకవ్యాకరణము - విధినిషేధములు- ౧. ధాతురూపములు, ౨ లింగవిభేదవిషయములు, 3. వచనవిభేదవిషయములు, ౪. కాలవిభేదములు, విభక్తులు - ఆంధ్రవైయాకరణుల యధికారనిర్వహణము, ౧. అర్ధానుస్వారము, రేఫశకటరేఫముల ప్రశంస-వ్యాకరణమునకుఁ గావ్యముపైఁ బ్రభుత్వము లేదు- రసమే ప్రయోగములసాధుత్వమును నిర్ణయించును - కావ్యమునకును తర్కశాస్త్రమునకును గలభేదము-కావ్యమునకును ధర్మశాస్త్రమునకును గలభేదము - సమష్టిమానవశ్రేయమే ధర్మశాస్త్రనిరీక్షణము-వ్యక్తియొక్కస్వతంత్రరసప్రవృత్తియే కావ్యనిరీక్షణము-కావ్యమునకును నీతిశాస్త్రమునకును గలభేదము- నీతిశాస్త్రస్వభావమును, దానిప్రధాననిరీక్షణతత్త్వమును - కావ్యము నీతిని బోధింపవలెనా? ౧ విద్యానాథుఁడు, ౨ శాస్త్రములు చేయుపనులను కవి చేయఁజూచుట యనవసరము- కావ్యమున నైతికప్రయోజనము లప్రధానములు - మమ్మటుని మతము - కావ్యమున నీతి ధ్వనిమాత్రముగ నుండును - కావ్యము నీతిబోధకమా? ౧ ప్లేటో అరిస్టాటిలులమతము - ౨ లాఙ్గినీసుమతము - ఆంగ్లేయసాహిత్యవిమర్శకులమతము, ౧ సిడ్నీ ౨ షేక్స్పియరు, 3 మిల్టన్, ౪ పోపు మొదలగువారు - ౫ పరాసువిప్లవముతరువాతికవులు - ౬ మాత్యూ ఆర్నాల్డుని మతము "కావ్యముజీవితవిమర్శనమే యగును" - ౭ రస్కిన్, కార్లైలు వర్గమువారిమతము. ౮ స్విన్బర్ను వర్గమువారిమతము. "కావ్యము నీతిబాహ్యముగఁగూడ నుండ

వచ్చును. ౯. ఆధునికవిమర్శనపద్ధతి, ప్రత్యక్షవిషయవర్ణనము. ౧౦ రవీంద్రునివర్గమువారిమతము. "నీతి కావ్యమున ధ్వని మాత్రముగ నుండును." ముస్లిమ్‌వాఙ్మయము, రూబయత్తులనుకావ్యములస్వరూపము - సుఫీకవులపద్ధతి నీతికిని రసమునకును సమన్వయ మనఁదగును. కావ్యమునకు నీతి ధ్వని మాత్రముగ నుండవలెను - కావ్యమునకు విశిష్టనీతిధర్మములే వర్జించును - కావ్యమునకును వేదాంతమునకును గల భేదము - వేదాంతమునకు నిర్వికారతయు, బుద్ధివిశేషమును నావశ్యకములు - కావ్యమున భావోద్రేకమును జిత్తవికారములును నావశ్యకములు - మతమునకును గావ్యమునకును గలసంబంధము-౧ మతము కావ్యమునకు వలయువిషయసామగ్రిని సేకరించియిచ్చును. ౨ కాని, మతమునకు సమష్టి మానవశ్రేయమే లక్ష్యము, కావ్యమున వ్యక్తియొక్క రసప్రవృత్తియే లక్ష్యము. కవి మతవిషయములలో రసవత్తరములగువానినే సంగ్రహించును. కావునమతము కావ్యమునకు సాధనమాత్రమే యగును-సారాంశములు! ౧ కావ్యమునకు రసమే ప్రధానము. 'రసాత్మకమ్' అనుసూత్రమును, మమ్మటుని 'నియతికృతనియమరహితాం' అనువ్యాఖ్యానమును నాదరణీయంబులు-ఆధ్యాత్మికకావ్యమతము ౧ ఆనందకుమారస్వామి, "కావ్యమాధ్యాత్మికశక్తికి సంజ్ఞారూపకము"-భారతచిత్రశిల్పముల సిద్ధాంతము ౨ అరవిందఘోషు "ఆధ్యాత్మికశక్తియే భారతీయులసర్వస్వము", భారతధర్మస్వరూపము - భారతీయకావ్యధర్మము, "కావ్యము మానవాత్మ ప్రకృత్యాత్మ పరమాత్మలకుఁ గలసంబంధమును వర్ణించును" - కావ్యశక్తియే వాగ్దేవి యనఁదగును-తాంత్రికులమతము, "పశ్యంతీశబ్దప్రయోగము, దానిభావము- కావ్య

శక్తి జన్మప్రకారము - వైదికద్రష్టలకావ్యనిర్వచనములు-కవికి కావ్యశక్తిసాక్షాత్కార మవసరము - ఆధ్యాత్మకశక్తిప్రదర్శకములగు నుత్తమకావ్యములే కవిత్వపరమావధి - "ప్రజ్ఞాపురాణీ" యనఁబరఁగుభారతశక్తి, కొన్నిశంకలు - ఆధ్యాత్మికజీవితస్వభావము - ఆధ్యాత్మకజీవితము లక్ష్యము. శరీరమార్గాదులు సాధనమాత్రములు. ప్రాచ్యపాశ్చాత్యధర్మనిరీక్షణములకుఁ గలభేదము-ఆధ్యాత్మికకావ్యరచనాసూత్రము- కావ్యమాధ్యాత్మికశక్తికి సంజ్ఞారూపకము - 3 రవీంద్రునిమతమును వైష్ణవసుఫీకవులమతమును - మమ్మటుని నిర్వచనమును, విశ్వనాథుని "రసాత్మకంవాక్యం" అనుసూత్రమును నాదరణీయంబులు - "రసాత్మకం వాక్యం కావ్య" మ్మనుసూత్రముయొక్క ప్రాతిపదికౌచిత్యము, ౧ 'వాక్య' మ్మనఁగా వాక్శక్తియే" ౨ రసము కావ్యమున కాత్మయగును.

---

## ద్వితీయప్రకరణము.

### రసస్వరూపనిరూపణము.

"రసమన నేమి?" విశేష్యవిశేషణములకుంగల సంబంధము-రసికుఁడు లేనిచో రసము జనింపదు. రసికుఁడు నిమిత్తమాత్రుఁడు - రసికునకును, రసమునకును గలయన్యోన్యాశ్రయ సంబంధము. "రస" నిర్వచనము, లాక్షణికమతము - "రస" జన్మకారణములు. ౧. రసికుని జన్మాంతరలబ్ధసంస్కారము, ౨. వస్తువులందు నిబిడమైయున్న రసవిశేషము - రసనిర్వచనము ౧. కవియొక్క పరిపాకము, ౨ వస్తువుయొక్క యాలంబము - 3. కావ్యముయొక్క రససంవాహకత్వము-భావానుభూతియే. రసమునకు జన్మకారణము - స్థాయీభావమే రసము - లాక్షణి

కుల రసనిర్వచనము, గుప్తపాదాచార్యులమతము, - కావ్యమునకును చిత్రశిల్పములకును గలభేదము - ౧. చిత్రశిల్పములయందు రసముయొక్క స్థాయిభావమే, అనఁగా నిశితతీక్ష్ణతయే ప్రదర్శితమగును. కావ్యమున వివిధభావములు వర్ణితములగును. ౨. చిత్రశిల్పము లింద్రియసాహాయ్యముచే రసమును బ్రదర్శింపఁగల్గును. కావ్యము ఇంద్రియసాహాయ్యము నపేక్షింపని శుద్ధమానసికవ్యాపారమే - విభావాదికములు రసప్రకటనమునకును, రసోపలబ్ధికిని సాధనమాత్రములే - రసముయొక్క జన్మప్రకారము. "కవిద్రష్ట" యని యంగీకరించువారిమతము, - రసము మొదట తీక్ష్ణభావముగ జనించి విభావాదికముల పరామర్శచే దుదకు స్థాయిభావము నొందును - కవికి రససాక్షాత్కారము కావలెను - వాల్మీకిచరిత్రము - రసస్వరూపము-విభావాదికములు రసముయొక్క బాహ్యస్వరూపమును బ్రదర్శించును - లక్షణగ్రంథములలోని విభావాదికప్రశంస యుదాహరణమాత్రమే - విభావాదులు రసమునకు వైవిధ్యము నొడఁగూర్చును - విభావాదులు సాధనమాత్రములు - విభావాదులప్రయోజనములు, ౧ రససిద్ధికిఁ దోడ్పడుట, ౨. రసమునకును గావ్యమునకును వైవిధ్యము నాపాదించుట - భిన్నత్వాంతర్గర్భితమగు నేకత్వమే సృష్టిలక్షణము - భిన్నత్వాంతర్గర్భితైకత్వము రసమునఁట్లఁగూడ నన్వయించును - విభావాదులు రసమునకు స్వరూపముఁ గల్పించును. - విభావాదులు రసమునకుఁ బ్రస్తారభేదములఁ గల్పించును - విభావాదులవిషయమున గమనింపవలసినవిషయములు - స్థాయిభావతత్త్వము - స్థాయిభావమనఁగ నేమి? - రసజన్మకారణము. భావానుభవమే - భావోదయమునకు జన్మాంతరసంచితచిత్త

సంస్కారమే కారణము - స్థాయీభావము, ఆలంకారిక నిర్వ చనములు - లవణాకరోపమయొక్క సార్థకతయు, సందర్భ శుద్ధియు - పండితరాయలనిర్వాచనము - స్థాయీభావమేగసము- రసముయొక్కబాహ్యస్వరూపము - స్వాదముయొక్కనిర్వాచ నము - స్వాదముయొక్క జన్మప్రకారము-రసమునకుజన్మకార ణములు, ౧. రసికుని చిత్తపరిపాకము, ౨. వస్తుసందర్శనము, రసవృద్ధిప్రకారము - అవస్థాక్రమముయొక్కప్రశంస - శృం గారరసముయొక్క దశావస్థలు - రసముయొక్కయవస్థల వర్ణిం చుటలోఁ గవిసర్వస్వతంత్రుఁడు - గసముయొక్కదశావస్థాక్రమ మునకుఁ బాత్రలయధికారమునసుసరించి ప్రసక్తికల్గును - అవస్థాక్రమ మవశ్యానుభవనీయము గాదు - లాక్షణికులచే నుదాహరింపఁబడిన యవస్థాక్రమముయొక్క ప్రయోజనము- రసాభివృద్ధియు ప్రాణికోట్లయభివృద్ధివలె జీవసూత్రబద్ధమై యుండును - ఉదాహరణములు, ౧. ప్రకృతిస్వభావము, ౨. మానవునివిషయము,—సీతారాముల సౌఖ్యానుభవవర్ణనము- శ్రీరాముని వియోగావస్థావర్ణనము - రసపారవశ్యస్వభావము- స్థాయీభావమునకును రసికునకునుగల యద్వైతభావము - స్థాయీభావము విరుద్ధభావములనుసయితమాత్మభావమును దాల్చునట్లొనర్చును - లైలామజ్నూనులకథ-స్థాయీభావము యొక్క విశ్వవ్యాపకత్వము - ఉపసంహారము.

---

## తృతీయప్రకరణము.

మానవధర్మమున రసము దేని నాశ్రయించుకొనును?

మానవధర్మముయొక్క నిరీక్షణము - మానవజీవితము యొక్క భాగములు, ౧. ఆత్మజీవితము, ౨. సాంఘికజీవితము-

మానవునకును, సంఘమునకును గలసంబంధము - ఆర్యధర్మము. ఆత్మజీవితమునకును సాంఘికజీవితమునకును సమన్వయముఁ గూర్ప యత్నించును - ఆర్యధర్మము ధర్మార్థకామమోక్ష యుతము - జీవితసంరంభముయొక్క స్వభావము - ధర్మశాస్త్ర నిరీక్షణము, విధులయొక్కస్వభావము - కామముయొక్క స్వభావము - కోర్కులు వివిధములు - కామ్యార్థములు భిన్న మగుచో నెట్లు? శాస్త్రావశ్యకత-శాస్త్రము కామమును శాసింపఁ జాలదు - శాస్త్రము కవిత్వమును రసమును నిరోధింపఁజాలదు- రసము అర్థము నాశ్రయింపదు - రసము మానవసహజమగు కామము నాశ్రయించును - కామము విశ్వవ్యాపి - ప్రకృతి కూడ భావసంచలనము నొందును - జగదీశచంద్రవసువుగారి నూతనసిద్ధాంతము - వాల్మీకిరామాయణమునుండి యుదాహర ణములు - పాశ్చాత్యులసిద్ధాంతము-౧. వర్డ్సువర్తు, ౨. టెన్నిసన్, ఉపసంహారము-కావ్యముయొక్క ప్రయోజన మానంద జనకత్వమే - కావ్యమునకును శాస్త్రములకును బరమార్థమున విశేషభేదములేదు - పాశ్చాత్యులమతము, ౧. ఆర్నాల్డు, ౨. వర్డ్సువర్తు - పూర్వపుఋష్యాశ్రమములు రసభావప్రపూత ములు.

---

## చతుర్థప్రకరణము.

### అనంతో వై రసః.

కామమునకును జీవసూత్రమునకును గలసంబంధము. పాశ్చాత్యమనశ్శాస్త్రసిద్ధాంతములు, డార్విన్ పండితుని ప్రపంచ పరిణామసిద్ధాంతము-మానవుని సప్తావస్థలఁగూర్చి షేక్స్పియరు కవి యభిప్రాయము - శ్రీశంకరాచార్యులయభిప్రాయము.-

మనోవికారములు శరీరస్థితిననుసరించును - ఆర్యధర్మమునందలి యాశ్రమపద్ధతులప్రయోజనము - మానవుని యభివృద్ధిని గూర్చిన భిన్నాభిప్రాయము, ప్రాచ్యదేశవాసుల యభిప్రాయము-పాశ్చాత్త్యులయభిప్రాయములు, ౧. వర్డ్సువర్తుకవి యభిప్రాయము-ఉదాహరణములు - చిత్తవృత్తు లనంతములగుటచే రసము లనంతములు

---

## పంచమప్రకరణము.

### భావములు; భావనాశక్తి.

పాశ్చాత్త్యమతము, జేమ్సులాంగ్ సిద్ధాంతము - ఆర్య సిద్ధాంతముయొక్క పరమార్థము - ప్రకృతికిని మనుజులకును గలరహస్యసంబంధము-భావనయన నేమి? - జీవితమున భావనా ప్రయోజనము-భావనాశక్తి భగవద్దత్తమే కాని వేఱుగాదు-భావనాశక్తియొక్క స్వభావము - భావనాశక్తి చిత్తవృత్తుల ననుసరించుచు నియమితమార్గములనే చరించును - భావనా దృష్టికిని శాస్త్రదృష్టికిని గలభేదము-భావనాశక్తికిని ఊహాశక్తికిని గలభేదము - ౧. మితభాషిత్వము - ఊహాశక్తిగలకవులకు మితభాషిత్వము సున్న-తిక్కన మితభాషిత్వమున కుదాహరణము. శాఘోకవయిత్రి-భావనాశక్తిగల కవులు మానవస్వభావము ననుసరింతురు. "జన్మనా జాయతే కవిః" - పాశ్చాత్త్యుల సిద్ధాంతము, వర్డ్సువర్తు, భావనాశక్తి యేకత్వమును, నూహాశక్తియనేకత్వమును సూచించును-భావనాశక్తిగల కవి యాకృతిని; ఊహాశక్తిగలకవి గుణవిశేషములను వర్ణించును:— తియోడర్ వాట్సుడంటన్‌పండితునిమతము - సర్వస్వతంత్ర

భావనాశక్తికిని బరిమితభావనాశక్తికిని గలభేదము - సర్వస్వతంత్రభావనాశక్తి కుదాహరణములు-౧. షేక్స్పియరు మహాకవి విరచితమగు హామ్లెట్ నాటకము - షేక్స్పియరుకృతమగు ఒథెల్లో నాటకము-౩. షేక్స్పియరుకృత మెక్బెత్ నాటకము - కాళిదాసకృతశాకుంతలవర్ణనము-భారతమునుండి యొకయుదాహరణము-రూపకల్పనావిషయము, కేవలకల్పనసాధ్యమా? - పాశ్చాత్యశాస్త్రజ్ఞులవాదము పాశ్చాత్యకవుల యభిప్రాయము, ౧. షేక్స్పియర్ - ౨. కోలరిడ్జి - స్వాభావిక, అస్వాభావికవిషయము లన నేవి?-సారాంశము.

---

## షష్ఠప్రకరణము.

### భావప్రకటనము.

భావముల ప్రత్యేకస్వభావమే పదజాలము—అనుకరణముల విషయము-'పర్యాయ' 'సమానార్థక' పదములవిషయము-భావమును శైలియు నభేదములు - ముఖపరీక్షాశాస్త్రము-శైలి కవియొక్క ప్రత్యేకస్వభావమును సూచించును - ఒకనిశైలిని వ్రాయ నింకొకనికి సాధ్యముకాదు-అనుకరణ మాత్మహత్యయే యగును-ఉదాహరణములు-కావ్యమున శయ్యారీతు లప్రధానములు - అలంకారము లవసరములా ? రామలింగారెడ్డిగారి వాదము-శబ్దార్థాలంకారముల తారతమ్యము - పూర్వలాక్షణిక మతము - అలంకారము లనావశ్యకములు - శబ్దార్థాలంకారములు సమానగౌరవార్హములే - శబ్దార్థాలంకారములకుఁ గొన్నియుదాహరణములు - ధ్వని త్రివిధము - ౧. శబ్దధ్వని-౨. అర్థధ్వని -3. భావధ్వని - శైలిగుణములు. ౧. తుష్టి-౨. పుష్టి-

3. కాంతి-౪. బ్రహ్మానందజనకత్వము-బ్రహ్మానందజనకములగు పద్యములు - సారాంశము - ఛందోవిషయము-కావ్యమునకుఁ బద్య మవసరమా? - పాశ్చాత్యవిమర్శకులమతము - వాట్సుడంటన్ పండితుని సిద్ధాంతము-అక్షర, మాత్రా, ఛందములకుఁ గలసంబంధమును, తారతమ్యమును - సారాంశము - సహజకవి స్వభావలక్షణములు-౧. స్వాతంత్ర్యము, పోతనకవి-౨. ప్రాపంచికాద్భుతపరిజ్ఞానము, వాట్సుడంటనుపండితునిమతము - పద్య గద్యరచనలయందుఁగల భేదము - పద్యమే ముందుపుట్టిననుటకుఁ గారణము. ౧. మానవజీవితచరిత్రరహస్యము, ౨. షేక్స్పియరుకవి యభిప్రాయము-చమత్కారజనకమగు నింకొకసిద్ధాంతము - జీవద్భాషాస్వభావము - పురాతనభాషలను మృతభాషలనఁజెల్లదు-జీవద్భాషలు జీవసూత్రబద్ధములై కించిన్నూతనసహితమగు నవతచే విలసిల్లుచుండును-పురాతనభాషలకుఁ జిరస్థాయిత్వమే ముఖ్యలక్షణము-పాశ్చాత్యసాహిత్యవిమర్శనమునందలి క్లాసికల్, రొమాంటిక్కు మతసిద్ధాంతము. సంస్కృతము స్వాతంత్ర్యమును నవతను నిషేధింపలేదు. భవభూతికాళిదాసులమతము, ఆంధ్రపండితుల విపరీతవాదము-ఆంధ్రసాహిత్యమున స్వాతంత్ర్యమును నాంధ్రత్వమును నభ్యర్థనీయములు గాని సంస్కృతపారతంత్ర్యము కాదు. త్రివిధాంధ్రకవులు, ౧. స్వతంత్రాంధ్రకవులు- ౨. సంస్కృతస్నేహాభిలాషులు- 3. సంస్కృతదాసులు- ఆంధ్రత్వమే యాంధ్రసాహిత్యమునకు జీవనమును గౌరవమును నొసంగును.

శ్రీ ర స్తు.

# ఆంధ్రకవిత్వచరిత్రము

## ప్రథమప్రకరణము.

రసాత్మకం వాక్యం కావ్యమ్.

కావ్యమననేమి ? ద్వివిధములగు కావ్యలక్షణములు.

సృష్ట్యాదినుండి వివిధదేశముల వివిధభాషలఁ గవితఁ జెప్పినకవిశ్రేష్ఠులు కోటానకోట్లుండిరిగాని, కావ్యస్వభావము పరిపూర్ణమ్ముగ నిర్వచించినవారు లేరైరి. దేశకాలపాత్రముల ననుసరించి కవులు భిన్నభిన్నాదర్శములఁ గయికొని కావ్యముల రచించి యుండుటచేఁ గావ్యస్వరూపము సర్వకాలముల నిట్లే యుండఁదగు నని శాసింపఁబూనుట యెంతయుఁ గష్టకార్యము. స్థూలముగఁ గావ్యముననుఁ 'గవికృతగ్రంథ' మనునర్థముఁ జెప్పుదుము. అంతియేకాని, కావ్యస్వరూపమును శిలాక్షరముల వలెఁ జిత్రింపవలెనన్న నెంతయో విచారము సలుపవలయును. ఈవిచారము ఖండఖండాంతరముల రసికశ్రేష్ఠులు తమతమ భాషామర్యాదల ననుసరించి సలిపియున్నారు. భరతఖండము నందలి భాషలకెల్లఁ దలమానిక మనఁదగు సంస్కృతభాషను నీకావ్యస్వరూపచర్చ మెండుగఁ గావింపంబడినది.

సంస్కృతమున రసచర్చఁ గావించిన లాక్షణికులు రెండు కక్షలకుం జేరియున్నారు. ఒకపద్ధతివారు శాస్త్రాదేశము శిరసా వహించువారు. రెండవపద్ధతివారు స్వచ్ఛందప్రకృతిమార్గముల ననుసరించి శాస్త్రాదేశమును గొన్నియెడల మీఱి రసము నే ప్రధానలక్ష్యముగ నంగీకరించి కావ్యలక్షణమును నిరూపించిరి. శాస్త్రాదేశము ననుసరించి కావ్యలక్షణమును నిర్వచించిన లాక్షణికులలో వామనుఁడును, వాగ్భటుఁడును, భోజుఁడును, మల్లినాథుఁడును, విద్యానాథుఁడును ముఖ్యులు. శాస్త్రాదేశమును బ్రధానముగ గణింపక రసప్రవృత్తియే ముఖ్యసూత్రముగఁ గైకొని కావ్యస్వరూపమును జిత్రించినవారిలో దండి, మమ్మటుఁడు, విశ్వనాథుఁడు, జగన్నాథపండితుఁడును ప్రముఖులు. ఈయిరుతెగలవారిమతముల ముఖ్యసూత్రముల నిందుఁ బొందుపఱచుచున్నాను.

౧. కావ్యశబ్దోఽయం గుణాలంకారసంస్కృతయోశ్శబ్దార్థయో ర్వర్తతే. రీతి రాత్మా కావ్యస్య.—వామనుఁడు.

౨. సాధుశబ్దార్థసందర్భం గుణాలంకారభూషితమ్,
స్ఫుటరీతిరసోపేతం కావ్యం కుర్వీత కీర్తయే.-వాగ్భటుఁడు.

3. నిర్దోషం గుణవత్కావ్య మలంకారై రలంకృతమ్,
రసాత్మకం కవిః కుర్వన్ కీర్తిం ప్రీతిం చ విందతి.-భోజుఁడు.

౪. అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యమ్.
—మల్లినాథుఁడు.

౫. గుణాలంకారసహితౌ శబ్దార్థౌ దోషవర్జితౌ,
గద్యపద్యోభయమయం కావ్యం కావ్యవిదో విదుః.
—విద్యానాథుఁడు.

౬. కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే.

రెండవమతము.

౧. ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యమ్.—దండి.
౨. రసాత్మకం వాక్యం కావ్యమ్.—విశ్వనాథుఁడు.
3. నియతికృతనియమరహితాం
హ్లాదైకమయీ మనన్యపరతంత్రామ్,
నవరసరుచిరాం నిర్మితి
మాదధతీ భారతీ కవేః.—మమ్మటుఁడు.
౪. రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యమ్.
—జగన్నాథపండితుఁడు.

పైమతముల యర్థము తెలుఁగునఁ జెప్పిన నిట్లుండు:—

మొదటిమతము.

౧. ఈ కావ్యశబ్దము గుణాలంకారయుక్తములగు శబ్దార్థములయందే వర్తించు. కావ్యమునకు శయ్యారీతులే యాత్మయనందగు.

౨. సుశబ్దములచేతను, గుణాలంకారములచేతను, భూషితమై స్ఫుటమగు రసముగలిగిన శబ్దార్థములే కావ్య మనఁదగు.

3. నిర్దోషమును, గుణవంతమును నలంకారవిలసితమును, రసాత్మకమును నయి కావ్య ముండఁదగు.

౪. దోషరహితములుగను, గుణవంతములుగను, అలంకారయుక్తములుగను నొప్పుశబ్దార్థములే కావ్య మనఁదగు.

౫. గుణాలంకారసహితములును, దోషరహితములును, నగుశబ్దార్థములుగల పద్యములుగాని, గద్యములుగాని కావ్య మనఁదగు.

౬. కావ్యము కీర్తికొఱకు, ధనార్జనమునకు, వ్యవహారములఁ దెలుపుటకు, నశుభములఁ బోఁజేయుటకు, నప్పటికప్పుడమేయానందము గూర్చుటకు, భార్యంబోలినదగుట నుపదేశించుటకు నేర్పడినది.

రెండవమతము.

౧ ఇష్టార్థములు—అనఁగా నింపగు నర్థములు సమకూర్చు పదజాలమే కావ్యము.

౨. రసాత్మకమగు వాక్యమే కావ్యము.

3. కర్మ కారణసంబంధములగు నియమములచే బద్ధము గాక, యితరములపై నాధారపడియుండక నవరసశోభితమై ప్రాయికముగ సంతోష మొసఁగునదియే కావ్యము.

౪. ఇంపగునర్థముల నిచ్చుశబ్దజాలమే కావ్య మనఁబడు.

లాక్షణికమతము.

ముమ్ముందు వామనవాగ్భటాది లాక్షణికులమతము విమర్శింతము. లాక్షణికులమతమునఁ గావ్యమున నెచ్చటను, నేవిధమగులోపమును లేకుండఁ గావ్యము సర్వలక్షణలక్షితముగ నుండవలయును లాక్షణికునకుఁ గావ్యమున నెచ్చోటను దోషము గాన్పింపఁగూడదు. సర్వమును గుణవంతముగనే యుండవలయు. అట్లు గావ్యమునందలి సర్వాంగములు నదోషములుగను సగుణములుగను నున్నఁగాని, కావ్యమున రస ముండ నేరదని యిమ్మతమువారి యభిప్రాయము. కావ్యము సర్వాంగసుందరమై రాతఁజెక్కినట్లు, అచ్చుగ్రుద్దిన ట్లాకల్పాంతము దేశకాలపాత్రజనితంబులగు నవస్థాభేదమ్ములకు లోనుగాక యేకరీతిని జిరస్థాయిగ నున్నచో బాగుండునని యెల్లరును

నొప్పుకొనక తప్పదు. కాని, 'అదోషౌ, సగుణౌ, సాలంకారౌ, శబ్దార్థౌ కావ్య' మ్మను మల్లినాథునిమతము నంగీకరించుటకు గొప్పచిక్కు తటస్థమగుచున్నది. మల్లినాథుఁడు మహావిద్వాంసుఁడును సుప్రసిద్ధవ్యాఖ్యాతయుఁగానఁ గావ్యవ్యాఖ్యానములకు సంబంధించినమరియాదలను సూచించెనేగాని, కావ్యసృష్టిని నిరోధింపఁగల నియమముల నేర్పఱుపఁ దలఁపలేదు. వ్యాఖ్యాతల విమర్శనము లన్నియు నిట్టిఫలితమునే యర్థించుచున్నవి. అంతియేకాని యవి కావ్యలక్షణముగ నంగీకరింపఁ దగియుండలేదు. కారణమేమన, నెయ్యది దోషమో? యేది దోషము గాదో, యేది గుణమో? యెయ్యది గుణముగాదో నిర్ణయించుటకు శాస్త్రములే యాధారములు గావలసివచ్చును. అందుచేఁ గావ్యమునకు నిరంతరపారతంత్ర్యావస్థ వాటిల్లినది.

లాక్షణికమతమున కాక్షేపణము:
శాస్త్రాదేశము రసప్రవృత్తిని బంధింపఁజాలదు.

అదియునుంగాక శాస్త్రాదేశ మెంతవఱకు గ్రహింపఁదగినదో నిర్ణయించుట కష్టతరము. శాస్త్రాదేశ మంత్యనిర్ణయమని యొప్పుకొనువారికిఁ దక్క శాస్త్రాదేశము నధిక్షేపించువారలకు నీమతము రుచింపనేరదు. శాస్త్రాదేశము నధిక్షేపించువార లనఁగా నొడలు దెలియక యున్మత్తులభంగి హద్దుమీఱి దుష్పథములఁ జరించువారని యెంచక ప్రతిభాశాలులై నిజముగ నమ్మకము లేమింజేసి శాస్త్రముల శిరసావహింపని మహామహు లనియే భావింతము. ఇందుల కుదాహరణము. శాస్త్రమునఁ బరదారగమనము పురుషునకును, బరపురుషసంయోగము స్త్రీకిని నిషేధింపంబడినవి. అందుచే నీశాస్త్రాదేశమునే యాధా

రముగాఁ గొని ప్రపంచమున రాధాకృష్ణులప్రేమమును, దారా శశాంకుల ప్రణయమును, చిత్రాంగిసారంగధరులచరిత్రమును రసవంతములు గావని నిరసింతమా! నిరసింపము. ఏలనన, ఈ పయిన నుదహరింపఁబడిన ప్రణయవ్యాపారముల శాస్త్రాదేశ మున కతీతమును, హృదయసమర్పణజనితమును, నవాచ్యమును నగుప్రేమము గలదు. అట్టిప్రేమమునే గాయకులును, గవీశ్వరు లును మనోహరముగఁ గానముచేసియున్నారు. నిసర్గముగ నీప్రేమము రసవంతమే కానిచోఁ గవులును గాయకులును నెట్లు మనోహరగానము సేయంగలిగిరి? రాతినుండి తైలమును నెట్టిదిట్టరైనను దీయంగలఁడా? కావున శాస్త్రాదేశ మేమైనది? శాస్త్రాదేశము అంత్యనిర్ణయము గాఁజాలదని యొప్పుకొనక తప్పదు.

## శాస్త్రాదేశము మహామహుల బంధింపఁజాలదు.

శాస్త్రమెప్పుడును సామాన్యమానవులకొఱకే యుద్దే శింపఁబడినది. సామాన్యజనాతీతప్రతిభాశాలురగు మహామహు లను సామాన్యజనోపయుక్తములగు శాస్త్రాదేశములు బంధింపఁ జాలవు. అట్టిమహామహులకు శాస్త్రాతీతములగు విశిష్టధర్మములే వర్తించును. అందువలన శాస్త్రాదేశములే యాధారములుగఁ గొని గుణదోషముల నిర్ణయింపనెంచు మల్లినాథాదులపక్షము వారి కవిత్వలక్షణనిర్వచనము సర్వకావ్యములకు వర్తింపక, సర్వకవిశ్రేష్ఠులయంగీకారముఁ బడయక లక్షణానుసారులగు వారికే వర్తించును. అందుచే లాక్షణికమతము కవిత్వలక్షణ మునకు సంపూర్ణనిర్వచనము గాఁజాలదు. అట్లని చెప్పుటలో సర్వశాస్త్రసమ్మతముగను, సర్వలక్షణలక్షితముగను నదోషము

గను, నతీతరసవంతముగ [illegible] రచించువారు పుట్టక పోరని మాయభిప్రాయము కాదు. అట్లయ్యు నింతవఱకు 'అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్య' మ్మనులక్షణమునకు సరిగఁ గావ్యమును నసిధారావ్రతముగ సమర్థించిన కవియే జనింపలేదని నుడువుట సాహసోక్తిగాని, యసత్యోక్తిగాని కాదని విన్నవించుచున్నాఁడను. ఎన్నటికైన నట్టి మహా మహాఁడు జనించునేమో చెప్పఁజాలను. ఒకవేళ నుద్భవించినను నుద్భవింపవచ్చును. మహామహాలు సర్వపక్షముల లోకోద్ధరణమునకై జనింపవచ్చును. కాని, అట్టివారు విమర్శనాతీతులగుటచేఁ బ్రకృతము మనవాదములోనికి రారు.

## రసికమతము.

ఇఁక రెండవమతమును విచారింతము. ఈమతమునకు మూలసూత్రము 'రసాత్మకం వాక్యం కావ్యమ్' అను విశ్వనాథుని నిర్వచనమే. ఈమతముప్రకారము కావ్యమునకు రసమే జీవము. స్త్రీకి సౌందర్యమును, బ్రణయమునకు భావమును నెట్లో కవిత్వమునకు రసమును నట్లే.

## రసస్వరూపరహస్యము.

రసమన నేమి? అది కవిత్వమునకు నెట్లు ప్రాణమగును? ఈప్రశ్నలకు సమాధాన మ్మొసఁగుట మిక్కిలియుఁ గష్టము. ఏలనన: శరీరమునఁ బ్రాణమె ట్లదృశ్యమయ్యును నిండి నిబిడీకృతమై సర్వావయవముల వ్యాపించియుండునో అట్లే రసమనునది కావ్యమున నిచ్చోటి నున్నదనికాని లేక యచ్చోట నున్నదనికాని చెప్పుటకు వీలుగాక కావ్యమున నాదినుండి తుదివఱకును నేకధారగఁ బ్రవహించుచునేయుండును. సాధా

రణముగఁ జక్కనియువతిని జూచినప్పుడా మెయందము ముక్కునం దున్నదా? లేక కన్నులయం దున్నదా? లేక చెవులయం దున్నదా? యనుపృచ్ఛ కవకాశము లేకుండ నెక్కడఁజూచినను జక్కఁదనము మిట్టిపడుచునే యున్నప్పుడే యాస్త్రీ లోకైక సుందరి యనియందుము. ఒక్కొక్కప్పుడు ఏయవయవమునను నంతసౌందర్యము లేకపోయినను గొన్నియవయవములఁ గొంచి గ్లోపము లున్నను మొత్తముమీఁద వాలకమంతయు నేదో యనిర్వాచ్యమగు సౌందర్యముతో నొప్పుచునే యుండును. సాధారణముగఁ బ్రపంచమున "నల్లఁగానున్నను చిలుకవంటిపిల్ల చామనచాయ యన్నమాటే. కాని యాపిల్ల కేమమ్మా? చక్కనిచుక్కగాదఁటమ్మా?" అనుచు నమ్మలక్క లాఁడుపలుకులు సూక్ష్మమయిన యీరసరహస్యమును సూచించు చున్నవి

## లోపరాహిత్యము రసవిషయమున నరుదు.

ఈ రసరహస్యముప్రకారము చామనచాయగలస్త్రీ యెట్లు వాలకమునను, నొయారమునను నతిసౌందర్యవతిగాఁ గనుపించునో యట్లే కావ్యమున నెచ్చటనేని శాస్త్రసమ్మతము కానిదియు, లోపమనఁదగినదియు నగు విరుద్ధలక్షణ మేదయిన నుండినను గావ్యము మొత్తముమీఁద రసజీవిగ నున్నఁ జాలును. ఈవాదమున ముఖ్యవిషయము లేదనఁగ: ప్రపంచ మునఁ బరిపూర్ణసౌందర్య మేవస్తువునం దేనియు మృగ్యము కావునను, ఒకపరమేశ్వరునియందుఁ దప్ప సకలచరాచరప్రపం చమునందున నేదోయొకలోపమేని యుండకమానదు కావునను, ప్రపంచవిషయమునను,మానవకృత్యములవిషయమునను గొంచి

ల్లోపములను గణింపక ప్రధానగుణమునే గ్రహింపవలె ననుటయే. ప్రపంచస్వభావవేత్తలకును, సృష్టిరహస్యవేదులకును, నీవాదములోని సత్యము గోచరింపకమానదు. ప్రపంచస్వభావము గుర్తెఱుఁగక భగవంతునికే చెల్లఁదగు దోషరాహిత్యమును సదోషుఁడగు మానవున కారోపించి కావ్యముననే లోపమును నుండఁదగదని శాసించుట న్యాయముకాదు.

ఇంకొకవిషయము: ప్రతిమానవునియందునను బరమేశ్వరుని తత్త్వ మున్నను ప్రతిమానవుఁడును, సర్వశక్తియుతుఁడును లోపరహితుఁడును నగుపరమేశ్వరుఁ డెట్లుకాఁజాలఁడో అట్లే కావ్యమున సౌందర్యమును, రసమును బ్రధానములైనను నేలోపములేని పరిపూర్ణసౌందర్య ముండుటయరుదు. కావున, కొద్దిలోపము లున్నను వానిని గణింపక ప్రధానవిషయములగు రసమును, కావ్యసౌందర్యమును గ్రహించినఁ జాలును.

### సహజసౌందర్యమే ఎక్కువ భావోద్దీపకము.

మఱియొకవిషయము: ప్రపంచముననేదేని సంబంధమున్నఁగాని యనురాగమును ననుకంపయు నుదయింపఁజాలవు. దగ్గఱిచుట్టముల కష్టసుఖములకు దుఃఖమును, సంతోషమును బొందుదుము. కాని యెవ్వరో సంబంధములేనివారినిఁగూర్చి సంచలనముఁ బొంపనే పొందము. హృదయసంబంధమే యనుకంపానురాగములకుఁ గారణము. అట్లే కావ్యమునను మానవులకు సహజమగు స్వభావసౌందర్యమే హృదయమును గరంచి మనస్సున కానందము నిచ్చును. కాని, లోకమున నెచ్చటను కానుపింపని లోపరహితమగు నుత్తమసౌందర్యము రుచింప

నేరదు. కావ్యమునఁ గొన్ని విషయముల మనతోఁబాటువారును, గొన్ని గుణముల మనకన్న మిన్నలును నగునాయికానాయకులే భావోదయముఁ గలిగింతురు. కాని సర్వవిషయముల మనకంటె మిన్నలును మనతో నేసంబంధమును లేనివారునునగు దేవత లాదిగాఁగల నాయికానాయకులు భావోత్పత్తిఁ గలిగింపఁజాలరు. రంభాసౌందర్యముకన్నఁ బ్రేమభాజనమగు నిల్లాలిముఖబింబలావణ్య మెన్నికోట్లమడుంగు లెక్కుడభావోద్దీపకముకాదు? ఈభావమునే "సహజలావణ్య" మనుగీతమందుఁ దెలిపియుంటిని:—

మోముతీరు సామాన్యమే ముగుద, కురులు
ముడిచి, కుంకుమతిలకమ్ము మోమున నిడి
నంతనే యింతసొగ సెట్టులబ్బెఁ, జెప్ప
వే చెలి, వినంగ నామది వేడ్క పుట్టె.
తీఁగెదీపమ్ముదీప్తి నద్దెసలఁ బర్వి
చదలఁ జీఁకటి నిటునటు కదలఁబాఱఁ
జేయుచుండ నొయారమ్ము సెలఁగ నిలచి
మాటలాడెడు నీసొగ సు మనముఁగొనియెఁ
జెలియరో, దేవలోకంపుఁజేడెలవగు
లోపమే లేని యుత్తమరూపములనుఁ
గంటిఁగాని యదేమొ నాకన్నులకును
నీదుమూర్తియె మోదమ్ము నించె నిజము.
ఉత్తమాకృతి జీవసంపత్తిఁ గలుగు
సహజలావణ్యమున కెట్లు సాటివచ్చు?

కావున దండి, విశ్వనాథ, జగన్నాథపండితు లాదిగాఁగల పక్షమువారికి కావ్యమున రసముపట్టఁ బక్షపాత మెక్కువ.

కావ్యమునందలి లోపములపైకిని, చిల్లరమెఱుఁగులపైకిని వారిదృష్టి చనదు. లోపరహితమగు నుత్తమసౌందర్యముకన్నఁ గించిల్లోపసహితమయ్యు జీవసంపత్తికలుగు సహజలావణ్యమే వారి కెక్కువయింపు నింపును. ఈమతాభిప్రాయభేదములపరిణామము కావ్యవిషయమున ననేకవిధములగు వాదోపవాదములకుఁ గారణమైనది. అట్టివాదములను సందర్భౌచిత్యము ననుసరించి చర్చించెదను.

## లాక్షణికరసికమతములకుఁ గలభేదము.

వామన, మల్లినాథాదిలాక్షణికులు కావ్యమున నలంకారములును, గుణములును, రీతులును, శబ్దశుద్ధియును, నదోషమును బ్రధానము లనుచున్నారు. రసికవర్గమునకుఁ జేరిన దండి, విశ్వనాథ, మమ్మట, జగన్నాథాదులు రసము, వ్యంగ్యము, ఇష్టార్థము, ప్లాదైకమయత, అనన్యపారతంత్ర్యము మొదలగు లక్షణములే కావ్యమునఁ బ్రధానము లనుచున్నారు. కావున వీరి మతములు రెంటికిని ముఖ్యమును, పరిస్ఫుటమును నగుభేదము కలదు. ఈభేద మెద్దియో పరికించి పిమ్మట నీభేదమునకుఁ బరిణామములుగఁ బెరిగిన సాహిత్యవిషయికవివాదములను సత్యాన్వేషణబుద్ధితోడఁ బరిశీలించి సత్యమును నిరూపింపఁ బ్రయత్నింతము. వీరికిఁ గలభేదమును నామిత్రులొకరు "సాహిత్యచర్చ" యనువ్యాసమునఁ జక్కఁగ నీక్రిందివాక్యములఁ బొందుపఱచినారు:—

"నాకుఁ జూడ బ్రథమపీఠమువారికి నిషేధము లెక్కువ; రెండవపీఠమువారికి విధము లధికము. కవి సృష్టికర్తయనియుఁ, గావ్యము సజీవనబింబమనియు, రెండవవారు ఆర్ద్రదృష్టితో

నుపలక్షింపఁగలిగిరి. కవిశబ్దకార్మికుఁడనియు, కావ్యము అదోష శబ్దార్థమయమనియు మొదటివారు నిర్ణయించిరి. అనఁగా మమ్మ టాదులు కవితను కళగా నన్వయించిరి. వామనాదులు కొంచె మించుమించు శాస్త్రముగాఁ బరిగణించిరి. ఒకటి శాస్త్రీయ పథము; మఱియొకటి రామణీయకపథము. మొదటితెగవారికి శాస్త్రములయెడ నభిమాన మధికము; ప్రమాణబుద్ధి విశేషము. రెండవతెగవారికి రసపక్షపాతము లెస్స; స్వాతంత్ర్యరక్తి యమితము. ఒకరు నియమములను బెంచి ఆదర్శమునకు వైరళ్య మాపాదించిరి. వేఱొకరు నియమములు అవిలంఘనీయములు కావని ఆదర్శమున కౌన్నత్యము నొప్పికొనిరి.”

## కావ్యము సృష్టియేనా?

మున్ముందుగ సాహిత్యవిషయకవివాదములలో నెల్ల ముఖ్యమగు కావ్యసృష్టినిగూర్చిన భిన్నభిన్నమతములను బరి శీలింతముగాక! పదపడి బాహ్యచిహ్నములగు, శయ్యారీతులను, ప్రయోగసిద్ధిని, శబ్దశుద్ధిని, నలంకారములనుగూర్చి సవిమర్శ ముగఁ జర్చింతము. అట్లనుటలో విషయమునకును, దత్ప్రకటన మునకును భేదమున్నదని నేను జెప్పుచున్నట్లు తలంపఁదగదు. వాదసౌకర్యముకై యిట్టివిభాగమును జేయవలసివచ్చినది.

## కవి బ్రహ్మ.

కవి మనదేశమునఁ గవిబ్రహ్మ, కావ్యనిర్మాత, కావ్య కారుఁడు నను పలునామములతోఁ బిలువఁబడుచున్నాఁడు. ఇట్టి నామకరణ మర్థవంతమయినదో కాదో యరయుదము. కవి సృష్టి కర్తయని పలుకువారు కొందఱు గలరు. వారిమతమునఁ బర మేశ్వరుఁడు ప్రపంచము నెట్లు నిర్మించెనో కవియు నట్లే, కావ్య

ప్రపంచమును నిర్మించును గావునఁ గవి నిశ్చయముగ రెండవ బ్రహ్మ యనుటకుం దగినవాఁడనియు కవిబ్రహ్మ యనునామము నకుఁ దగినవాఁడనియు నిర్ధారణమగుచున్నది. సృష్టి అనంతము ప్రతిఫలాపేక్ష నించుకేనియును సృష్టికర్తకు నాపాదింపఁ జాలము. బలవత్తరములగు కారణములుగాని, హృదయము నాకర్షించు ఫలాపేక్షగాని, లేక పరమేశ్వరుఁడు ప్రపంచమును సంకల్పమాత్రమున నానావిధజంతుసంతానముతోడను, బంచ భూతాత్మకముగను నిర్మించెను. అట్లే కవియుఁ బ్రత్యక్షకార ణములేవియు లేక ప్రతిఫలాపేక్ష యించుకేనియు లేక కావ్య మును, నందు వివిధప్రకృతులను వర్ణించి సర్వవిధములఁ బరి పూర్ణమైయొప్పు ప్రపంచమును గావ్యమునఁ బ్రదర్శించు చున్నాఁడు. బాహ్యసృష్టియందుంబలెఁ గావ్యసృష్టియందును ననంతమును, నపారమును నగుశక్తి ప్రదర్శితమగుచుండును. విషయబాహుళ్యము గవిబ్రహ్మలగ్రంథముల బాగుగఁ గాన నగును. మహాపురాణములను, నందెందు యుగయుగములఁ బ్రపంచములను వర్ణించి, విపులముగ సమర్థించిన వ్యాసవాల్మీ క్యాదిమహాకవులు నిశ్చయముగ నీకవిబ్రహ్మపదవి నధిష్ఠింపఁ దగినవారు. అట్టివారికావ్యసృష్టివలననే నేఁటివఱకును మన మాత్మోపలబ్ధిని బడయుచు సర్వవిధముల జీవితమును ఫలవంత ముగఁ గావించుకొనఁగలుగుచున్నాము. ఈవిషయమును ముస్ముందు నింకను విపులముగఁ జర్చించెదము.

## కావ్యనిర్మాత.

ఇఁకఁ గావ్యనిర్మాత యనుపదమును గొంచెము విమర్శిం తము. నిర్మాణకౌశలమనఁగా నెద్ది? ఈప్రశ్నకుఁ బ్రత్యుత్తరము

కించిజ్ఞులకుఁగూడ నతిసులభముగఁ దోఁచును. నిర్మాణము నిర్మాత-యనుపదములు సాధారణముగ గృహనిర్మాణమునకును, గృహనిర్మాతలకును జనులు వర్తింపఁ జేసెదరు. గృహనిర్మాత యెట్లు రాలు, సున్నము, కలప, దూలము లాపెగాఁగలపరికరముల నాయత్తముఁ గావించుకొని పునాదుల బాగుగఁ ద్రవ్వి వానిపై స్థిరమగు గృహమును నిర్మించునో యట్లే కావ్యనిర్మాతయు భావములు, శబ్దార్థములు, అలంకారములు, శయ్యారీతులు, ఆపెగాఁగల కావ్యపరికరములఁ గయికొని కావ్యసౌధమును నిర్మించునని యీమతమువారియభిప్రాయము. కావ్యనిర్మాణమునను, గృహనిర్మాణమునను విభ్రమాశ్చర్యము లుదయింపఁజేయంజాలు ననంతసృష్టివైభవము గాన రాకున్నను, చేతనున్నపరికరములను దగినరీతి నుపయోగించి యొకసర్వాంగసుందరమును, బరిపూర్ణమును, నగు కావ్యమునుగాని, సౌధమునుగాని నిర్మింపఁగలశక్తి ప్రదర్శిత మగుచుండును. కావ్యనిర్మాతదృష్టి సర్వప్రపంచమును గబళింపఁగలుగునంత విశాలమయినది కాదుగాని యున్నదానిని బూర్వోత్తరవిరోధము లేకుండ, నంగాంగములపొందిక తప్పకుండఁ బరిపూర్ణముగ నుపలక్షించుశక్తి గలదిగ్గాయున్నది. కాళిదాసాదికవిశ్రేష్ఠులెల్లరు నీకావ్యనిర్మాతృవర్గమునఁ జేరినవారు.

## కావ్యకారుఁడు.

ఇప్పుడు మూఁడవదియుఁ బై రెండింటికన్నఁ దక్కువఁగలదియు నగు కావ్యకారపదమును జర్చింతము. 'కావ్యకారుఁడు' అనుపదము స్వర్ణకారుఁడు, కుంభకారుఁడు, ఘటకారుఁడు మొదలగుపదములతో సామ్యము నందఁగల్గుచున్నది. సాధా

రణముగఁ గుండలుసేయుకుమ్మరియు, బిందెలఁ గరఁగించిపోఁతఁ బోయుఁ గమ్మరియు, బంగరుఁ గరఁగించి నగలుచేయు కంసాలియు, నిశితమయిన సృష్టిశక్తిగాని నిర్మాణశక్తిగాని కలిగి యుందురని చెప్పుటకు వీలులేదు. కరఁగించి యిదివఱకున్న యచ్చులలోఁ బోఁతపోయుచు నొకదానినొకటి పోలినవగు వేనవేలువస్తువులను శీఘ్రకాలమున నొక్కొక్కవస్తువునకుఁ బ్రత్యేకపరిశ్రమ మక్కఱలేకుండఁ దయారుసేయఁగల కుమ్మరి, కమ్మరి, కంసాలు లాదిగాఁగల కర్మకారులను సృష్టికర్తలనిగాని నిర్మాతలనిగాని నొడువుటకు వీలగునా? అట్లే దృష్టివైశాల్యము గాని నిర్మాణకౌశల్యముగాని లేక యూరక పుస్తకములఁ జూచి పుస్తకములను, గావ్యములఁ జూచి కావ్యములను, బద్దెములఁ జూచి పద్దెములను, ప్రయోగములఁ జూచి ప్రయోగములను రచింపుచు ననుకరణములఁ గావింపుచుఁ బరప్రత్యయనేయబుద్ధులగు నంగటికవులు అత్యంతగౌరవప్రదమగు కవినామమున కర్హులు కాఁజాలరు. సామాన్యప్రబంధకవులెల్లరు నీతెగకుఁ జేరుదురు. వీరినిగూర్చి ప్రసక్తి గల్గునవసరమున మున్ముందు విపులముగఁ జర్చించుట కవకాశము గలదు గావున ప్రస్తుతము దీని నింతటితో విరమించి వేఱుచర్చకుఁ గడంగుదుము.

### రాజశేఖరకవిరాజుమతము (సహజ) ఆహార్యపండిత ఔపదేశిక (ఉపాసక) కవులు.

పైనఁజెప్పఁబడిన సంగతులనుబట్టి ప్రపంచమునకుఁ బ్రతిప్రపంచమును సృష్టింపఁగల మహాశక్తిగాని, సర్వాంగసుందరముగ నుపలబ్ధములయిన సాధనములఁ గావ్యరూపమున నిర్మింపఁగల నిశితనైపుణిగాని, కవికుండవలసినశక్తులలో ముఖ్యములని తేలుచున్నది. ఈయభిప్రాయముఁ బురస్కరించుకొనియే

బాలరామాయణ బాలభారత కర్పూరమంజరీ కావ్యమీమాంసాదిగ్రంథముల రచించిన రాజశేఖరకవి—కావ్యరచనాశక్తి నిశ్చయముగఁ బ్రతిభయేయనియు, నయ్యది జన్మాంతరసంస్కారమువల్లనే లభ్యముగాఁగలదనియుఁ, బ్రపంచమున మహాకావ్యముల రచియించిన కవిశ్రేష్ఠులెల్లరును జన్మాంతరసంచితప్రతిభాశాలురే యనియు సిద్ధాంతముఁ గావించి కవులను ఈసిద్ధాంతము ననుసరించి సహజ ఆహార్య ఔపదేశికకవు లనుమూఁడు తరగతులుగ విభజించెను. నాకుంజూడఁ గావ్యవస్తుతత్త్వమును బ్రధానలక్ష్యముగ నుంచుకొని కవులగుణతారతమ్యములఁ జర్చించి వారికి యథోచితగౌరవము నొసంగఁ బ్రయత్నించిన వారిలోనెల్ల రాజశేఖరుఁడే యగ్రగణ్యుఁడు. ఈతఁడు గావించిన తారతమ్యనిర్ణయము సంగ్రహముగఁ జెప్పెదను. జన్మాంతరసంస్కారబలిమి నపూర్వప్రతిభావిశేషమున ననన్యసాహాయ్యముగ మహాకావ్యసృష్టిఁ గావింపఁగల యపరబ్రహ్మల సహజకవులని నిర్ణయించెను. పిమ్మట జన్మాంతరసంస్కారము లేకుండినను సత్కావ్యపఠనమువల్లను, గురుకులవాసమువల్లను బుద్ధివైశద్యముఁ బడసి కావ్యనిర్మాణమునకుఁ గడంగునిహజన్మసంస్కారశేముషీధురంధరులగు కవులను నాహార్యకవులఁగా నిర్ణయించెను. తరువాత మంత్రతంత్రోపాసనాబలమునఁ బ్రతిభయు నిహజన్మసంస్కారమును మృగ్యములుగఁ గవనము నల్ల సాహసించు తక్కుంగలకవులను నౌపదేశికు లని నిర్ణయించెను. కావున రాజశేఖరుని మతముప్రకారము కావ్యము రచింపఁగల్గుశక్తి జన్మాంతరసంస్కారమువల్లఁ గాని యిహజన్మసంస్కారమువల్లఁగాని జనింపవలసినదేకాని మంత్రతంత్రాదివిద్యల నభ్యసించుటవల్లఁ గలుగనేరదనియుఁ దేలుచున్నది. కావునఁ

గవి సృష్టికర్తయైనకాని నిర్మాతయైనకాని కావలెను. రాజశేఖరునిపరిభాషలోఁ జెప్పినకవి సహజకవియైనఁ గావలయు లేక పండితకవియయినఁ గావలయు. కాని వట్టికర్మకారునిఁ బోలిన కావ్యకారుఁడు అనఁగా నౌపదేశికకవి కారాదు.

పై యభిప్రాయము నాధారముగాఁ గొని రాజశేఖరుఁడు మహాకవులను తరగతులప్రకారము విభజించి కవిత్వలక్షణమును నేతదభిప్రాయానుసారముగ నిర్వచించినాఁడు. ప్రసక్తి గల్గినచోట రాజశేఖరుని కావ్యలక్షణనిర్వచనమును సందర్భానుసారముగాఁ జర్చింపఁ బ్రయత్నింతము.

కావ్యసృష్టికిని, బాహ్యసృష్టికిని గల సంబంధము. కావ్యము బాహ్యసృష్టి కనుకరణ మగునా? లేక స్వతంత్రజీవియగునా? భిన్నమతములు.

కవి సృష్టికర్త యనియు నిర్మాత యనియు నొప్పుకొనిన పిదప నొకప్రశ్న ముదయించును. అది యేదనఁగా:—కవి సృష్టించుప్రపంచమునకును పరమేశ్వరకల్పితంబగు నీబాహ్యసృష్టికిని సంబంధ మెట్టిది? కావ్యప్రపంచము బాహ్యప్రపంచము ననుకరించునా? లేక దానిని మీఱి స్వతంత్రముగ వర్తించునా? కవి బాహ్యప్రపంచమును జూచి దాని కనుకరణముగ, ఛాయాపటముఁ దీయువాఁడు మానవునిరూపమును బ్రదర్శించునటులఁ గావ్యప్రపంచమును బ్రదర్శించునా?—ఈప్రశ్నమును, దీనికి సమాధానమును, నీరెండింటికిని సంబంధించిన వాదోపవాదములును, పాశ్చాత్యకావ్యప్రపంచమును సుమారు రెండువేలయేండ్లుగ సంక్షుభితముఁ గావించినవి. నేఁటి

వఱకును నావివాద ముభయకక్షులవారికిని సమ్మతమగునటులఁ బరిష్కరింపఁబడె ననుటకు వీలు చిక్కకున్నది.

### ౧. ప్లేటో.

పాశ్చాత్యవిజ్ఞానభానుఁ డనఁదగు 'ప్లేటో' ఈప్రశ్నము మొట్టమొదటఁ గావించెను. ఆతఁడు 'అతీతసామ్రాజ్య' మను గ్రంథమునఁ 'గవికి స్థాన మొసఁగఁగూడ' దని శాసించు సందర్భమున నీక్రిందిమతమును సమర్థింపఁ జూచెను. అది యెట్టిదియన, "*స్థూలదృష్టికిఁ గోచరమగు నీబాహ్యప్రపంచము భగవంతునియందు లీనమయియుండు భావప్రపంచమునకు ననుకరణమనియుఁ, గవిసృష్టమగు కావ్యప్రపంచము బాహ్య ప్రపంచమున కనుకరణమనియు, నందుచేఁ గవి సత్యమునకు రెండింతలు దూరమగుచున్నాఁడనియుఁ, గావునఁ గవికి అతీత సామ్రాజ్యమునఁ బ్రవేశించుట కర్హత లేదనియు విస్పష్టమగు చున్నది *"

పైనఁజెప్పఁబడిన ప్లేటోపలుకులఁ గావ్యప్రపంచము బాహ్యప్రపంచమున కనుకరణమని తేలుచున్నది. ప్లేటోశిష్యుఁ డగు 'అరిస్టాటిల్' అనునతఁడు గురుమతమును బరిస్ఫుటముగఁ జెప్పి యొకయలంకార శాస్త్రమునుగూడ విరచించి పాశ్చాత్యు లలో నొకలాక్షణికవర్గమువారికి మూలపురుషుఁ డయ్యెను.

### ౨. అరిస్టాటిల్.

అరిస్టాటిల్ కవిత్వమునకు నిర్వచనము నిట్లు చెప్పెను. "కావ్యము ప్రకృతికి వాగ్రూపమగు ననుకరణ" మని. ఈయను కరణ మనుపదమునే 'అరిస్టాటిల్' అనేకసందర్భముల సమర్థిం చెను. అందుచే నీపదము కొంచె మించుమించు సూత్ర

ముగఁ బరిగణింపంబడి తరువాతి కావ్యవిమర్శకులకు నాదర్శ ప్రాయ మయ్యెను. ఈ 'యనుకరణ' మనుపదమునుగూర్చి వాదోపవాదములు చెలరేఁగుటకుఁ బూర్వము 'ఇటాలియన్ వ్యాఖ్యాత' లిర్వురు "అరిస్టాటిల్" గ్రంథమునకు వ్యాఖ్యానము సేయుచు 'ననుకరణ' మనుపదమును యథామాత్రకమగు ఛాయానుకరణమని యన్వయించిరి. తోడనే వాదోపవాదములు పెల్లుఁ బెరిగినవి అనేకు లరిస్టాటిల్ మతమును బూర్వపక్షము సేయుచు రససిద్ధాంతముఁ గావించిరి. అట్టివారిలో లాఙ్గినీస్ ప్రముఖుఁడు.

## 3. లాఙ్గినీస్. కావ్యము స్వతంత్రసృష్టియే కాని అనుకరణము కాదు.

'లాఙ్గినీసో' కావ్యము ప్రకృతికి ఛాయాపటమువంటి యనుకరణము గాదనియు, నట్లయినచోఁ బ్రపంచములో జనులాడెడు నీరసపుఁబల్కులును బ్రేలెడి యవాకు చవాకులును, గావ్యమున నున్నవి యున్నట్లుగఁ జెప్పువా రెల్లరును గవులు గావలసియే వచ్చుననియు, నట్టిదురవస్థ రసికులకు భాషావిషయమున నభ్యర్థనీయము గాదనియు, నట్టిదుర్మతమువలనఁ గుకవులు జన్మించి వేనవేలు నీరసప్రహసనములను శుష్కప్రలాపములను రచియించి లోభనీయమగు కావ్యసౌందర్యమును విసర్జించి పాఠకులరసికతను నాశముఁ గావింతురనియుఁ, బూర్వపక్షముసేసి వేఱొక కావ్యలక్షణమును నిరూపించెను. అది యెద్దియనిన, కావ్యము ప్రపంచమునకు యథామాత్రకమగు ఛాయానుకరణము గాక దానితో సరిసమాన మైనదియు, స్వతంత్రవ్యక్తి గల్గినదియు నగు ప్రతిసృష్టియే యనియు,

నయ్యది స్వతంత్రప్రదర్శన మనిపించుకొనునేకాని యథా మాత్రకానుకరణ మెప్పట్లను గాదని స్పష్టముఁ గావించెను ఈవివాదమునకవికి సృష్టిఁ గావించుటకు నపారమగుశక్తియును, దుర్నిరీక్ష్యమగు స్వాతంత్ర్యమును నొప్పుకొనఁబడినవి. కవిని బాహ్యప్రకృతియుఁ దత్సంబంధములగు నాచారవ్యవహారము లును నియమములును బంధింపవనియు స్పష్టమగుచున్నది. కాని కొందఱు కుతర్కమునకు డిగుదురేమో యనుభయమున లాజ్జీనీస్ బాహ్యప్రపంచమునకును గవితాప్రపంచమునకును గలసంబంధమును స్పష్టముగ నిట్లు వ్యక్తీకరించెను.

**కావ్యసృష్టికిని బాహ్యసృష్టికిని సూత్రాత్మల యందు భేదము లేదు.**

కావ్యప్రపంచమునకును బాహ్యప్రపంచమునకును సూత్రాత్మ లనఁదగు ప్రధానవిషయముల నెక్కువభేద ముండ దనియు, నప్రధానములగు తక్కంగల నియమములవిషయము ననే భేదము గలుగుననియు, బాహ్యప్రపంచమునకును గావ్య ప్రపంచమునకును జన్మస్థానమగు భగవంతుఁడే యీరెండు ప్రపంచములకును సూత్రాత్మలవిషయమునఁగల నైక్యభావ మునకుఁ గారణమనియుఁ దెల్పెను. అట్లుతెల్పి కావ్యప్రపంచ మభూతకల్పితము గాదనియుఁ, బ్రకృతిపరిణామభేదము లన్నియు సూక్ష్మముగను గొన్నియెడల స్థూలముగను గూడఁ గావ్యప్రపంచమునకు వర్తించుననియు, నందుచేఁ గావ్యపర మావధి ప్రహాసనప్రలాపాదిశుష్కనీరసవాక్యరచనగాదనియు, రసోద్దీపకమగు స్వతంత్రకావ్యరచనమే యనియు, నందుచేఁ గవి యసత్యప్రలాపి కాఁడనియు, నతీతసామ్రాజ్యమున వేదాం

తులకన్నను మతస్థాపకులకన్నను శాస్త్రకర్తలకన్నను నెక్కుడుగ గౌరవింపఁబడి వారియందఱికన్న మిన్నయై పరమేశ్వరునితోడ నర్ధసింహాసనాసీనుఁడగుననియు నగారా మ్రోయించినటుల వాక్రుచ్చి గురుశిష్యులిద్దరసిద్ధాంతములను గాలికెగురఁగొట్టి లాఙ్గీనీసు రససిద్ధాంతమునకుఁ బాశ్చాత్యులలోనెల్ల మార్గదర్శి యయ్యెను.

**అనుకరణసృష్టివాదములయొక్కభిన్నపరిణామములు.**

లాఙ్గినీసువాదము బయలువెడలఁగనే అరిస్టాటిల్ వర్గమువారు కన్నులు తెఱచి తమతప్పు దిద్దుకొనుచుఁ బ్రత్యక్షముగఁ దా మంతవఱకుఁ బొరపడితిమని జెప్పుటకు మోమోటముఁ జెందినవారగుట 'నరిస్టాటిలుచే' నుపయోగింపఁబడిన 'యనుకరణ' మనుపదమునకు ఛాయాపటరూపానుకరణ మర్థము గాదనియు, నట్టి యపార్థము నరిస్టాటిలుగ్రంథమును విమర్శించిన ల్యాటిన్ వ్యాఖ్యాతలచే గల్పింపఁబడినదనియు నేదో విధముగఁ జెప్పి విచిత్రసిద్ధాంతముఁ గావించుచు, నరిస్టాటిలును సమర్థింపఁజొచ్చిరి. కాని యరిస్టాటిలుచే నుపయుక్తమయిన యనుకరణపదబీజము గ్రీకు,ల్యాటిన్ వాఙ్మయక్షేత్రముల దిట్టముగ నాఁటుకొని యనేకశాఖాపరివృతమగు వృక్షముగఁ బరిణమించి తుదకు శుద్ధనీరసానుకరణకావ్యవిషఫలము లుద్భవము లగుటకుం గారణమయ్యెను.

పిమ్మట నరిస్టాటిలునకు వ్యతిరేకముగ వ్రాసినలాఙ్గినీసు మతమువారు దేశకాలనియమములన్ బద్ధులయియుండి వాఙ్మయము త్రొక్కుచున్న పెడదారుల పొంతఁబోవక సత్యైకపథగాములై కావ్యము చూచినదిచూచినట్లు చెప్పు దంపుడుపాట

వంటిది కాదనియు, నపూర్వప్రతిభాజన్యంబయి నూతనప్రపంచ సృష్టిఁగావించి ప్రకృతిగర్భమున నడఁగియున్న పరమరహస్యములనెల్ల గోచరింపఁజేయునది యనియు, మానవకల్యాణమునకు మతము, శాస్త్రము, ధర్మము లాదిగాఁగల ప్రయోజనముల కన్న నెక్కువఁ దోడ్పడంగలదనియు విస్పష్టముఁ గావించిరి.

## రోమనువాఙ్మయస్వభావము.

కాని గ్రీకునాగరికత యప్పటికే చరమావస్థనొంది భోగపరాయణత్వ ప్రధానమయిన రోమనునాగరకత పిచ్చల విడిగఁ బెచ్చుపెరుగసాఁగెను. అయ్యది భారతవర్షమునఁ బ్రబంధరచనకుఁ దావలమయిన దౌర్భాగ్యయుక్తకాలముఁబోలిన కాలము. అక్కాలమువారు దానినించుమించు మహాయుగమని పొగడిరి. కాని కావ్యాత్మవినాశసూచకములగుఁ జెక్కుడు బొమ్మలు దక్క ప్రతిభానంతమగు కావ్యసృష్టి విరివిగ జరిగి యుండలేదని మాయాశయము. డాంటి, వర్జిల్ అను నిరువురు మహాకవులుదక్క నప్పటి కవులెల్లరును సమకాలికాచార వ్యవహారములనే యున్న వున్నట్లు మనప్రబంధనియమములకుఁ దీసిపోవని కృత్రిమనియమములను గావ్యపోషణమునకై వలయు నుపాంగములుగ సేకరించుకొని కృత్రిమమును సహజ ప్రతిభాశూన్యమును నగు లాటిణికకావ్యపద్ధతి నొకదానిని బయటికిఁ దీసిరి. వారికావ్యముల ననుసరించి పాశ్చాత్యదేశములఁ గొంతకాలము కావ్యవధూటీస్వచ్ఛందవిహారమునకు నిరోధము గలిగెను. విమర్శకులు వారిపద్ధతిని వ్రాయఁబడిన కావ్యములనే ప్రశంసించుచు మిగిలినవానిని నిరసించుచుఁ గావ్యరచనకు సంబంధించిన సూత్రాత్మను మఱుఁగుపఱచిరి.

## విప్లవమునకును, అవతారములకును గల ప్రయోజనములు.

జ్ఞానభానుఁ డస్తమయముగా నున్నయట్టి సమయములఁ బ్రజలకు నిశ్చితార్థములు సహజములుగఁగాని గురుప్రసాదమునఁగాని యలవడుట యరుదు. కాని దయామయుఁడగు పరమేశ్వరుఁడు ప్రపంచ మంధకారబంధురమై యుండుట కంగీకరింపక, విప్లవములనుసాధనములచే జ్ఞానోదయముఁ గావించును. లేదా, యవతారము లెత్తియైన జనులలో సంశ యవిచ్ఛేదముఁ గావించును. పాశ్చాత్యదేశముల విప్లవములకు దఱచు ప్రసక్తి గలిగినది. కారణము; వారు రాజసపురుషు లగుటయు మనవారివలెఁ గారణ మరయక యొకదానినిగాని యొకనిసిద్ధాంతమునుగాని మూఢభక్తితో సేవింపక స్వచ్ఛంద వృత్తిని సత్యాన్వేషణముఁ గావింపఁ బ్రయత్నించుటయు, నట్టిప్రయత్నముల సఫల మొనర్చుటకయి ధనప్రాణముల నయినఁ దృణీకరింపఁ జూచుటయే! మనమన్ననో ప్రమాణ బుద్ధి గలవార మగుటను, సహజదయాంతఃకరణుల మగుటను, విప్లవమన్న జంకుదుముగాపుటను, మనకుఁ బరమేశ్వరుఁడే కష్టసమయముల శరణమగుచున్నాఁడు. ఈభావమునే భగ వానుఁడగు శ్రీకృష్ణుఁడు గీతలలో నీక్రిందిశ్లోకముల నుపదే శించినాఁడు.

శ్లో. యదాయదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్.
శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

ఈవేదాంతప్రసక్తి యేలకలిగినదనఁ బ్రాచ్యపాశ్చాత్య లాక్షణికపద్ధతులకుం గలభేదమును సూచించుటకే. అది యెట్లో నిరూపింతుము.

## విజ్ఞానోజ్జృంభణయుగము చాసర్, షేక్స్పియరుకవులు.

రోమను (ల్యాటిన్) సాహిత్యము క్షీణదశకు వచ్చి యందుఁగల నీరసకావ్యములకుఁ బ్రశస్తి హెచ్చి తన్మూలమున నైరోపాఖండవాఙ్మయము క్షీణదశకువచ్చునవస్థ వచ్చినతరుణమున భగవంతుఁడు గొప్పవిప్లవమును మత-సాంఘిక-రాజకీయ-వ్యవస్థాపనల నన్నిటిని గబళింపఁజాలునంతటి వైశాల్యము గలిగినదానినిగాఁ బ్రసాదించెను. ఆవిప్లవఫలితముగ నైరోపీయవిజ్ఞానము నూతనపథముఁబట్టి జరించి కొంచెము ప్రతిభాపక్షపాతము వహించి నిశ్చయమైన కావ్యసృష్టికిఁ గారణభూతమయ్యెను. ఈవిజ్ఞానవిజృంభణము ఇంగ్లాండు దేశమునఁ గావ్యరూపమున నమితఫలవంత మై చాసర్, షేక్స్పియర్, మార్లో మొదలగుకవులు ప్రభవించుటకుఁ గారణమయ్యెను. వీరెల్లరును గావ్యము ప్రకృతికి శుష్క-నీరసానుకరణము కాదనియుఁ, బ్రతిభావంతమగు స్వతంత్రప్రపంచసృష్టియే యనియుఁ గావ్యములఁ బ్రపంచమునకుఁ బరిస్ఫుటము గావించిరి. వీరినిఁగూర్చి ప్రసక్తిగలిగినయవసరముల మన దేశము నందలి కవులతోఁ బోల్చి గుణతారతమ్యచర్చకుఁ గడంగెదను. అందుచేఁ బ్రకృతము ననుసరించి కావ్యలక్షణముయొక్క నిర్వచనమునకుఁ బూర్వాదినమార్పులను విశదీకరింప నెంచితిమి.

## లాక్షణికకవిత్వము.

షేక్స్పియరును, నతనిమతముననే కొంతవఱకుఁ బ్రవర్తమానుఁడైన 'మిల్టన్' కవియు సూర్యచంద్రులట్లు లేని కీర్తిస్వర్గగతులగుటచేతను, నప్పటికాలసరణివలనను నింగ్లండుదేశమునను నితరములగు నైరోపీయదేశములను స్వతంత్రకావ్యరచనాప్రతిభ కొంతవఱకు కడుగంటినకతన యాదేశముల కవులెల్లరును దిరిగి ల్యాటిన్‌కవు లేర్పఱచిన లాక్షణికపథమునే త్రొక్కవలసిన వారైరి. ఆకాలమున సమకాలికాచారవ్యవహారములు ల్యాటిన్‌కవులచేవలె నాంగ్లపరాసుకవులచే మిక్కిలి విరివిగఁ గావ్యముల వర్ణితములై స్వతంత్రకావ్యరచనాప్రతిభను నగాధసముద్రమున నడుగంటఁ ద్రొక్కివైచెను.

## పరాసు విప్లవము

కాని సముద్రుఁడును నెంత గభీరుఁడయ్యును నట్టి శుష్కకావ్యముల జీర్ణించుకొనలేక వానినెల్ల నొక్కపెట్టున 'ఫరాసువిప్లవ' మను మహాజ్వాలకు నాహుతియగునటులఁ బైకి వెడలఁగ్రక్కెను. నిరంకుశపరిపాలనవ్యథను దరతరములఁ గుంది యొక్కమాఱుగ దాస్యపారతంత్ర్యాది శృంఖలలను భేదింప దొరకొన్న పరాసులు కావ్యమునఁ గూడఁ బూర్వకవిసాంప్రదాయదాస్యమును ఛేదించి స్వతంత్రకావ్యసృష్టికి దారులు తీసినవారైరి. పరాసువిప్లవఫలితముగ నైరోపాఖండమునఁ గావ్యసృష్టియే ప్రధానముగ నెంచఁబడి ఛాయాపటరూపానుకరణము గౌరవపదమును గోలుపోయి స్వతంత్ర వాఙ్మయము బయలువడుటయు సంభవించెను. విప్లవమే యెప్పుడును జిరస్థాయిగ నుండునటుల మనుష్యులు కోరరు.

విప్లవములచే జనించినవాఙ్మయము తాత్కాలికముగ నిర్మింపఁ బడు పాకలు, పందిళ్లుంబోలె దిట్టమగు పునాదులు లేనివగుట శీఘ్రముగ నధఃపతనము నొందునవస్థకు రాఁగలవు. దీనికిఁ దార్కాణము విప్లవానంతరమున నొకశతాబ్దమేనియు ముగి యకపూర్వమే తిరిగి ల్యాటిన్ వాఙ్మయమునెడఁ బక్షపాతము మొలకెత్తుటే!

## మాత్యూ ఆర్నాల్డు.

'ఆర్నాల్డు' అనువిమర్శకుఁడు కావ్యము జీవితవిమర్శన మని యొకయపరూపసిద్ధాంతముఁ గావించెను. ఇతఁడు కావ్య కర్తను సృష్టికర్తగఁ గాని 'ఛాయాపటగ్రాహకునిగఁ గాని భావింపక జీవితవిషయములను విమర్శించి, (శాస్త్రదృష్టితోడ నని సమయముఁజెప్పినను సత్యదూరముగాదు.) యాంటర్యమును నర్పించువానిఁగ నిర్ధారించెను.

## ఆధునికాంగ్లకావ్యపద్ధతి.

వెంటనే కవి విమర్శకుఁడు గాఁడనియు, సృష్టికర్తయే యనియుఁ, గవిస్వతంత్రజీవియేకాని పరులపై నాధారపడి యుండువాఁడు కాఁడనియుఁ, గావ్యమునకుఁ గావ్యదృష్టిదక్క శాస్త్రదృష్టియు విమర్శకదృష్టియు నప్రధానములనియుఁ, గావ్య మునకుఁ బరమావధి హ్లాదైకమయత యే యనియు సిద్ధాంతముఁ గావించి యనేకులగు విమర్శకులు ఆర్నాల్డుమతమును బూర్వ పక్షముఁగావించి రసికమతమును నిల్పిరి. నేఁటిపఱకును భగవత్ కృపవలన నామతము మాఱలేదు. మొనమొన్ననే తిరిగి 'యను కరణ'పద్ధతి నవలలయందును, నాటకములయందును, గొన్ని

యెడలఁ గవితయందునుగూడఁ దలచూప నెంచుచున్నది. కాని యింతలో లోకభీమమగు నీమహాసంగ్రామము ప్రాప్తించి యుంటచే వాఙ్మయము స్తంభించిపోయినది. ఇఁకముందు నేపరిణామముఁ దాల్చునో చెప్పుట దుస్తరము.

### కవి నిరంకుశుఁడా!

కావునఁ గవి సృష్టికర్త యనియుఁ బ్రతిభాశాలి యనియు నొప్పుకొన్నతోడనే వేఱొకప్రశ్నమున కవకాశము గలుగుచున్నది. ఆప్రశ్న మెద్దియనఁ గవి నిరంకుశుఁడా? కవిని బంధింపఁగల నియమము లేవైన నున్నవా? యనియే. ఈప్రశ్నమునకు సమాధాన మీవలయునన్నఁ గొంచెము చర్చలోనికి దిగవలసివచ్చును. ఆచర్చ భిన్నభిన్నశాస్త్రములపై దాడిగాఁ బరిణమింపఁగలదు. అందుచే నేను శాస్త్రములయెడ గౌరవము లేనివాఁడనని భావింపఁదగదు. సాహిత్యశ్రేయోభిలాషినై సాహిత్యస్వచ్ఛందప్రవృత్తికి నిరోధములగు నియమముల నాపాదించు వివిధశాస్త్రముల నొక్కింత చుఱచుఱఁ జూచి దూరముగఁ దొలఁగిపోవ నానతీయ దొరకొందును.

### శాస్త్రశృంఖలావిచ్ఛేదము.

ప్రప్రథమమునఁ గవి నిరంకుశుఁడని స్థాపించుట నాయభిమతము. కవిని బంధించుటకయి మనవారు తయారుగావించిన శాస్త్రశృంఖలలను ఛేదించుటకుఁ బ్రయత్నింతును. లాక్షణిక వర్గమునకుఁ జేరినవిమర్శకులందఱును "అదోషౌ,సగుణౌ,సాలంకారౌ" అనుమాటలను దమవిజయపతాకలపై విలిఖించి కవిని బ్రతిఘటింపఁ జూచుచున్నారు. లాక్షణికసైన్యముల నతిరథులు, మహారథులు, నర్ధరథులుఁగూడ నున్నారు. వీరిలో వైయా

కరణు లతిరథులు. పాణిని యేపుణ్యదివసమున భూమిపై నవత రించెనోకాని, యానాటినుండియు నీవైయాకరణులయధికారము నిరంకుశముగను, నిర్వికల్పకముగను సాఁగుచునే వచ్చినది.

## వ్యాకరణశాస్త్రము.

దీనికిఁ బ్రధానకారణము వ్యాకరణమును నాయభిమానియగు పాణిని వేదాంగముగ నిర్ణయించుటచే దానికి నమితగౌరవమును, గవిని బంధింపఁగలుగునంతటి యధికారమును మనవార లొప్పుకొని శబ్దశుద్ధియని సాకుపెట్టి,కవియొక్క స్వచ్ఛందవృత్తికి భంగము నొదవించుచు వ్యాకరణమునకు జోహాను లొనరించుచుండుటయుఁ, గవులు వైయాకరణుల దౌర్జన్యమునకు వెఱచి వారియధికారమునకు లోఁబడి స్వస్వరూపమును గుర్తింపలేకపోవుటయు నే!

## వ్యాకరణశాస్త్రప్రయోజనము.

వ్యాకరణ మననేమి ? శబ్దశుద్ధి యననేమి ? ఈ రెంటికిని గవికర్మకును సంబంధ మేమి ? వ్యాకరణమనఁగా శబ్దముల స్వరూపమును సాధుత్వమును జర్చించి నిరూపించుశాస్త్రము. శబ్దశుద్ధియన వ్యాకరణనియమానుసారముగా శబ్దములకు నలవడు నిశ్చితమయిన రూపలక్షణాదులే. దానినిగూర్చి సందియముగాని, వివాదముగాని లేదు. కాని "వైయాకరణుల నియమములు కవిననుసరించునా? లేక కవిని శాబ్దాదుగాఁ గొని యిష్టానుసారముగ నడపించునా?" ఈప్రశ్నకు సమాధానము నిచ్చుట నిష్పక్షపాతబుద్ధితోడను దత్త్వాన్వేషణాసక్తితోడను నరయుదము.

## వ్యాకరణము స్వాభావిక శాస్త్రీకమని ద్వివిధము.

కావ్యవిషయమునఁబోలె వ్యాకరణవిషయమునను భిన్నమతముల కవకాశము కలదు వ్యాకరణశాస్త్ర మనుసంధించుటలో రెండుపద్ధతులు వ్యవహారయోగ్యములు. అవి యెవ్వియనిన? స్వభావపద్ధతి, ప్రమాణపద్ధతియును. స్వభావపద్ధతి ననుసరించి వ్రాయఁబడు వ్యాకరణముల శిష్టజనవ్యవహారమేగాక గ్రామ్యజనవ్యవహారమునైతముఁ బడసినపదజాలముఁగొని శబ్దస్వరూపనిర్ణయమును విశాలదృష్టితోఁ గావించుటయే వైయాకరణులు కావింపఁదగునని.

## స్వాభావికవ్యాకరణపద్ధతి.

పదములనన్నిటి నున్నవి యున్నట్లుగ సంగ్రహించి స్వరూపనిర్ణయము గావింపవలెను. కాని "ఈరూపము సాధువు, ఇదయసాధువు" నను శాసనములకు నెడమిచ్చి వైయాకరణులు నిషేధమార్గము ప్రసాపింపఁగూడదు. ఈస్వాభావికవ్యాకరణముల సూత్రములు మితసంఖ్యాకములు. సృష్టికెల్లను సూత్రాత్మకములనఁదగు ప్రధానసూత్రము లెట్లు మితసంఖ్యాకములుగను నిర్వికల్పములుగను నుండునో యట్లే స్వాభావికవ్యాకరణమూలసూత్రములు కొలఁదిగనే యుండి సర్వప్రపంచసామాన్యములును సర్వభాషాసామాన్యములును సర్వదేశకవిజనాదరణీయంబులును నై వర్తించుచుండును. ఇందులకుదాహరణములు వచన - లింగ - పురుష - కాల-విభేదాదులఁ గూర్చిన నియమములు.

### ౧. వచనవిభేదములు.

ఏ దేశముననేమి, యేభాషయందేమి వచనభేదముఁ జెప్ప వలసినయవసరముల నెవ్వరైన "రెండుపెట్టె వచ్చినది" అని గాని, "ఒకబల్లలు ఉన్నవి" అనిగాని, చాలమంది జనులు వూరు చున్నది" యనిగాని పల్కుదురా? పలుకరు. వేయేల? గ్రామ్యు లేని, పిల్ల లేని, ఎవ్వరునేని యట్టితప్పుఁ గావింపరు. భాషయేమి యుఁ దెలియని పరదేశీయు లట్లు పల్కుదురేమో? సాధార ణముగా తెనుఁగు తిన్నగా రాని తురకలును, విదేశీయులగు శ్వేతజాతులవారును నిట్టియపభ్రంశములఁ దఱచువాఁడుచుం డుట మనకు విదితమే. కాని వ్యాకరణశాస్త్రమన నేమియో తెలియనిపామరులు సైతము సహజమగు వ్యాకరణజ్ఞానబల మున వచనభేదముల సూచించుపట్ల పైనుదాహరింపఁబడిన యపభ్రంశముల నుపయోగింపరు.

### ౨. లింగవిభేదము.

ఇఁక లింగవిభేదవిషయముఁ బరిశీలింతము. ఎట్టిపశు ప్రాయుఁడేని "ఆఁడువాఁడు వస్తాఁడు, రాముఁడు మంచిది, ఆవు మంచివాఁడు బల్ల మంచివాఁడు" మొదలగుప్రయోగ ములఁ గావించునా? కావింపఁడు. ఎవ్వఁడేని యట్టిప్రయోగము గావింపఁగనే మనమెల్లరమును జేరి చెన్నపురికో, విశాఖపట్టణ మునకో కబురుఁజేసి యతనికిఁ బిచ్చియాసుపత్రులలో నెందేని ప్రవేశము సంపాదించెదము. కాని "గుఱ్ఱముగారూ, ఆఁడ వాఁడు" అని పలుకువిజాతీయులు భాష తెలియనివారగుటచే క్షంతవ్యులు; స్వభావసిద్ధములగు వ్యాకరణనియమముల కేనియు నతీతులు. ముక్కుల నూపిరిఁ గలిగి చైతన్యముఁ

దక్కియుండని జీవులెల్లరకు నీలింగవిభేదజ్ఞానము తల్లిపాలతో వచ్చునదియే. ఇందులకు వారి కేవైయాకరణులసాయమును నక్కఱయే యుండదు.

### 3. పురుషవిభేదములు.

పురుషవిభేదజ్ఞానముకూడ నిట్టిసహజప్రతిభయే. ఎవ్వఁడుగాని "నేను వస్తావు, నీవు వస్తాను, వాఁడు వస్తాము" అని పల్కునా? పలుకఁడు. ఒకవేళ నట్లుపలికినచో వానినిగూడ పైనఁ జెప్పఁబడినవారితో కట్టఁగట్టి పంపుదుము. నీవు, నేను, అతఁడు, ఆమె యనువిభేదములు కన్నులున్న ప్రతిమానవునకు గోచరించును. ఆభేదము కనఁజాలనియతఁడు సాక్షాత్తు అద్వైతమూర్తియైనగాని, తనకుమించిన దెద్దియుఁ బ్రపంచమున లేదని నమ్ము నహంకారస్వరూపుఁడైనఁగాని, చైతన్యరహితుఁడగు జడప్రకృతియైనఁగాని కావలెను.

### ర. కాలవిభేదములు.

తుదకు కాలవిభేదజ్ఞానముకూడ జన్మలబ్ధమే కాని యన్యము కాదు ఎట్టివాఁడును "నిన్న వస్తాము, రేపువచ్చితిని" అనిపలుకునా? పలుకఁడు నిన్న, నేఁడు, రేపు లనువిభేదములు బిడ్డలకుసైతము గోచరించును. ఏది ముందుజరిగినదో, ఏది జరుగుచున్నదో, ఏది ముందు జరుగఁగలదో జనులు కాలక్రమానుసారముగ నేర్పఱింపఁగలరు. నిన్నటిసంగతి రేఁపటిదిగను, రేఁపటిసంగతి నిన్నటిదిగను నన్వయించుగుణము కాలజ్ఞానమువీడి తపోనిష్ఠమై యుగయుగములు ముక్కులను గన్నులను మూసికొని జపముఁజేయుచుఁ జైతన్యముఁ దక్కి శిలలఁ

బోలియుండు మహర్షులకుఁ జెల్లునేకాని యితరులకుఁ జెల్లదు. పిశాచావేశమున మతిభ్రమనొంది పూర్వాపరజ్ఞానముఁ దక్కిన వారికిఁ జెల్లిన నొకవేళఁ జెల్లవచ్చును. అంతియకాని పంచేంద్రియవ్యాపారములకు వశుఁడై సజీవుఁడై యుండుప్రతిమానవునకు నీకాలవిభేదవిమర్శనజ్ఞానము సహజసంభవమే.

## వాడుకపదములస్వరూపము సమర్థించు విపులవ్యాకరణ మవసరము.

కావున వైయాకరణులు కావింపవలసినదేమి? వాడుకలోనున్న శబ్దజాలమును సమగ్రముగఁ బరిశీలించి వానితత్త్వముఁ బ్రకాశముఁ గావించుటయేకాని 'సాధుత్వాసాధుత్వాదిచర్చ' యనుపాసువెట్టి లేనిపోనినియమములఁ గల్పించి నిషేధముల వేనవేలుగఁగావించుట కాదు. లింగ-వచన-పురుష-కాలవిభేదవిషయములసహజనియమముల మీఱిచనక యితరవిషయములఁగూడ స్వచ్ఛందస్వభావప్రవృత్తికేమాత్రమునునిరోధములఁగల్పించుకొనకసహజమధురమ్మగురీతినిభాషించు సామాన్యజనులచే వ్యవహరింపఁబడు పదరూపముల నన్నిటిని సాధువులుగఁగాని,యంతకుంజాలనిచో శుద్ధమైనరూపములను రూపాంతరములుగఁగాని వైయాకరణు లంగీకరించి ప్రయోగమునకు వైరళ్య మాపాదించుటయే భాషకు శ్రేయోదాయకము. అట్లు వైయాకరణులు ప్రయోగవిషయమున వైరళ్య మొప్పుకొన్నచో వ్యవహారమున నున్నపదముల రామణీయకము నశించిపోవక యెన్నియో వన్నెలచిన్నెలతోఁ బ్రకాశించి కావ్యమునకు నిత్యనవ్యత నొడఁగూర్పఁజాలును. అప్పుడు పామరులయ్యు హృదయభావోద్వేగబలమున సామాన్యులు సైతము కవితఁజెప్ప యిన్నిశతాబ్దముల

నుండియుఁ బండితులపిత్రార్జితమగు నాస్తివలె నున్న కవిత్వ సంపదను బ్రపంచమున నెల్లెడల విరఁజల్లి లోకాభ్యుదయమునకు నెంతో తోడ్పడఁగలుగుదురు.

## శాస్త్రీకవ్యాకరణము-విధినిషేధములు.
## ౧. ధాతురూపములు.

కాని మనవైయాకరణులు కావించినమహోపకార మెయ్యది? ఒక్కొకధాతువునకు బహుళసంఖ్యాకములగు రూపాంతరములఁ గల్పించిరి. విచిత్రనియమములచే నెల్లఁ గల్పింపఁబడిన రూపాంతరములన్నియు వ్యాకరణశాస్త్రగ్రంథస్థములుగ నున్నంతమాత్రమున, నిఘంటువులమూలల నడఁగి యున్నంతమాత్రమునఁ, బ్రజలచే వ్యవహారమున నిత్యము వాడఁబడకుండినను,గవులచే గ్రంథముల విరివిగ నుపయోగింపఁ బడకున్నను, నగమ్యగోచరములుగ నున్నను, వైయాకరణుల చేతియక్షతలు తలలపైఁ బడినంతనే సాధువులగుచున్నవి. దైవ కరుణచేతను, మనయదృష్టవశమునను మహాకవులెల్లరు నీ యసంఖ్యాకములగు రూపాంతరములకుఁ దమగ్రంథములఁ దావీయనైరిగాని, యిచ్చినచో గన్నులపండువుగ నుండు కావ్యప్రపంచమంతయు ఔలుఅప్పలతోను, ముండ్లమోఁడులతోను నిండియుండెడిదే. సంస్కృతమున ధాతురూపముల నన్నిటి నుపయోగించు నుద్దేశముతో వ్రాయఁబడిన "భట్టికావ్య"మను నొకగ్రంథమున్నది. సాహిత్యమును జిత్రవస్తుప్రదర్శనశాలగ భావించి యిన్నిమహాకావ్యము లుండఁగ నిట్టిగచ్చపొదవంటి నిరర్థకకావ్య మేల యుండఁగూడదని యెంచియేకాఁబోలు కవి శ్రమమంతయుఁ వృథఁబుచ్చి యీగ్రంథమును రచించి మన

పాలఁ జదువుఁడని పడవైచెను. వ్యాకరణశాస్త్రము నిరంతరము పఠించుటవలనఁ బ్రసిద్ధములగు ధాతురూపముల విసర్జించి మాఱుమూలలనున్న రూపములనే వల్లించి ప్రయోగించుట తటస్థించును. కోఁతికిఁ గొబ్బరికాయ దొరకినచందమున వ్యాకరణశాస్త్రపరిచయ మబ్బినతోడనే యువకుల కననేల, యారితేరిన పండితులకునైతము విపరీతములగు ధాతురూపముల యెడఁ బక్షపాతము మెండై స్వారస్యమునెడను, వైశద్యమునెడను నాదరమును నభిమానమును సన్నగిల్లిపోవుచున్నది. వ్యాకరణశాస్త్రపారంగతులుకాని కవులు వ్యవహారముననున్న పదములను, వానికుండుసుప్రసిద్ధరూపాంతరములను మాత్రమే సేకరించి యెల్లరకుఁ దెలియునటులు స్వచ్ఛమును, మధురమును, సులభమును నగుభాషలో గ్రంథరచనఁ గావింపఁ గలుగుచున్నారు.

## ౨. లింగవిభేదవిషయము.

ఇంతియకాదు. వైయాకరణులు సృష్టికిఁబ్రతిసృష్టిఁ జేయుటకుఁగూడఁ గడంగినారు. లింగవిషయమున నిరంకుశాధికారధూర్వహులై పదములకుఁ దమయిచ్చవచ్చినభంగి లింగముల దానముఁ గావించిరి. ఒకేపదమును స్త్రీలింగముగను, పుంలింగముగను, నపుంసకలింగముగను వాఁడుచు, గవులకుఁ దీరరాని కష్టములఁ గల్పించినారు. వ్యవహారముననున్న పద్ధతికిని వైయాకరణకల్పితమగు పదములలింగపద్ధతికిని భేద మెంతేనిఁ గన్పించును. వారియిచ్చవచ్చినట్లు నీపదము స్త్రీలింగము, నీపదము నపుంసకలింగము, నీపదము పుల్లింగము ననుచు వైయాకరణులవ్యాజకరుణమెయిఁ బదములకు లింగదానపత్రముల నొసఁగ

నవి కవులపాలిటిశాసనములై మీఱి వర్తింపరాని వయ్యెను. ఈలింగవిభేదముల విచిత్రపద్ధతులచే సమాసరచనలో నెన్నో కష్టములు సంభవించుచున్నవి. గణవిభజనము విషయమునను సంధివిషయమునను నమితములగు కష్టము లుత్పన్నము లగుచున్నవి.

## 3. వచనవిభేదము.

వచనవిభేదముల విషయమునఁగూడ నిట్టిచిక్కుల ననేకముల వైయాకరణులు కల్పించియున్నారు. సంస్కృతమున వచనములు ఏక - ద్వి - బహువచనము లనుమూఁడువిధములుగ నుండుటయేగాక యనేకశబ్దములు నిత్యబహువచనాంతములుగనో, నిత్యైకవచనాంతములుగనో, నిత్యద్వివచనాంతములుగనో యుండుటకూడ సంభవించి గోరుచుట్టుపై రోఁకంటిపోటన్నభంగి యీవఱకున్న కష్టములకుఁదోడు క్రొత్తవి కలుగుచున్నవి. ఇట్టి విచిత్రపద్ధతులను గల్పింపఁబడిన వచనాంతవిభేదములనెల్ల వల్లెవేయ నిది కవితఁ జెప్పఁగడంగుట సాహసకార్యమే యగుచున్నది. ఈవిచిత్రవ్యాకరణవిశేషముల నన్నిఁటిని నేకరువుపెట్టుసరికి యున్నసాహిత్యాభిరుచి కొంచెమును గవితోద్రేకమును నశించిపోవును.

## ౪. విభక్తులు, కాలవిభేదములు.

ఇఁక విభక్తులవిషయమును భూత - భవిష్య - ద్వర్తమానకాలవిభేదములవిషయమును గష్టముల కాస్పదము లగుచున్నవి. ఒకవిభక్తియర్థమున నింకొకవిభక్తి యుపయోగింపఁబడునియమములును, నొకకాలమును సూచించుటకై వేఱు

కాలమును సూచించు క్రియారూపము లుపయోగింపఁబడు పద్ధతులును నానావిధములగు కష్టములఁ గూర్చుచున్నవి. సులభగ్రాహ్యములును, సర్వసమ్మతమ్ములును, సర్వవిషయసామాన్యమ్ములును నగునియమముల నేర్పఱచి సర్వమతములకు సమన్వయము గావించుపద్ధతి మనవైయాకరణులకు రుచింపదు. ఎంత దూరస్థములుగను, స్వభావవిరుద్ధములుగను నున్న నియమముల కంతగౌరవము ప్రాప్తించునని మనవైయాకరణులమత మై యున్నట్లు తోఁచెడును.

## ఆంధ్రవైయాకరణుల యధికారనిర్వహణము.

సంస్కృతవైయాకరణులచేఁ గల్పితములగు నియమములు చాలవని కాఁబోలు మనయాంధ్రలాక్షణికులు నర్ధానుస్వారము రేఫఱకారములకుభేదము,చే జేలకు భేదము, మొదలు గాఁగల నియమములను నేర్పఱచిరి.

## ౧. అర్ధానుస్వారము.

ఇందు నర్ధానుస్వారనియమమును రేఫఱకారభేదమును గూర్చిననియమమును జాలకాలమునుండి వివాదాంశములుగఁ బరిగణింపంబడుచువచ్చినవి. అర్ధానుస్వారమునకుఁ బ్రయోజనము శూన్యమని చెప్ప వలనుపడదు గాని, తదభావము మాత్రము గవికి శాశ్వతఘోరనరకప్రాప్తి నాపాదింపఁగల మహాదోషము కాదని నావిజ్ఞప్తి. సదసద్వివేకులగు పాఠకులు కొండొకయెడ నర్ధానుస్వారమును గవి ప్రయోగింపకున్నను సందర్భముననుసరించియు, బుద్ధిబలమునను నర్థము గ్రహింప లేకపోరు. అట్టియర్ధానుస్వారము లేకపోవుటచే నర్థభేదము

వాటిల్లేదు కావులందఱ కర్థానుస్వారవిసర్జనము సర్వత్ర దోషముగఁ బరిగణింపఁదగదు.

## ౨. రేఫ శకట రేఫముల ప్రశంస.

ఇఁక రేఫశకట రేఫములవిషయము: వీనికి నేమో నిసర్గ భేదమున్నదనియు, నందువలన వీనికి మైత్రిఁ గల్పించుట మహాదోషమనియు భావించి యాంధ్ర దేశలాక్షణిక శిరోమణి యనందగు నప్పకవి పోతనామాత్యునిచే విరచితమగు శ్రీమ ద్భాగవతమును నధఃపాతాళమున నడుగంటఁద్రొక్కఁజూచెను. కాని, మనయదృష్టఫలమునను, బోతన కవితా ప్రభావమునను భాగవతము నప్పకవ్యాదిలాక్షణికంమన్యుల తాఁకుడులచే నశిం పక ద్విగుణీకృతవైభవముతోడను, శక్తితోడను నాంధ్రరసి కులహృదయముల వశముఁ గావించుకొనుచున్నది. వైయా కరణులచేఁ గల్పింపఁబడిననియమములఁ గొన్నింటిమాత్రమే యుదాహరించితి.

## వ్యాకరణమునకుఁ గావ్యముపయిఁ బ్రభుత్వము లేదు.

నాయభిప్రాయ మేమనఁగా వ్యాకరణశాస్త్రము గౌరవార్హమయ్యుఁ గావ్యనిర్మాణము నెడఁ బ్రభుతనవహించు టకు సమర్థము గాదనియు, వ్యాకరణనియమములకు లోనై రసవత్తరకావ్యకల్పనముఁ జేయఁగల్గుట ధీవైభవప్రదర్శక త్వమేయైనను వైకల్పికములగు వ్యాకరణనియమములను మాత్ర మతిక్రమించి సహజములగు నియమములఁ బాటించి రసమునే ప్రధానలక్షణముగ నుంచి కవితఁ జెప్పంబూనుట యొక్కింతసాహసకృత్య మయిననుఁ బాపకార్యముమాత్రము గాదనియు నే!

ఈసందర్భమునఁ బాఠకులు నాయభిప్రాయమును నిష్పక్ష పాతబుద్ధితో నరయుదురుగాత. నేను జెప్పునది బుద్ధిపూర్వకముగ వ్యాకరణము నగౌరవపఱచుటకయి దుష్టప్రయోగముల బొంతఁ బొమ్మనుట గాదు. ప్రధానలక్ష్యమగు రసపోషణము నకై తప్పనిసరిగ పెడత్రోవల ననఁగా—వ్యాకరణవిరుద్ధములయిన త్రోవలఁ జనినం దప్పులేదనుటయే!

రసమే ప్రయోగముల సాధుత్వమును నిర్ణయించును.

వైయాకరణులచే నంగీకృతములగు విపరీతరూపాంతరముల నంగీకరించుటకన్న సహజములును, వ్యవహారమున నున్నవియును, నగు పదరూపములనే యవి కొంచెము దుష్టములైనను నంగీకరించి ప్రయోగింపఁదగుననియుఁ గృత్రిమ వ్యాకరణనియమవిరుద్ధములయినంతమాత్రమున రసబంధురములగు "చూచీచూఁగని—రోసీరోయని—ఱోళ్లారోఁకళ్లా—" మొదలగు ప్రయోగంబులు ప్రయోగానర్హములు గావని నావిన్నపము. న్యాయముగ విచారింతుమేని వైయాకరణులు దుష్టములనిచెప్పు వ్యావహారిక ప్రయోగములందునను, సామెతలయందునను, నున్నరసపుష్టి యెర్వుం దెచ్చిపెట్టుకొన్న సంస్కృతవ్యాకరణ నియమానుబద్ధములగు విపరీతప్రయోగములయందు మృగ్యము. కావుననే యాంధ్రమున విపుల వ్యాకరణసంగ్రహరచన మత్యావశ్యకము. అనేకభాషలలో వ్యావహారిక పదప్రయోగముల స్వరూప పరిణామములఁ దత్త్వపరిశీలనదృష్టితో విమర్శించువ్యాకరణములు పెక్కులు గలవు. తుదకు బూతులతత్త్వమును, స్వరూపమును జర్చించు వ్యాకరణములుగూడ నాంగ్లేయభాషయందుఁ గలవు. వ్యావ

హారిక పదప్రయోగములతత్త్వమును, స్వరూపమును బ్రకాశింపఁజేయు విపులవ్యాకరణ మొకటి యుండిన వైయాకరణులకును రసికులకును సంప్రదాయసిద్ధముగను నిర్వికల్పముగను వచ్చుచున్న యీపోరాట మంతరించి యాంధ్రకావ్యవధూటి సొంతసొమ్ములతో నవ్యలావణ్యస్ఫురణలతో మనయెదుటఁ దాండవమాడఁగలదు. రసహృదయులగు పాఠకులీసందర్భమునఁ గాళిదాసమహాకవి రచితమగు నీక్రింది శ్లోకభావమును మనసనముఁజేయుదురుగాక!

శ్లో. సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి,
ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివ హి మధురాణాం మండనం నాకృతీనామ్.

ఆకృతియే ప్రధానముగాఁ గలవారికి నెట్టివిదైనను భూషణములే యగును. అది లేనివారికి నెన్నియున్నను దీఱనికొఱంత యొప్పటికప్పుడు గోచరించుచునే యుండును. చంద్రునిఁ గూర్చి విచారించునప్పుడు మనకుఁ బ్రధానలక్ష్య మతనిశోభాపటలమేకాని యతనియందున్న మచ్చగాదు. అట్లే సరసిజము విషయమునను దానిసౌందర్యమే ప్రధానలక్ష్యమగుంగాని దాని నంటఁజుట్టికొనిన నాఁచుగాదు. ఇన్నిలోపములున్నను సరసిజమును, జంద్రుఁడును బ్రభావిశేషముననే లోపముల నతిక్రమించి ప్రకాశింపఁగల్గుట సంభవించుచున్నది. ఏతద్విధముననే కావ్యమునఁగూడ బ్రధానలక్ష్యము రసమే యగుటం జేసి చిల్లరవిషయము లనందగు వ్యాకరణలోపములు పరిగణింపఁదగినవి కావనియు, రసమనునది వ్యాకరణలోపముల

కతీతమై స్వతంత్రజీవనముఁ గల్గియుండుననియు, నెట్టివ్యాకరణ దుష్టప్రయోగములైనను రసభరితాకృతియగు కావ్యకన్యక కలంకారములు గాకపోవనియు నావిన్నపము.

## ౨. కావ్యమునకును, తర్కశాస్త్రమునకును భేదము.

వైయాకరణులతో మనకుఁ బెద్దపోరాట మాయెను. వారినివీడి రసికపథమునఁ గావ్యతత్త్వాన్వేషణపరులమై చనియెదముగాక! కాని విరోధివర్గ మింకను నాశము కాలేదే! అరుగో తార్కికులు, నైతికులు, ధర్మవేత్తలు మొదలగు నతిరథార్ధరథశ్రేష్ఠులు బాణులుతీఱి యుద్ధపరికరములతోఁ గావ్యరసాన్వేషుల నెదిరింపఁ జూచుచున్నారు. కావున మనకు వీరితోఁ బోరాటము తప్పదు. ద్వంద్వయుద్ధమే కరణీయము, ముందుగఁ దార్కికుని నోడింప యత్నింతము. కావ్యమునఁ బ్రధానాంశము రసమగుటచేఁ గార్యకారణ సంబంధములఁ గూర్చినచర్చకుఁ దర్కశాస్త్రమున నున్నంత ప్రసక్తి లేక పోవుటచేతను గావ్యమునకును దర్కమునకును దరతరముల నుండి యెడమూపు పెడమూపు లయినవి. తర్కమున నెంతవఱకును నిదిముందా? యదిముందా? దీని కాధార మదియా? దాని కాధార మిదియా ? యనుహేతువాదమున కెక్కువప్రసక్తి కలదు. కావ్యమున నట్టిప్రసక్తి యసంగతము. ఎదుట నున్న వాఁడే పెండ్లికొడుకన్నట్లు కవికి మొట్టమొదటఁ దట్టుభావమే కావ్యమూలబీజమగును. కవికి రసపోషణముతోఁ బని కలదు గాని పూర్వాపరచర్చతోడను కార్యకారణవిభేద విచారము తోడను బనిలేదు. తార్కికుఁడు చిత్తవికారములకు లోను గాక నిష్పక్షపాతబుద్ధితో న్యాయైకవిమర్శనదృష్టితో సందిగ

విషయముల నిదమిత్థమని నిర్ణయించును. కవి సహజముగఁ బక్షపాతి, యభిమాని, చిత్తవికారములకు దాసుఁడు, పక్ష పాతము, నభిమానము, చిత్తవికారజనితమగు వ్యామోహ మును లేనిచి కవిత పుట్టుటయే యసంభవము. కావునఁ గవిత ప్రభవిల్లవలెనన్నఁ దార్కికుని దూరముగ దొలఁగిపొమ్మనుట యవశ్యకరణీయమ్ము. కవిత్వ మెన్నఁడును సిద్ధాంతవిషయము గాదు. చర్చవలన సత్యము నిరూపించుట కవకాశముగల శాస్త్రము గాదు. కవిత్వరస మనుభవైకవేద్యము గావలయుఁ గాని సిద్ధాంతములవలన నలవడదు. ఈభావమునే భోజుని యాస్థానమున నొకకవి యీక్రిందిచాటుశ్లోకమున వర్ణించెను.

శ్లో. అధరస్య మధురిమాణం కుచకాఠిన్యం దృశోశ్చ తైక్ష్ణ్యం చ,
కవితాయాః పరిపాకం హ్యనుభవరసికో విజానాతి.

కావ్యమునకు ధర్మశాస్త్రమునకుఁ గలభేదము.

తార్కికునితోడి పోరాటము ముగిసినతోడనే ధార్మి కునితోడి కయ్యము సంప్రాప్తమగుచున్నది. ధర్మశాస్త్రమన నేమి? మానవవ్యవహారముల నుద్భవించుకలహముల సమ దృష్టితో నవలోకించి న్యాయ్యముగ తీరుమానము నిచ్చు శాస్త్రమే ధర్మమే ప్రపంచమున నుండనిచో నిరంతరసంరం భము తప్పదు. ధర్మశాస్త్రము జీవితసమస్యను న్యాయముగఁ బరిష్కరించి జీవితమున సామరస్యముఁ గల్పింప యత్నించును. ఇది తగు నిది తగదని ధర్మశాస్త్రము విధినిషేధముల నిర్ణ యించును. శబ్దస్వరూపమువిషయమున వ్యాకరణమునకు బలె మనవారు లౌకికవ్యవహారముల ధర్మశాస్త్రమునకు శాసనాధి కారము నొప్పికొనిరి. ధర్మశాస్త్రముమీఱి వర్తించువారు దండ

నార్షములుగఁగూడ నెన్నఁబడుచున్నారు. అట్టిచో ధర్మశాస్త్రము కవి నెంతవఱకు బంధించును? కవి ధర్మశాస్త్రనిర్ణయములకు వ్యతిరేకముగాఁ గావ్యము రచియింపవచ్చునా? అట్లు రచించుట సత్కావ్యలక్షణ మగునా? ఈప్రశ్నములకు సోదాహరణములగు ప్రత్యుత్తరములను సంపూర్ణముగ నింకొకసందర్భమున విన్నవించెదను. ప్రస్తుతము స్థాలీపులాకన్యాయమునఁ గొంచెము సమాధానము సూచించెదను. కవి రచించెడికావ్యము ప్రపంచమును, నందలిజీతమును, ఛాయాపటమురీతి ననుకరింపక, స్వతంత్ర ప్రపంచమును సృష్టిఁ గావించునని యీవరకే తెల్పియుంటినిగదా! ప్రకృతులు భిన్నము కానప్పుడు వానికి వర్తించు సూత్రములును భేదింతమానవు కదా! ధర్మశాస్త్ర మెప్పుడును బ్రకృతుల కనుగుణముగ సమర్థింపఁబడును గాని వేఱుపద్ధతులఁ గావింపఁబడదు. ధర్మశాస్త్రము నుపనిబంధించునవి దేశకాలపాత్రములు. దేశకాలపాత్రములు మాఱుకొలఁదిని ధర్మసూత్రములును మాఱుచునే యుండును. కవి దేశకాలపాత్రములపైననే యాధారపడియుండఁడు. దేశకాలపాత్రముల కతీతమును, స్వతంత్రజీవనరహితమును నగు రసప్రకృతి కాధారముగఁ గొనును. అందువలనఁ దనచేఁ గల్పితమగుఁ బ్రకృతి కనుగుణముగ స్వతంత్రధర్మసూత్రములను ధర్మసూక్ష్మములను గవియే నిర్ణయించుకొనునుగాని యొకరుగావించినధర్మశాస్త్రము నాధారముగఁగొని కావ్యములలోని పాత్రములకుఁ బారతంత్ర్యము ఘటింప నిచ్చగింపఁడు. మూలసూత్రములను మిగిలినవిషయములనుగూడఁ గావ్యము లవలంబించుధర్మశాస్త్రము నకును, సాధారణమగు ధర్మశాస్త్రమునకును వ్యత్యాస మెంతయేనియు నుండును. ప్రధానసూత్రముల రెండింటికిని నీముఖ్య

భేద మున్నది. సామాన్య ధర్మశాస్త్రమున విధులకుఁ బ్రభుత మెండుగనుండును. స్వాతంత్ర్యమున కనేకములగు నిరోధము లేర్పఱుపఁబడును. అందు మనధర్మశాస్త్రము మానవస్వాతంత్ర్యమునకు వేనవేలు నిరోధములఁ గల్పించినది. మనకు ధర్మములన్నియు నతీతపథమునే చూపింప యత్నించుటచే ధర్మమాచరించవలెనన్న మనము వియత్పథముననైనఁ జరింపవలెను. ధర్మము విసర్జింపవలెనన్న నధోలోకప్రాప్తియైన నందవలెను. మధ్యస్థమగు మార్గాంతరము కన్పింపఁబడలేదు. కావ్యములీపనికిఁ జాలఁ దోడ్పడినవి. కవి స్వతంత్రేచ్ఛుఁ గలవాఁడగుటచే స్వతంత్రపథమున నడచుటవలన వచ్చుఫలితముల నన్నింటిని ధ్యానించి వానివిషయమై తగినకట్టుదిట్టములఁ జేసికొనుచునే యుండును. రసవిషయము సూక్ష్మగ్రాహ్యమైనదగుటచేఁ దత్సంబంధములగు ధర్మములును గడుసూక్ష్ములుగ వర్తించును. ప్రత్యక్షానుభవమున నధర్మములుగఁ దోఁచువిషయము లెన్నో కావ్యసంబంధమైన రసదృష్టితో నవలోకించిన ధర్మములట్లు గన్పడును.

### సమష్టిమానవశ్రేయమే ధర్మశాస్త్ర నిరీక్షణము. వ్యక్తియొక్క స్వతంత్ర రసప్రవృత్తియే కావ్యనిరీక్షణము.

ఈ భేదమునకుఁ గారణము రెండుమతములకును గల భిన్న నిరీక్షణమే కాని వేఱుకాదు. ధర్మశాస్త్రమునకు నిరీక్షణము సంఘశ్రేయము, మానవవ్యక్తియుఁ దత్సంపోషణమును, సాధనమాత్రములును, నప్రధానములును. కావ్యమునకో సంఘశ్రేయ మప్రధానవిషయము. సాధనమాత్రమే, ప్రధానవిష

యమగు నాలంబము మానవవ్యక్తియొక్క రసప్రవృత్తియే. అందుచే ధర్మశాస్త్రము మానవవ్యక్తిస్వాతంత్ర్యమునకు నిరోధకములగు ధర్మములను సంఘశ్రేయోభివృద్ధికై నిర్ణయించును. కావ్యమన్ననో మానవవ్యక్తికి సహజమగు ప్రవృత్తులలో నొకటియగు రసప్రవృత్తిని బెంపొందించు నుద్దేశముతో దాని కనుగుణములగు ధర్మములనే నిర్ణయించి సంఘశ్రేయోభివృద్ధికిఁ గొన్ని యెడల వానిఁగూర్చుధర్మములఁగూడ బోధింపఁజూచును. కావుననే కావ్యధర్మములకును బ్రాపంచికధర్మములకును వైపరీత్యముండుట. ఈవిభేదము పాత్రలచర్యల విమర్శించుచు ధర్మాధర్మవిమర్శన చేయఁగడంగు నవసరముల ముఖ్యముగఁ బాటింపఁదగినదై యుండును కొన్నియెడలఁ గవులు నూతనశాస్త్రముల నిర్మించుచు నూతనధర్మముల సూచించెదరు. అనఁగా పాత్రములచర్యలను నూతనధర్మముల ననుసరించి చేయఁబడినయట్టి వానినిఁ బ్రదర్శించి ప్రత్యక్షముగఁ గాకపోయినను పరోక్షముగనైనను నూతనమార్గముల విశదీకరింతురు. నిస్తంద్రప్రతిభాశాలురగు కవులు భావనాశక్తిబలమున భావిపరిణామమును గూడఁ దాము గాంచి మనకుఁగూడ గోచరింపఁజేయుచు విరుద్ధధర్మములపై మనలోఁ బక్షపాత మునయింపఁజేతురు. ప్రతి మనుజునకును స్వాతంత్ర్యేచ్ఛ యుండుటచేఁ గావ్యధర్మముల యెడ నభిమానము లోలోనఁ జెందుదుము గాని, బహిరంగముగ దానిని వెలిఁబుచ్చుటకు జంకుదుము. ఈభావమునే షెల్లి యను నాంగ్లేయకవివరుఁడు—"కవులు శాసనాధికారరహితులగు ధర్మప్రవక్తలు" అనువాక్యమునఁ దెల్పి రెండుధర్మమతములకును గలభేదమును వివరించెను.

### కావ్యమునకును నీతిశాస్త్రమునకును గలభేదము.

ఇఁక నైతికునితోడి వివాద మున్నది. ఈవివాదము కావ్యముయొక్క బహిరింద్రియము లనందగు శబ్దస్వరూపాది విషయములకు సంబంధింపక కావ్యాత్మ యనందగు విషయమునకే సంబంధించున దగుటచే నెంతయు విపులచర్చకుఁ దగి యుండును. నీతి యన నేమి? నీతికిని గావ్యాత్మకును నెట్టి సంబంధబాంధవ్యములు?

### నీతిశాస్త్రస్వభావమును దాని ప్రధాన నిరీక్షణతత్త్వమును.

నీతి యనఁగా మానవులకుఁ దా మొనర్చుకార్యముల విషయమునఁ గల గుణదోషవిచక్షణతయుఁ బుణ్యాపాపవిచక్షణతయు నే! ధర్మశాస్త్రమునకుబలె నీతిశాస్త్రమునకుఁగూడ సంఘశ్రేయమును, మానవజాతిశ్రేయమును బ్రధాననిరీక్షణములు. నైతికుఁడు భగవంతుఁడను నొకయతీతన్యాయాధికారి యున్నాఁడనియు, నతఁడు సదసద్వివేకసంపన్నుఁడనియు, మానవులకృత్యములను న్యాయబుద్ధితోఁ బరిశీలించి యిది పుణ్యము, నిది పాపము నని వానియందలి మంచిచెడుగులను నేర్పఱచి సర్వజనసామాన్యముగ నాదరణీయమగు జీవితపద్ధతిని నాదేశించుననియు, నట్టియాదేశమే నీతిశాస్త్ర మనఁదగుననియు వాదించును. జీవితానంతరమునఁ బుణ్యాపాపవిమర్శన మొనర్చు న్యాయాధికారియెదుట స్వీయకృత్యములకు నుత్తరవాదులై యుండవలయు ననుభయమున జను లిహలోకమునఁ బాపకార్యములకుఁ గడంగక సర్వమానవకోటికిని శ్రేయోదాయకమగు నీతిపథమునఁ జరింతురనియు నైతికునియాశయము.

ఈయాశయము సఫలమగుటకొఱకై నైతికుఁడు స్వర్గమును నరకమును నను రెండతీతలోకము లున్నవని భ్రమింపఁజేసి నీతిపథమునఁ జరించువారికి స్వర్గలోకప్రాప్తియు, నీతిపథమును వీఁడి పాపపథమునఁ జరించువారికి నరకప్రాప్తియుఁ గలుగునని నిర్దేశించుచున్నాఁడు. ఈనరకభీతియు స్వర్గలోకప్రాప్తియందలి యాసక్తియు మానవుల జీవితపథమును ననేకవిధములఁ ద్రిప్పుచున్నవి నరకభీతిచే మానవుఁడు స్వచ్ఛందప్రవృత్తిని నిరోధించుకొనుచున్నాఁడు. స్వర్గప్రాప్తికొఱకై మానవుఁడు తన కిష్టములేనివైనను స్వచ్ఛంద ప్రవృత్తికి బాధగలగించునట్టివైనను గొన్నినియమములకుఁ గట్టువడి కొన్నివిధుల ననుష్ఠించుచున్నాఁడు. ఇహలోకమున దండనాధికారిభయ మెటులో, పరలోకమున యమదండనభీతియు నట్లే నీతిశాస్త్రమువలని మేలును నింతయని నుడువుటకు వీలుగాదు. అట్లయ్యు నీతిశాస్త్రము కావ్యసృష్టికి నిరోధముఁ గల్పింపఁజాలదని నావిజ్ఞప్తి. అది యెట్లో యించుక విపులముగఁ జర్చించెదను. ధర్మశాస్త్రము నకుబలె నీతిశాస్త్రమునకును బ్రధాననిరీక్షణము సంఘశ్రేయమే యని మున్నే తెల్పియుంటినిగదా! కావ్యమున వ్యక్తియొక్క స్వచ్ఛందప్రవృత్తియే యవశ్యాలంబనీయము. మానవుని రసప్రవృత్తియే ప్రధాననిరీక్షణమై కావ్యమునకు నొక్కింత స్వతంత్రప్రతిభ నాపాదించును.

కావ్యము నీతిని బోధింపవలెనా? ౧. విద్యానాథుఁడు.

కావ్యము మానవజాతిశ్రేయమును బ్రధానలక్ష్యముగ నూని నీతి-ధర్మ-తర్క-శాస్త్రములచే నిర్ణయింపఁబడు నియమములచేఁ గట్టువడి, స్వచ్ఛందరసప్రవృత్తిని నిరోధింపఁ

జూచునా? అట్లు చూచుట మంచిదగునా? ఈప్రశ్నకు సమాధానము ననేకులగు విమర్శకు లనేకరీతుల నొసఁగిరి. ఈవిషయమునుగూర్చి ప్రాచ్యపాశ్చాత్యవిమర్శనసంప్రదాయము లొకేవిధమగు నవస్థాభేదముల నొందినవి. మనదేశమునఁ గావ్యము నీతిబోధకముగ నుండవలెనని శాసించిన లాక్షణికశాసనములలోనెల్లను "కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే, సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే" అనువాక్యమే ప్రమాణాధికారము నందియున్నది. ఈవాక్యముయొక్క యర్థముఁ బరిశీలింతుమేనిఁ గవి కావ్యము యశస్సుకొఱకును నర్థసంపాదనముకొఱకును వ్యవహారజ్ఞానముఁ దెల్పుటకొఱకును నశుభములఁ దొలఁగించుటకొఱకును తాత్కాలికసుఖ మొడఁగూర్చుటకొఱకును భార్యయుంబోలె సమ్మతముగ నుపదేశించుటకొఱకు నని తేలుచున్నది. కవి నిశ్చయముగ నిన్ని ప్రయోజనముల నర్థించి కావ్యము వ్రాయునా? వ్రాయఁదగునా? వ్రాయుటవల్ల నేమైన నష్టముగల్గునా? కావ్యము రసాత్మకమని యంగీకరించుటకుఁ బైశాసన మభ్యంతరము గల్గించునుగావున దీనిని గొంచెము విమర్శింపక తప్పదు. యశంబనఁగ నెట్టిది? అర్థమనఁగ నెట్టిది? శుభాశుభములెయ్యవి? వీనికిని గవికిని నేమిసంబంధము?

## శాస్త్రములు చేయుపనిని కవి చేయఁజూచుట యనవసరము.

కావ్యమునఁ గవి కల్పనఁజేయుపాత్రలు స్వతంత్రప్రవృత్తిఁగలవిగ నుండునని యింతకుమున్నె మన మంగీకరించియుంటిమి. ఇప్పుడు కవిని బ్రయోజనములకు-అనఁగా యశస్సు,

ధనము, శుభము, మొదలగువానికి దాసునిగఁ జేయఁదగునా? వివిధప్రయోజనముల సాఫల్యమునకు వివిధశాస్త్రములు నిర్దేశింపఁబడియుండఁ గవి పనిలేనిపనిగ వానిపొంత నేలఁ బోవలయును? ఎవరిపని వారు చూచుకొన్నఁ దమకును, మిగిలినవారికిని మేలగు కవి తనస్వధర్మమును వీడి శాస్త్రములపొంతఁ బోయినచోఁ బారతంత్ర్యమునఁ బరాధీనతయు నేర్పడునే కాని వేఱుప్రయోజనసిద్ధి లభింపదు. ప్రకృతియం దెప్పుడును ననవసరవాగ్వ్యయముగాని యనవసరప్రతిభావ్యయముగాని యుండరాదు. ప్రకృతి సహజముగ లోభిని చేతనున్న శక్తి ననవసరముగ వ్యయముచేయదు. వివిధశాస్త్రకారులు వివిధశాస్త్రముల రచించి వివిధమానవధర్మముల నిర్దేశించియుండఁ గవి స్వస్థానము వీడి తనకావ్యప్రపంచమును వీడి తనరసమార్గీయపథము నతిక్రమించి కార్యకారణములఁ గూర్చినట్టియు ధర్మాధర్మములఁ గూర్చినట్టియు, శుభాశుభములఁగూర్చినట్టియుఁ, బుణ్యపాపములఁగూర్చినట్టియు వివాదములజోలి కేలరావలయును? రాఁదగదు. శాస్త్ర మెప్పుడును సమష్టివిషయకదృష్టినే కలిగియుండును. కావ్య మెప్పుడును స్వస్వరూపసంధానపూర్వకమగు వ్యష్టివిషయకదృష్టియే కలిగియుండును. కావున నీ రెంటికిని బ్రధాననిరీక్షణమున భేదమున్నది.

కావ్యమున నైతికప్రయోజనము లప్రధానములు రసప్రవృత్తియే ప్రధానము. మమ్మటునిమతము.

అట్లనుటచేఁ గావ్యమున నీతియుఁ బైనఁజెప్పినప్రయోజనములును సిద్ధింపఁదగనివని నాయభిప్రాయము గాదు. అవి ప్రధానలక్ష్యములు గావనినంతమాత్రమున వానికిఁ బద

భ్రంశము విధించితినని తలంపకుఁడు. కావ్యమున నివియెల్లను సాధనములుగ నుండిన నుండవచ్చును. ప్రధానవిషయమగు కావ్యసృష్టికి నిరోధము కలిగింపనంతవఱకు వానికిఁ గావ్యమునఁ దావీయవచ్చును. అంతియేకాని వానినిఁ గావ్యమున రసమునకు నీడువచ్చునధికారినిగా శాస్త్రమునకుఁ దావొసఁగితిమేనిఁ 'జనువిచ్చినఁజంకెక్కె' ననులోకసామ్యము యథార్థమై కావ్యమున రసమునకుఁ బదచ్యుతి సంభవించినను సంభవించును. కవి యనేకులగు యజమానులకు దాసుఁడైనవారిలో నెవ్వరినిఁ దిన్నఁగ సేవించుటకు వీలు కలుగకపోవుటయే కాక రెంటికిం జెడిన రేవడిభంగిని ఆత్మగౌరవమును నన్యుల యాదరణమును గోల్పోవలసిన యవస్థయు సంభవించును. తమతమనెలవులు దప్పిన తమమిత్రులె శత్రులగుట తథ్యము అగునటుల స్వీయకృత్యమును మఱచి పిలువనిపేరంటములకుఁ బోయి యగౌరవమునందుఁ గవి రసికలోకాదరణమునకుఁ గూడఁ బాత్రుఁడును కాకపోవుట తటస్థమగును. నీతి, ధర్మము మొదలగునవి కావ్యమున ధ్వనించుచుండును. కాని ప్రధాన ప్రయోజనములు గానేరవని నావిన్నపము. ఈయభిప్రాయమునే మమ్మటుఁడు 'అనన్యపరతంత్రాం' అను కావ్యవిశేషణమున సూచించినాఁడు. కావ్యము అన్యములపై నాధారపడి యుండదు. అనఁగా నీతి, ధర్మము మొదలగు నన్యప్రయోజనముల నర్థింపదు. స్వతంత్రమై వానిని సాధనమాత్రములుగఁ గైకొని సేవకపదముల నియోగించునేకాని వాని కెన్నఁడును దనతో సమానమగు గౌరవమును స్థానమును నొసంగదు. ఈ భావమునే పండితరాయలు విశ్వనాథుఁడు మొదలగు రసిక వర్గమువారెల్లరు నంగీకరించిరి.

## కావ్యమున నీతి ధ్వనిమాత్రముగ నుండును.

కావ్యము నీతిబోధకముగనే యుండవలయునను టొకటి, నీతి కావ్యమున ధ్వనించుచుండవలయునను టొకటి, కావ్యము నీతిబాహ్యముగ నుండఁదగుననుట వేఱొకటి. కావ్యము నీతి బోధకముగనే యుండవలయునని శాసించుటయుఁ, గావ్యము నీతిబాహ్యముగ నుండఁదగు ననుటయు రెండును గూడని మతములు. కావ్యము నీతిబోధకముగ నుండవలయునని పలుకు వారు స్వధర్మముఁ బరిత్యజించి కవి యన్యధర్మములు స్వీకరించి వానికి దాసుఁడై పదభ్రష్టుఁడు గావలెనని సూచించుచున్నారు. ఇఁకఁ గావ్యము నీతిబాహ్యముగ నుండవచ్చు ననువారు మానవజాతికి ముఖ్యలక్షణమగు నీతిని సంపూర్ణముగ నాశముఁ జేసి దానిని—అనఁగా మానవజాతిగౌరవమును నడుగంటఁ ద్రొక్కఁ దలంచుచున్నారు. మామతమున నీతి కావ్యమున ధ్వనించుచుండవలయును. కావ్యమునకు నీతి సాధనమాత్రము గను నుపాంగముగను నుండి సర్వసంపూర్ణమగు కావ్యసౌం దర్యమునకు దోహదముఁ గావింపవలయును. ఉత్తమప్రకృతులచరిత్రములును, దుర్మార్గులలోసయితము గ్రహింపనగు సద్గుణాభివర్ణనమును నీతిని సూచించుచునేయుండును. దాని వలన మానవునకు నాత్మవికాసము గలుగుచునే యుండును. అంతియేకాని 'కవి ఇది చేయుము, అది చేయకుము' అనుచు ధార్మికునివలెను నైతికునివలెను శాసింపఁబూనుట పిలువని పేరంటమునకుఁ జనుటంబోలినదే. పాశ్చాత్యసాహిత్యచరిత్ర మునఁగూడఁ దుట్టతుదకు నీనిర్ణయమే జరిగెను.

## కావ్యము నీతిబోధకమా?
## ౧ ప్లేటో అరిస్టాటిలులమతము.

ప్లేటోమతమువారందఱును గావ్యము నీతివిదూరమని భావించినసంగతి నిదివఱకే తెల్పియుంటిని. అరిస్టాటిలుమతమునఁ గావ్యమునకుఁ బ్లేటోచే నాపాదింపఁబడిన దోషములు నిశ్చయముగ లేవనియుఁ గావ్యము ప్రాయికముగ నీతిబోధకమే యనియు నిరూపింపఁబడెను. కవి మానవజాతియభ్యున్నతికిఁ గావ్యమును సాధనముగ నుపయోగించి తోడ్పడుననియు, నరిస్టాటిలు సూచించెను.

## ౨. లాఙ్గినీసుమతము.

అరిస్టాటిలుతరువాతివారగు లాఙ్గినీసువర్గమువారును కవి మానవజాత్యభ్యున్నతికే నిజముగఁ దోడ్పడువాఁడే యైనను బ్రాయికముగ నీతిబోధకుఁడు గాఁడనియు, స్వీయపథమగు రస పోషణముననే కవియొక్క స్వాచ్ఛందప్రతిభ విజయమొందఁ గలదుగాని నీతిధర్మము మొదలగుశాస్త్రవిషయముల నిరాఘాటసంచారముఁ గావింపలేవనియు, నిర్ణయించి కవికిఁ బారతంత్ర్యనిష్ఠను, దొలఁగించి రసికమతము స్థాపించిరి. ఇంగ్లండునను, ఫ్రాన్సుదేశమునను దేశకాలపాత్రముల ననుసరించి యభిప్రాయములు మాఱుచు నొకొక్కప్పుడు అరిస్టాటిలు పద్ధతిని వేఱొకప్పుడు, లాఙ్గినీసుమొదలగువారిపద్ధతిని వర్ధిల్లుచు వచ్చెను.

## ఆంగ్లేయసాహిత్యవిమర్శకులమతము
## ౧. సిడ్నీ.

ఆంగ్లేయవిమర్శకులలోనెల్లఁ బ్రథముఁ డనఁదగు సిడ్నీ యనునతఁడు కావ్యము ప్రత్యక్షముగ నీతిబోధకముగాదనియుఁ బ్రచ్ఛన్నముగ నీతిని బోధించియే తీఱవలయుననియు శాసించి తనమతమును నీక్రిందివిధమునఁ దెలిపెను. వైద్యుఁడు చేదు మాత్ర నిచ్చినయెడల రోగి మ్రింగలేఁడని తలఁచి యామాత్రకుఁ గొంచెము తీయనిపదార్థము ననఁగాఁ జక్కెర, తేనె మొదలగు వానిని బైపూఁతఁ బూసి యిచ్చి యెటులు రోగము మాన్పఁ జూచునో యట్లే కవియు నీతినిఁ బ్రత్యక్షముగ బోధించినచో జనులకు రుచింపనేరదని యెంచి రసమును నొకపైపూఁతఁగఁ గావించి కథావర్ణన మొదలగునలంకారములచే నీతిని జనులకు హృదయంగమమగురీతిని బ్రదర్శింపఁదనని సిడ్నీ తెల్పెను. ఈయుదాహరణమునఁ గవికి నీతిబోధన ప్రధానకర్తవ్యమనియు, రసము, సాధనమాత్రమే యనియు స్ఫుటపడుచున్నది. కాని సిడ్నీతరువాతఁ గవులు నప్పటిదేశకాలపాత్రములసరణి ననుసరించి సిడ్నీమతము నంగీకరింపక యింగ్లండు పరదేశముల నిర్జించి జయోద్ధతిచేఁ బ్రకాశించుకతమున నింగ్లండు దేశము యొక్క యౌన్నత్యమును నందలిప్రజలయొక్క జీవితములును వర్ణించిరేకాని నీతిని బ్రత్యక్షముగ బోధింపఁ బ్రయత్నింపరైరి.

## ౨. షేక్స్పియరు.

సిడ్నీతరువాత నింగ్లీషువిమర్శకులలో నెన్నఁదగినవాఁడు షేక్స్పియరు మహాకవియే. షేక్స్పియరు గొప్ప నాటకకర్త.

నాటకలక్షణమును విమర్శించుచు నర్థాంతరన్యాసముగ సర్వ విధములగు కావ్యములకు వర్తించురీతిని నతఁ డొకకావ్య లక్షణనిర్వచనముఁ గావించెను. నాటకము ప్రకృతిని నద్దమునఁ బోలెఁ బ్రదర్శించునని తెల్పెను. అంతియేకాని నాటకము జను లకు నీతిబోధించునని చెప్పలేదు. ప్రకృతిని, మానవజీవిత మును గన్నులఁగట్టినట్లుగ రసవంతముగ, స్వతంత్రముగ వర్ణిం చుటయే కవికృత్యమనియు, నీతిబోధన, ధర్మశాసనముఁ గవి కనవసరము లనియు నిర్ణయించి షేక్స్పియరు తనకావ్యముల నన్నిటినిఁ బైపద్ధతినే రచించి లోకవిఖ్యాతుఁడయ్యె.

## 3. మిల్టను.

షేక్స్పియరుతరువాత నింగ్లీషుకవులలో మిల్టన్ అను నతఁడు చాలగొప్పవాఁడు. ఇతఁడు మతసాంప్రదాయములఁ బెరిఁగినవాఁడు. చిన్నటనాఁటనుండియు మతావేశము గల వాఁడు. అతనిమతావేశమునకుఁ దోడుగ నింగ్లండు దేశమున నాకాలమున విజయౌద్ధత్యము క్షీణించి దురభిమానమునకుఁ బ్రసక్తి మెండయ్యెను. అందుచే మిల్టను మానవునిజీవిత మంతయు గొప్పకావ్యము కాఁదగుననియుఁ, గావ్యమున సద్గుణములన్నియు మానవునియందుఁబలె వర్ధిల్లవలెననియుఁ, గావ్యము మానవుని గుణాభివృద్ధికిఁ దోడ్పడవలెననియు నెంచి భగవంతునిచర్యలను మానవులకుఁ బ్రదర్శించి మానవ కల్యాణమునకు, ననఁగా మానవజాతియొక్క నీత్యభ్యుదయ మునకుఁ దోడ్పడుటకై సృష్టియొక్క చరిత్రమును, మాన వునియధఃపతనమును, మానవునిపునరుద్ధరణమును మొదలగు విషయములను గైకొని నీతిబోధకములగు కావ్యములను

విరచించెను. కాని—మిల్టను రచించినకావ్యములలోనెల్ల దుర్నీతిపరుఁడును నహంకారస్వరూపియు నగు సైతానుని వర్ణనమే యెంతయు రసవత్తరముగ నుండి నీతిబోధకముగ సంతరింపఁబడిన యితరకావ్యభాగములన్నియుఁ జేవలముగ నుండుటయే మిల్టనుమతమును దమంతఁదామే యన్యవాద సాహాయ్య మక్కఱలేకుండఁగనే పూర్వపక్షముఁ గావింపఁ జాలియున్నవి.

## ౪. పోపు మొదలగువారు.

మిల్టన్ తరువాతఁ గవులు సమకాలికాచారవ్యవహారములను వర్ణించుచుఁ గావ్యము సమకాలికాచారవ్యవహారములను సరియగుపద్ధతిని నడపించు నీతినిమాత్రమే బోధించునని తలఁచి కావ్యమునఁ దాత్కాలికోపయోగములగు నీతిసూత్రములను మాత్రమే బోధింపఁజొచ్చిరి. వారికావ్యముల విశాల ప్రకృతివర్ణనముగాని విశాలమానవజీవితవర్ణనముగాని సర్వసమ్మతమగు నీతిబోధముగాని మృగ్యమై తాత్కాలికోపయోగములగు నీతివిషయములమాత్రమే వర్ణింపఁబడి కావ్యములన్నియు నొకేతీరున సంతరింపఁబడి మనప్రబంధములరీతిని "పాడినదే పాడుము పాఁచిపండ్లదాసరీ" యనునిందకు లక్ష్యములై దేశమునకుఁ గాని కావ్యమునకుఁ గాని యేమేలును నొడఁగూర్పంజాలకపోయినవి.

## పరాసువిప్లవముతరువాతికవులు.

ఇంతలో శృంఖలలనన్నియు విదలించి పరాసుజాతి స్వాతంత్ర్యపతాకను దేశదేశములకుఁ బంపించునటులఁ బ్రదర్శించెను. తోడనే నియమములయెడ భక్తియు, భయమును దగ్గి

పోయెను. మతాచార్యులందఱును దొంగలుగను నిరంకుశాధికారవర్గమిత్రులుగను భావింపఁబడుటచే వారిచేఁగావింపఁబడిన నైతికధార్మికనియమములన్నియుఁ దిరస్కారపాత్రములుగ గణింపఁబడినవి. నీతినియమముల నేర్పఱచుటకు మతాధికారులకుఁగల ప్రభుత్వమును దిరస్కరించి పరాసులు మానవుని జన్మగౌరవమును జన్మస్వత్వములును, బవిత్రములుగ భావించి తదనుగుణమగు స్వాతంత్ర్యప్రవృత్తియే యుత్తమనీతిపథమని నిర్ణయించి కావ్యమున నట్టిస్వాతంత్ర్యప్రవృత్తికే తావొసంగిరి. కాని—నీతికి గౌరవపద మీయరైరి. వర్డ్స్వర్త్, కోలరిడ్జ్, షెల్లీ, కీట్స్, బైరన్, మొదలగుకవులు నీతికిఁ గావ్యములఁ బ్రాధాన్యమొసఁగక రసప్రవృత్తినే మిక్కిలి పోషించిరి. బైరన్ ఇంచుమించు నతని దిరస్కరించెననియే చెప్పవచ్చును. మొత్తముమీఁద బరాసువిప్లవముమూలమున నతివాదమునకుఁ బెద్దదెబ్బ తగిలినదని యాంగ్లేయసాహిత్యపరిచితులకు విశదమగును. కాని స్వాతంత్ర్యరక్తి యతిశయించినకొలఁది నీతియందలి రక్తియు సన్నగిల్లుచుండెను. కోలరిడ్జ్, డిక్వి౯సి, బైరన్, షెల్లీ, కీట్స్, మొదలగు కవులజీవితచరితమే యిందులకుఁ దార్కాణము. ప్రతిభాశాలు లెల్లరును నీతివిదూరులై యకాలమరణమువాతఁ బడుట సంభవించుచుండెను.

### ౫. మాత్యూ ఆర్నాల్డునిమతము.
### "కావ్యము జీవితవిమర్శనమే యగును."

ఇట్టిసమయముల 'మాత్యూఆర్నాల్డు' అనుకవి యుద్భవిల్లి యాంగ్లేయసారస్వతమును నీతిపథమునఁ ద్రిప్పఁజూచెను. అతఁడు కావ్యము జీవితవిమర్శన మనియుఁ, గావ్యపరమావధి

యత్యుత్తమ మైనదనియుఁ, గావ్యము మానవునివిచారములఁ బోఁగొట్టి ధైర్యము నొసఁగి చిత్తశాంతిఁ జేకూర్చి యుత్తమ గతి నొడఁగూర్చుననియుఁ, గావ్యమున నీతి ముఖ్యము గాఁ గూడదనియు, మఱి ప్రధానముగనే యుండవలయుననియు, నీతి లేనిజాతులన్నియు నశించుననియు, నీతిబద్ధమయినజాతి చిర స్థాయిగ వర్ధిల్లుననియు, నుత్తమపరమావధిగలకావ్యము సత్పు రుషులయొక్కయు, నీతియుతులయొక్కయు, మహాపురుషుల యొక్కయుఁ జరిత్రములను గావ్యముల వర్ణింపవలయుననియు, సామాన్యమానవునిజీవితము నిసర్గముగ వర్ణనీయము గాద నియుఁ, గవియొక్కశక్తియంతయు సర్వకాలములకును, సర్వ దేశములకును, సర్వమానవులకును వర్తింపఁగలమహావాక్యము లను నీతివాక్యములను రచించుటయే యనియు సిద్ధాంతముఁ జేసి స్వాతంత్ర్యరక్తులగు షెల్లీ-బైరన్-కీట్స్ మొదలగుకవు లను నాదర్శప్రాయులుగ నంగీకరింపక పూర్వులగు గ్రీకు రోమన్ కవులనే యాదర్శప్రాయులుగ నంగీకరించెను.

## ౬. రస్కిను, కార్లైలు వర్గమువారి మతము.

ఆర్నాల్డుకవియొక్క వాక్యము లాకాలపుటాంగ్లేయు లకు శ్రవణకఠోరములుగ నుండెను. కాని రసశాస్త్రవేత్తయగు రస్కిన్‌యొక్కయు, సంఘలోపముల నదయుఁడై ఖండించిన కార్లైలుయొక్కయు వాక్యములు 'ఆర్నాల్డు' నిమతమునకు వ్యాప్తిఁగల్గించెను. రస్కిన్ కార్లైలు లిరువురును నాంగ్లదేశమునఁ బ్రకృతిశాస్త్రవిజృంభణమువల్ల నీతి యడుగంటుచున్నదని భయ పడి దేశక్షేమమునకై నీతివాదమును సమర్థించుచుఁ గొంచె మత్యుక్తిదోషమునకు సహితము పాల్పడిరి. ఫ్రాన్సున సెయింట్

బ్యూపండితుఁడును, జర్మను దేశమున గీతేకవియు, నమెరికా దేశమున యమర్సన్ పండితుఁడును, నాంగ్ల దేశమున నార్నాల్డు కార్లైల్, రస్కిన్ ప్రభృతులును బ్రపంచమున ననఁగాఁ బ్రకృతిశాస్త్రవిజృంభణమునను, ధనమత్తతవలనను నీతివిదూర మయిన పాశ్చాత్యప్రపంచమున నీతియుగమును స్థాపింపవలయు నని చాలఁ బ్రయత్నించిరి. కాని వారియత్నములు చిరస్థాయిగ నుండుఫలితమును బడయఁజాలకపోయెను.

## —{ ౭. స్విన్బర్న్ వర్గమువారిమతము. "కావ్యము నీతిబాహ్యముగఁగూడ నుండవచ్చును." }—

పైవారంతరించినతోడనే రోజటీ, స్విన్బరన్, స్టీవెన్సన్, ఆస్కార్ వైల్డు మొదలగు విమర్శకులు బయలుదేరి కావ్యమునకును, నీతికిని సంబంధమే లేదనియుఁ, గవి సర్వస్వాతంత్ర్యుఁడనియుఁ, గావ్యమున నన్వేషింపఁదగినది రసమే కాని నీతియు ధర్మమును గావనియుఁ, గావ్యము రసవంతముగ నున్నచో నీతిబాహ్యముగ నున్నను దప్పులేదనియు శాసించి నిరంకుశమగు రసికమతమును స్థాపించి నీతిపథమును నడుగంటఁద్రొక్కి 'ఆర్నాల్డు' ప్రభృతుల యాశయములను భగ్నములఁ గావించిరి. తత్ఫలితములుగ ననేకములగు మధురగీతములు వెలసినవి. కాని—నీతియుతమై సర్వలక్షణశోభితములగు పెద్దకావ్యములు బయలువెడలవయ్యెను. స్విన్బరన్ మొదలగు నాధునికాంగ్లేయకవు లెల్లరును నీతి యప్రధానముగ నున్నవిషయములఁ గూర్చియే కవిత వ్రాసి కీర్తిగడించిరి. కాని, నీతి ప్రధానవిషయముగఁ గొని కావ్యరచనకుఁ గడంగరైరి. ఫ్రాన్సు దేశమునను సౌందర్యారాధనము మెండుగఁ గవులు కావించిరి. కాని

కావ్యమున నీతికిఁ బ్రాధాన్యము నొప్పుకొనరైరి. జర్మను దేశ కవులును నీతిదక్క నన్యవిషయము లగుబాహుబలము, జాతి బలము మొదలగు నైహికవిషయములనే ప్రధానములుగఁ గొని నీతిని గనుచూపుమేరనే నిలిపి కావ్యరచనకుఁ గడంగిరి.

**౮. ఆధునికవిమర్శనపద్ధతి. 'ప్రత్యక్షవిషయవర్ణనము.'**

ప్రస్తుత ఘోరసంగ్రామమునకుఁ బూర్వము కవి యున్న దున్నట్లు నీతిధర్మసూక్ష్మములఁగూర్చి విచారణములఁ గాలము వృథపుచ్చక ప్రపంచస్థితిని, మానవజీవితమును గన్నులఁగట్టినట్లు వర్ణింపవలయు ననియు, నీతి కావ్యమునఁ బ్రధానాంశము గాదనియు నిశ్చయించి,'ప్రత్యక్షవిషయవర్ణనము'అనుసంప్రదాయమును నెలకొల్పిరి. ఈసంప్రదాయముయొక్క ఫలితము కావ్యములయందును, నాటకములయందును, పాటలయందును, కథలయందును, నవలలయందును విశేషముగఁ గన్పట్టెడిని. ఇంతలో ఈమహాసిద్ధాంతఫలితమో యన ఘోరసంగ్రామంబు సంప్రాప్తించె. సారస్వతము స్తంభించెను. ఈసంగ్రామప్రళయము నుండి యాంగ్లేయసారస్వత మేరూపముతో బయల్వెడలునో యూహించుట పుట్టనిబిడ్డకుఁ బేరువెట్టఁ జూచుటయే యగు.

**౯. రవీంద్రునివర్గము వారిమతము.**
**"నీతి కావ్యమున ధ్వనిమాత్రముగ నుండును."**

యుద్ధమునకుఁ బూర్వమే యాధునికభారతీయకవిశిఖామణి యనందగు రవీంద్రుఁడు కావ్యము నీతిప్రధానము గాక పోయినను నీతిబాహ్యముమాత్రము కాఁజాలదని తన కావ్యములను నీతి ధ్వనించునట్లుగనే వ్రాసెను. వానిని జదివిన కొంత మంది యాంగ్లేయకవులును ముఖ్యముగ ఈట్సు మొదలగు

సైరిష్ కవులును, దిరిగి నీతియుగమును గావ్యప్రపంచమున స్థాపింతురేమో యనునూహా వొడముచున్నవి.

ముస్లిమ్‌వాఙ్మయము.
రూబయత్తులను కావ్యములస్వరూపము.
సుఫీకవులపద్ధతి నీతికిని రసమునకు
సమన్వయ మనఁదగును.

ఇఁక మహమ్మదీయవాఙ్మయముఁగూడ నించుక స్థాలీపులాకన్యాయమున నవలోకింతము. ముస్లిమ్ కవులలోను గొంత మంది ప్రాయికముగ నీతిబోధనఁ గావించిరి. సాధారణముగ రూబయత్తులు—అనఁగాఁ 'గెంపులదండలు' అను కావ్యరూపముల ముస్లిమ్‌కవు లుపమానోపమేయముల సాధించి నీతిబోధనఁ గావింపఁజూచిరి. వీరలలో **ఓమార్ ఖయమ్, జలాలుద్దీన్**, సాదీ, మొదలగువారు ప్రముఖులు. వీరును బ్రాయికముగ నీతిబోధనఁ గావించిరని నిర్ధారించుటకు వీలులేదు. ముస్లిము లెప్పుడును రసప్రవృత్తిఁ గలవారే. వారిజీవితము ద్రాక్షారసము, హుక్కా, ఉద్యానవిహారము, పుష్పధారణము మొదలగు మనోహరవిషయములచే రసవంతముగ నొనర్పఁబడుచుండును. అందుచేఁ బ్రాయికముగ నీతిబోధనఁ గావింపఁజూచిన పాఠకులు మన్నింప రనుభయమునఁ గవులు మనోహరవిషయములను గూర్చి వ్రాయుచు మానవునికి సంతోసమొనఁగూర్చు విషయముల విసర్జింపక సర్వమును భగవత్పరముగ నన్వయించుటకు నవకాశముఁ గల్గించుచుఁ గావ్యమును రసవత్తరముగను నీతి ధ్వనించునట్లుగను వ్రాసిరి. ఇట్టి కవులు సాధారణముగ సుఫీమతమునకుఁ జేరినవారలై

యున్నారు. హాఫీజ్ జేబ ఉన్నీసా మొదలగు కవిశ్రేష్ఠులెల్లరును నీసుఫీసిద్ధాంతమును కొంచెముగనో, గొప్పగనో గౌరవించి కావ్యరూపమునఁ బరిణమింపఁ జేసిరి. కాని రసజ్ఞులగుటచేఁ జప్పిడి నీతివాక్యములట్లు రచింపక పైకి రసాత్మకముగను నీతివిదూర ములుగను నుండి నీతియు, భక్తియు ధ్వనించుచుండునటులఁ గావ్యముల రచించి వివాదములబాఱినుండి తప్పించుకొనిరి. వీరినిగూర్చి వేఱొకచో సోదాహరణముగఁ జర్చించెదను.

## కావ్యమున నీతిధ్వనిమాత్రముగ నుండవలెను.

ఇంతవఱకుఁ దేలిన దేమనఁగాఁ గావ్యమున నీతి ప్రధా నాంశము గాదనియు, ధ్వనిరూపమున మాత్రమే యుండఁదగు ననియు, నీతిబాహ్యముగ నుండఁదగదనియును. కావ్యమున నీతి ధ్వనించుచున్నంతవఱకుఁ గావ్యము మానవకల్యాణము నకుఁ దోడ్పడుచునే యుండును. కాని నీతిబాహ్యమైన తోడనే కావ్యము లోకమునకుఁ గీడు నాపాదింపఁజాలును. కాని యెయ్యది నీతిబాహ్యవిషయమో యెయ్యది కాదో నిర్ణ యించుటకుఁ గొంచెము సూక్ష్మబుద్ధి యుండవలయును.

## కావ్యమునకు విశిష్టనీతిధర్మములే వర్తించును.

కావ్యసృష్టి కావ్యప్రపంచమును గవికపోలకల్పితములు గావునను, స్వతంత్రప్రతిభఁ గలవి యగుటను, సామాన్యప్రకృ తికివర్తించు నీతినియమములు కావ్యప్రకృతికి వర్తింపవు. కావ్య ప్రకృతి కనుగుణములగు విశిష్టధర్మములును నతీత నీతినియమ ములును మాత్రమే కావ్యమునెడ వర్తించును. ఉదాహరణ ములుగ రాధామాధవ, చిత్రాంగీసారంగధరుల ప్రణయ వ్యాపారములను సూచించితిమిగదా. కావున సూక్ష్మపరిశీలన

చేయనిది కావ్యము నీతిబాహ్యమో కాదో యనునంశము నిర్ధారణఁగావించుట యెంతయుఁ గష్టకార్యము. నీతివిషయిక ప్రశంసఁ గావించుట ముండ్లపొదను గదలించుటం బోలినదే! కావున కావ్యమున నీతి ధ్వనిమాత్రముగ నున్నఁ జాలునని సమయముదక్క నన్యనియమముల నేర్పఱచుట వ్యవహారలక్షణము గాదు. ఏలననఁ దీఱనిచిక్కులు కల్గును.

కావ్యమునకును, వేదాంతమునకును
గలభేదము. వేదాంతమునకు నిర్వి
కారతయు, బుద్ధివిశేషమును నావశ్యకములు.
కావ్యమున భావోద్రేకమును,
చిత్తవికారములును నావశ్యకములు.

ఇఁకఁ గావ్యమునకును, వేదాంతమునకును నెట్టిసంబంధము? వేదాంతశాస్త్రమన నేమి? దృష్టిగోచరంబగు నీప్రపంచమునకంతయు మూలాధార మనఁదగు పరతత్త్వమును గూర్చిన విచారణయే. వేదాంతి చిత్తవికారాదిచేష్టలకు లోఁబడక యతీంద్రియుఁడై పరతత్త్వము నిశ్చలమగు యోగైకదృష్టితోఁ బరిశీలించి మానవులకు వ్యక్తము గావింపఁ జూచును. కాని, కవికి చిత్తవికారాదిచేష్టలును, నింద్రియవ్యాపారములును గావ్యరచనకు ముఖ్యవిషయము లగును. కవికి రాగము, నభిమానము, భావోద్రేకము మొదలగు చిత్తవికారములు లేనిది కవిత ప్రభవించుటయే దుస్తరము. వేదాంతి సిద్ధాంతము మూలమునను, నిశ్చలధ్యానము మూలమునను, జ్ఞానయోగముమూలమునను, సాధించుపరతత్త్వజ్ఞానము కవి భక్తివల్లను, రసమువల్లను సాధించి పరమార్థతత్త్వమును శుద్ధసిద్ధాంత

రూపముగఁ గాక రమణీయమగు నాలంబముగఁ బ్రదర్శింపఁ గలుగును. కావున వేదాంతికిని కవికిని నిరీక్షణ మొకటియే యని యొప్పుకొందమన్నను సాధనములును, మార్గములును రెంటికిని భేదించును.

మతమునకును, కావ్యమునకును గలసంబంధము.
౧. మతము కావ్యమునకు వలయువిషయసామగ్రిని సేకరించి యిచ్చును. ౨. కాని మతమునకు సమష్టి మానవశ్రేయమే లక్ష్యము; కావ్యమున వ్యక్తి యొక్క రసప్రవృత్తియే లక్ష్యము.

ఇఁక మతమునకును గావ్యమునకును గలసంబంధ మొక్కింత యరయుదము. కావ్యమునకుఁ గావలసినవిషయము లను మతవిషయికగ్రంథములు సమకూర్చుననుట యెల్లరకును దెలిసినవిషయమే. మతగురువులయద్భుతచరిత్రములును, బండు గులకు సంబంధించిన కథలును, వ్రతములు నోములు మొదలగు వానికి సంబంధించినకథలును గావ్యవిషయము లగుననుట నిశ్చయమే. అయినను గావ్యమునకును మతమునకును నిరీక్షణ మున భేదము గలదు. మతము జీవితమున సామరస్యము నెల కొల్పుటకును, బరతత్త్వజ్ఞానము కరతలామలక మగుటకు వల సిననిష్ఠను విధించుటకొఱకును నేర్పడినది. అందుచే సమష్టి మానవశ్రేయమే మతమునకుఁ బ్రధాననిరీక్షణము. కావ్య మునకన్ననో వ్యక్తియొక్క స్వాతంత్ర్యమును, రసప్రవృత్తి యును బ్రధాననిరీక్షణములు. మతము విధుల ననుష్ఠించుట వలన జనులు జ్ఞానలబ్ధికిఁ దగియుందురని చూపును. కావ్యము రాగాధిక్యముచే, రసప్రవృద్ధిచే, భావతైక్ష్ణ్యముచే మాన

సికోత్తేజముఁ గల్గించును. కాని మతమునను నన్నివిధు లను బ్రతిబంధకమాత్రముగ నుండిన మతముపట్ల జనుల కాదరము సన్నగిల్లు ననుభయమున మతకర్తలు పండువులు, వ్రతములు, నోములు మొదలగు సామాన్యజనోపయోగకర ములును, సామాన్యజనాంగీకృతములును నగు పద్ధతుల నేర్ప ఱచి మతమును గొంచెము రసవంతముగను; నాకర్షణశక్తిమంత ముగను జేయనెంచిరి. కవికి మతమునకు సంబంధించిన వివాద ములును, గర్మలును, సిద్ధాంతములును, వర్ణనయోగ్యములు గావు.

కవి మతవిషయములలో రసవత్తరములగు
వానినే సంగ్రహించును. కావున మతము
కావ్యమునకు సాధనమాత్రమే యగును.

మతమున నుండు మనోరంజకవిషయములను మాత్రమే కవి సంగ్రహించి స్వీయపద్ధతి ననుసరించి కావ్యమున వర్ణింపఁ జూచును. కావున మతవిషయము కావ్యమున నుపాంగము గను సాధనమాత్రముగను నుండఁదగునని నాయాశయము. కావ్యముల కుపయోగించునది మతమునందలి యాచార వ్యవహారములు గాక జనసమ్మతములగు విషయములే యని తెలిసికొనఁదగు. కావ్యమునకును మతమునకును బలవద్విరో ధముమాత్రము లేదు. అనేకసమయముల గొప్పగొప్పకవులు మతాభిమానమును రసమును సమన్వయము చేసి చక్కనికావ్య ములను వ్రాసియుండుటయే యిందులకు నిదర్శనము. భక్తిగీత ముల రక్తి మొలవఁ బాడిన తుకారాం, రామదాస్, చండీదాస్, కబీరు మొదలగు భక్తులెల్లరును సకలకావ్యలోకవంద్యులు.

ఈవిషయమున భక్తికవిత యనుప్రకరణమున విపులముగఁ జర్చించెదము.

సారాంశములు: ౧. కావ్యమునకు రసమే ప్రధానము 'రసాత్మకం వాక్యమ్' అనుసూత్రమును, మమ్మటుని 'నియతికృత నియమరహితాం' అనువ్యాఖ్యానమును నాదరణీయంబులు.

కావునఁ దేలిన దేమనఁగాఁ గావ్యము స్వతంత్రసృష్టి యేకాని పారతంత్ర్యమును సహింపదనియుఁ, గావ్యమునకు రసమే ప్రధానముగాని యన్యవిషయములు గావనియు, నెన్ని విషయములయినను గావ్యమున సాధనమాత్రములుగ నేయుండ వలయుననియుఁ గావ్యజీవమనఁదగు రసప్రవృత్తికి భంగము కల్గింపరాదనియు నే! మొట్టమొదట మన ముదాహరించిన నిర్వ చనములలో విశ్వనాథుని 'రసాత్మకం వాక్యం కావ్యం' అను వాక్యమును బండితరాయల 'రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యం' అనువాక్యమును దండికవి శ్రేష్ఠుని 'ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యం' అనువాక్యమును నించుమించు సమానార్థ కము లనఁదగి యుంటచే వీనిలో నెల్ల 'రసాత్మకం వాక్యం కావ్యం' అనువిశ్వనాథుని వాక్యము నే కావ్యనిర్వచనముగ నంగీకరింపఁదగునని మామనవి. మమ్మటుని "నియతికృతనియమ రహితాం హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం, నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవేః..." అనువాక్యమును 'రసాత్మకం వాక్య'మ్మను నిర్వచనమునకు సంపూర్ణవ్యాఖ్యానముగ నంగీక రింపఁదగును. మమ్మటుఁడు సామాన్యనియమాతీతస్వభావము,

హ్లాదైకమయత, స్వాతంత్ర్యము, అనన్యపారతంత్ర్యము, రసబంధురత్వము గావ్యమునకు ముఖ్యలక్షణములుగ శాసించి 'రసాత్మకం వాక్యంకావ్యమ్' అనునిర్వచనమునకుఁ గల పరిపూర్ణాన్వయమును విశదపఱచినాఁడు. ఇంతవఱకును, విశ్వనాథుని నిర్వచనమును, మమ్మటుని వ్యాఖ్యానమును, గావ్యలక్షణ ములలో నెల్ల సమంజసములుగ నున్నవని యొప్పుకొనక తప్పదు.

## ఆధ్యాత్మికకావ్యమతము.

కాని యాధునికకావ్యప్రపంచము నాధ్యాత్మికపథము నకుఁ ద్రిప్పఁజూచువిమర్శకులు కొందఱు బయలువెడలు చున్నారు. వీరిలోనెల్ల నానందకుమారస్వామిగారును, యోగి సత్తముఁడై భారతభాగ్యనిధానమనఁదగు నరవిందఘోషు గారును, భారతీయకవికులతిలకుఁ డనందగు రవీంద్రనాథ ఠాకూరుగారును ముఖ్యులు. వీరలమతమును ప్రస్తుతము సంగ్రహముగను ప్రసక్తిగలిగినచోట విపులముగను దెల్పెదను.

## ౧. ఆనందకుమారస్వామి. కావ్యము ఆధ్యాత్మికశక్తికి సంజ్ఞారూపకము.

ఆనందకుమారస్వామిగారు గొప్పశిల్పతత్త్వవేత్త. భారతీయశిల్పమునుగూర్చి యభిప్రాయ మీఁగలయధికారి. భారత శిల్పతత్త్వమును సూచించుచుఁ బ్రసంగవశమున్న వీరు కావ్య తత్త్వమునుగూడ నిరూపించిరి. వారిమత మేమన? భారతజాతి యాధ్యాత్మికదృష్టిబలమున శుద్ధసత్యమును గ్రహింపఁగలిగె ననియు, మానవజీవితపరమావధి భగవంతునితత్త్వమును శక్తిని, గ్రహించుటయే యనియుఁ, గావ్యములను శిల్పములను చిత్ర

పటములను నెల్ల విషయము లాధ్యాత్మికదృష్టితో వర్ణింపఁ బడవలయుననియుఁ, గావ్యము శిల్పముఁ జిత్రరచన మొదలగువానియందలి రసప్రవృత్తి యాధ్యాత్మికతత్వమునకును, ఆధ్యాత్మికశక్తికిని, ఆధ్యాత్మికతేజమునకును, సంజ్ఞామాత్రకముగను, ఉపాధిమాత్రముగను నుండఁదగుననియు, రసప్రవృత్తి తనంతటఁ దాను మానవునకుఁ బ్రధాననిరీక్షణము గాఁదగదనియు, నాత్మకు జీవుఁడుపాధియగున ట్లాధ్యాత్మికజ్ఞానమునకు రసప్రవృత్తి గలకళలు సాధనమాత్రములు సంజ్ఞామాత్రములును నుపాధిమాత్రములును నగుననియేవీరిమతము.

## భారతచిత్రశిల్పములసిద్ధాంతము.

ఈమతమును బురస్కరించుకొని వీరు భారతశిల్పమును విమర్శించుచు నాధ్యాత్మికజ్ఞానోపలబ్ధికి సోపానము లనందగు భగవదవతారములను, వానియొక్కలీలలను, శక్తులను, ప్రదర్శించుశిల్పములనే యుత్తమములని యంగీకరించి, యయ్యవియే యాదర్శప్రాయములనియు శాసించి, యెల్లోరాగుహ అజంతా, కార్లీ మొదలగుగుహాలలోని శిల్పములను, నందు ముఖ్యముగ నటరాజ, కాళీ, ధ్యానిబుద్ధ మొదలగువిగ్రహాముల యాధ్యాత్మికశక్తిప్రదర్శనమును నాధ్యాత్మికజ్ఞానోత్తేజక ప్రతిభయును బ్రశంసించి, ప్రసంగవశమునఁ గావ్యమునకును నట్టి మహద్విషయములే యాదర్శప్రాయములని నిరూపించిరి. చిరకాలమునుండియు విదేశమున నివాసముగ నుండినకతముననో యేమో వీరు భారతసాంప్రదాయమును సర్వతోముఖముగ ననఁగా నందలి దేశకాలపాత్రానుగతములగు యవలక్షణములతో సహితము సమర్థింపఁ జూచుచు నూత

నాశయములపట్లను, కాలస్వభావానుగతములగు మార్పుల పట్లను నిరాదరులై యున్నారు. కాని,—వీరి ప్రధానసిద్ధాంతము కొంతవఱకు సమర్థనీయమని యొప్పుకొనక తప్పదు.

## ౨. అరవిందఘోషు. ఆధ్యాత్మికశక్తియే భారతీయుల సర్వస్వము, భారతధర్మస్వరూపము.

అరవిందఘోషుగారు మొట్టమొదట రాజకీయవిషయములఁ గూర్చి విశేషముగ వ్రాయుచు వానిని భారతధర్మము ననుసరించి సమన్వయముఁ జేయఁజూచిరి. భారతదేశమభివృద్ధి నందవలెననిన యుగయుగములనుండి వచ్చుచున్న భారతధర్మము మూలసూత్రములకు భంగము లేకుండ ననుష్ఠింపఁబడవలయు ననియు, భారతశక్తి స్వతంత్రశక్తిగఁ బ్రజ్వరిల్లి కాలమహాశక్తితో సరిసమానముగఁ జేతులఁజేతులు గలిపికొనుచు స్నేహభావముతో సంచరింపవలయుననియు వీరు బోధించుచున్నారు. ఈభావమును బురస్కరించుకొనియే స్వదేశీవ్రతమును, స్వరాజ్యాదర్శమును, స్వధర్మనిరతియు వారు ప్రజలకుఁ బత్రికాముఖమున నిరంతరము నుపదేశించుచుండిరి. వారియుపదేశబీజములు భారతభూమిని దిట్టముగఁ నాటుకొని మనప్రస్తుతాభివృద్ధికిఁ గారణభూతము లయినవి. వీరికి దాస్యము గిట్టదు. స్వాతంత్ర్యరక్తి మెండు. కాని పరులతోఁడి విరోధమునుగూడ సాధ్యమయినంతవఱకు నవసరము లేదు. అనఁగా భారతదేశమునకుఁ బరదేశముల సంసర్గము మేలుగ నున్నంతవఱకుఁ గూడుననియు, కాలశక్తిసంచారమును నిరోధింపఁ జూడరాదనియు, స్వదేశస్థితిగతులకును, స్వధర్మమునకును, ననుకూలములగు మార్పులు జరుగుచనే యుండవలయుననియు, నట్లు జరుగ

నిచో జాతియానన్యత్వము స్తంభించి జాతిశక్తి ఘనీభవించిపోవు ననియు వీరి రాజకీయమతము. ఈరాజకీయమతముఁ బురస్కరించుకొనియే వీరు కావ్యసృష్టిస్వభావమును నిరూపింపఁజూచిరి.

భారతీయకావ్యధర్మము.
కావ్యము మానవాత్మ, ప్రకృత్యాత్మ,
పరమాత్మలకుఁ గలసంబంధమును వర్ణించును.

'ఆర్య' పత్రికలయందు 'భవిష్యత్కవిత్వ' మనువిషయమునుగూర్చి వ్రాయుచు భారతకావ్యధర్మమును వీ రిట్లు నిరూపించిరి.—"కావ్య మాత్మానుభవప్రకటనమే కాని బుద్ధివిశేషసూచకము గాదు. కావ్యము మానవాత్మకును, బ్రకృత్యాత్మకును, బరమాత్మకును గల యనిర్వాచ్యము నగమ్యగోచరమును నగుసంబంధమును వ్యక్తీకరింపఁ జూచును. వేదమతమునఁ బరబ్రహ్మ వాఙ్మాత్రమున లోకముల నెట్లు సృజించెనో, యట్లే కవియును గావ్యమువలనఁ గొద్దిగఁగాని, గొప్పగఁగాని, శకలములుగఁ గాని, యఖండముగఁగాని, జీవములతోడను, వస్తువులతోడను, ననుభవములతోడను గూడుకొనిన మనోఽంతర్గర్భితప్రపంచమును సృష్టించును. సృష్టియెల్లను గొప్ప మాయ. అందలి బాహ్యవిషయములుమాత్రమే విచారణసులభము లగును. కావ్యసృష్టియు నిట్లే. కవి తనమంత్రప్రభావము నెఱుఁగనిమాంత్రికుఁడు. కావ్యనిర్మాణశక్తియు నాత్మానుభవమే కాని బుద్ధిచాతుర్యము గాదు. కవి యాత్మశక్తిపరిపూర్ణుఁడై మనస్సుద్వారా కావ్యనిర్మాణమునకుఁ గడంగి యాధ్యాత్మికానుభవమువలననే తనకావ్యశోభకు సంతసించుచు మనలోఁగూడ సంతసముఁ బురికొల్పును.

### కావ్యశక్తియే వాగ్దేవి యనఁదగును.

కావ్య మొకశక్తిగ భావించి మనవేదయుగమునాఁటి ఋషులును, దత్త్వవేత్తలును గావ్యశక్తికి వాగ్దేవీనామ మిడిరి. తాంత్రికులును వాక్శక్తి మనలను ననేకవిధముల సంచలింపఁ జేయునదిగ నిరూపించిరి. కవి యాధ్యాత్మికదృష్టిబలమున నాధ్యాత్మికశక్తిని, నాధ్యాత్మికభావములను, నాధ్యాత్మిక ప్రపంచమును సాక్షాత్తుగఁ గన్నులఁ దిలకించినవానిరీతిని వర్ణించి ప్రదర్శించును. కావ్యశక్తి బుద్ధిబలమున కతీతమగును. ప్రపంచమునను, బ్రకృతియందునను, మానవజీవితమునను నంతర్గర్భితమై నిబిడమై యున్నయాధ్యాత్మికశక్తిని రసవంతమును బరిస్ఫుటమును ననిరుద్ధ్యమును నగువాక్కున కవి వర్ణించి ప్రదర్శింపఁజూచును.

### 'తాంత్రికుల'మతము. 'పశ్యంతీ'శబ్దప్రయోగము దానిభావము.

ఈవాక్కును దాంత్రికులు 'పశ్యంతీ' యనుపదమున సూచించి కావ్యశక్తియొక్క పరిమితిని సూచించియున్నారు. ఈభావముఁ గొంచెము విప్పిచెప్పిన నిట్లుండును. కవికి విషయసాక్షాత్కారముతోఁబాటు వాగ్దేవీసాక్షాత్కారము ననఁగాఁ బదసాక్షాత్కారమును గలుగనిచో, యుత్తమకవిత జనింపనేరదు. దీనిభావము కవి పదసాక్షాత్కారలబ్ధములగుమాటలం దక్క నన్యమార్గలబ్ధములగు—ననఁగా నిఘంట్వాదిమార్గములచే లబ్ధములగు పదములఁ గవిత చెప్పఁదగదనియు, నట్లు చెప్పినకవిత యుత్తమకవిత గాదనియు విదితమగుచున్నది. కావ్యమున సాక్షాత్కృతవిషయమునకును, భాషకును వికల్ప

ముగాని, భేదముగాని యుండఁదగదనియు, రెంటికి నవీనా భావసంబంధమును బరిపూర్ణైక్యమును నుండవలయుననియు వీరిమతము.

## కావ్యశక్తిజన్మప్రకారము.

కావ్యశక్తి సాధారణబుద్ధి కతీతమగు నంతరాత్మ వలన జనించుచున్నది. ఆయంతరాత్మ యాధ్యాత్మికప్రభావమున వస్తువులఁ దిలకించి యందలి యలౌకికప్రభను, నుత్తేజక శక్తిని సాక్షాత్కృతమును నాధ్యాత్మికశక్తిసూచకమును నగు సరసవాక్కులఁ బ్రదర్శించును. అంతరాత్మ బుద్ధి యహంకారము మొదలగు మానవశక్తులను వశముఁగొని కావ్యసృష్టికిఁ గారణ భూతమగుచున్నది. ఈయంతరాత్మశక్తిప్రభావమున మెద డును, హృదయమును, నాళములును గంపితములగుచున్నవి.

## వైదికద్రష్టలకావ్యనిర్వచనములు.

వైదికద్రష్టలు కావ్యమును 'సదనాదృతస్య' మ్మనఁగా 'సత్యజన్మస్థానాగత' మని వక్కాణించి కావ్యము బుద్ధికి నతీత మగు నంతరాత్మప్రభావమున జనియించునని నిర్దేశించిరి. వాగ్రూపమునఁ బరిణమించుటలో నీవిషయసాక్షాత్కారము నకుఁ గొన్నిమార్పులు గలుగుచున్నవి. అనేకములగు నసంగత విషయములు వెల్లువెల్లువగ మనకుఁ దట్టుచుండును. వానినెల్లఁ బరిశీలించి భావమునకును, వాక్కునకును ననిరుద్ధ్యసంబంధ మును గల్పించుట మనపని. వాక్కు అంతరాత్మనుండి రహస్య ముగ వచ్చి మనలోఁ బాఁతుకొని యుండును. అట్లు పాఁతు కొనియుండిన వాక్కును గవిత్వోద్రేకమునను భావోద్రేకము నను మనము మార్పుచేయువిషయమును వైదికద్రష్టలు

'హృదా తష్టం మనీషా' యనువాక్యమున సూచించియున్నారు. ఈకావ్యశక్తి ప్రవహించుటకు మనయంతరాత్మయే మార్గము. ఈశక్తి మనలో గర్భితమై నిబిడమై యుండి యప్పుడప్పుడు కొంచెముకొంచెముగ మనకు వ్యక్తమగువిషయమును వైదిక ఋషులు 'నియతం గుహాయాం గుహాహితం గహ్వరేష్ఠమ్' అనువాక్యమున సూచించియున్నారు.

కవికి కావ్యశక్తిసాక్షాత్కార మవసరము.

ఈనిబిడశక్తిని మనము బాగుగా గ్రహించి తత్సాక్షాత్కారబలమునఁ గవితఁ జెప్పినచో నయ్యదియే యుత్తమకవితగాఁ బరిణమింపఁగలదు. అట్టియాత్మసాక్షాత్కారము లేనికవి బుద్ధిచాతుర్యమునుమాత్రమే ప్రదర్శింపఁగలుగును. ఇట్టిసాక్షాత్కారజనితకవిత్వమును గొందఱు కవులు కొలఁదిమాత్రముగఁ బ్రదర్శింపఁ గడంగుచున్నారు. అట్టివారలలో నైరిష్‌కవులును, రవీంద్రనాథఠాకూరును, హరీంద్రనాథచట్టోపాధ్యాయులును, సరోజినీదేవియును నెన్నఁదగినవారు. కాని యింకను విషయమునకును, బదములకును గల యనిరుద్ధ్యసంయోగము దాపరించలేదు.

ఆధ్యాత్మికశక్తిప్రదర్శకములగు నుత్తమ కావ్యములే కవిత్వపరమావధి యగును.

"అట్టిసంయోగము భావమునకును, భాషకును నేనాఁడు గుదురునో యానాఁడే యతీతప్రతిభావంతమును, నాధ్యాత్మిక శక్తియుతమును నగు దివ్యకవిత యుద్భవింపఁగలదు."

పై వాక్యములఁ జెప్పిన యరవిందుని కావ్యమతమునకుఁ గలచిక్కులును సందేహములును సూచించి వాని నభూతము

లని నిరసించి స్వీయమతమును వ్యాఖ్యానపూర్వకముగ నరవిందుఁడే సమర్థింపఁజూచెను.

## 'ప్రజ్ఞా పురాణీ' అనఁబరగు భారతశక్తి-కొన్ని శంకలు.

అరవిందుఁడు పునరుజ్జీవితమయిన భారతశక్తి, ప్రజ్ఞా పురాణీ యని ప్రస్తుతిఁగన్న ప్రాచీనభారతశక్తి ననుసరించి యాధ్యాత్మికప్రభావముఁ గలిగియుండవలయునని నిర్దేశించెను. కాని "కావ్యమున నాధ్యాత్మికశక్తి యెటులు ప్రభవిల్లును? కావ్యమునకు నాధ్యాత్మికశక్తివలన నేమి ప్రయోజన?" మనుచుఁ బాశ్చాత్యనాగరకతాసాంప్రదాయములఁ బెరిఁగినవా రడుగుదురు. పాశ్చాత్యులకు మతమును, నాధ్యాత్మిక జీవితమును నొకటిగను, బుద్ధిచాతుర్యమును బాహ్యజీవితమును వేఱొకటిగను నుండుననియు,నొక్కొకదానికిఁ బ్రత్యేక నియమములు గలవనియు, వానియనుసరణమే సిద్ధికిఁ గారణమగుననియు మనకుఁ దెలియుచున్నది. అంతియకాక 'ప్రజ్ఞా పురాణీ' ననుసరించి యాధ్యాత్మికజీవితమునే యాలంబముగఁ గొని ప్రకృతిశాస్త్రము లాదిగాఁగల సాధనములచే విజృంభించుచున్న నవీనకాలశక్తిని నిరోధింపఁదగునా? యనునింకొక ప్రశ్నము కలుగుచున్నది. వీనికిఁ దగురీతి సమాధానమీయఁదగును.

## ఆధ్యాత్మిక జీవితస్వభావము.

ఆధ్యాత్మికజీవితమునకును,సర్వసంగపరిత్యాగమే ప్రధాన లక్షణముగగల సన్న్యాసమునకును సంబంధములేదు. కొండొక కాలమున నట్టి యపోహ మప్పటిస్థితిగతులమూలమున జని

యించియుండునేకాని యాధ్యాత్మికజీవితమునకును సన్న్యాసమునకును నెట్టినిసర్గసంబంధమును లేదు. ఆధ్యాత్మికజీవితమునకును, ప్రత్యేకమతసిద్ధాంతములకును సంబంధ మంతగా లేదు. ఆధ్యాత్మికజీవితము సామాన్యమతసిద్ధాంతములను, మతాచారములను, నతిక్రమించి వాని కతీతమయియుండి మానవునియందున్న పరమాత్మతత్త్వమును గోచరముఁ గావింపఁజూచును.

{ ఆధ్యాత్మిక జీవితము లక్ష్యము. శరీరమార్గాదులు సాధనమాత్రములు-ప్రాచ్యపాశ్చాత్యధర్మనిరీక్షణములకుఁ గలభేదము. }

ఇంతియకాక మానవశ్రేయమునకు సహాయభూతములుగ నుండుసాధనములలో వేనికిని నాధ్యాత్మికజీవితముతోడ విరోధ ముండదు. బుద్ధి వినా యాత్మయు, శరీరము వినా యాత్మయు నుండఁజాలవు. కావుననే బుద్ధికిని శరీరమునకును బలమును దేజంబును నిచ్చి వానిపరిపూర్ణతకుఁ దోడ్పడు సాధనములన్నియు నాధ్యాత్మికజీవితమునకు సహాయకారులే కాని—విరోధులు మాత్రము గావు. ఏలనన నాత్మ, బుద్ధి, శరీరము—అవినాభావసంబంధమున వర్తించును. గనుక ప్రాచీనభారతనాగరకతయందు నిట్టిసాధనములన్నిటికిని నుచితగౌరవ మొసంగఁబడియెను. కాని యిట్టిసాధనములవిషయమునఁ బాశ్చాత్యప్రాచ్యనాగరకతలకు నిరీక్షణమున భేదమున్నది. అది యెద్దియనఁ బాశ్చాత్యనాగరకతయందు శరీరమార్గము, ధనసంపత్తి, బుద్ధివికాసము మొదలగువిషయములు సాధనమాత్రములుగఁ బరిగణింపఁబడక సాధ్యదేవతలంబోలె.

నుపాసింపంబడుటయే సంభవించి పాశ్చాత్యలోకమునఁ గొన్ని యెడల నాస్తికమతమునకును, సర్వత్ర యనాధ్యాత్మికజీవితమునకును గారణభూతము లయినవి. భారతదేశమునందలి మహర్షులును, ద్రష్టలును వైవానిని సాధనమాత్రములుగనే పరిగణించి యాధ్యాత్మికజీవితోపలబ్ధికిని ధర్మానుష్ఠానమునకును సాధనములుగ నుపయోగించిరి. 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్' అనువచనమే యిందులకుఁ దార్కాణము. ఆధ్యాత్మికదృష్టిగలవారు జీవితమునందలి సర్వోపాంగములను నాత్మోపలబ్ధికై వినియోగించెదరుగాని వానినే సాధ్యములుగ నుపాసింపరు. వారు బాహ్యసృష్టియందును, సాధారణ మానవజీవితమునందును మానవసంస్థలయందును గలయాధ్యాత్మికశక్తిని, దేజమును వ్యక్తముఁగావింపఁ జూచెదరు.

## ఆధ్యాత్మికకావ్యరచనాసూత్రము. "కావ్యమాధ్యాత్మికశక్తికి సంజ్ఞారూపకము."

కావ్యమున బాహ్యసృష్టియు మానవజీవితమును సాధ్యదేవతలవలెఁగాక సాధనమాత్రములుగను, బరతత్త్వమునకును, నాధ్యాత్మికప్రపంచకమునకును సంజ్ఞారూపకములుగ వర్ణింపఁబడినచో నయ్యదియే యాధ్యాత్మికకావ్యసృష్టియగును. అయ్యది వేదాంతమువలె సిద్ధాంతరూపమున నుండక సృష్టిరూపముననే యుండి యాధ్యాత్మికప్రపంచమును సంజ్ఞారూపముఁన గోచరింపఁజేయును. కావునఁ గావ్యరసమునకును, నాధ్యాత్మికదృష్టికిని, విరోధభావము లేదనియు నొండొంటికి సహకారభావమే వర్తిల్లుననియు, నట్టిసహకారభావము పూర్తిగఁ గుదిరినకావ్యములే యుత్తమకావ్యము లగుననియు, నట్టికావ్య

రచనకే 'ప్రజ్ఞా పురాణీ' సంతతివారగు భారతీయులు చిరానుగతమగు స్వీయకార్యధర్మమును వీడక కడంగి యాధ్యాత్మిక జ్యోతిచే నుద్దీప్తములుగాని దేశములకుఁ బ్రకాశము గూర్పఁ దగుననియు నరవిందుఁడు భారతసాహితీకుమారుల నుద్బోధించుచున్నాఁడు.

## రవీంద్రునిమతమును, వైష్ణవ సుఫీకవులమతమును.

ఈయుద్బోధ ననుసరించి వ్రాసెనని రవీంద్రునిగూర్చి పలుకుట ప్రమాదము. ఏలనన నరవిందుఁడు కావ్యతత్త్వమును నిరూపింపకమున్న యెన్నో యేండ్లుగ రవీంద్రుఁ డాధ్యాత్మిక శక్తియుక్తమగు కవిత్వమును జెప్పుచుండినాఁడు. కాని ప్రధాన విషయముల రవీంద్రునిపద్ధతి యరవిందుని కావ్యలక్షణమునకు లక్ష్యమగుచున్నది. చండీదాసు మొదలగు వైష్ణవకవులకవిత్వమును, సుఫీకవులకవిత్వమును నరవిందుని కావ్యలక్షణమునకు సరివచ్చుచున్నవి. ఇందుఁ బరమాత్మతత్త్వము బాహ్యావస్తువర్ణనమువల్లను, మానవజీవితవర్ణనమువల్లను, సూచింపఁబడుచున్నది. ప్రకృతికిని, మానవునకును, బరమాత్మకునుగల యవినాభావ సంబంధ మనిర్వాచ్యైక్యము నీకావ్యపద్ధతి పరిస్ఫుటీకరించుచున్నది. ఈమహదాశయము సంపూర్ణముగ నెప్పట్ల నెవ్వారి యందునను నెఱవేఱినదని చెప్ప వీలుచాలకున్నది. కాని కాల ప్రభావము వలన పురోగమనముమాత్రము జరుగుచునే యున్నది. ఈపురోగమనఫలితముగ గతానుగతికముగ మనలను వేధించుచుఁ దలయెత్తకుండ నడఁగఁద్రొక్కిన భావదాస్యమును, లక్షణదాస్యమును, బ్రయోగదాస్యమును వీడి నవ్యోత్తమ కవిత్వమును జనించి ప్రపంచమునకు గౌరవార్హకవితాశక్తిని,

వ్యక్తముఁజేయు ననునాశకు నెడముఁ గల్గుచున్నది. కావున నింతదీర్ఘచర్చఁ జేసి తేల్చినసారాంశ మేమనఁగా:—

మమ్మటునినిర్వచనమును, విశ్వనాథుని 'రసాత్మకం వాక్య'మ్మను సూత్రమును నాదరణీయములు.

మమ్మటుఁడు వచించినట్లు కావ్యము నియతికృతనియమ రహితాం, హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం, నవరసరుచిరాం, అనువర్ణనమునకు సరివచ్చుననియే యిప్పటికిని మామతము. ఏల నన, నాధ్యాత్మిక కావ్యసృష్టి,యనవసరనియమ రాహిత్యమును, ననన్యపరతంత్రతయును, హ్లాదైకమయతను, రసరుచిరత్వమును జుల్కనగాఁ జూచుట లేదు. వాటినెల్లను సాధనములుగ నుప యోగించి యతీతశోభాయుతమును నాధ్యాత్మికశక్తియుత మును నగుకావ్యరూపమునఁ బరిణమింపఁజేయును. మమ్మటుని కావ్యలక్షణమునకు, నాధ్యాత్మిక కావ్యలక్షణమునకును విరోధ మేమియు లేనిచో విశ్వనాథుని 'రసాత్మకం వాక్యం కావ్యమ్' అనులక్షణమునకు మాత్ర మేల విరుద్ధభావము పొసఁగును? పొసఁగదని నావిజ్ఞప్తి. ఎట్లన రసమునకును, నాధ్యాత్మికశక్తి కిని స్నేహమేకాని విరోధము లేదు. కావున రసాత్మకమగు వాక్య మాధ్యాత్మికశక్తితో విరోధమునకుఁ బాల్పడదు. ఇట "రసాత్మకం వాక్యం కావ్యమ్' అనునిర్వచనముయొక్క ప్రాతిపదికౌచిత్యమును గమనింపఁ బ్రార్థితులు.

"రసాత్మకం వాక్యం కావ్య" మ్మనుసూత్రముయొక్క ప్రాతిపదికౌచిత్యము. ౧. వాక్యమ్మన వాక్శక్తియె.

మొట్టమొదలుగ 'వాక్యమ్' అనుపదము వైదికద్రష్ట లుపయోగించిన'వాగ్దేవీ'యనుపదమునకుఁ బర్యాయముగనుండి

తద్భావమును సువ్యక్తముఁగావించుచున్నది. వాక్శక్తి మహాశక్తియని మనమహర్షులు భావించి తచ్ఛక్తికి వాగ్దేవీ యను నామము నిడిరి. వాగ్దేవీవదనగహ్వరాంతరమునుండి యనంత ముఖములతో నఖండతేజఃపూరంబుతో నప్రతిమానప్రతిభా విభవముతో, దుర్నిరీక్ష్యశక్తితో వెల్వడి వచ్చుపదమే వాక్యమనందగును. కావున 'వాక్యమ్'అనుపదము కావ్యము నాధ్యాత్మికప్రపంచమును నాధ్యాత్మికశక్తిని బ్రదర్శించుప్రయోజనకారి యని సూచించుచున్నది.

## ౨. రసము కావ్యమున కాత్మయగును.

ఇఁక 'రసాత్మకమ్' అనుపదౌచిత్యమును బరిశీలింతము. కావ్యమున కాత్మ నీతి - ధర్మ- మత, వేదాంతములు మొదలగు శాస్త్రములు కావనియు, మానవప్రకృతి నవలీలగ వశముఁ గావించుకొని బంతియుంబోలె పల్లవములఁపు గుసుమములను నాడించు బాలపవనునింబోలె నాడించుశక్తిగల రసమే యనియు సూచితమగుచున్నది. ఇంతియ కాదు. రసము కావ్యమున కాత్మ యనుటలో నింకొకవిశేషార్థము స్ఫురించుచున్నది. అదేదన, రసము కావ్యజీవ మనందగువిషయమునకే వర్తించునుగాని కల్పితములును, మార్పునకు లోనగునట్టివియు నగు కావ్యము యొక్క బహిరింద్రియము లనఁదగు భాషామర్యాదలవిషయమున వర్తింపదని సూచిత మగుచున్నది. అందువలనఁ గావ్య బహిరింద్రియవ్యాపారముల నిర్ణయించి శాసింపనెంచు శాస్త్రములఁ బ్రభుత్వమునకుఁ గొంచెముగ నడ్డుదవిలి కావ్యము రసజీవియై రసాత్మకమై యనన్యపరతంత్రమై ప్రభవిల్లుటకుం

గారణమగుచున్నది. కావునఁ గావ్యమును రసజీవిగను రసాత్మకముగను గవిని ననన్యపరతంత్రునిగను, వాక్కును శక్తియుతముగను నిరూపించు విశ్వనాథునియద్భుతకావ్యలక్షణనిర్వచనమే సర్వత్ర యంగీకారార్హమని తోఁచుచున్నది. తుట్టతుదకు ననేకయుద్ధముల జయించి, యనేకవీరుల నిర్జించి కావ్యశక్తి ద్విగుణీకృతప్రతిభాయుతమై యనంతతేజోరాశియై రసాత్మకమగు వాక్యముగఁ బ్రపంచమునఁ జిరస్థాయిభావము నందఁగల్గుమహాభాగ్యముఁ బొందినది.



# ద్వితీయ ప్రకరణము.

## రసస్వరూపనిరూపణము.

'రసాత్మకం వాక్యం కావ్యమ్' అనుకావ్యసూత్రము నంగీకరించినపిదప రసమన నేమియో, ధర్మార్థకామమోక్ష సంయుతమగు మానవధర్మమున దానికాశ్రయ మెద్దియో, దానిస్వరూప మేమో చర్చింప నవసరము గలుగుచున్నది. ముందుగ రసమన నేమో దానియాశ్రయ మెద్దియో విచారించి పిమ్మట కావ్యమున వర్ణితమగు రసముయొక్క ప్రత్యేక స్వరూప మెట్టిదియో తెలిసికొందము.

### "రస మన నేమి?"

రసమునకు వ్యుత్పత్తి ననుసరించి 'ఆస్వాదింపఁబడునది' యని అర్థముకలుగుచున్నది. స్థూలముగఁ జెప్పిన రసము మానవ హృదయముల నాకర్షించు శక్తిగల వస్తుసౌందర్యమే. ఎట్లన? నాస్వాదింపఁబడు వస్తువునందు నాస్వాదింపఁబడుట కర్హతగల గుణవిశేష ముండితీఱవలయును. ఆగుణవిశేషమువలననే మనుజుఁడు వస్తువు నాస్వాదించుట సంభవించుచున్నది. కావున రసమనునది వస్తుగుణవిశేషమునకు సంబంధించిన దనుభావము స్ఫురించుచున్నది. దానికిఁ బూర్వపక్షముగ నింకొక ప్రశ్న ముదయించుచున్నది. తార్కికు లిట్టిప్రశ్నలను లేవఁదీయుటలో నేర్పరులు. ఆప్రశ్న మేమన. 'అయ్యా! రసము వస్తుగుణ విశేషము నాశ్రయించు ననుచున్నారే! అట్లయినచో రసము వస్తువునకు విశేషణమని చెప్పందగునా? అట్లు రసము వస్తు ప్రధానవిశేషణములలో నొకటి యయినచో నారస మధికా

రానధికారభేదము లేకుండ నావస్తువుం దిలకించిన నెల్లరకు నేక రీతిని వైశిష్ట్యమునఁ దారతమ్యము లేకుండ గోచరించునా? చదువురానిమూఢునకును, బుద్ధిమాంద్యముగల జడునకును, ప్రపంచజ్ఞానములేని పసిబిడ్డలకును వస్తువుల నిబిడమైయున్న రసము గోచరించునా? మీరు చెప్పినట్లు రసము వస్తువునకుఁ బ్రధానవిశేషణమేని నది యెల్లరకును గోచరింపవలదా? అట్లు గోచరించుచున్నదా? గోచరింపనిచోఁ గారణమేమి? అట్టియెడ రసమునకు భిన్నాశ్రయత్వము నాపాదింతురా?' ఈప్రశ్నకు సమాధాన మీావలయునన్నఁ గొంచెము తర్కవిషయమున వాదము సలుపవలయును.

## విశేషణమునకు విశేష్యమునకుఁ గలసంబంధము.

విశేషణ మననేమి ? అది యెట్లు వ్యక్తమగును? విశేషణము వ్యక్తమగుట వస్తువుయొక్క స్వభావబలముననా? లేక, యుపలక్షించుద్రష్టయొక్క దృష్టిబలముననా? వస్తువును విశేషణమును వేఱుగావు. ఎట్లన? తియ్యఁదనము పంచదారకు విశేష్యణము. పంచదార నోటనిడుకొనిన నెల్లరకును దియ్యఁగ నేయుండును. ఒక్కసర్పదష్టులకుందక్క. ఈభేదమునకుఁ గల కారణము నరయుదము. తియ్యఁదనము పంచదారకు విశేషణ మగుటం జేసి సాధారణముగ నందఱకును బంచదార తియ్యఁగ నుండునట్లు చేయును. కాని—సర్పదష్టుఁడైనవానియందు వ్యాపించు విషము పంచదారయొక్క తియ్యందనమును దష్టునికిఁ దోఁపకుండఁ జేయును. ఈభిన్నత్వమునకుఁ గారణము విరుద్ధవిషబలమేకాని వస్తువునందలి విశేషణముయొక్క సర్వసమత్వాభావము గాదు. పంచదార యెప్పటికిని దియ్యనిదే.

కాని విరుద్ధవిషబలమున సర్పదష్టునికిఁ బంచదార యెప్పుడును దియ్యఁగ నుండదు. అట్లే రసము వస్తువునందు విశేషముగ నుండుననుట సత్యమ. కాని, దర్శించు ద్రష్టయొక్క చిత్త పరిపాకము ననుసరించి రసము గోచరించును. చిత్తపరిపాకము లేనివారికి వస్తువులందు నిబిడమైయుండు రసము గోచరింపదు. ఎట్లన, సర్పదష్టునకుఁ బంచదారతియ్యందనము గోచరింపని యట్లు, విశేషణమునకును, విశేష్యమునకునుగల యవినాభావ సంబంధము ద్రష్ట ృదృష్టిప్రసారము లేనిది బయల్పడదు. ఎట్లనఁ బంచదారలోని తియ్యందనము విశేషణముగ మన మంగీకరించితిమే. ఆవిశేషణము—అనఁగా నాతియ్యందనము మొట్ట మొదట నెట్లు బయల్పడియెను? ఎవరో యొకమనుజుఁడు నాలుకపై వైచికొని రుచి ననుభవించి తియ్యఁగ నున్నదని చెప్పుటవలననే కదా! కానఁ బంచదారయొక్క తియ్యందనము రుచిచూచిన జిహ్వేంద్రియము లేనిచోఁ బ్రపంచమునకు వ్యక్తము కాదుగదా.

## రసికుఁడు లేనిది రసము జనింపదు.

కావున రసికుఁడు లేనిది రసమసంభవమని సారాంశము. పోనిమ్ము. రసికుఁడే రసమును సృష్టించెనందమా? పంచదార తీయఁదనమును నాలుక కనుఁగొనినదా? సృష్టించినదా? నాలుక సృష్టింపఁగల్గినచో నుప్పును దీయఁగా నేల చేయలేదు? పైనఁ జెప్పిన సర్పదష్టుని సమయ మిచ్చుటఁగూడ గ్రాహ్యము. నాలుక యుప్పును దియ్యఁగఁ జేయలేనటులే రసికుఁడును, విశే షణయుక్తవస్తుస్వభావత్వమున రసము ననుభవింపలేఁడు విశే

షణాయుక్తవస్తువు లేనిది కవి శూన్యమునుండి రసమును సృష్టింపలేఁడు.

## —● రసికుఁడు నిమిత్తమాత్రుఁడు. ●—

రసికుఁడు వస్తువులయం దంతర్గర్భితమై నిబిడమైయున్న విశేషణము నాస్వాదించి రసమునకుఁ గారణభూతుఁ డగును. ఎట్లన, భూభారమును మాన్పుటకు శ్రీకృష్ణుఁ డవతరించి యుండ, జనులప్రాణములు దీయుటకు మృత్యుదేవత ప్రతిక్షణసన్నిహితయై యుండ, శివుఁడు త్రిశూలపాణియై మూఁడవ కన్ను విప్పుకొని మహాప్రళయమును వ్యాపింపఁజేయుటకు సంసిద్ధుఁడై యుండ, బ్రహ్మప్రళయానంతరము పునస్సృష్టిఁ గావించుటకై ప్రయత్నముల నుపాయములను నాలోచించుచుండ, నర్జునుఁడు గాండివమండితహస్తుం డై రణరంగమున నిమిత్తమాత్రుఁడై ప్రత్యక్షముగ గాండీవనిర్ముక్తప్రచండనారాచముల శత్రుసంహారము గావించినయట్లు నరివర్గముల ప్రాణములను దీసిన దర్జునుఁడు గాఁడు. పైనఁ బేర్కొనఁబడిన మహాశక్తులే. అర్జునుఁడు నిమిత్తమాత్రుఁడే. నిమిత్తమాత్రుఁడనుటలోనే యర్జునునితాత్కాలికప్రయోజనము స్థిరపడుచున్నది. అర్జునుఁడు ప్రత్యక్షముగ నిమిత్తమాత్రుఁడైనను శత్రుసంహారము గావించెనని గోచరింపకమానదు. సూక్ష్మమరసినఁ జంపిన మహాశక్తి యర్జునుఁడు గాఁడని తెలునుగాక! అట్లే కవియు నిమిత్తమాత్రుఁడే. వస్తువునందు లేని రసవిశేషణమును కవి సృష్టింపఁజాలఁడు. వస్తువునం, దంతర్గర్భితమై తనకుఁ దక్కనన్యులకు గోచరింపనిదగు రసవిశేషణమును గవి మొట్టమొదట ననుభవించి యితరులకు వ్యక్తముఁజేయును. కవి పరమాత్మ చేఁ

ప్రత్యేకప్రయోజనసిద్ధికొఱకు నియోగింపఁబడినవాఁడు. ప్రకృతియం దంతర్గర్భితమైన రసవిశేషణమును బరమాత్మచే నియోజితుఁడగుకవి మొట్టమొదట గనిపెట్టి వ్యక్తముఁగావించును. కావునఁ గవి నిమిత్తమాత్రుఁడే రసము చిరస్థాయియే. రసమేనాఁటికేనియు ననుభవింపఁబడవలసినదే. ఏలనన, వస్త్వంతర్గర్భితమై చిరస్థాయి నందుకతనకాని రసము ఎన్నటికయినను ఎవ్వఁడయిన నొకకవిచే ననుభవింపఁబడి వ్యక్తము గావింపఁబడవలసినదేకాని స్వయంప్రకాశముగ విలసిల్లఁజాలదు.

## రసికునకును రసమునకును గలయన్యోన్యాశ్రయసంబంధము.

కావున రసమునకును రసికునకును నన్యోన్యాశ్రయత్వమున్నది. ఈభావమునే టెన్నిసన్ అనునాంగ్లేయకవి సోదరకవి యగు స్విన్‌బరన్‌ను ప్రశంసించుసందర్భమున నిట్లు వాక్రుచ్చెను.—'నామిత్రుఁడు ప్రపంచమునెల్ల గానముగఁ బాడువేణువు. ఇందులకు సందియములేదు.' ఈమాటల కర్థము కొంచెము గమనింతము! ప్రపంచముయొక్క రససంపదను వేణువుంబోలె గానరూపమున నాకవి వర్ణింపఁగలఁడనియే. ఇచ్చటఁ గవి వేణువెట్లు నిమిత్తమాత్రముగ వాయువునందు గర్భితమై యున్న సంగీతశక్తిని మాధుర్యవిశేషమును నంగుళీవిక్షేపమూలమున గానరూపమునఁ బ్రదర్శించునో, యట్లే తానును బ్రకృతి యందలి మాధుర్యమును గానరూపమునఁ బ్రదర్శించునని భావము స్ఫురించుచున్నది. కవికిని, రసమునకును గలయన్యోన్యాశ్రయత్వము పైయుదాహరణమువలనఁ జక్కఁగఁ దేఁటపడినది. కవి లేనిది రస ముండదు. రసములేక కవి యుండ

నేరఁడు. విత్తు లేనిది చెట్టుండ నేరదు. చెట్టు లేని విత్తు లేదు. అనుతర్కముం బోలె నిదియును నన్యోన్యాశ్రయత్వదోష మునకుం బాలగుచున్నది. కాని, యన్యోన్యాశ్రయత్వ దోష మనిరుద్ధ్యము. అయ్యవి సృష్టిరహస్యవేదులకు నిశ్చయముగ దోషమునట్లు తోఁపఁదగదు. పాశ్చాత్య వేదాంతమున ముఖ్యముగను, మనవేదాంతమున నాచరణ విషయమునను (సిద్ధాంతవిషయమునఁ గాకపోయినను) నన్యో న్యాశ్రయము గుణముగనే పరిగణింపఁబడుచున్నదిగాని దోషముగఁ బరిగణింపఁబడుట లేదు. ప్రపంచమున మూల సూత్రములన్నియు నొకదానినొకటి యాశ్రయించి యుండునే కాని పరిపూర్ణస్వతంత్రములుగను నసంగతములుగను నుండవు.

## రస నిర్వచనము ౧. లాక్షణికమతము.

రసికునకును రసమునకును గలయన్యోన్యాశ్రయసంబంధ మును విమర్శించుటలో రసమననేమో యించుక సూచించియే యుంటిమి. ప్రకృతము రసమననేమో సవిస్తారముగఁ జర్చిం తము. రసమనఁగ 'రస్యంత ఇతి రసాః' అనువ్యుత్పత్తి ననుస రించి యాస్వాదింపఁబడునది యని మనపూర్వలాక్షణికు లన్వయించి యీక్రిందివిధమున దానిని నిర్వచింపఁ బ్రయ త్నించిరి.

శ్లో. విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః,
ఆనీయమానస్స్వాద్యత్వం స్థాయీభావో రసస్స్మృతః.

విభావ అనుభావ సాత్త్విక వ్యభిచారిభావములచేఁ దేఁబడిన మాధుర్యముగలిగిన స్థాయీభావమే రసమని చెప్పఁబడినది. వేఱొకచోట స్థాయీభావమే రసమని తెల్పుచు 'రసః, సఏవ

స్వాద్యత్వాత్ రసికస్యైవ వర్తనాత్' అని యొకలాక్షణికుఁడు నిరూపించినాఁడు. దీనియర్థము రసికునిచే ననుభవనీయ మైనది యనియే. స్థూలముగ దీనియర్థ మేమన రసికునిచే నను భవింపఁబడిన భావమును నవస్థయు రససూచకము లగుననియే. ఈనిర్వచనమున రసికునివర్తనమునకు ననఁగా రసికునియను భూతికిఁ బ్రాధాన్య మొసఁగఁబడినది. ప్రకృతియొక్కగాని మానవజీవితముయొక్కగాని సందర్శనమువలనఁ గవియందు జనియించెడు స్థాయీభావమే రసమగుచున్నది. అదియెట్లనఁ, బైనవస్తువునందు రసవిశేషణమును, రసికునియందుఁ జిత్తపరి పాకమును బ్రాయికముగ నుండి రసమునకు జన్మకారణములగు నని తెల్పియుంటిమి?

'రస' జన్మకారణములు ౧. రసికుని జన్మాంతరలబ్ధ సంస్కారము ౨ వస్తువుల నిబిడమైయున్న రస విశేషము.

ఆభావమే యిచ్చట విప్పిచెప్పిన నిట్లుండును. కవి యే దేని వస్తువునుగాని, యవస్థనుగాని దర్శింపక యుండఁడు. అట్లు వస్తువులను మనుజులజీవితములయందలివివిధావస్థలను దర్శించు కవి గ్రుడ్డివానివలెఁ గన్నులు మూసికొని 'గ్రుడ్డియెద్దు చేలోఁ బడి సంచరించుచురీతి' దర్శింపఁడు. జన్మాంతరలబ్ధమైన దివ్యదృష్టితో ననఁగాఁ బూర్వజన్మసంస్కారవాసనాబలమునఁ దీక్ష్ణమగు జ్ఞానదృష్టితో వస్తువులఁ దిలకించును. తోడనే కారణాతీత మగు ననుభవమున కతఁడు వశుఁడగును. కవియొక్క యను భవమునకు బాహ్యకారణముల సూచించుట యంత విజ్ఞాన సూచకము కాదు. కవియొక్క విచిత్రానుభూతికి జన్మాంతర

లబ్ధమైన చిత్తపరిపాకమే నిశ్చయమగు కారణము. కాని, జన్మాంతరలబ్ధమగు కవిచిత్తపరిపాకము ప్రకృతియందలి వస్తువు నేదేని నాలంబనముగఁ గొనక తప్పదు. ద్రవపదార్థములగు జలతైలాదులు పాత్రాధారము లేనిది నిలువనేరనట్లు కవిచిత్త పరిపాకము శుద్ధశూన్యత నాశ్రయింపఁజాలదు. శూన్యత నాశ్రయించినచో శూన్యత్వమే దానికి సంభవించును. ఎట్లన సున్నను సున్నతో హెచ్చించినయెడల సున్నయే వచ్చునట్లు. కావునఁ గవియొక్క చిత్తపరిపాక మాలంబము లేక ప్రవర్తింప నేరదు. రస మనునది యేదో యనిర్వాచ్యమగు విధమున జనించునది. జనించునపుడు రసము కార్యకారణసంబంధములకు లోనగుట లేదు. అప్రయత్నముగను హఠాత్తుగను నలౌకికాద్భుతరీతిని గవిహృదయమున జనించురసమునకుఁ గారణ మిదియని నిరూపింప నెట్టివారికిని దుస్సాధ్యము. కాని విమర్శకునకు రసముయొక్క జన్మప్రకారము వర్ణింపకపోవ వీలులేదు కదా! ముందు స్థూలబుద్ధికి గోచరించు సామాన్యరసధర్మము సూచించి పిమ్మట లాక్షణికులు సూచించిన విభావానుభావవ్యభిచారీసాత్త్వికముల ప్రశంసకుం గడంగుదము.

{ "రస" నిర్వచనము. ౧. కవియొక్క పరిపాకము. ౨. వస్తువుయొక్క యాలంబనము. 3. కావ్యముయొక్క రససంవాహకత్వము. }

రసమనునది జన్మాంతరలబ్ధపరిపాకము గల్గిన కవిదృష్టి యేదేని వస్తువుపైఁ బ్రసరించుటవలనఁ గవిమనమున జనించు భావవిశేషమే యగును. ఈనిర్వచనముయొక్క యర్థమును, బరిణామమును గమనింతము. కవికిఁ జిత్తపరిపాకము లేనిది రస మను

భూతము గాదనియు,కవియొక్కదృష్టి యే దేనివస్తువుపైఁ బ్రస రింపనిది నిరాధారముగా నిష్కారణముగా రసముజనింపనేరద నియు, జనియించురసము తనంతటఁదాను వ్యక్తముగాలేక కవి ద్వారముననే వ్యక్తము గావలెననియు, ముఖ్యమగు భావము నిర్వచనము స్ఫురింపఁజేయుచున్నది. కవియొక్క పరిపాకము, వస్తువుయొక్క యాలంబనము, కావ్యముఁయొక్క రససంవాహ కత్వమును, నీనిర్వచనమున ముఖ్యముగ సూచింపఁబడినవి. ఇం దొకవిశేషముగూడ గమనింపఁదగియున్నది. అదెద్దియన వస్తువు కవి చిత్తపరిపాకమున కాలంబన మైనంతమాత్రముగనే కవి యొక్క యుఃజ్ఞకును, నపూర్వస్వతంత్రకల్పనాప్రతిభకును నిరోధము సంభవింపనేరదు. వస్తువు గుణవిశేషములకును, గవియందు జనించు భావమునకును గార్యకారణసంబంధ ముండ నవసరములేదు. అనఁగా కవి వస్తువును నాధారమాత్రముగఁ గొని యపూర్వములగు కల్పనలఁ గావించి కీర్తి గడించవచ్చును. కాని ముఖ్యముగ సూచితమగు నర్థమేమనఁగా కవి మనము నందు వస్తుసందర్శనబలమున జనించు భావోద్రేకమే భావాను భూతియే రసమని.

### భావానుభూతియే రసమునకు జన్మకారణము.

ఈనిర్వచనపుంబరిణామము కావ్యకల్పనావిషయమున నెట్లుండును? కవి ప్రకృతిదర్శనమును, మానవజీవితమునందలి వివిధావస్థలజ్ఞానమును ననుభవమునకుఁ దెచ్చికొనకుండఁ గవ నము నల్లఁ బ్రారంభించిన రసనిష్పత్తి కానేరదని తేలుచున్నది. భావానుభూతి రసమునకు జన్మకారణము. ఊహ తర్కసిద్ధాంతాదులవలన రసనిష్పత్తి కానేరదు. భావానుభూతియే రసము

నకు జన్మకారణమని తిరిగి యొకమాఱు హెచ్చరించుచున్నాను. ఆభావానుభూతియే స్థిరత్వమునందలి స్థాయీభావ మగును.

**స్థాయీభావమే రసము. లాక్షణికులరస నిర్వచనము. గుప్తపాదాచార్యులమతము.**

అట్టి స్థాయీభావమునే మనలాక్షణికులు రసముగా నన్వయించిరి. ఆస్థాయీభావము కుదురుటకుఁ బూర్వము వివిధములగు విభావ - అనుభావ - సాత్విక - వ్యభిచారీ భావములను నంతరములు గడువవలసి యుండుంగాన మనలాక్షణికులు వీనినే రసమునకు జన్మకారణముగా నిరూపింపఁ బ్రయత్నించిరి. కాని,రసము సాత్త్వికవ్యభిచారాదిభావములనుండి కార్యకారణ సంబంధము ననుసరించి తప్పకుండ జనించియే తీరవలయునని చెప్పుటకు వీలులేదు. ఈభావమునే ఆచార్యఅభినవగుప్తపాదులీక్రిందివాక్యముల వివరించిరి. అది (రసము) విభావాదికము లేకున్నను జనించుఁ గావునఁ గారణజనితము కార్యము గాదు. మఱియు, నది సిద్ధినొందినను గానఁబడకపోవుటచే నిట్టిదని నిరూపించి తెలుప వీలుగానిది. అట్లయ్యు విభావాదికముచే వ్యక్తమై యనుభవింపఁదగినది. మఱియు నొకేపర్యాయ మాస్వాదింపందగినది.విభావాదికమువలనిపరామర్శయే ముఖ్యమైనందున దాని(ననఁగా రసమును) గ్రహించునది నిర్వికల్పకముగాదు. ఆరస మనుభవింపఁబడిన యలౌకికానందమయమై తనంతఁ దెలిసి సిద్ధించుఁగావున నది సవికల్పముగూడఁ గాదు. అట్లు నిర్వికల్పకత్వ-సవికల్పకత్వములకుఁ జేరకపోయినను నది యుభయమును, ననఁగా నిర్వికల్పకత్వ-సవికల్పకత్వముల నొందించు

చున్నదగుచుఁ బూర్వమువలె నారెంటికలయికచే లోకోత్తర భావమునే పొందుచున్నది. కాని, వైరుధ్యమును గలిగించునది గాదు."

గుప్తపాదాచార్యులయభిప్రాయమున రసమునకును, విభావానుభావాద్యంతరములకును గార్యకారణసంబంధము లేదని రూఢియగుచున్నది. ఆచార్యులమతమున రసము సవికల్పకమును నిర్వికల్పకమునుగూడ నయియున్నదని - అనఁగా రసము చిరస్థాయిగఁ గొంతకాలము మాత్రమే నిల్చుననియుఁ, గొంతకాలము విభావానుభావసంచారీవ్యభిచారీస్థితుల నందుచుండుననియు సూచింపంబడినది. దీనియంతటికిని స్థూలార్థమేమనఁగా:—రసము నిశితమగు నతితైక్ష్ణ్యముతోఁ గొండొక కాలముమాత్రమే ప్రదర్శింపయోగ్య మగుననియు,మిగిలినపట్ల నట్టితైక్ష్ణ్యము తగ్గిపోవుననియుఁ, గావ్యమున రసమునకు జీవస్థాన మతి తైక్ష్ణ్యముఁ బ్రదర్శించుపట్లగల స్థాయీభావమే యయినను నట్టిస్థాయీభావమును బోషించుటకును, దోహదముఁజేయుటకును వివిధములగు విభావానుభావములు వలయుననియుఁ దెలియుచున్నవి.

కావ్యమునకును చిత్రశిల్పమునకును గలభేదము.
౧. చిత్రశిల్పములయందు రసముయొక్క—స్థాయీభావమే, అనఁగా, నిశితతీక్ష్ణతయే ప్రదర్శిత మగును. కావ్యమున వివిధభావములు వర్ణితములగును.

ఇప్పట్టున శబ్దరూపమున నుండుకావ్యమునకును వర్ణశిలారూపముల నుండు చిత్రశిల్పములకును భేదము లరయు

దము. చిత్రములయందును, శిల్పములయందును మానవప్రకృతి యందుఁగాని, బాహ్యప్రకృతియందుఁగాని కలసౌందర్యభావా నుభూతి నిశితతైక్ష్ణ్యమునొందు నవస్థయే ప్రదర్శితమగును.

(౨ చిత్రశిల్పము లింద్రియసాహాయ్యముచే రసమును బ్రదర్శింపఁగల్గును. కావ్యము ఇంద్రియసాహాయ్య మపేక్షింపని శుద్ధమానసికవ్యాపారమే.)

చిత్రమునందును, శిల్పమునందును పలుమాటల కవకాశము లేదుగావునఁ జెప్పఁదలఁచుకొన్న భావమంతయు నేకస్థాయి నుండునట్లుగను, నిశితతీక్ష్ణతఁగలుగునట్లుగును బ్రదర్శింపవలయును. ఒకవేటు దెబ్బ రెండే తునుక లనునట్లు, చిత్రకారుఁడును, శిల్పియును నిశితతీక్ష్ణతఁ గలస్థాయీభావమును మాత్రమే ప్రదర్శింతురు. అందుచేతనే చిత్రములును శిల్పములును భావతీక్ష్ణతఁ గలవై కొట్టవచ్చినట్లుగ నుండి చూపఱమనంబుల నొకేచూడ్కితోనే వశముగావించుకొనఁగల్గుచున్నవి. శిల్పమునందును జిత్రమునందును వైవిధ్యమున కవకాశము లేదు. భావతైక్ష్ణ్యమే చిత్రకారునకును, శిల్పికిని బరమావధి. ఇఁకఁ గావ్యముననన్నవో వైవిధ్యమున కవకాశము గలదు.

చిత్రములయందును, శిల్పములయందును గలరసము చక్షురింద్రియముద్వారా మనసునకు గోచరించును. అందుచేఁ గన్నులకుఁ జూచినతోడనే ఒక్కమాఱుగ రసము గోచరించుటకై రసము నిశితతైక్ష్ణ్యముతోడను నేకాగ్రతతోడను నొప్పునవస్థయే చిత్రకారులును శిల్పులును ప్రదర్శింతురు. ఆ నిశితతీక్ష్ణతగలభావమును గన్నులు మనసునకు గోచరింపఁ

జేయును. కావ్యమన్నచో నింద్రియముల సాహాయ్యముపై నాధారపడియుండదు. కావ్యపఠనము శుద్ధమానసికవ్యాపారమే. శ్రవణేంద్రియసాహాయ్యము ఛందోవిషయమున మాత్రము వర్తించును. అందువలనఁ గావ్యమున భావ మింద్రియ సాహాయ్య మక్కఱలేకయే ప్రదర్శితము కావలెను, కావ్యమున రసము శబ్దరూపముననే మనసునకు స్ఫురించవలెను. శబ్దము భావమునకు సంజ్ఞారూప మగుటంజేసి పలుశబ్దముల సూచింపఁ బడురసము పలువిధములగు భావముల సూచించును. కన్నులకు వర్ణశిల్పములవలన నేకాగ్రత సూచితమగు ప్రత్యేకవిధమున శబ్దములవలన మనసునకు నేకాగ్రతసూచితముకాదు. అర్థము లేనుమాటలచె రసము స్ఫురించవలెను అట్టిచో కావ్యమాది నుండి తుదివరకుశబ్దరూపమున నుండుటచేఁ బలుమాటలకును, బలువిధములభావములకును నవకాశముగలదు. నిశితమగు భావ తైక్ష్ణ్యము కావ్యమునఁ జిరస్థాయిగా నేకరీతిం బ్రదర్శించుట దుస్తరమును దుష్కరమును! ఏలననఁ గావ్యము చదువుటకు చిత్రశిల్పముల దర్శించుకాలముకంటె నెక్కువకాలము పట్టును. మొదటినుండియుఁ జివఱవఱకు వైవిధ్యములేకుండ నేకస్థాయిని గవి రసమును బ్రదర్శింపఁ బ్రయత్నించిన నది విసువుఁ గల్గింపక మానదు. ఉచ్చైస్థాయిని నాటక మాదినుండి తుదివఱకు గొంతుకఁ జించుకొని పాడు నాటకసమాజగాయకుల గానము కొంచెసేపటికే విసువుఁగల్గించుటలేదా? సంగీతమున స్థాయీ భేదములు సూచింపఁబడనిది మాధుర్యము జనింపనేరదు: ఎల్లప్పుడును నేకార్థము సూచించుమాటలతో నిండియుండినగాని యేకాగ్రత సూచించు రసభావము ప్రదర్శితము కానేరదు.

కావున నేకాగ్రత నొందినభావమే వర్ణింపఁబడవలెనన్నఁ గావ్యమున మితభాషణ మత్యవసరమగును. కవి చెప్పఁదలఁచుకొన్న భావమంతయు రెండుమూఁడు మాటలలోనో రెండుమూఁడు వాక్యములలోనో పూర్తియగును. 'కట్టె, కొట్టె, తెచ్చె' నన్నట్లగును. అదిగాక చిత్రములయందును, శిల్పములయందును వర్ణశిల్పములచే సూచితములగు భావములన్నియు నేకక్షణముననే గోచరించును. కావ్యమున భావము లొకదాని వెంబడి నొకటి గోచరించును. కావున నవి వివిధాంతరములు గల తీక్ష్ణతగలుగు వివిధావస్థలతోడఁ బ్రదర్శింపఁబడవలెను. వివిధాంతరములుగల తీక్ష్ణతయు, వివిధావస్థలును భావమునకు వైవిధ్యము నొసఁగును. అందుచే రసము నిశితతీక్ష్ణతతోడను, నేకాగ్రతతోడను మాత్రమే గాక వివిధావస్థలతోడను, వివిధాంతరములుగల తీక్ష్ణతతోడను బ్రదర్శితమగును. ఏక స్థాయిని బాడుచుండినచో నయ్యది 'కీఁచురాయిరొద'వలె వినువారికిఁ దలనొప్పిఁ బుట్టింపక మానదు. కావ్యమునకు నిట్లే రసము వైవిధ్యము లేక యేకస్థాయిని బ్రదర్శింపఁబడినచో రోఁతయు, విసుఁగును జనింపకమానవనియు, నట్టివిసువును రోఁతయు జనింపకుండుటకై కవి సాత్వికవ్యభిచారాదిభావములను విభావానుభావములను దగురీతిఁ బ్రస్తరించి కావ్యమున రసమునకు వైవిధ్యమును నాహ్లాదకత్వమును గల్గింపవలెనని మనలాక్షణికులయభిప్రాయ మైయున్నది. ఎట్లయినను, గావ్యమున రసమనునది యేకారణమున జనించినను నిశితతైక్ష్ణ్యముఁ గలిగి యుచ్చైస్స్థాయి నొందినయవస్థావిశేషమునకే చెల్లును గాని తదితరములగు విభావానుభావాదికములకుఁ జెల్లదు.అందు వల్లనే మనవారు స్థాయీభావమే రసమని చెప్పుటలో నెంతయు

రసస్వభావపరిచయము వ్యక్తమగుచున్నది. రసము నిశ్చయముగ విభావానుభావాదికములలో లేదని చెప్పఁదగదు. అవి రసోపలబ్ధికిని రసప్రకటనమునకును సాధనమాత్రములుగను మనలాక్షణికులు సూచించి యున్నారని మన మంగీకరింపక తప్పదు.

{ విభావాదికములు,రసప్రకటనమునకును రసోపలబ్ధికిని సాధనమాత్రము లే. }

విభావానుభావాదికములు రసోపలబ్ధికి నంతరములును సాధనములును మాత్రమే యనియుఁ గారణములు మాత్రము కాఁజాలవనియు నిశ్చయముగఁ జెప్పవచ్చును.

{ రసముయొక్క జన్మప్రకారము. 'కవి ద్రష్ట'యని యంగీకరించువారిమతము. రసము మొదట తీక్ష్ణభావముగ జనించి విభావాదికముల పరామర్శచేఁ దుదకు స్థాయీభావమునొందును. }

ఇట్లు పలుకుటవలన నింకొక ప్రశ్నమున కవకాశ మొదవుచున్నది. రసము జనించునపుడు స్థాయీభావముఁగ జనించునా? లేక విభావాదికముబలమున స్థాయీభావముగఁ బరిణమించునా? ఈప్రశ్నమునకుఁ బ్రత్యుత్తర మొసఁగుటకుఁ గావ్యజన్మకారణము నరయవలయు. కవి, మొట్టమొదట భావము ననుభవించి పిమ్మట ప్రస్తరించునా? లేక భావానుభూతి నొందనివాఁడై ప్రస్తారములవలనఁ దుదకు భావోపలబ్ధిని బడయునా? దీనివిషయమున భిన్నాభిప్రాయముల కెడముగలదు. కవి సాక్షాద్ద్రష్టయని నమ్మువారికిఁ గవి ప్రప్రథమముననే భావమును దీక్ష్ణముగ ననుభవించునని నిశ్చయమగుచున్నది. అట్లు

దర్శించినమూర్తిని ననుభవించినభావమును, వినినశబ్దమును గవి నెవ్విధిమీఁదఁ గావ్యరూపమునఁ బరిణమింపఁజేయుచు సాధనములుగా విభావాదుల నుపయోగించి రససిద్ధిని బడయ నెంచును. కావున రసము ప్రప్రథమముననే జన్మాంతరసంస్కార జనితచిత్తపరిపాకము గలిగిన కవియొక్కదృష్టి వస్తువుపైని బ్రసరించినతోడనే జనించును. పిట్టలు ప్రాతఃకాలమున గూండ్లు వదలి పైరుచేలఁ దిరిగి మేఁత మేసి తటాకముల జలముఁ ద్రావి నానావిధఫలవృక్షములపండ్లను దిని సాయంకాలమగు సరికి గూండ్లు చేరునట్లుగనే, కవి సాక్షాత్కారలబ్ధమైనరసమును విభావాదికమునెడఁ బ్రసరింపనిచ్చి చివఱకు రసోపలబ్ధిం బడయును. కవి యంత్యమున ననఁగాఁగావ్యాంతమునఁ బడయు రసోపలబ్ధికిని, మొట్టమొదట రససాక్షాత్కార మగునపుడు కలుగు భావానుభూతికిని వైరుధ్యము లేదు. ఐక్యభావమే వర్తిల్లును. మొదట సాక్షాత్కారజనితమయిన భావము నిశిత తైక్ష్ణ్యము గలదియై జనించి యొక్కపెట్టునఁ బెల్లువెల్లు వయుంబోలెను, మెఱుంగుఁబోలెను గవిని వశముఁజేసికొని స్తంభితుని గావించి పారవశ్యావస్థను విడియించి యరుగును. పిమ్మట స్మృతిఁదెలిసి కవి సాక్షాత్కారబలమునఁ దాఁ గాంచిన మూర్తి యిదియా యదియా! యనుచుఁ బ్రకృతియందుఁ గల వివిధమూర్తులతో సరిపోల్చి చూచి మననముఁ జేయుచు నక్లే కాగ్రచిత్తతతో మననముఁ గావించుటవలన సంకల్ప సిద్ధుఁడై తొల్లింటిమహనీయమూర్తినిఁ దొల్లిఁటి యలౌకిక భావానుభూతిని బడయఁగలుగును. అదియే రససిద్ధి యనం దగును. కావున మామతమున రసము మొట్టమొదట మెఱుపుఁ దీవయుంబోలె నిశితతీక్ష్ణతగల కాంతితో జనించి కవికన్నుల

మిటుమిట్లుఁగొల్పును. అనఁగా జనియించునపుడే రసము తైక్ష్ణ్యముగలిగియుండి స్థాయీభావ మనందగియుండును. కాని స్థాయిత్వముమాత్రము చిరానుభూతివలనస్థిరీకరింపఁబడఁదగిన దగుటచేఁ జివఱకు సిద్ధించును. కాని మొట్టమొదట జనించు రసానుభవమున స్థాయీభావమున కుండవలసిన నిశితతైక్ష్ణ్యము పూర్తిగ నుండును. మెఱుఁగువోలె మెఱసి యేఁగిన రసస్వరూపము కవి విభావాదికమును సాధనముగఁ గొని పునర్దర్శనముఁ గావించుటకుఁ బ్రయత్నించి రసోపలబ్ధినిఁ బడసి స్థాయీభావము నందినవాఁ డగును. అనఁగాఁ దొల్లింటిమెఱుంగుఁ బోలిన రసానుభూతిని జాఱిపోకుండ నెప్పుడును దన్నాశ్రయించుకొనియే యుండునటులు బంధించి కైవసముఁగావించి కొని పునఃపునా రసానుభూతి నొందుచు యోగబలమునఁ బరమేశ్వరరూపము నిత్యముఁ గాంచుచు నమేయానందము నందు యోగికరణి సిద్ధుఁడగును. కావున నింతవఱకుఁ జర్చించి తేల్చిన దేమనఁగా:—

## కవికి రససాక్షాత్కారము కావలెను.

రసానుభూతి సాక్షాత్కారబలమున నిశితతైక్ష్ణ్యముతో మొట్టమొదట లబ్ధమయి మననబలమున స్థాయీభావమునొందు ననియే కాని సాక్షాత్కారబలము లేక విభావ అనుభావ సాత్త్విక వ్యభిచారీభావముల పట్టికలను జదివినంతమాత్రమునఁ గవికి రససిద్ధి యనందగు స్థాయీభావ మేర్పడుట సంభవము గాదని యును గావ్యరచనకు మూలకారణమగు రసానుభవమును భావోద్రేకమును జన్మాంతరసంస్కారవాసనాబలమునను జిత్తసంస్కారమువలనను జనింపవలసిన దే కాని గ్రంథపఠనమువల

నను, నందు ముఖ్యముగ లక్షణగ్రంథపఠనమువలనను, లభించుట యసంభవమనియును. పుట్టుకతోనే కవియై పుట్టవలయుఁగాని వేఱువిధమునఁ గవి యగుట యరుదు. భావ మెప్పుడును జన్మాంతరసంస్కారబలమునఁ గవికి వస్తుసందర్శనముఁ గావించిన నిమేషముననే లబ్ధమగును.

## వాల్మీకికవిచరిత్రము.

ఈభావ మాదికవియగు వాల్మీకిమహర్షిచరిత్రవలనఁ బరిస్ఫుట మగుచున్నది. తమసానదీతీరమునఁ గామమోహిత మయిన క్రౌంచమిథునమునందు నొకదానిని జంపిన వ్యాధునిఁ జూచి బాణనిహతమయిన క్రౌంచమును గాంచి కరుణాపరవశుఁడయి యాక్రిందివిధమున వాల్మీకి దురాత్ముఁడగు నావ్యాధుని శపించెను.—

శ్లో. మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమశ్శాశ్వతీస్సమాః,
యత్క్రౌంచమిథునా దేకమవధీః కామమోహితమ్.

జన్మాంతరసంస్కారమును జిత్తపరిపాకమును గలవాఁ డగుటచే వాల్మీకికి వ్యాధబాణనిహతమయిన క్రౌంచదర్శనము రసోత్పాదకమయ్యెను. జన్మాంతరసంస్కారము గాకున్న వాల్మీకి కరుణకుఁ గారణము వేఱొక్కటియు లేదుగదా! తాను మనుజుఁడు. హతమయినది క్రౌంచము. ఇరువురకును సంబంధ మంతగా లేదు. కాని జన్మాంతరలబ్ధసంస్కారముగల వాల్మీకి వ్యాధబాణనిహతమయిన క్రౌంచమును జూచినతోడనే కరుణారసపరవశుఁ డయ్యెను. కరుణారసము నిశితతైక్ష్ణ్యముతో నతని వశముఁ గొనెననుటకు శ్లోకరూపమున నతనిశోకము వెలువడుటయే తార్కాణము. ఎంత భావతైక్ష్ణ్యము లేనిది. వాల్మీకి సం

బంధము లేని క్రౌంచమువిషయమయి తనలోఁజనించిన కరుణ ననాలోచితముగ సద్యఃకావ్యముగఁ బలుకఁగలిగియుండెను? కావున రసము జనించునపుడు తైక్ష్ణ్యము గలిగియుండి పిదప విభావాదికముచేఁ బోషింపంబడి స్థాయీభావముగఁ గవి యందుఁ దిరముగఁ బాఁతుకొనును.

**రసస్వరూపము - విభావాదికములు.**
**రసముయొక్క బాహ్యస్వరూపమును ప్రదర్శించును.**

కావున రసమునకు జన్మకారణము సాక్షాత్కారలబ్ధ నిశితతీక్ష్ణభావానుభూతియే. ఇఁక రసముయొక్క స్వరూప మెట్టిది? రసమున కాత్మయును, జీవమును ననఁదగునది సాక్షా త్కారమును తద్ద్వారా జనించు భావానుభూతియే! ఇఁక బాహ్యస్వరూపమును దత్సూచకములగు నంగోపాంగములును, నీవిభావానుభావాదులే యగునని మన మొప్పికొనినను జిక్కు లేదు. కాని, యీవిభావానుభావాదు లనంతవైవిధ్యము గలిగి యుండును.

**లక్షణగ్రంథములలోని విభావాదులప్రశంస యుదాహరణము మాత్రమే.**

కావున లక్షణగ్రంథములకుఁ జెప్పఁబడు విభావాను భావాదులప్రశంస యుదాహరణమాత్రమే కాని సంపూర్ణనిర్వ చనముగాని, నిర్ణయముగాని కాఁజాలదు. మానవప్రకృతి యనంతవిధములఁ బ్రవర్తించును. అందుచే భావానుభూతియు ననంతవైవిధ్యముఁ గలిగియుండును. అందువలన భావాను భూతిని సూచించునవియు, దానికంతరము లనందగినవియు నగు

విభావాదికములు లక్షణగ్రంథముల నుదాహరణపూర్వకముగ వివరింపంబడియుంట నిశ్చయము.

## విభావాదులు రసమునకు వైవిధ్యము నొడఁగూర్చును.

రసము సాక్షాత్కారబలమున ననిర్వచనీయభావానుభూతిని జననమొంది విభావాదిసాధనముల పరామర్శచేఁ బెంపొంది స్థాయీభావముగ సిద్ధించి కవికి యశమును, గావ్యమునకు స్థిరత్వమును సంపాదించును. కావ్యము శబ్దరూపమగుటచేతను శబ్ద మెప్పుడును నేకస్థాయి నుండక స్థాయీభేదముల నొందుచునే యుండవలయుఁగావునను గావ్యమున వైవిధ్యము తప్పనిసరిగ నుండవలయు. కావ్యమునకు జీవాత్మ సాక్షాత్కారజనితరసమే. కాని, సాక్షాత్కారలబ్ధమగు రసము చిత్రములను శిల్పములనుబలె నేకస్థాయిని గావ్యమునఁ బ్రదర్శితమగుటకు వీలులేదు. కావునఁ గావ్యమునకు వైవిధ్యగుణాలంకారము నొడఁగూర్చుటకు రసముయొక్క వివిధప్రస్తారములను బాహ్యచిహ్నములును ననఁదగు విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావములకుఁ గావ్యమున నవసరప్రసక్తి గలదు.

## విభావాదులు సాధనమాత్రములు.

ప్రాణికి జీవమును నాత్మయును నదృశ్యములయినను నవయవములుమాత్రముబాహ్యదృష్టికి గోచరించుచు నేయుండును. ప్రాణి యవయవములసాధనమున నవసరకర్మముల నిర్వర్తించును. ప్రాణ మంతరించిపోవునపుడు సాధనమాత్రములును, బాహ్యచిహ్నములును నగునవయవములుగూడ నంతరించి యాత్మయొక్క యదృశ్యత్వమును నైక్యమును, నిరాకారతయు మాత్రమే మిగులును. అట్లే కావ్యమున జీవాత్మయగు

రసము విభావానుభావాదికములవలనఁ గార్యముల నిర్వర్తించు కొనుచు నిజస్వరూపమును బ్రకటించుటకు వానిని సాధనములుగ నుపయోగించుచుఁ దుదకు స్వస్వరూపసంధాన మనఁ దగు స్థాయీభావము నొంది సిద్ధిఁగాంచినతోడనే విభావాదిక ప్రసక్తిని మఱచి స్థాయీభావజనితాస్వాదముననే యోలలాడు చుండును. ప్రాణి యుపాధిని దాల్చి ప్రవర్తించునంత కాలము నవయవము లెట్లు ప్రయోజనముఁ గల్గి యవసరములై యుండునో యట్లే రసము కావ్యస్వరూపముఁ దాల్చి ప్రవర్తించు నంత కాలము విభావాదికమునఁ బ్రయోజనమును నవసరమును విదితము లగుచుండును. ప్రాణి యుపాధిని విడిచి పోవునప్పు డవయవములయవసరము తీఱిపోవునట్లే రసము కావ్యస్వరూపమును వీడి సిద్ధిఁ గొందుసమయమునకు విభావానుభావాదికముల యవసరము తగ్గిపోవును. ఇందులకుఁ దార్కాణము కావ్యమున రస మేది యన విభావాదికముల సంగతిఁ జెప్పక కావ్య జీవమగు స్థాయీభావమునుగూర్చియే నిరూపణ గావించుటయే. స్థాయీభావము కావ్యమున రసమునకు జీవస్థానము వంటి దని చెప్పఁదగును. కావ్యమున రసము స్థాయీభావ రూపముననే సిద్ధించి తన్మూలముననే నిరూపితమగును.

{ విభావాదుల ప్రయోజనములు. ౧ రససిద్ధికిఁ దోడ్పడుట. ౨. రసమునకును గావ్యమునకును వైవిధ్యము నాపాదించుట. }

విభావాదికము నిమిత్తమాత్రమును, సాధనమాత్రమును. వానియొక్క ప్రయోజనము స్థాయీభావమునకు మార్గముఁ జూపించుటయే. రసము అడ్డంకులు లేక యథోచితముగ

ననుకూలప్రదేశములం జరించి యనుకూలమార్గములం బురో గమనముం గావించి యిష్టాభరణములం దాల్చి యానందపార వశ్యమున స్థాయీభావము నొందుటకుం దగిన యవకాశము నీవిభావాదికములే గలిగించును. కావున విభావాదికముల ప్రయోజనము రససిద్ధికిం దోడ్పడుటయు, రసమునకును,గావ్య మునకును వైవిధ్యము నాపాదించుటయును నను ద్వివిధము లుగ వర్తిల్లును.

### భిన్నత్వాంతర్గర్భితమగు నేకత్వమే సృష్టిలక్షణము.

కాని, విభావాదికప్రశంసలో మనము గమనించవలసిన విషయ మొకటి కలదు. సృష్టి యనంతమనియుం బ్రకృతుల భిన్నత్వ మనంతమనియు ముందుగ మనము గ్రహింపవల యును. సాధారణముగ సంపూర్ణముగ నొకదానిని బోలిన వస్తు వింకొకటి యుండదు. ప్రతివస్తువునకును మూలమును జీవమును నగులక్షణ మేదో యొక టుండును. అప్రధానము లగు గుణములుకొన్నియు నుండును. ప్రధానగుణవిషయమున నేకజాతికిం జేరిన వస్తువులకు సామ్యముండును. కాని యప్ర ధానగుణములవిషయమున నట్టిసంపూర్ణసామ్య ముండుట యరుదు. ఎట్లంటిమేని, మానవులందఱకును బ్రాణమును, మను ష్యత్వమును ముఖ్యలక్షణములే. ఇచట మనుష్యత్వమనగాం బంచేంద్రియవ్యాపారవశత్వమని యన్వయించుకొనం దగును. ప్రతిమనుజునకును బ్రాణ ముండును. ప్రతిమనుజుండును పంచేంద్రియవ్యాపారములకుం గట్టువడియే యుండును. ఈ రెండువిషయములను, సర్వమానవకోటికిని బంచేంద్రియ వ్యాపారముల జయించిన సిద్ధయోగులకుందక్క సామ్యము

నిశ్చితము. కాని, వివిధమానవుల ప్రాణముల కుండు శక్తులును, వివిధమానవుల పంచేంద్రియ వ్యాపారప్రవృత్తియు భేదించును. ఒకొక్కనిప్రాణ మతిశక్తిఁ గలదిదై యెట్టికష్టములనైన నోర్వఁగలదిదై యుండును. కొందఱప్రాణి యతిసుకుమారమై కష్టముల కోర్వక ముట్టుకొనిన వాఁడిపోవు పూవుం బోలె వర్తిల్లును. ప్రాణికిఁ గలశక్తియం దుండు తారతమ్యము సూచించితిమి. ఇఁకఁ బంచేంద్రియవ్యాపారప్రవృత్తియందును గూడ ననంతములగు విభేదములు గానవచ్చుచుండును. రుచుల విషయమునఁగల యనంతవిభేదము 'లోకో భిన్నరుచిః' యను జనప్రశస్తిఁగన్నది. వాసనావిషయనఁగూడఁ గొందఱకు గాటునగువాసన యింపుగనుండును. కొందఱకుఁ దేలికయగువాసన యింపుగనుండును. శబ్దము, స్పర్శము, మొదలగు నితరేంద్రియ వ్యాపారప్రవృత్తియందుఁ గూడ నిట్టి యనంతవైవిధ్యమును సోదాహరణముగఁ బ్రదర్శింపవచ్చును. కాని గ్రంథవిస్తరభీతిచే 'స్థాలీపులాకన్యాయ' మునే యనుసరింపవలసినవాఁడ నయితి. ప్రకృతి యెప్పుడును, నీక్రిందిసూత్రము ప్రకారము ప్రవర్తించును. వివిధవస్తువులకు జీవగుణములయందు నైక్యభావమును సామ్యమును, నప్రధానగుణములయందు వైపరీత్యమును వైవిధ్యమును వర్తించుచుండును. భిన్నత్వము లేనిది యేకత్వము సంభవించుట యరుదు. భిన్నత్వముతోఁ గూడిన యేకత్వమే ప్రకృతియొక్క లక్షణము. ప్రకృతి సృష్టికర్త మనమునందు భావరూపముగ నుండినపు డేకత్వము నే కలిగి యుండును. దీనినే మనవారు పరమాత్మయొక్క నిర్గుణత్వముగను నేకత్వముగను నిరూపించిరి. సృష్టికర్తృవదనగవ్హారాంతరములనుండి గుణరూపమున వెలువడిన సృష్టి యనంతమగు

గుణ-లక్షణ - స్వరూప విభేదములచే ననంతవైవిధ్యములతో నొప్పుచు వర్తిల్లుచుండును. చివఱకు సృష్టియంతయు నశించు నపుడీయనంతవైవిధ్యమంతయు రూపఱిపోవును. ఈభావ మునే పోతనామాత్యుఁడు గజేంద్రమోక్షణమున—

క. లోకంబులు లోకేశులు
లోకస్థులుఁ దెగినతుది నలోకంబగు పెం
జీఁకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్.

అనుపద్యమున సూచించెను. సృష్టియంతయు లయమయిన పిమ్మట ననఁగా ననంతగుణరూపవిభేదములతో నొప్పు 'లోకం బులు లోకస్థులుఁ దెగినఁదుది నలోకంబగు పెంజీకటి కవ్వల నేకాకృతితో భగవంతుఁడు వెలుఁగుననుచున్నారు. వైవిధ్య మంతయు నశించి యేకత్వమున లీనమగును. కావున భిన్న త్వము సృష్టియందే కాని భగవంతునియందు లేదు. ఏకత్వము నుండి జనించినసృష్టి నిమిత్తమాత్ర జీవితముఁ గడపి తుదకు నేకత్వముననే లీనమై పోవును.

{ భిన్నత్వాంతర్గర్భితమగు నేకత్వము రసముపట్లఁ గూడ వర్తించును. }

ఈసృష్టిరహస్యమే రసమునకుఁగూడ వర్తించును. సృష్టి స్థితిలయములు సకలచరాచరప్రపంచములకు సమానమే. సృష్టికిఁ బూర్వమును, లయమునకుఁ దరువాతను నేకత్వమేకాని భిన్న త్వము లేదు. సృష్టిజరిగి, యది స్థితినొందుచు లయమగువరకు భిన్నత్వసూచితగుణ్యావైవిధ్యము వర్తించును. కావున భిన్నత్వాం

తర్గర్భితమగు నేకత్వమే సృష్టిలక్షణమని తిరిగి హెచ్చరించు చున్నాఁడను.

కావ్యసృష్టివిషయమునఁ గూడ నీభిన్నత్వాంతర్గర్భిత మగు నేకత్వము వర్తించును. ఎట్లన కావ్యసృష్టికి మూలకార ణము జన్మాంతరసంస్కారవాసనాబలమే. అయ్యది యాత్మశక్తి యేకాని వేఱుకాదు. అట్టియాత్మశక్తిని గవి సాక్షాత్కార బలమునఁ బొంది యనుభవింపఁగలుగును. సాక్షాత్కారమగు నప్పుడు కావ్యాత్మయగు రసము మెఱుపువోలె క్షణదృశ్యమై మాయమగును. భిన్నభిన్నరూపములతోఁ గవికిఁ గనుపింపక నేకతేజముతో హఠాత్తుగా నయ్యది గోచరించును. సాక్షా త్కారమున దృశ్యమైనతేజమును మననముఁ గావించుటలోనే భిన్నత్వము, ద్వైతభావమును, సృష్టివైవిధ్యమును జనించుట కవకాశము కలుగుచున్నది. అట్టిమననబలమున స్థాయీభావము చేకుఱి రససిద్ధి యైనతోడనే వైవిధ్యమునకు, భిన్నత్వమున కును నవకాశమును, బ్రసక్తియుఁ దగ్గిపోవును. అప్పుడు స్థాయీభావరూపమునఁ దిరిగి యేకత్వమే సిద్ధించును. అప్పుడే కవి సిద్ధుఁడగును.

## విభావాదులు రసమునకు స్వరూపముఁ గల్పించును.

కావున విభావానుభావ-సాత్త్విక-వ్యభిచారీభావములు సాక్షాత్కారబలమున జనించినరసముయొక్క బాహ్యప్రవృత్తిని దెలుపఁగలుగును. కేవలతేజోరూపమున గోచరమైన రసమున కొక యవయవయుతమగు స్వరూపమును గల్పింపఁజూచును. ఈస్వరూపము ప్రయోజనార్థియును సాధనమాత్రమునని యెంచనగును. నిరంతర మననబలమున మొదట తేజోరూప

మున గోచరమైన రసస్వరూపము స్థాయీభావము నందునని యిదివరకే సూచించియుంటిమి. విభావానుభావాదు లీమనన కార్యమునకుఁ దోడ్పడును. రససిద్ధికి నెంతేనిఁ దోడ్పడును. తుదకు స్థాయీభావరూపమున రససిద్ధి యైనతోడనే "లోకం బులు, లోకేశులు, లోకస్థులుఁ దెగి""యలోకంబగు పెంజీఁకటి కవ్వల నేకాకృతి వెలుఁగు" పరమాత్మలో నైక్య మాకరణి నీవిభావానుభావాదులు స్థాయీభావమున నైక్యమొందును. కావున రసముజనించునప్పుడును సిద్ధించునప్పుడును నేకత్వము నే పొందియుండును. జన్మకును సిద్ధికిని నడుమ విభావానుభావ సాత్త్వికవ్యభిచారీభావములు రసముయొక్క నిమిత్తమాత్రమగు బాహ్యస్వరూపమును బ్రకటించును.

**విభావాదులు రసమునకుఁ బ్రస్తారభేదములఁ గల్పించును.**

అంతియకాక నీవిభావాదికములు కావ్యమునకు వైవిధ్య గుణము నాపాదించునని తెల్పియుంటిని. ఏకస్థాయిని కావ్యమున రసము ప్రదర్శనయోగ్యము కాకుంటచే నేదేనిమార్గమున నా రసమునకు ప్రస్తారభేదములఁ గల్పించఁదగును. అట్టిప్రస్తారభేద ములన్నియుఁ గావ్యాత్మయగు రసమునకుఁ గట్టువడియుండి దానిని సూచించుచుఁ గావ్యమునకు వైవిధ్యము నొడఁ గూర్చును. కావున నీవిభావాదులు కావ్యాత్మయగు రసమును బోషించి దోహదముఁ గావించును. సాక్షాత్కారలబ్ధమైనరసము విభావానుభావాదుల సాధనములుగఁ గొని తిరిగి స్థాయీభావ రూపమున స్వస్వరూపసిద్ధిఁ బడయును గావుననే మనవారు

"విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః,
ఆనీయమానస్స్వాద్యత్వం స్థాయీభావో రసః స్మృతః."
యనుచు విభావాదికముల నిమిత్తమాత్రప్రయోజనమును "ఆనీయమాన" అనుపదముచే సూచించియే యున్నారు.

## విభావాదుల విషయమున గమనింపవలసిన విషయములు.

కాని విభావాదులప్రసంగవిషయమున ముఖ్యముగ గమనింపవలసినవిషయములు రెండు. రసము రసికునిచిత్తసంస్కారము నాధారముగఁ గొనుననుట యొక్కటియుఁ, బ్రకృతిలో సంపూర్ణసామ్య ముండక భిన్నత్వాంతర్గర్భితమగు నేకత్వమే వర్తించుననుట యొకటియు, నీరెండువిషయముల గ్రహించితి మేని యనంతవిధములఁ బ్రసరించు కవిచిత్తసంస్కారము, రసస్పర్శ ననుభవించి, యసంఖ్యాకములును, ననంతవైవిధ్యము కలవియును నగు విభావాదుల నొందుననియు, లాక్షణికులు సూచించెడి విభావాదులపట్టికయుదాహరణమాత్రమేయనియుఁ గవిని బంధింపఁగలుగు శాసనము కాఁజాలదనియు, కవి కావ్యసృష్టిపట్లఁబోలె విభావాదికావలంబనముపట్లను నిరంకుశుఁడై ప్రవర్తించి నిజమనోభీప్సితసిద్ధి యనఁదగు రససిద్ధిని స్థాయీభావమురూపమునఁ బడసి ప్రకటింపఁగలఁ డనియుఁ దేఁటపడఁ గలదు. కవికిఁ బ్రధానలక్ష్యము లక్షణానుకరణముగాక రససిద్ధిని స్థాయీభావమును నొందుటయే యగును.

## స్థాయీభావతత్త్వము.

రససిద్ధియు, రసనిర్వాణమును, రసముముక్తియు ననఁ దగు నీస్థాయీభావప్రశంస కొంచెమువిపులముగఁ గావింతము.

ఆసనాదిసాధనసంపత్తిబలమున యోగి తుదకు యోగసిద్ధినంది పరమేశ్వరుని తేజమును నిత్యము నెట్లు సందర్శించి యానందానుభూతి నందుచుండునో యట్లే కవియు విభావానుభావాది సాధనములబలమున స్థాయీభావమునంది రససిద్ధిఁబొందినవాఁడగును. భక్తుఁ డెట్లు ధ్యాన - మనన-భజన-అర్చనాది సాధనములద్వారా మనోనైల్యము వీడి నిర్వాణమునొందునో యట్లే కవియు విభావాదిసాధనములద్వారా స్థాయీభావరూపమగు రసనిర్వాణమును జెందినవాఁడగును. జప-తప - స్వాధ్యాయ నిరతుఁడై తపసి యెట్లు దేహేంద్రియప్రపంచము మరచి జీవన్ముక్తుఁడై ముముక్షుత్వము నొంది పరమాత్మతో నైక్యమగునో యట్లే విభావానుభావాదికముల ప్రస్తారమువలనను మననమువలనను రసము వైవిధ్యమును, ద్వైతభావమును, వీడి యేకత్వము నొంది స్థాయీభావరూపమున సిద్ధినొందినదగును. కావున రససిద్ధిని సూచించు నీస్థాయీభావప్రశంసయే రసస్వరూపచర్చకు మిక్కిలి యవసరము. స్థాయీభావతత్త్వము బాగుగ గ్రహించినవారికి రసస్వరూపము గోచరించును. స్థాయీభావమే రసముగ మనలాక్షణికు లన్వయించి వ్యవహరించుటకుఁ గల రహస్యకారణ మిదియేయని గ్రహింపఁదగును.

## స్థాయీభావ మనఁగ నేమి ?

స్థాయీభావమన స్థూలముగఁ జెప్పినచో స్థాయినొందిన భావమనియే. స్థాయి యనఁగ నిలుకడ యని యర్థము. తిరముగ పాఁతుకొనియుండుభావమే స్థాయీభావ మగును. మానవుని కనేకభావములు జనించినను నేదే నొక్కభావమే ప్రాధాన్యము వహించి మిగిలినవానిని నడపుచు మనమునఁ జిరస్థాయి నంది

యుండును. అదియే జీవసూత్ర మనఁజెల్లును. ముందుగ భావ మన నేమో పిమ్మట స్థాయీభావమన నేమో, స్థాయీభావమే యెట్లు రసమునకు సిద్ధియగునో విచారింతము.

భావమును లాక్షణికు లీక్రిందివిధమున నిర్వచించిరి: "సుఖదుఃఖాదికై ర్భావై ర్భావ స్తద్భావభావనమ్." "దృష్టికి గోచరములగువస్తువులదర్శనమువలన జనించిన సుఖదుఃఖాది భావములచే హృదయావేశమునొందు నవస్థయే భావమగును. ఇయ్యది భావన, వాసన యనుపదములనుండి జనించినది. ఇతర వస్తువులకున్నై తమునువాసననొసఁగుభావమేయిచటగ్రాహ్యము" దీనితాత్పర్య మిట్లు చెప్పఁదగును. కన్నులకు గోచరించువస్తువులదర్శనమువలన మానవునకు సంతోషముగాని, దుఃఖముగాని జనించును. అట్లు జనించిన సుఖముగాని దుఃఖముగాని హృదయము నావేశించినచో నయ్యదియే భావమగును. అట్టి భావావేశమునవలన మిగిలిన వస్తుజాలమంతయు భావానుగుణ మగురూపమును దాల్చును. అదియే భావన. అట్టిభావనయొక్క విజృంభణమే భావనాశక్తి యనఁబరగును. అట్టిభావనాబల మునఁ గవి కావ్యనిర్మాణముఁ గావించి ప్రకృతియందునను మానవజీవితమునందలి వివిధావస్థలయందునను సౌందర్యమును బ్రదర్శించి స్వయముగ నానందము ననుభవించి యితరుల నానందము ననుభవింపఁ జేయును. భావనాశక్తిప్రశంస యింకొకచో విరళముగఁ జేయుదము. ప్రకృతము భావమునకును, రసమునకును గలసంబంధమును విచారింతము.

## రసజన్మకారణము భావానుభవమే.

భావానుభవమే రసజన్మకారణమని యిదివఱకే తెలిసికొంటిమి. అట్టిభావానుభవమే వివిధప్రస్తారభేదములనొంది తుదకు స్థాయీభావముగఁ బరిణమించి సిద్ధిఁ బడయునేని ప్రకృతము హెచ్చరికఁ గావించుచున్నాను. కావున స్థాయీభావము సిద్ధించుటకుఁ బ్రథమమున నిసర్గతైక్ష్ణ్యముగల భావానుభూతి కారణముగ జనింపవలెను. అట్టిభావానుభూతి యకారణముగ జనించునని తెల్పియుంటిమి. అట్టి యకారణజనిత భావానుభూతిఁ గవియొక్క జన్మాంతరలబ్ధసంస్కారబలమే యాధారమును, కారణమును నగునని తెల్పితిమి. కవియొక్క చిత్తసంస్కారమునకుఁ బరమేశ్వరుని యవ్యాజకరుణయే మూలకారణము. అట్టిజన్మప్రకారమునే వైదికద్రష్టలు సదనాద్రితస్యమ్మనుపలుకులను, నాలంకారికులు అలౌకిక యనువిశేషణమునను సూచించిరి. సూచితమాత్రపూర్వములగు నీవిషయముల సవిమర్శముగఁ జర్చింతము.

## భావోదయమునకు జన్మాంతరసంచితచిత్త సంస్కారమే కారణము.

భావోదయమునకుఁ గారణమేమి? అకారణముగ భావోదయ మగుననియు, జన్మాంతరలబ్ధమగు చిత్తసంస్కారమే యందుకు మూలకారణ మనియు సూచింపఁబడినది. ఈభావమే యాక్రింపద్యములను ధ్వనించుచున్నది.

### ప్రేమకారణము.

కారణం బేమనందునో కాంత, నీదు
ముద్దుమోమందమో లేక, మోహపార

వశత నిటునటు చలియించు వాలుఁగనుల
యందమో, కెంపుఁబెదవులసందునుంచి
తొంగిచూచుచు వెంటనే తొలఁగి లోని
కేఁగుచును మోముసీమపై నిచట నచట
మెఱపు మెఱపించు మవ్వంపుచిఱునగవుల
చందమో, లేక ముంగురులంద మౌనొ?
ప్రేమకు న్గల్గు కారణం బేమనఁగల
మింతిరో! నిన్నుఁ జూడఁ బ్రేమించుటె చుమి!
ఇంతియే కాని వేఱ్వేర నెంచిచూచి
యందఁపుఁదళుక్కులనె ప్రేమ నందఁగలనె?
తెలియ మాత్మను నాత్మను గలిపి కుట్టు
దారమే నాదుప్రేమకుఁ గారణమ్ము.

పైన నుదహరింపఁబడినపద్యములఁ బ్రేమకారణ మరయుటకుఁ గవి ప్రయత్నించినాఁడు. "ముద్దుమోమందము" కాదు. "మోహాపారవశ్యమున నిటునటు చలియించు వాలుఁగనుల యందము" కాదు. "కెంపుఁబెదవులసందునుండి తొంగిచూచుచు వెంటనే తొలఁగి లోనికేఁగుచును మోముసీమపై నిచటనచట మెఱపుమెఱపించు మవ్వంపుచిఱునగవుల చందముఁ" గాదు. "ముంగురులందము"ను గాదు. మఱి ప్రేమకుఁ గారణ మేమనఁ దగును? ఇంతిని జూచుటయే ప్రేమించుట. అనఁగఁ జూచుట తోడనే ప్రేమించి తీఱవలె ననుటయే. ఇంతియే కాని వేఱ్వేర నెంచి చూచి యందఁపుఁదళుక్కులనె ప్రేమనందుట సంభవించునే? మఱి ప్రేమకుఁ గారణమేమి? "ఆత్మను ఆత్మను కలిపికుట్టు దారమే" ప్రేమకుఁ గారణమ్ము. అనఁగ జన్మాంతరలబ్ధచిత్త

సంస్కారబలమున నాత్మకును వేఱొకయాత్మకును సంబంధ మేర్పడును. ఆసంబంధమువలననే ప్రేమ జనించునని సూచింపఁ బడినది. ఆత్మకు నాత్మకుఁ గలయనిర్వాచ్యమును నకారణ జనితమును నగు సంబంధమే ప్రేమకుఁ గారణ మగునను భావము పరిస్ఫుటమగుచున్నది. కావున భావానుభూతికి జన్మాంతరలబ్ధమగు చిత్తసంస్కారమే కారణమనియు, బాహ్యకారణములు సూచింపఁ బ్రయత్నించుట యప్రధానవిషయము నాధారముగఁ గొనుటయే యనియు స్థిరమగుచున్నది.

## స్థాయీభావము-ఆలంకారికనిర్వచనములు.

ఆకారణజనితమగు నీభావానుభూతియే వివిధావస్థల ననుభవించి విభావాదికముల పరామర్శనొంది స్థాయీభావము నొందునని తెల్పియుంటిమి. అట్టిస్థాయీభావతత్త్వమును బరిశీలింతము. ముందు స్థాయీభావమునకు లాక్షణికు లొసంగిన నిర్వచనములఁ బరిశీలించి, పిమ్మట సోదాహరణముగ దాని తత్త్వముఁ జర్చించి, రసస్వరూపము నిరూపింతము. సుప్రసిద్ధ నిర్వచనముల రెండిటి నుదాహరించెదను:—

విరుద్ధై రవిరుద్ధైర్వా భావై ర్విచ్ఛిద్యతే న యః
ఆత్మభావం నయత్యన్యాన్స స్థాయీ లవణాకరః,
సజాతీయై ర్విజాతీయైరతిరస్కృతమూర్తిమాన్,
యావద్రసం వర్తమానః స్థాయీభావ ఉదాహృతః.

(రసగంగాధరము.)

పై రెండు నిర్వచనములలో మొదటిది రసవత్తరముగను, భావగంభీరముగను నున్నది; రెండవది వ్యాఖ్యానరూపముగ నున్నది. మొదటినిర్వచనమున స్థాయీభావము లవణా

కర మనఁగా సముద్రముతోఁ బోల్చఁబడినది. **సముద్రమివ గాంభీర్యే** యని రామాయణమునఁ జెప్పఁబడినట్లు స్థాయీ భావము గంభీరమైనది. అంభోనిధి యింకునంతటిస్థితి యసంభవముకదా? ఆకల్పాంతము నంభోనిధి చిరస్థాయిగ నుండవలసినదేకదా? కావున స్థాయీభావముయొక్క స్థిరత్వము సూచితమగుచున్నది. ఎన్నినదులు వచ్చి కలసినను, నెన్నినదులెండిపోయి కలియకపోయినను సముద్రముమాత్ర మచలమై యుండునట్లే స్థాయీభావముఁగూడ విభావాదుల పరామర్శ యున్నను లేకపోయినను గూడ నచలమై యుండునని స్ఫురించుచున్నది. ఎట్టియమృతమువంటి నీరైనను సముద్రములోఁ బడినంతనే యుప్పనగురీతిని నెట్టివిరుద్ధములగు వ్యభిచార భావములైనను స్థాయిభావమునకు వశములై దానిలో లీనములై దానియొక్క స్వరూపమునే పొందును. నిర్వచనము యొక్క యర్థమును విచారింతము. "విరుద్ధములును, అవిరుద్ధములును నగు భావములచే నిరోధింపఁబడకను భేదింపఁబడకను సర్వమును నాత్మభావపూరితముగ ననఁగా సర్వమును దనయొక్క రూపమునే తాల్చునట్లుగాఁ జేయునదియు, లవణాకరునిఁ బోలినట్టిదియు నగుభావమే స్థాయిభావ మనఁదగును." నిర్వచనమున స్థాయిభావముయొక్క యచలత్వమును, సర్వవశీకరణ, సర్వభక్షణశక్తియు విశదీకరింపఁబడినవి.

### లవణాకరోపమయొక్కసార్థకతయు సందర్భశుద్ధియు.

లవణాకరోపమానమువలన స్థాయీభావముయొక్క గాంభీర్యమును, నాకల్పాంతస్థాయిత్వమును ధ్వనించుచున్నవి.

సకలచరాచరసృష్టికిఁ బూర్వము జలముమాత్రమే నిండియుం డెను. సకలప్రపంచమును లయమైనపిదప మహాప్రళయరూప మున జలమే నిండియుండును. సృష్టియొక్క యాద్యంతములు జలములోననే సంభవించుచున్నవి. అట్లే రసము జనించునప్పుడు ననఁగా విభావాదిగుణవిశేషములతో నొప్పురసజగత్తు కవిచే సృష్టింపఁబడక పూర్వమును, రసజగత్తు అంతమై లీనమైపోవు నప్పుడును స్థాయీభావమే మిగిలియుండుననుభావము స్ఫురించు చున్నది. రసజన్మప్రకారమును రససిద్ధి ప్రకారమును సూచి తము లగుచున్నవి. అగాధమగు సముద్రమునకు లోఁతెట్లు తెలియదో యట్లే స్థాయీభావముయొక్క లోఁతును నగాధత్వ మును దెలియఁజాలము. సముద్రగర్భమున నడఁగియుండు ముత్యములకును, రత్నములకును నెట్లు విలువ నేర్పఱిపఁ జాలమో యట్లే స్థాయీభావమువలనజనించు నపూర్వసౌందర్య యుతములగు విభావాదికములరుచినిగూడ నింతయని నిర్ణయిం పఁజాలము. భూమిపైనఁబలె సముద్రమునందుఁగూడ ననేక ములగు జీవరాసు లెట్లు జీవించునో, యట్లే రసజగత్తుకూడ బాహ్యప్రపంచమునకు సరిసమానముగఁ దులఁదూగున ట్లుండు ననియు, రసజగత్తునందునను వింత ప్రకృతులును ననేకములగు జీవరాసులును బ్రభవిల్లుచుండుననియు సూచింపఁబడినది. పంచ భూతాత్మకమగు నీప్రపంచమున, ననఁగ పృథివ్యాప స్తేజో వాయు రాకాశయుతమగు నీసృష్టియందు జలరూపమగుసము ద్రమున కెంత ప్రాముఖ్యము కలదో యట్లే ధర్మార్థకామమోక్ష సంయుతమగు మానవధర్మమున రసమునకుఁ బ్రాముఖ్యము కలదని సూచితమగుచున్నది. "ఉప్పే పస రుచులకెల్ల" నను లోకసామ్యమునంది సకలరుచులకెల్లను నాధారమును, నాస్పద

మును నగు లవణమునకు మానవజీవితమున కెంతయవసరము కలదో అట్లే మానవజీవితమును రసవంతముగను నానంద మయముగను నొనరించు రసమునకు మానవజీవితమునందుఁ గలయావశ్యకము వ్యక్తమగుచున్నది. సముద్రనాదమును, సముద్రదర్శనమును నెట్లలౌకికభావానుభూతిని, అలౌకి కానందమును జనింపఁజేయునో అట్లే రసస్పర్శయు రసాను భూతియు నలౌకికానందమును నలౌకికభావానుభవమును జనింపఁజేయును. ప్రపంచమునందలి వివిధదేశములకు సముద్ర మెట్లు రాకపోకలఁ గల్పించి సంబంధము గలిగించునో అట్లే రసము, అనఁగ రసభావమే రాజకీయవిద్వేషములచే విచ్ఛిన్న మైన మానవజాతి నేకసూత్రబద్ధముఁ గావించి, టెన్నిసన్ అనునాంగ్లేయకవియు, గురుజాడ అప్పారావుగారును నీక్రింది పద్యముల సూచించినట్లు మానవజాతియం దైక్యభావము పెంపొందించి మానవకళ్యాణమునకుఁ దోడ్పడుననుభావము సూచితమగుచున్నది.

"A commonwealth of nations and federation of worlds" ("జాతులసంఘమును లోకముల సమ్మేళనమును" నని పై మాటల యర్థము.)

మూడు మునుముందు మేటివారల
మాటలనియెడు మంత్రమహిమను
జాతిబంధములన్న గొలుసులు
జారి సంపద లుబ్బెడున్.
ఎల్లలోకము నొక్కయిల్లై వర్ణభేదము లెల్లకల్లై
వేలనెఱుఁగని ప్రేమబంధము వేడుకలు కురియు.
ఆంధ్రకవిత్వ—రి

మతములన్నియు మాసిపోవును
జ్ఞాన మొక్కటి నిలిచి వెలుఁగును
అంత స్వర్గసుఖంబు లన్నవి
యవని విలసిల్లున్

సూత్రప్రాయముగ నున్న మొదటినిర్వచనమున నంతర్గర్భిత ములుగనున్న భావములను గొన్నింటిని సూచింపఁగల్గితిని. మిగిలినభావములు విశిష్టసంస్కారులకు గోచరింపకపోవు.

పండితరాయల నిర్వచనము.

ఇఁక వ్యాఖ్యానరూపముననున్న పండితరాయల నిర్వచనమును గొంచెము పరిశీలింతము. "సజాతీయములును విజాతీయములును నగుభావములచే మార్పుఁజెందని మూర్తిగలదియు, రసమునంతయు ప్రదర్శించునట్టిదియు నగుభావమే స్థాయీభావమని చెప్పఁబడినది'' ఈనిర్వచనమునందలి "సజాతీయవిజాతీయ" అనుపదములు మొదటినిర్వచనమునందలి "విరుద్ధైరవిరుద్ధైః" అనుపదములయర్థమునే యొసఁగుచున్నవి. ప్రధానభావము తదనుగుణములును విరుద్ధములును నగు భావములచే మార్పునొందక రసమును సర్వమును ప్రదర్శించు ననియే పండితరాయల నిర్వచనముయొక్క యర్థము. మొదటి నిర్వచనమునందలి "ఆత్మభావం నయత్యన్యాన్" అనుభావమును, లవణాకరునితోటి సామ్యత్వమును భావగాంభీర్యమును బండితరాయలనిర్వచనమునఁ గానరావు.

స్థాయీభావమే రసము.

కావున స్థాయీభావమునకుఁ బ్రధానలక్షణము విభావాదికముచేతను విరుద్ధములగు సంచారీవ్యభిచారాదిభావముల

చేతను విచ్ఛిత్తినొందక, యచలమై చిరస్థాయియై, సర్వభావములను నాత్మరూపమును దాల్చునట్లుగఁ జేసి వాని యన్నిఁటికిని స్వకీయవాసన నొసఁగుననుటయే. ఇట్టిస్థాయీభావమే రసమగునని మనలాక్షణికులు నిర్వచించి దానికే 'ప్రధాన అంగి' యనునామాంతరముల నొసఁగియున్నారు. రసముయొక్క యాశ్రయమునుగూర్చియు, వానియొక్క యనంతవైవిధ్యమునుగూర్చియు, వేఱొకచో ముచ్చటింతము. ముందు రసస్వరూపము మనలాక్షణికులు నిర్వచించినప్రకారము తెలియంజెప్పెదను. రసము లన్నింటిలో మనవారు శృంగారరసమునే యెక్కువ విపులముగఁ జర్చించియున్నారు.

## రసముయొక్క బాహ్యస్వరూపము. "స్వాద" నిర్వచనము.

మనలాక్షణికులు రసముయొక్క బాహ్యస్వరూపమును నిరూపించు సందర్భమున,

"స్వాదః కావ్యార్థసంభేదాదాత్మానందసముద్భవః" అను సూత్రమును గావించినారు. వీనికి "కావ్యార్థేన విభావాదిసంసృష్టిస్థాయ్యాత్మకేన భావకచేతసః సంభేదే ప్రత్యస్తమితస్వపరవిభాగే సతి ప్రబలతర స్వానందోద్భూతి స్స్వాదః" అను వ్యాఖ్యానము గావింపఁబడినది. ఈసూత్రవ్యాఖ్యానముల రెండింటివలన వ్యక్తమయినభావము లేవనః—

స్థాయీభావమునకు విభావాదికమును గలిగినకావ్యమునందు వర్ణితములయిన వస్తువులతో మనసు పూర్ణముగ స్వపరభేదము లేకుండ లగ్నమగుటవలన జనించు ప్రబలతరస్వానందానుభూతియే స్వాదము. కావ్యమునందు స్థాయి సంచారీ

వ్యభిచారిభావములు ప్రదర్శింపంబడును. అనేకవస్తువులు వర్ణింపఁబడును. అట్లు వర్ణింపంబడినవస్తువులయందుఁ గవియొక్క మనస్సు లగ్నమయినప్పు డనఁగాఁ గవి నేను, ననుభావమును వీడి వర్ణించువస్తువునందే లక్ష్యముంచి యహామును వీడివస్తువునందు లీనమయిపోవునపుడు తత్ఫలితముగఁ గవికిఁ బ్రబలతరానందము జనించితీరును. అట్టియానందమునే మనలాక్షణికులు స్వాదమని నిర్వచించిరి. స్వాదమనఁగా స్థూలముగఁ జెప్పిన రసపారవశ్యమే!

### స్వాదముయొక్క జన్మప్రకారము.

ఇంతవఱకు మనలాక్షణికులు చెప్పినది సరిగ నున్నది. కాని, వివాదమున కవకాశ మీక్రిందివిషయమునఁ గలుగుచున్నది. అదెద్దియన?

ఈస్వాదము ప్రప్రథమమునఁ గవి వస్తువును సందర్శించుటతోడనే కలుగునా? లేక విభావానుభావాదికముగల వర్ణనానంతరమునఁ దత్ఫలితముగఁ జనించునా? ఈప్రశ్నముయొక్క భావము విప్పిచెప్పిన నిట్లుండును. కవి రసపారవశ్యమును ననఁగా స్వాదము ననుభవించి కావ్యరచనకుఁ గడఁగునా? లేక యూరక కావ్యాలాపముఁ గావించి 'తీయఁగా తీయఁగా రాగమును, మూలుగంగా మూలుగంగా రోగమును' నన్నట్లు దుదకు స్వాదమును ననుభవించునా ? అనియే. ఈ ప్రశ్నకు సమాధానము రసజన్మప్రకారమును సూచించు సందర్భమున నిరూపించియుంటిమి. కవి సాక్షాద్ద్రష్ట. అట్టిసాక్షాత్కారమును దివ్యదృష్టియును లేనికవి యుత్తమకావ్యముల రచింపనేరఁడు. కావ్యనిర్మాణశక్తి యనఁగా రసాస్వాదనశక్తి

జన్మాంతరలబ్ధచిత్తపరిపాకము ననుసరించి కవికి లభ్యము గావల యునేకాని యూరక సాక్షాత్కారబలము లేక దివ్యదృష్టి లేక గ్రంథపఠనమును నలంకారశాస్త్రపఠనమును గావించినంత మాత్రమున రాదు. స్వాదమనునది. హృదయసంబంధవిశేషమే కాని యూహావిశేషము గాదు. స్వాద మెప్పుడును ననుభవ నీయమేకాని నిర్వచనీయమును సిద్ధాంతీకరింపఁదగినదియును గాదు. స్వాదమునకును వివిధాంశములును, వివిధాంతరము లును గలవు. కాని, నిసర్గముగ స్వాద మకారణజనితము. జన్మాంతరసంచిత చిత్తసంస్కారముచేఁ బరిపక్వమయిన కవి హృదయము వస్తువులసందర్శించినప్పుడు స్వాదము జనించును. అట్లు జనించిన స్వాదమే వివిధావస్థల నొంది స్థాయీభావ రూపమున సిద్ధినొందుననియే మామతము.

{ రసమునకు జన్మకారణములు. ౧. రసికుని చిత్తపరిపాకము ౨. వస్తుసందర్శనము. }

రసస్వరూపనిర్ణయముఁ గావించుటయందు రసము యొక్క జన్మప్రకారమును, వృద్ధియు, సిద్ధియుఁ,జర్చనీయములు. జన్మప్రకారము అనఁగా—జన్మకారణము—రసికునియొక్క జన్మాంతరలబ్ధచిత్తపరిపాకమే. అనఁగాఁ గవియొక్క జన్మాంతర లబ్ధచిత్తపరిపాకమువలన వస్తుదర్శనానంతర ముద్భవించు స్వాదమే యగును. రసము వస్తుదర్శనానంతర ముద్భవింపవలసి నదే కాని శూన్యత నాశ్రయింపదని మున్నే యెఱింగించియుంటి. ప్రపంచమునందలి వివిధరసప్రవృత్తులకెల్ల వస్తుసందర్శనమే ప్రధానాశ్రయము. అట్టివస్తుసందర్శనము జన్మాంతరలబ్ధచిత్త పరిపాకము గలిగిన కవిమనమున స్వాద ముదయింపఁజేసి

మెఱపు మెఱసినట్లు భావమును జనింపంజేసి కవిని స్తంభితుని గావించి యేఁగును. ఈభావము మనలాక్షణికులకన్న పాశ్చాత్యలాక్షణికులు స్థూలముగను, నరవిందఘోషు సూక్ష్మముగను జర్చించినారు. రసప్రవృత్తికి నకారణజనితస్వాదమే కారణమని మనవారు గ్రహించినట్లు స్పష్టముగఁ దోఁచుటలేదు. మనవా రెంతవఱకును నవస్థాదికమున భావము పరిపక్వము నొంది తుదకు స్థాయీభావముగఁ బరిణమించునని తెలుపుచున్నారు మామతమున, రసము చిత్తపరిపాకము ననుసరించి రససందర్శనానంతరమున జనించి పర్యాలోచన మనఁదగు విభావానుభావాది వివిధావస్థల యనుభూతి వలన స్థాయిత్వము నొందుననియే? రసమునకుఁ గారణ మాధ్యాత్మికముగాని, భౌతికము గాదు. ఎట్లనఁ: గవికిఁ జిత్త సంస్కారమే ప్రధానగుణ మగుటచే నది లేనివారికి రసానుభూతి యసంభవమగును. కనుక, జన్మాంతరసంస్కారముఁ గలవాఁడయ్యు భౌతికవస్తువు నాధారముగఁగొని తనజన్మాంతర సంస్కారవాసన నావస్తువున కొసఁగి తద్భావనావిశేషమున స్వాదమును ననఁగా నపరిమితానందమును బొందినవాఁ డగును. ఈమతముయొక్క సిద్ధాంతముప్రకారము. వస్తువులలో నిసర్గముగ దుర్గుణము లుండవనియు, నట్టిదుర్గుణములకుఁ గారణము కవియొక్క జన్మాంతరసంస్కారాభావత్వమే యనియు స్పష్టమగుచున్నది. ప్రకృతియందలి సర్వవస్తువులును స్వాదము నొసంగఁగలుగును కాని—యట్టిస్వాదము సంస్కారికిమాత్రమే జనించును. అట్టిస్వాదము సంస్కారముగలిగిన కవికి నెట్టి వస్తువువలననైనను గలుగును. స్వాదము హృదయానుభూతమే కాని వేఱుగాదు. అనుభవించువానికిఁ జిత్తసంస్కారమువలన

నేవస్తువునందు మనంబు లగ్నంబగునో యావస్తువే స్వాద మునకు బాహ్యాశ్రయ మగును. అనఁగాఁ బైకి నావస్తువే స్వాదము జనింపఁజేయునట్లు దోఁచును. నిజమరసికుఁ గవి యొక్క సంస్కారవాసనయే వస్తువునకు స్వాదజనకత్వము నాపాదించును. ఎట్లనఁ: బూవుయొక్కపరిమళము చేఁ జుట్టునున్న ప్రదేశమంతయు సువాసిత మగునటుల; ఈభావమే 'తాను మునిఁగినది గంగ—తా వలచినది రంభ; తనచావు జగము గ్రుంగుట' యనులోకోక్తుల వ్యక్తమగుచున్నది. ఈభావ మునే విక్టర్ హ్యూగో యనుఫ్రెంచికవీశ్వరుఁ డీక్రింది వాక్యమున వివరించెను.

["There is no forbidden fruit in the beautiful garden of Poesy." (Victor Hugo.)]

(సుందరతరకవితోద్యానమున వర్జనీయమగు ఫల మొక్కటియు లేదనియు సర్వఫలములును రుచికరములును నవశ్యగ్రహణీయములును:) అని పైమాటలయర్థము. ప్రతి వస్తువును నిసర్గముగ నేదోయొకగుణవిశేషమును గలిగియుం డును. అట్టిగుణవిశేషము నాస్వాదించి వ్యక్తముఁజేయువాఁడే కవియగును. అట్టికవి దనశక్తిచే నెట్టివస్తువునయినను రసదృ ష్టితో నవలోకించి తత్ఫలితముగ రసాస్వాదమును ననుభవించు ననియే పైవాక్యముయొక్క భావము. కావున నింతవఱకుఁ దేల్చిన దేమనఁగా రసమునకు జన్మకారణము(రసికుని)జన్మాంతర సంస్కారమువల్లను, వస్తుదర్శనమువల్లను, ఫలితముగ జనించు స్వాదమే యని. వాని యొక్క సంసర్గమువలన హాతాత్సంభవ మగు నలౌకికానందమే స్వాదమగు. అట్టిస్వాదమే రసజన్మ కారణ మగును.

### రసవృద్ధిప్రకారము-అవస్థాక్రమముయొక్క ప్రశంస.

ఇఁక రసముయొక్క వృద్ధిని గొంచెము విచారింతము: మనలాక్షణికులు విభావానుభావాదులే రసముయొక్క వృద్ధిని సూచించునవి యని కొంచె మించుమించుగఁ దెల్పియే యున్నారు. అట్లు దెల్పినవారిలో ముఖ్యుఁడగు నభినవగుప్త పాదాచార్యుని యభిప్రాయము నిదివఱకే చర్చించియుంటిని. విభావాదికప్రశంస గాక, రసముయొక్క వృద్ధినిగూర్చిన ప్రశంస యలంకారశాస్త్రమునఁ గొన్నికొన్నిసందర్భములఁ జేయఁబడినది. శృంగారరసముయొక్క దశావస్థల నిరూపణము యిందులకుఁ దార్కాణము.

### శృంగారరసముయొక్క దశావస్థలు.

శ్లో. "దశావస్థస్స తత్రాదావభిలాషోఽథ చింతనమ్,
స్మృతిర్గుణకథోద్వేగప్రలాపోన్మాదసంజ్వరాః;
జడతా మరణం చేతి దురవస్థం యథోత్తరమ్"
దృజ్-మనస్సంగ-సంకల్ప-జాగరాః, కృశతా, రతిః,
హ్రీత్యా-గోన్మాద-మూ-ర్ఛాంతా ఇత్యనంగదశా దశ"

ఆదియందు నభిలాషము, పిమ్మట చింతనము, పిమ్మట స్మృతి, గుణవర్ణనము, నుద్వేగముఁ, బ్రలాపము, నున్మాదము, జ్వరార్తి, జడత, మరణము; అనుదశావస్థలు శృంగారరసవిషయమునఁ జెప్పఁబడినవి.

చూచుట, మనస్సాంగత్యము,సంకల్పము, (అభిలాషము) జాగరము (అనఁగాఁజింతనము,) కృశించుట, ఆసక్తి, సిగ్గువిడు

చుట, పిచ్చి, మూర్ఛ, మరణము;—అనియు నింకొకరినిర్వచన మునఁ జెప్పంబడియె.

రెండునిర్వచనములును నేకార్థప్రతిపాదకము లేకాని, రెండవనిర్వచనమున దృక్ అనుపదమున భౌతికవస్తువును భూతి స్ఫుటముగ వచింపఁబడినది. మొదటినిర్వచనమున నభిలాషమనుపదమున ధ్వనిమాత్రముగ నున్నది. ఈయవస్థల క్రమముఁ దప్పకుండఁ గాదంబరీకర్తయగు భట్టబాణుఁడు వర్ణించినాఁడు. ఈయవస్థలు క్రమముగ సంభవించునా? లేక పాత్రముయొక్క స్వభావమును శక్తిని ననుసరించి కొన్ని మాత్రమే యనుభవింపఁబడునా? అనునది వివాదాంశము.

## రసముయొక్క యవస్థల వర్ణించుటలోఁ గవి సర్వస్వతంత్రుఁడు.

కావ్యమున నెప్పుడును రసప్రవృత్తియే ప్రధానలక్షణముగ గణింపఁదగినది. అట్టి రసప్రవృత్తి కవియొక్క చిత్తపరిపాకమును, చిత్తవృత్తులను ననుసరించునే కాని యొక నియమము ప్రకారము వృద్ధినొందనేరదు. అనఁగాఁ గవి తాను వర్ణింపఁదలఁచుకొన్న విషయము రసోచితముగ నుండుటకుఁ బాత్రములకు నేయేయవస్థలఁ గల్పింపఁదగునో, యేయేయవస్థల ననుభవింపఁ జేయఁదగదో స్వబుద్ధిబలమున యోచించి వర్ణించును. ఎట్లనఁగా నుపాధ్యాయుఁడు విద్యార్థులకుఁ బాఠములు చెప్పునప్పుడు విద్యార్థుల తెలివితేఁటల ననుసరించి కొందఱ కొక్కొక్క గ్రంథమునందుఁ గొన్ని యధ్యాయములు మాత్రమే చెప్పి మఱియొక్క పుస్తకమును బ్రారంభించును. కొందఱకు వరుస దప్పకుండ గ్రంథమాదినుండి తుదివఱకు బోధించును. తెలివిగల

విద్యార్థి గ్రంథమున నొకటిరెండధ్యాయములు సదువఁగనే పొత్తములోని సారమును గ్రహించి మిగిలినభాగములను దనంతటఁ దానే చదువుకొని యన్వయించుకొనఁగలఁడు. మందమతియగు విద్యార్థి గురువునకును, దనకును గంతశోష జనించునట్లుగ నుపాధ్యాయునిచే గ్రంథము సర్వముం జెప్పించుకొనును. కొందఱుపిల్లలేఁడాదిలోపల మందమతులు నాల్గేండ్లు సదువుచదువును ముగించి పైతరగతులకుం బోవ నర్హులై యుందురు. కొందఱు మందమతులు సంవత్సరమున కొకతరగతిచొప్పునఁ జదువుచు జీవితకాలమున సగము చదువుతోనే గడపెదరు. కొంద ఱొకసారి చెప్పఁగనే గ్రహించు నేకసంథాగ్రాహులు. కొంద ఱెన్నిమాఱులు చెప్పినను బాఠము రాని వారు గలరు. ఉపాధ్యాయుఁ డిట్టి వివిధాంశములుగలబాలుర బుద్ధిబలమును గ్రహించి యెవరికనుకూలమగురీతి వారికిఁ బాఠములు చెప్పి విద్యయం దుత్తీర్ణులఁగావించు.

**రసముయొక్క దశావస్థాక్రమమునకుఁ బాత్రల యధికారము ననుసరించి ప్రసక్తి కలుగును.**

అట్లే కొందఱు పాత్రములు చూచుటతోడనే భావోద్రేకము నొంది రసపారవశ్యము జెందుదురు. మఱికొందఱు చూచినతోడనే భావోద్రేకము నొందక యేదోయొకరీతిని జీవితము నెగ్గించుచు వివిధావస్థల నొంది తుదకు రసస్పర్శ ననుభవించినవారుం గలరు. పూర్వకాలపు టమాయకులందు భావోద్రేకముగాని రసపారవశ్యముగాని యేమాత్రము ననుభవింపక గతానుగతికములగు లోకమర్యాదల ననుసరించి జీవితముఁ గడపుచు నే యొడిదొడుకులును ననుభవింపక స్వ

స్వరూపమును స్వవిషయమును స్వాత్మోపలబ్ధియు గ్రహింపని వారై జీవితములఁ జాలించువా రెందఱనుగూర్చి మనము వినియుండలేదు? ఈభావమునే వర్డ్స్వర్త్ అనునొకయాంగ్లేయ కవి మైకల్ అనుకావ్యమున వృద్ధులగు గొల్లదంపతులజీవితమును వర్ణించుచు వారియనురాగమును బ్రశంసించుచు క్రిందివిధమున వ్రాసెను.

"Thus, living on through such a length of years,
The shepherd if he loved himself, must needs
Have loved his helpmate."

(అనఁగా నన్నియేండ్లు కాఁపురముఁజేసినవాఁడగుటచే మైకేలు తనపెండ్లమును బ్రేమించియే యుండవచ్చును. తన్నుఁదాను బ్రేమించుకొన్నయెడలఁ దనపెండ్లమునుగూడఁ బ్రేమించియే యుండును. అని పైమాటలభావము.)

మనపెద్దలకాలమున నిప్పటిభావోద్రేకమును నిప్పటి రసావేశమును దక్కువగనే యుండెను. ఇప్పటికాలముననో యువతీయువకులు అవాచుప్వులఁ బోలె భావోద్రేకమున జివ్వునఁ బైకెగయుచుందురు. చూచుటతోడనే రసావేశము ననుభవించు ప్రణయినులు నేఁటికాలమునఁ జాలమంది గలరు. అట్టిరసహృదయులకుఁ జూచుటయు, భావానుభూతి నొందుటయు, రసపారవశ్యము నందుటయుఁగూడ నేకక్షణజనితములే యగును. వారికి మనయాలంకారికు లుపదేశించిన దశావస్థల యనుభూతి క్రమాంతరముగ లభియింప నక్కఱలేదు. దశావస్థలయంత్యపరిణామ మనఁదగు రసపారవశ్యమును రససిద్ధియు నేకక్షణముననే లభ్యమగును. అందుఁలకనియే కవి పాత్రములయొక్క శక్తులను, చిత్తవృత్తులను, చిత్తసంస్కార

ములను లక్ష్యమున నుంచుకొని దశావస్థలలోఁ దగినవానిని ననుభవించునట్లు చేయఁదగును. సింహమునకు మృగరాజు శీవియు, మత్తేభహననశక్తియు నేయవస్థాదికమును గ్రమాంతరముగ ననుభవించుటచేఁ గలిగెను. మత్తేభమును జూచిన తోడనే కుంభస్థలము పైకుటికి దానిని జీల్చి యందలిమాంసమును భుజించుగుణము సింహమునకుఁ బుట్టుకతోడనే జనించును. ఈస్వభావమే 'పులిపిల్ల పులిపిల్లయే, మేఁకపిల్ల మేఁకపిల్లయే' అనులోకోక్తిఁ గన్నది. తోఁకఁ ద్రొక్కినతోడనే త్రాచుఁబాము కాటువేయునుగాని మానునా? తోఁకఁద్రొక్కిన మనుజుని గాటువేయఁ బ్రయత్నించుటకు నాగుఁబా మేయే యవస్థాదికక్రమము ననుభవించును? త్రొక్కుడుపడుటయుఁ గాటొందుటయు నేకని మేషజనితములే.

## అవస్థాక్రమ మవశ్యానుభవనీయము గాదు.

కావున నింతకును జెప్పవచ్చిన దేమనఁగా: జన్మాంతర సంస్కారము ననుసరించి జీవికి రససిద్ధి వివిధావస్థాక్రమము ననుభవింప నవసరము లేకయే జనించును. జన్మాంతరసంస్కారము లేనివారికి వివిధావస్థానుభవము రససిద్ధికిఁ గారణభూతమగుఁగాక! కావున నీయవస్థాక్రమమంతయు వివేచనాబలమునను, విమర్శనబలముననను దోఁచవలసిన దేకాని, కావ్యమున సంపూర్ణముగను నావశ్యకముగను వర్ణనీయముగాదు. రసానుభూతిలో మనలాక్షణికులు సూచించినయవస్థాక్రమ మంతర్గర్భితముగను, సూచితముగను నుండవచ్చును. కాని, రసానుభూతిమాత్రము తప్పనిసరిగ నీయవస్థాక్రమము తప్పకుండ ననుభవించితీఱవలయుననుట భ్రమప్రమాదము. పాశ్చాత్య

శాస్త్రజ్ఞులు దెల్పినట్లు జలమునందు ఆక్సిజన్, హైడ్రజన్ అను రెండువాయువులు కలిసియుండును. వేర్వేఱుగ ఆక్సిజన్ హైడ్రజనులఁ దయారుగావించి మిళితముఁజేసిన జల ముద్భవించును. ఇంతవఱకును శాస్త్రసమ్మతమే, కాని సృష్టికర్తయగు పరమేశ్వరుఁడు మొట్టమొదట ఆక్సిజన్ సృజియించి పిదప హైడ్రజనును సృజించి యా రెంటిని మిళితముఁజేసి జలమును సృజించెనని చెప్పఁ గలుగు బుద్ధిమంతుఁ డెవ్వఁడు నుండఁ డని మానమ్మకము.

ఈయవస్థాక్రమముయొక్క ప్రయోజనము తక్కువ యని నిరూపించుటకే యింతదీర్ఘప్రసంగముఁ గావింపవలసి వచ్చినది ఉత్తమపాత్రముల కెప్పుడును రససిద్ధి యతిశీఘ్రముగ లభ్యమగును. మధ్యమాధమప్రకృతులకు రాయఁగా రాయఁగా రాతియందు అఱవడిపడునట్లు వివిధావస్థల యనుభవమున నెన్నటికో యొకనాఁటికి రససిద్ధి కలుగునేమో ! అందుకనే మృకండమహర్షి యల్పాయుర్దాయుఁడైనను బ్రతిభాశాలియు జ్ఞానసిద్ధి సత్వరముగఁ బడయఁగలిగినసిద్ధుఁడును నగుకుమారు నే దయచేయుమనియు, దీర్ఘాయుష్మంతుఁడయ్యు జ్ఞానసిద్ధిని బడయఁ జాలని యల్పబుద్ధిని దయచేయవలవదనియుఁ బరమేశ్వరుని వేఁడుకొనెను. మహాకవులును గావ్యనిర్మాణమున నీసూత్రమునే గ్రహించి యవలంబించిరి. రోఁకటిపాటవలె దశావస్థలఁ గ్రమముఁ దప్పకుండ నొకదానివెంట నొకటిని నొక్కొక్క ప్రకరణమున నన్వయించుచుఁ గావ్యముల ననవసరముగఁ బెంచి నీరసస్థితికిఁ దోడ్పడలేదు. ఒక్క బాణుఁడుమాత్రము దశావస్థలను గ్రమము దప్పకుండ నేకకావ్యమున వర్ణించియున్నాఁడు. కాని, కాళిదాసాదిమహాకవులును దశావస్థలను సాంగోపాంగముగ

నొకేకావ్యమున వర్ణించుపద్ధతి నవలంబింపలేదు. కావ్యము అవస్థావిశేషవర్ణనముగ నుండవలయునుగాని యవస్థాసము దాయముగ నుండఁదగదు. అనఁగాఁ బాత్రముయొక్క స్వభావమునకును గుణములగు నవస్థావిశేషములను మాత్రమే కవి వర్ణించి పాత్రసంపోషణముఁ జేయవలయుఁగాని యూరక ప్రస్తుతపాఠశాలల విద్యార్థుల తరగతివారిచదువువలె వర్ణించుట తగదని మామతము.

## లాక్షణికులచే నుదహరింపఁబడిన అవస్థాక్రమముయొక్క ప్రయోజనము.

లాక్షణికు లాదేశించినరసావస్థాక్రమ మవశ్యవర్ణనీయము గాకపోయినను విమర్శకునకుఁ గొన్నివిశేషములను బోధింపఁ గలుగుచున్నది. రస మెప్పుడును సృష్టిస్థితిలయములను నవస్థాపరిణామభేదములను నందుచుండుననియే లాక్షణికుల యాదేశమునకు ముఖ్యోద్దేశమయి యుండును. రస మెప్పుడును బెల్లముఁగొట్టినరాయివలెఁ గుక్కుమిక్కుమని యూరకుండక సచేతనులగు మానవులయవస్థావిశేషముల ననుసరించి యవస్థాభేదముల నందుచుండునని మనము ముఖ్యముగ నేర్చుకొనవలసినవిషయము. రస మెప్పుడును నేకస్థాయిని నిల్చియుండదని యిదివఱకే తెలిపియుంటిని. ఆభావమునే ప్రస్తుత సందర్భమున నీక్రిందివిధముగఁ ద్రిప్పి చెప్పెదము. భావ మెప్పుడును నవస్థాభేదము నొందుచుండుననియు నట్టియవస్థాభేదములన్నియు ననుభవించు మానవుని యవస్థాభేదములను, చిత్తవృత్తులను ననుసరించుచు సంపూర్ణమగు చైతన్యము నొందుననియు గ్రహింపఁదగు. భావము జనించునపుడు నిశితముగను

తీక్ష్ణముగను జనించునని యిదివఱకే తెలిపియుంటిమి. అట్లు జనించినభావము మననాది వివిధప్రసక్తులం దవిలి వివిధావస్థల నొందుననియు నట్టివివిధావస్థలు విభావానుభావాదులచే సూచితము లగుననియు నిదివఱకే సూచించియుంటిని. సాధారణముగా మానవునిభావ మెట్లు జన్మించి వృద్ధినొంది సిద్ధిఁబొందునో సోదాహరణముగా నిరూపింపఁ బ్రయత్నింతును.

జన్మాంతరసంస్కారమువలన మానవుఁ డేదేని వస్తువును గాంచినతోడనే జన్మాంతరసంస్థితమగు నాత్మసంబంధమువలన నావస్తువునెడ మనసు తగిలినవాఁ డగును. అట్లు మనస్సు తగులుటకుఁ గారణము మున్ను దెల్పినట్లు అవ్యాజమును, నకారణజనితమునునగు నాత్మసంబంధమకాని వేఱుకాదు. ఇట్టి యాత్మసంబంధమునే కాళిదాసు శకుంతలాదుష్యంతుల ప్రణయసందర్భమున సూచించెను. దుష్యంతుఁడు వేఁటకై చని తపోవనముననున్న శకుంతలను గాంచి యామె వివాహితయో, యవివాహితయో క్షత్త్రియకన్యకయో, బ్రాహ్మణకన్యకయో, యెఱుంగక చూచుటతోడనే యామెయెడ బద్ధానురాగముఁ గలవాఁడయ్యెను. దుష్యంతుఁడు తనమనోవృత్తిని దానే వితర్కించుకొనుచు నీక్రిందిశ్లోకమునఁ జెప్పిన భావమే మాయభిప్రాయమున స్పష్టపడియున్నది.

శ్లో. అసంశయం క్షత్త్రపరిగ్రహక్షమా
యదార్యమస్యామభిలాషి మే మనః,
సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః.

(ఈకన్యక నిశ్చయముగా క్షత్త్రియుఁడ నగునాచేఁ బరిగ్రహింపఁబడఁదగినదే. నామనస్సు ఈమెపైఁ దగులుటయే యిందులకుఁ దార్కాణము. బుద్ధిమంతులగు సత్పురుషులకు సందేహాస్పదములగు విషయములయందు నంతఃకరణప్రవృత్తు లనఁగా నంతరాత్మయొక్క యాదేశములే ప్రధానలక్షణములు. అని పైశ్లోకముయొక్కభావము.)

నిష్కల్మషహృదయు లేదేనివస్తువును బ్రేమించిరేని నయ్యది నిశ్చయముగఁ బ్రేమార్హ మైయుండియే తీఱవలయును. లేనిచో నట్టివస్తువులందు వారికి మనసు దగులుట యసంభవము. సత్పురుషులకు శుద్ధాంతఃకరణముండుఁగాన నట్టి యంతఃకరణప్రవృత్తియే వారిసందియములను బాపి చక్కని మార్గముఁ జూపించుననియే పైశ్లోకాభిప్రాయము.

అట్లు ఆశ్రమమును దర్శించి యకారణముగఁ బ్రేమించిన యాశకుంతలాజన్మవృత్తాంతము చెలికత్తెలవలన విని దుష్యంతుఁడు మనమున నెంతయు సంతోషమును, శాంతిని నొందినవాఁ డయ్యెను. కాని యిచ్చటఁ బ్రధానముగా గ్రహింపవలసిన విషయ మంతఃకరణశుద్ధియే. అట్టియంతఃకరణశుద్ధియే సర్వమును జక్కఁజేయఁ గల్గును. రసవిషయమున నెప్పుడును, నంతఃకరణశుద్ధి యనఁగా మనోనైర్మల్యము ఆవశ్యకము. అర్థముకొఱకుఁ గాని, పదవులకొఱకుఁగాని, అన్యప్రయోజనములకొఱకుఁగాని వస్తువులను బ్రేమించుపట్ల నీయంతఃకరణశుద్ధి లభ్యమగుట యసంభవము. చూచినతోడనే జన్మాంతరసంచితాత్మానుబంధమువలనఁ బ్రేమించు శుద్ధమానసుల ప్రణయము నిష్కల్మషమై, స్వచ్ఛమై ప్రకాశమానమై,

భావోద్దీపకమై యొప్పును. అట్టి నిష్కల్మషప్రణయమే కావ్యమున నవశ్యవర్ణనీయమని రసహృదయులకు గోచరింపక మానదు.

## రసాభివృద్ధియుఁ బ్రాణికోట్లయభివృద్ధి వోలె జీవసూత్రబద్ధమై యుండును.

జన్మాంతరసంచితాత్మానుబంధమువలన జనించిన ప్రేమము వివిధరీతుల నభివృద్ధినొంది ఫలసిద్ధిఁబడయును. చూడుఁడు.

### ౧. ఉదాహరణములు. ప్రకృతిస్వభావము.

ప్రకృతిస్వభావము ఎట్లు ఈయభిప్రాయమును స్పష్టముఁ జేయుచున్నదో. చెట్టు పుట్టుటతోడనే చెట్టై పుట్టుట లేదు గదా! విత్తుననుండి చిన్నమొలక యుద్భవించి యది పెరిగి పెద్దదై శాఖోపశాఖలు గాంచి పూతఁబూచి, కాయగాచి ఫలసిద్ధిఁ బడసి యితరులకు ఫలదాన మొసఁగ సమర్థమయి యున్నది. లతలును, బూవులును, గాయలును, సర్వమును నిట్టి యవస్థాక్రమమునే యనుభవించి యుద్భవిల్లి సంపూర్ణత్వమును బొందిన వగుచున్నవి. మొగ్గనుండి పూవును, పూవునుండి పిందెయుఁ, బిందెనుండి కాయయుఁ, గాయనుండి పండును, నంతరాంతరములుగ నభివృద్ధిగోచర మగుట లేదా?

### ౨. మానవునివిషయము.

మానవునిసంగతిఁ బరికింతము. మాతృగర్భమునుండి వెలువడి తల్లిపాలచేఁ బోషింపఁబడి వరుసగ శైశవమును, బాల్యమును, యౌవనమును, గౌమారమును, వార్ధక్యమును, మరణమున్నుగూడ నను భవించి తాను మొదట నేకాలగర్భమునుండి

వెలువడెనో ఆకాలగర్భమునే చొచ్చుచున్నాఁడు.-ఈభావమునే మనవారు 'మంటిలోఁ బుట్టి మంటిలోఁ జేరె' నని చెప్పుదురు. మట్టిలోఁ బుట్టి మట్టిలోఁ జేరువఱకు నీజీవి యనుభవించు సుఖదుఃఖాదిక మనంతము. శైశవమున జీవి లక్ష్మీసమానమగు మాతృవదనసందర్శనమున నేతృప్తిఁజెంది తజ్జనితానందముననే యోలలాడుచుండును. తల్లికిని అప్పటికుమారుని యప్పలప్పల యను జిలిబిలిపలుకుల యవ్యక్తరమణీయవచన ప్రవృత్తులే యింపునింపును. అట్లు శిశువు పెరిగి పెద్దవాఁడై యాటపాటలఁ బ్రొద్దుపుచ్చుచుఁ, బిమ్మట యౌవనము వచ్చినవాఁడై వయోవిలాసమున విజృంభించుచుఁ, దల్లికి సంతసముఁ గూర్చును. పిమ్మటఁ బెద్దవాఁడై సంసారముఁ జేయుచు, నాలుబిడ్డలతో వర్ధిల్లుచుఁ దల్లిదండ్రులకు మనస్సంతోషముఁ గూర్చును. ఇట్లే మానవునియొక్క వివిధావస్థలును నాత్మసంబంధము గలిగిన తలిదండ్రులకు సంతోషమును గలిగించుచునే యుండును. మానవుని వివిధావస్థలవలనఁ జైతన్యమునకు సంపూర్ణత్వము ను. వైవిధ్యమును సిద్ధించును. అట్లే ప్రణయమును వివిధావస్థల వివిధానుభవముల నందిననఁగాని సంపూర్ణత్వము నొందనేరదు. నిష్కల్మషముగఁ బ్రేమించెడుమానవునకుఁ బ్రియురాలిసర్వావస్థలును బ్రేమోద్దీపకములుగనే యుండునుగదా! ఈభావమే కొంచెము విపులముగఁ జర్చింపఁ బ్రయత్నింతుము. ప్రేమకుఁ గారణము జన్మాంతరసంచితహృదయానుబంధమని మున్నే తెల్పియుంటిని. అట్టిప్రేమ హఠాత్సంభవముగాని వేఱుగాదు. హఠాత్తుగ మెఱుఁగు మెఱసినట్లు మెఱపించి యేఁగిన ప్రియురాలివదనమును, లావణ్యమును, ఠీవిని, నడకలయందమును బలుమాఱు సంస్మరించుకొనుచు జపతపస్స్వాధ్యాయ

ములు సేయు యోగి యెట్లు పరమేశ్వరుని దివ్యతేజమును దర్శించి సిద్ధిఁబొందునో యట్లే ప్రియుఁడును ఆమెయందు మనస్సు లగ్నముఁ గావించి తద్ధ్యానబలమువలనఁ బ్రపంచమున సర్వమును నామెయందే యుపలక్షించి యామెదక్క నన్యప్రపంచము లేదని నమ్మి యామెయే సర్వముగ భావించి యామెయొక్క సర్వసుఖదుఃఖములను దనవిగనే భావించి యామె లేనిది బ్రదుకు దుర్భరమగునవస్థకుఁ బాల్పడి తుదకు నామెకై ప్రాణముల సహితము ధారపోసి యకారణలబ్ధమును జన్మాంతరసంచితహృదయానుబంధఫలమును నగు ప్రణయసిద్ధిని బడయఁజూచును. ఈభావమునే యనేకకావ్యముల నాయికానాయకులవిషయమున గోచరించును. ఇట్టిభావము నాయికానాయకులకుఁ బరస్పరమని కూడ గ్రహింపఁదగును. అట్టిపరస్పరప్రణయాభివృద్ధి వలననే మానవునికి ఫలసిద్ధియుఁ, గావ్యమున రససిద్ధియు లభించును. ప్రకృతము రసస్వరూపనిరూపణమునకు ననుకూలించు నుదాహరణములమాత్రమే కైకొని విమర్శింతము.

## శ్రీ సీతారామచంద్రుల ప్రణయకథనము.

అయోధ్యాపురాధీశుఁడగు దశరథమహారాజు నడిగి విశ్వామిత్రమహర్షి శ్రీరామలక్ష్మణులను గొనిపోయి వారిచేఁ దాటకాసంహారముఁ జేయించి తనయాగమును గొనసాఁగకుండ నాటంకములు గలిగించుచుండిన రాక్షసులఁ జంపించి నిర్వర్తితకృత్యుఁ డయ్యెను. పిమ్మట విశ్వామిత్రుఁడు రామలక్ష్మణుల్గను దపోధనుఁడగు జనకునియాస్థానమునకుఁ గొనిపోయి యయోనిసంభవయు, నిమిత్తమాత్రముగ జనకునియింట నున్నదియు

నగు శ్రీజానకీదేవిని శ్రీరామచంద్రున కిచ్చునటు లేర్పాటుఁ గావించెను. అనంతరము ఆర్యపద్ధతిని జనకుఁడు:

"ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ,
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా."

యనువచనములఁ బలుకుచు సీతను శ్రీరామచంద్రమూర్తి కర్పించెను. నాటనుండియు వారిరువురకును బ్రణయమభివృద్ధిఁ జెందెను. తుదకుఁ బినతల్లియగు కైకేయితంత్రము కారణముగ శ్రీరాముఁ డడవుల కేఁగునప్పుడు సీతయు వలదని యితరులు వారించినను వినక భర్తతోఁగూడ నరణ్యమునకుం జని యట భర్తతోఁ గూడఁ గాలముఁగడపుచు, నతనితోడి వాసమే స్వర్గభోగముగ నెంచుచు రససముద్రమున నీఁదు లాడుచుండెను. వివాహవేదికపై నొండొరుల సందర్శించు కొనునప్పుడు హఠాత్తుగ మెఱుపువలె జనించిన సీతారాముల ప్రణయము చిరసహవాసయోగమువలనను, గష్టానుభవము వలనను, బరిశుద్ధప్రకృతిజీవనమువలనను, స్థాయీభావము నొందెను. పిమ్మట సీత రావణునిచే నపహరింపఁబడుట తటస్థించె. ఆయవస్థ రామునకు దుర్భర మయ్యెను. తనసర్వస్వముగ భావించుచుండినసీత దూరస్థురా లగుటచే నాతనికిఁ బ్రపంచ మంతయు నంధకారమగ్నమైనట్లు తోఁచెను. జీవితపథమున విస్పష్టీకరించు దివ్యప్రణయజ్యోతిగ భావించుచున్న సీత తనకు దూరమయిపోవుటచే నతనికి దారి తోఁపకుండెను. సీతకొఱకయి యాతఁడు విలపించినవిధమంతయుఁ గరుణాస్పదము. సీత నన్యు లెవ్వరో యపహరించిరని భావించి సర్వప్రపంచమును నాశముఁ జేయుటకును, సర్వలోకములను డిందుపడఁజేయుట

కును సర్వసముద్రములను క్షోభింపఁజేయుటకును సమకట్టెను. సీతాపహారణమునకై ప్రతిక్రియగ శ్రీరాముఁడు కావింపం బూనినకృత్యములు లోకభీకరములుగ వాల్మీకిమహర్షిచే వర్ణింపఁబడినవి. ఇట్టిమహానైష్ఠుర్యప్రతీకారమునకు నిజమగు కారణము సీతయందుఁ దగిలి స్థాయిఁబొందిన శ్రీరాముని ప్రణయరసమే కాని యన్యము గాదు. లవణాకరుఁడు సర్వమును గబళించునట్లును, నగ్నిదేవుఁడు సర్వమును నాహుతిగఁ గొని దహించునట్లును, రాముని ప్రణయము సర్వవిషయములను మఱచునట్లును, సర్వభావములను ద్యజించునట్లును, సీతదక్కనన్యము గోచరింపకుండునట్లును జేసెను. స్థాయిభావలక్షణమది యేకదా!

శ్రీసీతారామచంద్రుల ప్రణయవ్యాపారముల భావమునకు స్థాయి బాగుగ గుదిరినట్లు సంస్కృతగ్రంథములవలన స్పష్టమగుచున్నది. ఎంత స్థాయి గుదిరినది; అట్టిప్రయాసముల కోర్చి సుగ్రీవాదులసాయము నపేక్షించి యన్యాయముగ వాలిని సయితముఁ జంపి కొండయనక, కోనయనక, చెట్టనక, పుట్టయనక, సర్వదేశములను వానరులచే వెదకించి సీతజాడఁ గని, సామాన్యమానవుల కజేయుఁడగు, దపోధురంధరుఁడును "అయి ఖలు విషమః పురాకృతానాం భవతి హి జంతుషు కర్మణాం విపాకః" అనునార్యోక్తికిఁ గాళిదాసునిచేఁ బ్రధాన లక్ష్యముగఁ గైకొనఁబడినవాఁడును, నహంకారస్వరూపుఁడును, నిజశిరస్సులచే శివునకు నిత్యమునుఁ బూజయొనర్చునట్టి భక్తాగ్రేసరుఁడును, నపూర్వమేధావంతుఁడును, శౌర్యరాశియునగు రావణునంతవానినిఁ బోర నెదిర్చి యమితశ్రమమున

కోర్చి, తుదకు నతని నిర్జించి, సీతను గైకొని యయోధ్య కరు దెంచి ప్రథమమున నగ్నిసాక్షిగఁ గొన్నయామెను దిరిగి యగ్నితప్తఁ గావించి స్వీకరించి నిర్వర్తితప్రతిజ్ఞుఁడై యుండును?

### సీతారాములసౌఖ్యానుభవవర్ణనము.

సీతారాముల ప్రణయము స్థాయీభావమునొందినయంశ మును స్ఫుటముఁగావించుశ్లోకముల రెండిటి నుదాహరించె దను. ఒకటి వారి సౌఖ్యానుభూతికి సంబంధించినది. మఱియొ కటి వారి వియోగమునకు సంబంధించినది. అందలిరసమును బాఠకులు గ్రహింతురు.

శ్లో. కిమపి కిమపి మందం మందమాసక్తియోగా
దవిరళితకపోలైర్జల్పతోరక్రమేణ
అశిథిలపరిరంభవ్యాపృతైకైకదోష్ణో
రవిదితగతయామా రాత్రిరేవం వ్యరంసీత్.

ఈశ్లోకము భవభూతికృతోత్తరరామచరితనాటకములోనిది. పూర్వము గోదావరీతటస్థనికుంజములయందు సీతారామ చంద్రు లనుభవించిన ప్రణయవ్యామోహము రామునిచే సీతాపునస్సంయోగకాలమున స్మృతిపూర్వకముగ వర్ణింపం బడినది. దీనిభావము తేటగ బోధించిన నిట్లుండును. సీతా రాము లిరువురును రహస్యముగ సరససల్లాపములాడునవస్థ యిందు వర్ణింపఁబడినది. ఏమేమో మాటాడుకొను చుండిరఁట. ఆయాసక్తి యాభావానురక్తి వారలకే గోచరింపవలయుఁగాని, మనబోంట్లకు గోచరించుట దుర్లభము. అవిరళితకపోలులై — ఒకపరుస, యొకతీఱు—అనునది లేక యిష్టమువచ్చినదెల్ల— మనస్సునకుఁ దట్టినదెల్లఁ బల్కుచు, సల్లాపములఁ గావించు

చుండిరంట! గాఢపరిరంభమువలన జనించిన మందోష్ణసంస్పర్శచే నొడలుమఱచి యిగువురును బ్రపంచము సర్వమును మఱచి రససిద్ధినొందినవా రయిరి. అట్టివారికి యామములును, నంతయేల? రాత్రిసయితము గతించినసంగతి తోఁచునే? ప్రణయపారవశ్యమును భవభూతి యీశ్లోకమున నెంతయుఁ జక్కఁగ వర్ణించినాఁడనుట నిస్సంశయము.

రసము స్థాయీభావమునొందినప్పు డన్యవిషయములు స్మృతికి రాకుండును. స్థాయీభావముచే నావహింపఁబడిన రసహృదయులకు నిజభావనాప్రపంచము దక్క నన్యప్రపంచముండదు. సీతారామచంద్రులకును సౌఖ్యసమయమునఁ బ్రపంచము సర్వమును స్మృతిదూరమై 'అశిథిలపరిరంభవ్యాపృతైకైకదోష్ణతచేఁ' బరవశు లయినవారికిఁ దాము గావించుకొను చున్న సల్లాపములయందలి యాసక్తిబలమున రాత్రియంతయు గడచినసంగతికూడ గోచరింపదయ్యెనుగదా! ఆహా! సౌఖ్యానుభూతి యన్న రసానుభూతియన్న నిట్లే యుండవలయుఁ గదా!

## శ్రీరామునివియోగావస్థావర్ణనము.

ఇఁక సీతావియోగమునఁ గార్శ్యమునొందియున్న రామునియవస్థ వర్ణించుశ్లోకము నొకదానిని స్మరింతము.

శ్లో. ప్రాసాదే సా, పథిపథి చ సా, పృష్ఠతః సా, పురస్సా,
పర్యంకే సా, దిశిదిశి చ సా, తద్వియోగాతురస్య;
హంహో చేతః! ప్రకృతిరపరా నాస్తి తే కాఽపి సా, సా
సాసా సాసా జగతి సకలే కోఽయ మద్వైతభావః.

సీత వియోగముచే మతిచెడి సీతాదర్శనమునే కోరుచు నెల్లప్పుడును దదేకధ్యానమున నుండురామునకుఁ బ్రపంచ

మున నెల్లెడలను సీత కన్పించునవస్థయే యిందు వర్ణితము. దీని భావము విప్పిచెప్పిన నిట్లుండును.

సీతావియోగాతురుఁడగు రామునకు నేమేడయందుఁ జూచినను సీతయే! ఏదారిని జూచినను సీతయే! ముందునను సీతయే! వెనుకను సీతయే! ప్రక్కను సీతయే! సర్వదిశలను సీతయే! ఆహా! ఏమి యామనోవైచిత్ర్యము! ఆయనకు నితర ప్రకృతి శూన్యమైతోఁచెను. సీతయే! సీతయే! సీతయే! సీతయే! సకలజగత్తును సీతయే! సీతవినా యాతనికి వేఱుప్రకృతి లేనే లేదు గదా! ఆహా! యేమి యద్వైతభావము! పైశ్లోకమున సీత యందు మనస్సును లగ్నముఁ గావించి యుంటచే రామునకు సర్వప్రపంచమును స్మృతివిదూరమై సీతదక్క నన్యము గోచరింపదయ్యె. అనఁగా సీతాదేవి సురూపమే యాతనిమనస్సు నావహించి యాతనియందు స్థాయీభావము నొందెను. సీత యన్నదే ప్రపంచము! సీతతోడిదే సౌఖ్యము. సీతయే సర్వ జగత్తునను నేకరీతి వెల్గుచు జీవితపథమును విస్పష్టముగఁ జూపెంచు ప్రణయజ్యోతి! అట్టిసీత లేనిప్రపంచము అరణ్యముతో సమాన మని

"వినా సీతాదేవ్యా కిమివ హి న దుఃఖం రఘుపతేః,
ప్రియానాశే కృత్స్నం కిల జగ దరణ్యం హి భవతి."

యనుశ్లోకమున భవభూతి వర్ణించినదంతయు సత్యముగను హృదయంగమముగను నున్నది.

## రసపారవశ్యస్వభావము.

రసముచే నావహింపంబడి రసము స్థాయీభావము నొందినకారణమున రసజీవియగు నతనికి సకలప్రపంచమును రస

విషయముగనే గోచరించును. రసవిషయము దక్క నన్యవిష యము లాతనిమనము నాకర్షింపంజాలవు. ఏయవస్థయందున్నను నెటc దిరుగుచున్నను నేకార్యముc గావించుచున్నను రసవిష యమే ప్రధానముగ నతనికి గోచరించుచుండును. ఈభావ మునే రామభక్తుడగు శంకరాచార్యులు రామకర్ణామృత మున నీక్రిందిశ్లోకమున వర్ణించెను.—

శ్లో. మార్గే మార్గే శాఖినాం రత్నవేదీ
వేద్యాం వేద్యాం కిన్నరీబృందగీతమ్;
గీతే గీతే మంజులాలాపగోష్ఠీ
గోష్ఠ్యాం గోష్ఠ్యాం త్వత్కథా రామచంద్ర!

శ్లో. వృక్షే వృక్షే వీక్షితాః పక్షిసంఘాః
సంఘే సంఘే మంజులామోదవాక్యమ్;
వాక్యే వాక్యే మంజులాలాపగోష్ఠీ
గోష్ఠ్యాం గోష్ఠ్యాం త్వత్కథా రామచంద్ర!

పైశ్లోకములకర్థ మీక్రిందివిధమున నుండును.—

"ప్రతివృక్షపంక్తుల మార్గములందును రత్నవేదికలును— వేదులందున వేదులందునc గిన్నరీసమూహములగీతములును, గీతమందున గీతమందున మృదువైన యాలాపగోష్ఠియును, గోష్ఠియందున గోష్ఠియందున నో రామచంద్రమూర్తీ! నీదు కథయే వినంబడుచున్నది."

"వృక్షమందున వృక్షమందున పక్షిసంఘములు కనంబడి నవి. సంఘమందున సంఘమందున మంజులమైనశుభాహ్వాన వాక్యమును, వాక్యమందున వాక్యమందున మంజులమైన

యాలాపగోష్ఠియు, గోష్ఠియందున గోష్ఠియందున నో రామ చంద్రా! నీదుకథయే వినంబడుచున్నది."

పై శ్లోకములభావమును రసపరముగ నన్వయించి విమర్శింతము. భక్తుఁ డొక యరణ్యప్రదేశమునఁ ద్రిమ్మరుచున్నాఁడు. అట్టియెడ నతనికిఁ బ్రకృతి యెట్లు గోచరించెనో యిందు వర్ణింపఁబడినది. భక్తుఁడు రామపాదారవిందభజనతత్పరుఁడు. అట్టిభక్తునకు ప్రపంచము సర్వమును రామమయముగఁ గన్పడుటలో నాశ్చర్యము లేదు. ఈసత్యమే పై శ్లోకముల వ్యక్తమగుచున్నది. భక్తుఁడు చనెడుప్రతిమార్గముననను వృక్షశాఖలపైన రత్నవేదులు కనఁబడుచున్నవి. ఆరత్నవేదులపై సుఖోపవిష్టములయిన కిన్నరీసమూహములు గీతములఁ బాడుచున్నవి. అట్టిగీతముల ప్రతిదానియందునను మంజులమగు నాలాపగోష్ఠి అనఁగా, మృదులమును రహస్యమునునగు సల్లాపగోష్ఠియుఁ దెలియనగుచున్నది. అట్టియాలాపగోష్ఠియందున శ్రీరామచంద్రుని దివ్యచరిత్రమే వినవచ్చుచున్నది. వృక్షములపైనఁ బక్షులు గుమిగూడి కూరుచున్నవి. ఆపక్షులు సంతోషముతో రారమ్మనునటులు పాటలు పాడుచున్నవి. ఆపాటలలో రహస్యమగు మృదుసల్లాపగోష్ఠి వినవచ్చుచున్నది. ఆరహస్యసల్లాపగోష్ఠియందు శ్రీరామచంద్రమూర్తియొక్క దివ్యకథయే వినంబడుచున్నది. ఆయరణ్యసీమయందు భక్తునిచెవుల సోఁకెడునది యొక్క శ్రీరామునిదివ్యకథయేకాని వేఱుకాదు. వృక్షశాఖలును, రత్నవేదులును, కిన్నరీబృందగీతములును, మంజులాలాపగోష్ఠియు, పక్షిసంఘములును, మంజులామోదవాక్యములును, మంజులాలాపగోష్ఠులును, శ్రీరామునిదివ్యకథ వినిపించుసాధనములుమాత్రమే యగునుగాని, స్వతంత్ర

వ్యక్తులు కాఁజాలవు. మనభక్తునికి రామనామమే సర్వత్ర విని పించుచున్నది. తదితరము వినవచ్చుట లేదు. కారణము హృద యము రామనామపూరితమై యుండుటయే, మనము రామ నామామృతపానముచే మత్తిల్లి యుంటయే, కన్నులు రామ మూర్తిని దర్శించి దర్శించి యన్యమును గాంచలేకుంటయే, వీనులు రామనామగానమునఁ దనిసి యన్యశబ్దముఁ జొఱ నీకుంటయే.

## స్థాయీభావమునకును, రసికునకుఁ గల యద్వైతభావము.

ఆహా, స్థాయీభావమన నిట్టులే కదా రసికునిహృదయ మును వశము గావించుకొనును! స్థాయీభావముచే వశుఁడగు రసికునకుఁ బ్రపంచము సర్వమును శూన్యముఁగను, రసవిష యమే సత్వమును శాశ్వతముగను గోచరించును. అంత యేల ? అన్యప్రపంచము గోచరింపనే గోచరింపదు. ఒకవేళ గోచరించెడు వస్తువులైనను స్థాయీభావమును దోహదము గావించుటకుఁ దోడ్పడునేకాని స్వతంత్రవ్యక్తిఁ గలిగియుండ నేరవు. స్థాయీభావమే సర్వము. స్థాయీభావమే సత్యము. స్థాయీభావమే సాధ్యము. తదితరములు సాధనమాత్రములు. అసంపూర్ణసత్యములు. రామనామమే సర్వము, రామనామమే సత్యము, రామనామమే శాశ్వతము, రామనామమే సంపూర్ణ జీవితపరమార్థము. ఇట్లు భావించుభక్తునకుఁ బ్రపంచము సర్వ మును శ్రీరామచరణారవిందప్రాప్తికి సాధనమాత్రములుగ గోచరించునేకాని స్వతంత్రవ్యక్తిఁ గలవిగను, పరమార్థములు గను, లక్ష్యములుగను, గోచరించునా? గోచరింపవు. అందు

కనేకదా మహాభక్తుఁడును రామపాదారవిందభజనతత్పరుఁడును నగు శ్రీగోపన్న యను రామదాసుగారు రామపదధ్యానలోలుఁడై తత్పారవశ్యమున "అంతా రామమయం బీజగమంతా రామమయ" మ్మని గానముఁజేసెను! ఆహా! రసప్రవృత్తి కన్న నుత్తమమగు జీవితాలంబన మేమి కలదు? అట్టిరసజీవులగు రసికశేఖరులు పూర్వజన్మ సంస్కారవాసనచే స్థాయీభావమునకు వశులై యన్యప్రపంచమును మఱచి రసాధిష్ఠానదేవతలఁ గీర్తించి కీర్తికాములై శాశ్వతజీవమును గడించినారు! అదృష్టమన రసికులదేకదా! జీవితమందంతయు రసాధిష్ఠానదేవత కన్నులయెదుటనిలచి తాండవముఁజేయుచు జీవితపథము విస్పష్టముగఁ జూపించుచుండ నియమితపథమున జీవితముఁ గడపుచు స్వచ్ఛందసంచారము గావించు రసికశ్రేష్ఠులకును, మేఁకలమందవోలె గతానుగతికులై స్వీయజీవితపరమార్థముల గుర్తెఱుంగలేక, కూపస్థమండూకములుంబోలెఁ దమ సంకుచితభావములతోఁ దృష్టినొందుచు, మృత్యుపథమున నిరంతరము ప్రయాణమొనర్చుచు, కీర్తికాములు గాక పేరుప్రతిష్ఠలు లేక నశించుచుఁ దమకును, తమ్ముగన్న దేశమునకుఁగూడ నపఖ్యాతి నొడగూర్చుసామాన్యమానవులకును నెట్టిసంబంధము? వారికిని వీరికిని హస్తిమశకాంతరము గదా? వారుధన్యులు, మృతజీవులు, వీరు హతభాగ్యులు! జీవన్మృతులు !!!

## ౨. శ్రీరాధాకృష్ణుల ప్రణయకథనము.

శ్రీసీతారాముల ప్రణయకథన మెంత ప్రాముఖ్యము గడించినదో శ్రీరాధాకృష్ణుల ప్రణయకథనముకూడ నంత ప్రాముఖ్యము గడించినది. శ్రీసీతారాములప్రేమము శాస్త్ర

సమ్మతమైనది. సర్వశాస్త్రములును, సర్వమతములును, సర్వసిద్ధాంతములును నంగీకరించు ప్రణయవ్యాపారమే కాని విరుద్ధధర్మములు కలది కాదు. గురుజనాజ్ఞానుసారముగ భార్యాభర్తలై రామచంద్రుఁడును జానకీదేవియు ప్రణయవ్యాపారములఁ జలిపిరి రాధామాధవులన్ననో అట్లు గావింపలేదు. రాధామాధవులు భార్యాభర్తలు కారు. శ్రీకృష్ణుఁడు సుక్షత్రియుఁడు. నిమిత్తమాత్రముగ యాదవవంశమున నందుని యింటఁ దిరిఁగి యాదవుఁడుగ నెంచఁబడినవాఁడు. అట్టి సుక్షత్రియుఁడగు శ్రీకృష్ణుఁడు నందునికిఁ జెల్లెలివరుసయగు రాధను ప్రియురాలిఁగఁ జేపట్టుట యంత శాస్త్రసమ్మతమయినవిషయము కాదని సామాన్యశాస్త్రపరిజ్ఞానముకలవారికి సైతముఁ దెలియును. అందులో రాధ వివాహితయగు నిల్లాలని సైతముఁ బ్రసిద్ధి. అట్టిచో శ్రీకృష్ణుఁడు పరునిభార్యయు, గొల్లయిల్లాలును నగు రాధతోఁ జెలిమిచేయుట సామాన్యముగ నీతిశాస్త్రపరిచయులకు దోషముగఁ దోఁచకమానదు శ్రీకృష్ణుని యేకపత్నీత్వమునకు, రాధయొక్క పాతివ్రత్యమునకునుఁ గూడ హానిని విరోధమును నాపాదించును. అంతియ కాక సామాన్యమానవులకు దుర్నీతిసైతము బోధించుననియుఁ గొందఱవాదము. ఏలనన: శ్రీకృష్ణునంతటి మహాత్ముఁడు గావించుటచే నిట్టినీతివిదూరకృత్యములు పవిత్రములనియే భావించి సామాన్యులును నీవిషయమున శ్రీకృష్ణు ననుకరించుచు దుర్నీతిపరులై పరదారాపేక్షకులై చరింతురేమో యని వీరికి భయము.

ఈనీతిసంగతి యెట్లున్నను రాధాకృష్ణుల ప్రణయవ్యాపారము సామాన్యవిషయము కాదు. దానికి సామాన్యములగు శాస్త్రనియమములు వర్తింపవు. శ్రీకృష్ణుఁడు సామాన్యమాన

వుఁడు గాఁడు. జగన్మోహనాకారుఁడు, వేణుగానముచే సకల చరాచర ప్రపంచమును గరఁగింపఁగలిగిన గాయకశిఖామణి, అమేయప్రతాపశాలి. శ్రీకృష్ణునిమహిమలఁ బొగడుటకు శక్తి చాలమిచే నింతటితో ముగించి ప్రకృతము ననుసరింతును. అట్టిమహాపురుషుఁడగు శ్రీకృష్ణునిసౌందర్యముఁ జూచియో, గానమునకు భ్రమనొందియో, మహిమలచేఁ బారవశ్యముఁ జెందియో, మఱి యేకతముననో రాధ వరించెను రాధ సామాన్యురాలగు గొల్లపడుచు కాదు. రసహృదయము కలది. శ్రీకృష్ణునిగుణములఁజూచి వ్యామోహిత యయ్యెను. కండక్రొవ్వి దుర్వృత్తిలో దిగు సామాన్యాభిసారికలుంబోలెఁ గాక రాధ రసహృదయ యగుటంజేసి గుణాభిరాముఁడగు శ్రీకృష్ణునిఁ జూచినతోడనే ప్రేమించినది. శ్రీకృష్ణునిగుణముల గ్రహించి, యాతనిమహిమకు వ్యామోహముఁజెంది రాధ వలపుఁజెందెను. అట్టి రాధను సామాన్యవ్యభిచారిణులతోఁ బోల్పఁదగదు. ఆమెయెడ విశిష్టధర్మములు వర్తింపఁజేయవలెను రాధయొక్క స్వభావమును రసదృష్టితోడను దయాపూర్ణహృదయముతోడను విమర్శించువిమర్శకున కామె గుణము లద్దమునంబలెఁ బరిస్ఫుటముగఁ గన్పడును సంకుచితస్వభావులకు రాధయొక్క చరితము నీతిబాహ్యముగఁ గన్పడుటలో నాశ్చర్యము లేదు.

గుణాలుబ్ధయై శ్రీకృష్ణునివరించినరాధ యాతనియందు బద్ధానురాగ యయ్యెను. ఏశుభముహూర్తమున శ్రీకృష్ణునిఁ జూచినదో కాని యాముహూర్తమునుండియు రాధ యతని నుండి తనమనముఁ ద్రిప్పికొనఁ జాలదయ్యెను. నిముసమునిముసమును నాతనిఁ గాంచుట కామె కెక్కడవకాశము కలిగెను. ఏలయన నిరువురు నొక్కకుటుంబములోనివారై యొక

యింటఁ బెరుగుచు నిరంతరము నొకరిసాన్నిధ్యమున నొకరు వర్తిలుచు నుండిరి. అందుచేత వారిప్రణయలత పెరిఁగి పెంపొంది యనూన సౌందర్యయుతములగు పల్లవములను, పుష్పములను దాల్చి, సౌరభము వెదఁజల్లఁగలిగెను. ప్రొద్దు ప్రొద్దుననె లేచిన తోడనె శ్రీకృష్ణునివదనదర్శనసౌభాగ్యమే, భోజనమువేళ శ్రీకృష్ణుని దర్శనమే, పాలుదీయువేళను పెరుఁగు చల్లఁజేయువేళను, పసుల దోలుకొనిపోయి మేఁపుచు నెండకుఁ దాళలేక చెట్టునీడ విశ్రమించెడివేళను, సాయంకాలమున వనాంతమునందుఁ గుసుమితసమయమున సైకతస్థలములఁ జంద్ర కిరణములవెలుఁగున రాసక్రీడఁ దేలువేళను, శ్రీకృష్ణునిదర్శన మెప్పుడును రాధకు లభించుచునేయుండెను అందుచేఁ బ్రథమ మున నేక్షణముననో చూచి వరించినరాధకు శ్రీకృష్ణునిమూర్తి ప్రతిక్షణసన్నిహిత మైయుండి తీఱనిమానసోల్లాసముఁ గూర్చు చుండెను. అట్లు నిరంతరదర్శనపటిమచే రాధమనమందు శ్రీకృష్ణునిపైఁ బ్రేముడి యతిశయించి స్థాయీభావము నొందె ను. అట్టిస్థాయీభావము కుదిరినకతన రాధకుఁ బ్రపంచమునెడ భయరాహిత్యమును శ్రీకృష్ణునియెడ నద్వైతభావమును గలి గెను. పరులు కన్నఁ దప్పువెట్టెదరేమో యనుభీతి నశించెను. సర్వకాలసర్వావస్థలను శ్రీకృష్ణనామస్మరణముఁ గావింపుచు నాతనినే ప్రాణసమునిగను, ప్రాణములకన్న నెక్కువగుప్రియు నిగను, నిష్టదైవముగను భావించి హృదయమును—సామాన్య శుష్కనీరసనారీహృదయము కాక ప్రణయార్ద్రీభూతమైన రసహృదయము—నాతని కర్పణముఁ గావించెను. శ్రీకృష్ణుఁడు దక్క నన్యము రాధకన్నులకుఁ గన్పడదయ్యెను. నీళ్లు ముంచు కొనుచుఁ జెలువులోఁ గంతములోఁ తునీళ్లలో నిలువఁబడి

యున్న, రాధకు ముందు శ్రీకృష్ణునిదివ్యమంగళవిగ్రహము గోచరించెను. తోడనే యామె ప్రాణములకున్నైతము వెలిపక శ్రీకృష్ణు నాశ్లేషించుకొనునాసతో ముందంజవేయఁబోయెను. సామాన్యాభిసారిక యంతటిప్రాణాపాయమునకుఁదెగించునా? రాధ తెగించెను. ఏల? శ్రీకృష్ణగాత్రపరిష్వంగసుఖ మెక్కువయా? తద్విరహితములగు ప్రాణము లెక్కువయా? రాధకు మనోనిశ్చయము కుదిరెను. శ్రీకృష్ణుఁడు మెచ్చెను భక్తపరాధీనుఁడగు శ్రీకృష్ణుఁడు భక్తాగ్రగణ్యురాలగు రాధ యొక్క నిష్కల్మషహృదయమును మెచ్చి యామెతపోనిష్ఠకు సంతసించి యామె కభీష్టసిద్ధి కావించెను. రాధను శ్రీకృష్ణభగవానుఁడు హృదయసమానురాలగు ప్రేయసిగ నంగీకరించి యామెయభీప్సితమును నెఱవేర్చి యామెజీవితమును సఫలముగావించెను.

అట్లు శ్రీకృష్ణునిచేఁ బరిగ్రహింపఁబడి, లాలింపఁబడి, యతనిచే భార్యలందఱికన్న నెక్కుడుప్రేమతోఁ జూడఁబడి, రాధ పరితుష్టహృదయ యయ్యెను. ఆమె చేసినతపస్సు ఫలించెను. శ్రీకృష్ణుఁ డాపెవాఁ డయ్యెను. ఇందుల కొక్కచిన్ని యుదాహరణముఁ దెల్పెద! రాధ యొకనాఁడు శిరముపైఁ బెరుగు ముంతల నిడికొని వీథి నమ్ముకొనఁ బోవుచుఁ 'బెరుగో యమ్మ పెరుగు, పాలోయమ్మ పాలు' అంచుఁ గేకలిడుటకు మాఱు మాధవా! గోవిందా! యనుచుఁ బ్రేమామృతపానమత్తయై పలువరింపసాఁగెను. ఆహా! రాధ, శ్రీకృష్ణునిపయిఁ బ్రేమచే నెంతయవశ యయినది! రసపారవశ్యమన్న నద్దియేకదా!

## —{ స్థాయీభావము విరుద్ధభావములను నైత మాత్మభావమును దాల్చునట్లొనర్చును. }—

అట్టి రసపారవశ్యముఁ గన్న రాధకు స్త్రీజనసహజమగు నీర్ష్యయు మృగ్యముగ నుండును. ప్రపంచమున నెట్టిపతి వ్రతయయినను భర్త యన్యకాంతారతుఁ డైయుంట కంట గింపుగను నీర్ష్యాజనకముగను నుండును. ప్రపంచమునందలి యుంపుడుకత్తెల యీర్ష్యావిషయమును విస్తరించు టనవస రము. కాని, ప్రేమపరవశయగు రాధకు శ్రీకృష్ణుని యవగుణ ములు నవినయమును గోపమును దెప్పించుటకు మాఱుగఁ బ్రేమమునే జనింపఁజేయును. శ్రీకృష్ణుఁ డెచ్చటనైనను నెవ్వతె తోనైనను సంతోషముగనున్నఁ జాలును. రాధకు! తనతోడనే సౌఖ్య మనుభవింపవలె ననులోభబుద్ధి ప్రణయసిద్ధి గలిగిన కతన రాధయందు నశించెను. స్వసౌఖ్యము గాదు! శ్రీకృష్ణుని సౌఖ్యమే రాధ కభ్యర్థనీయము. ఈభావమును జయదేవకవి తన గీతగోవిందకావ్యమున నిట్లు వర్ణించినాఁడు.—

శ్లో. గణయతి గుణగ్రామం భామం భ్రమాదపి నేహతే
　　వహతి చ పరితోషం రోషం విముంచతి దూరతః,
　　ఇహ విహరతి వనే కృష్ణే వలత్తృష్ణే మాం వినా
　　పునరపి మనో వామం కామం కరోతి కరోమి కిమ్?

ఆహా! రాధ యెంతటి ధన్యాత్మురాలు ? ఆమెమనస్సు ఎంత నిర్మల మయినది? గుణములనే గ్రహించునుగాని— పొరఁబాటుననైనను లోపముల గ్రహింపదు! పరితోషమును బొందునేకాని, రోషమును బొందదు! రోషమును దూరముగఁ బాఱద్రోలును! తన్నుఁ విడిచి అతితృష్ణతో నన్యకాంతలయెడఁ

దగిలి వారితో వనమునఁ గ్రీడాసక్తుఁడై యుంట కన్నులారఁ జూచి తిరిగితిరిగి యాతనినే ప్రేమించుచున్నది. ఆతనిసౌంద ర్యముచేతనే చొక్కుచున్నది! అట్లు చొక్కుచుండుట వశము గాదనికూడఁ దెల్పుచున్నది! ఆహా! ఏమి యాయనురాగాధి క్యము? స్థాయీభావలక్షణము పూర్ణముగ వ్యక్తమగుచున్నది కదా! విరుద్ధవిషయములనుసయితమాత్మపరముగఁ గావించు శక్తి స్థాయీభావమున కున్నదనుటకు రాధయొక్క ప్రేమయే ప్రబలతార్కాణ మగుంగదా!

## 3. లైలా-మజ్నూనులకథ.

లైలా-మజ్నూనులు పారసీకదేశపువారు. వీరిరువురును బాల్యమున నొండొరులఁ బ్రేమించియుండిరి. కాలవశమున నా బాల్యప్రవర్ధితమగు వీరిప్రేమలత హాఠాచ్ఛిన్నమయ్యెను. తత్ఫలి తముగ లైల వేఱొకనిని దలిదండ్రుల నిర్బంధముచేఁ బెండ్లి యాడుట తటస్థించెను. జీవితమంతయు లైలతోఁ గూడ సుఖ ముగఁ గడపనెంచిన మజ్నూనునకు లైల యన్యుని వివాహ మగుట వజ్రపాతనిభ మయ్యెను! జీవితసాఫల్యము లైలకౌఁగి లియే యని యువ్విళ్లూరుచుండిన మజ్నూను లైల యన్యునిఁ జే పట్టెనని విన్నతోడనే హతాశుఁడై భగ్నమనోరథుఁడై స్వబంధు జనమును, స్వదేశమును, స్వగృహమును వీడి పిచ్చివానివలె నడవుల సంచరించుచుండెను. అందుకనియే యాతనికి మజ్నూ నని పేరువచ్చెను. మజ్నూననఁగఁ బారసీకభాషయందు నున్మ త్తుఁడని యర్థము. అడవులఁ గ్రుమ్మరుచు నెల్లప్పుడును లైలా ముఖబింబలావణ్యమునే స్మరించుచు, లైలానామమునే జపిం చుచుఁ దపోనిష్ఠ గలవాఁడై యుండెను. ఇట్లుండఁ గొంతకాల

మునకు లయిల భర్తృవియోగమునొంది మజ్నూనునిపయిఁ దలఁపుగలుగ నాతనిఁ జూడఁగోరి యాతని వెదకుటకయి యరణ్యములఁ గ్రుమ్మఱుచుఁ దుట్టతుదకు నొకయాశ్రమప్రాంతమునఁ గృశించిన శరీరముతోఁ దపోబలమునఁ బ్రకాశించువదనముతో ధ్యానమగ్నుఁడై యున్న మజ్నూనునిఁ గాంచి చిన్నతనంపుఁబ్రేమమంతయు నొక్కసారిగఁ బైకుబుక నార్ద్రహృదయయై యాతని నిట్లు ప్రార్థించెను.—

తే. "లయిల నోయీ! ప్రియా, కన్నులారఁ గనవె?"
యనుచుఁ బిలచినకంఠము నానవాలు
పట్టినట్లుగఁ గను లెట్టి పయికి నెత్తి
చటుకునను మూసి మజ్నూను సంచలింప
కుండ జపమాలికను ద్రిప్పుచుండఁ జూచి
లైల యనురాగపవనసంచాల యాచు
గద్గదక్లాంతి నిట్లనుఁ గరుణ దోఁప
"గట్టులను పుట్టలను దాఁటి కాననములఁ
గడచి యే, న్నెన్నియో యీఁది కట్టకడకు
సన్నిధిని జేర ఫలమి దాకన్నులకును?
మఱచితో గాఢవైరాగ్యపరవశతను
లైల మున్నుండె నీప్రియురా లటంచు
లేక ద్రోహాత్మనా నాదురాకచేత
భగ్నప్రణయంపుగాథ జ్ఞాపకము వచ్చి
పాపినా ననుఁ గాంచఁగా నోపలేవా?
విధివశతఁ జాపలమ్మున వేఱొకనిని

బెండ్లియాడితి నేకాని హృదయమెల్ల
నిండియుంటివి నీవె నానిశ్చలంపుఁ
బ్రేమ సర్వేశ్వరుఁడు సైత మేమేలుంగు?
నాథ! మన్నింపవే దయఁ నాదుపాష
చయము నెల్లప్పు డింక నీచరణదాసి
నగుచు జీవమ్ముఁ గడపెద నాథ! కనవె!
ప్రాణముల మఱపించెడు ప్రాణమిచ్చి
దివ్యదివ్యామృతముకన్న దివ్యమయిన
నీదుగానామృతముఁ గ్రోలి నిన్నుఁగూడి
నిభృతకుంజగృహంబుల నెల్లకాల
మీ నవోద్యానమున విహరింపనీవె!"
అనఁగ మజ్నూను సూర్యునియట్ల వెలుఁగు
వదనమునఁ గ్రమ్ముజడల నావలకుఁ ద్రోసి
కనులఁ బైకెత్తి లైలను గాంచి నవ్వి
"లైలవా? కల్ల నీవెట్లు లైల వౌదు?
విశ్వమెల్లను దానయై వెలుఁగునామె
స్వచ్ఛకాంతిదా సంఛన్నశకల మేమొ?
అంతియేకాని లైల వీవన్న నమ్మ!
నిదుగొ నాలైల నీకుఁ జూపింతుఁ గాంచు"
మంచు లైలా యనుచు గౌఁగిలించి లతలఁ
బూవులను లైలా యంచు ముద్దుఁగొనుచుఁ
బతులను లైలా యంచుఁ బలుకరించి

పలుదిశల లైలా యంచుఁ బరుగులిడుచుఁ
బోయె మజ్నూను ఆనందపురముఁ జేర.

### స్థాయీభావముయొక్క విశ్వవ్యాపిత్వము.

లైలా మజ్నూనునిఁ దన్నుఁ బరిగ్రహింపుమని కోరెను. కాని మజ్నూను సామాన్యవాంఛా ప్రపంచమును మీఱిపోయి నాఁడు. కామ్యవాంఛ లన్నియు విడనాడి లైలానామస్మరణ మున కాలముఁ గడపుచుండెను. అందుచే లైలాయొక్క ప్రేమమూర్తి యతనిమనఃఫలకమునఁ జిరముగఁ జిత్రింపఁబడెను. లైలదక్క నన్యము ప్రపంచమున నతనికి గోచరింపకుండెను. అతనితపము సిద్ధించెను. ఏలైలపొందు నతఁడు యావనోన్మా దవశమునఁ గోరెనో యాలైలపొందే యిప్పుడు తపోబలిమిచే నతఁడు మానసికముగ ననుక్షణ మనుభవించుచుఁ దనివిఁజెంది ప్రణయనిర్వాణానందమున నోలలాడుచుండెను. అందుచేఁ బ్రకృతిస్వరూపయగు లైలయొక్క బాహ్యస్వరూప మతని నాకర్షింపదయ్యెను. లైలయొక్క స్త్రీసహజమగు ప్రణయ వేదన యతనిమనస్సుఁ గరఁగింపఁజాలదయ్యెను. చివఱకు లైల యొక్క బాహ్యస్వరూపమునే యతఁడు గుఱుతింపలేకపో యెను. లైల స్త్రీసహజములగు చంచలతయు, మృదుస్వభావ మును కలది. అందుచేతనే మజ్నూనుని వీడి యింకొకనినిఁ బెండ్లి యాడినదియు నతనిమఱువఁజాలక యాతనియందే బద్ధాను రాగయై యుండెను. తత్కారణమున భర్త చనిపోయిన పిదప మజ్నూనుకడ కేతెంచి తిరిగి తన్నుఁ బరిగ్రహింపుమని యాతని వేఁడుకొనెను. తనవియోగముచే మజ్నూనునందుఁ గలిగినమార్పును, అతఁడు పడసినతపస్సిద్ధియు నెఱుఁగదయ్యెను.

మజ్నూనుని సామాన్యమానవునిగ లైల భావించి తన్నాతఁడు వరించునని నమ్మి యతని ననేకవిధములఁ బ్రార్థించెను. కాని పిట్టపిడుగువోలె మజ్నూ నామెతో "నీవు లైలవే కావు పొ" మ్మనుచు లైలను జూడుమని చెట్టుచేమలు, పూవులు, పక్షులు మొదలగువానినెల్లఁ జూపి తనదారిని దానుఁ బోయెను. మజ్నూను చెప్పినవాక్యము లెంతయు గంభీరములుగ నున్నవి. లైల విశ్వమెల్లను దానయై వెలుఁగునఁట. నిజముగ నట్లువెలిఁగి నను వెలుఁగకున్నను మజ్నూనునకుఁ బ్రణయతపస్సిద్ధివలనఁ బ్రపంచమున నెల్లయెడలను లైలయే వెలుఁగుచుఁ గనంబడెను. అందుచే నతనికి లైల కానివస్తువు లేనే లేకుండెను. స్థూల రూపము ధరించి యున్నలైల యామె స్వచ్ఛకాంతియొక్క ఖండమేమో, సంఛన్నశకలమేమో. అంతియెకాని లైల యామెయే యనిన నతఁడు నమ్మఁడు. ఆహా! మజ్నూను ప్రణయ భావ మెంత విశ్వవ్యాప్తి నొందెను. ఆహా! స్థాయిభావమున కుండఁదగిన విశ్వవ్యాప్తి మజ్నూనుని ప్రణయవ్యాపారమున నెట్లు ప్రదర్శితమైనది?

ప్రప్రమథమున స్థూలవస్తువు నాశ్రయించుకొని మజ్నూనుని రసభావము స్థూలవస్తుసంబంధమను శృంఖలల విదలించుకొని స్వచ్ఛంద ప్రవృత్తిఁ గాంచి విశ్వమెల్లను విహరించుచు విశ్వవ్యాప్తినొందెను. అట్లేకదా రసవిషయము? కవికిని ప్రకృతికినిఁ గలసంబంధ మట్టిదియేకదా?రసికుఁడు జన్మాంతరసంస్కార బలముచే నిమిత్తమాత్రముగ నొకవస్తువు నాధారముగఁగొని తన్మూలమున రసానుభూతి నొందును. కాని యతఁడు కొంత కాలమైనపిమ్మట రసానుభూతియొక్క బలిమిచే వస్తుసంబంధమునుగూడఁ ద్యజించి స్వతంత్రముగ రసానుభూతిఁ బడయుఁ

గలుగును. అట్లు కవి స్వతంత్రముగ రసానుభూతిఁ బడయఁ గలిగినప్పుడే యతనిరసభావము విశ్వవ్యాప్తమై సిద్ధిఁగాంచును. అట్టిరససిద్ధియే యాత్మవికాసమునకు స్వస్వరూపసంధానమునకు సాయము గావించును. అట్టి రససిద్ధులే సిద్ధపురుషులు. అట్టివారి నాశ్రయించుకొనియే ప్రపంచము వర్ధిల్లుచున్నది.

## ఉపసంహారము.

రసమునకు పర్యాయపద మనఁదగు స్థాయీభావము యొక్క ముఖ్యలక్షణముల మూఁడిటిని బైమూఁ డుదాహరణముల వ్యక్తముఁగావించితిని. శ్రీసీతారాముల ప్రణయమువిషయమున రసికునకును రసాశ్రయస్థానమగు వస్తువునకును గల యవినాభావసంబంధమును, నద్వైతభావమును, స్పష్టముఁ గావించితిని. శ్రీరాధామాధవులప్రేమవిషయమున స్థాయీభావ మెట్లు విరుద్ధభావములను సైతము నాత్మవశము గావించుకొని తనలోఁ గలిపికొనునో విశదీకరించితిని. లైలామజ్నూనుల ప్రణయవిషయమున రసభావ మెట్లు స్వతంత్రవ్యాప్తినంది విశ్వవ్యాప్తి నొంది సిద్ధిఁజెందునో వ్యక్తముఁ గావించితిని. రసము యొక్క యితరలక్షణములను జూపించుట కింక నెన్నియో యుదాహరణములను జూపింపవచ్చును. గ్రంథవిస్తరభీతిచే ముఖ్యము లగువానిని మాత్రమే యిచ్చితిని. మిగిలినవానినిఁ బాఠకులు తమ యనుభవమున సరిపోల్చికొనియెదరు గాక! స్థాయీభావము విరుద్ధభావములను సైతము తనలో నిమిడ్చి కొనుననుటకు "చిత్రాంగి సారంగధరులచరిత్ర" యొక నిదర్శనము. ప్రాణపదముగఁ బ్రేమించినసారంగునిఁ జిత్రాంగి చంపించుటయే యిందుకుఁ దార్కాణము. టెన్నిసన్ అనునొకకవి

ఈభావమునే డోరా (Dora) యనుకావ్యమున "I loved him, yet, I killed him" అనుమాటల వెలిఁబుచ్చెను. రసాశ్రయ హేతువగు వస్తువు నశించినను రసము రసికునియందు నశింప దనుటకు ఇందుమతీమరణానంతరము అజుఁడు కావించు విలాపమే తార్కాణము. ఈరహస్యమునే కాళిదాసు "శరీర నాశేఽపి సమానురాగయోః" అనుపదముల సువ్యక్తము గావించెను.

రసవిషయము మహాసముద్రమువంటిది. తఱచినకొలఁది రత్నములు దొరకుచుండును. కావ్యరత్నములు కోటానకోట్లు రసజగత్తును ప్రకాశమానము గావించుచున్నవి. అతిగఁ దఱచిన పూర్వము పాలసముద్రమునుండి విసము జనించినయట్లు ప్రమాదము లేమైన జనించునేమో యనుభీతిని ముఖ్యవిషయముల యథాశక్తిని జర్చించితి. ఇఁక ధర్మార్థకామమోక్షయుతమగు మానవధర్మమున రసమున కాశ్రయస్థాన మెద్దియో నిరూపించెదను.



# తృతీయ ప్రకరణము.

## ౧. మానవధర్మమున రసము దేని నాశ్రయించికొనును?

రసస్వరూప మెట్లుండునో కొంతవఱకు నిరూపించితిని. రసమునకుఁగల వివిధావస్థలను పరిణామభేదములనుగూడ వివరించితిని. ఈప్రకరణమున మానవధర్మమున రసమును, అదియాత్మగాఁగల కవిత్వమును వేని నాధారముగాఁ గొనునో సూచించి చర్చింప నెంచితిని.

### మానవధర్మముయొక్క నిరీక్షణము.

మానవధర్మ మన నేమి? దానియుపయోగ మేమి? అందు రసమునకును, రసాత్మకమగు కావ్యమునకును నేమైనఁ దావుండునా? పైప్రశ్నములకు జవాబు నొసఁగుట వివాదాంశము నింకొకదానినిఁ బైకిఁ ద్రవ్వితీయుటయే యగును. అయినను నట్లు చేయక తప్పదు. మానవధర్మమునకు మూలస్థానము మానవునియందున్న భగవదంశమే యని గ్రహింపనగును. మానవుఁడు భగవదంశాసంభూతుఁడని మనమతకర్తలును వేదాంతులునుగూడ నొప్పికొనిరి. వేదాంతులు మీఁదుమిక్కిలి మానవుఁడును భగవంతుఁడును నొకటియే కాని రెండు భిన్నవస్తువులు కారని నిర్ణయించిరి. ఈమానవుని భగవదంశము నాధారముగఁ గొని మానవుఁడు తనజన్మమును సార్థకముఁ గావించికొని భగవంతునిఁ జేరుటకుఁ దగినయుపాయములను నియమములను నిర్మించి మానవధర్మమును బ్రతిష్ఠాపనఁ గావించిరి.

ఈమానవధర్మముయొక్క ముఖ్యోద్దేశమును సూచించితిని. మానవుఁడు తన కుచితమయిన పద్ధతుల జీవితముఁ గడపి సఫలీకృతుఁడు కావలెనని నిశ్చయించి ధర్మజ్ఞు లనేకములగు నియమముల నేర్పఱచిరి. ఆనియమముల వ్యాప్తిని గూర్చియుఁ బ్రయోజనమునుగూర్చియుఁ బ్రసంగించెద. జీవితమునందలి వివిధాంశములను, వాని కేవిధమున సామరస్యము కలుగునో యావిధమును, నట్టిసమగ్రసామరస్యమున రసమునకుఁ గల ప్రాముఖ్యమును గమనింపఁదగినవిషయములు.

## మానవజీవితముయొక్క భాగములు. ౧. ఆత్మజీవితము. ౨. సాంఘికజీవితము.

మానవజీవితమున రెండుముఖ్యములగుభాగములు ఆత్మజీవితము, సాంఘికజీవితము ననుపేర్లఁ బరఁగుచుండును. ఆత్మజీవితమునకు రెండువిధములుగ నర్థముఁ జెప్పుకొనవచ్చును. ఎట్లనః స్వలాభ మనునొకయర్థమును, ఆత్మకు సంబంధించిన జ్ఞానజీవితమును మానసికజీవితమును నని రెండవ యర్థమును. అట్లే సాంఘికజీవితమునకును రెండర్థములు వర్తించును:— ఒకటిః సంఘముయొక్క సమష్టిశ్రేయము, రెండుః సంఘముయొక్క సమష్టి ఆత్మవికాసము, ఆత్మజ్ఞానమును. ఈ రెండిటికిని జాల సంబంధ మున్నది. ఎట్లనః—

## మానవునకు సంఘమునకుఁ గలసంబంధము.

మానవుఁ డెంత భగవదంశసంభూతుఁ డైనను నిమిత్తమాత్రముగనైనను శరీరమను నుపాధిఁ దాల్చి తల్లిదండ్రుల కడుపునఁ బుట్టి సంఘములో నొకసభ్యుఁ డై దినదినప్రవర్ధమానతఁ గాంచి జన్మాంతరసంస్కారవాసనాబలమున స్వీయా

త్మోపలబ్ధినిఁ బడయును. అందుచే బాహ్యసంఘాభివృద్ధి కొంత వఱకు మానవునివికాసమునకుఁ దోడ్పడును. ఎట్లనః—విద్వత్కుటుంబములో జన్మించి యందే పెరుఁగుబాలుఁడు విద్యావంతుఁడై పేరుప్రతిష్ఠల గడించును. మూర్ఖులయింటఁ బుట్టెడుబాలుఁడు తోడివారల దుర్నీతిని, జెడునడతను నేర్చికొని దుష్పథమునఁ జరించి చెడిపోవును. వరప్రసాదులై యీనియమమును మీఱి "తులశమ్మకడుపున దురదగొండి పుట్టుతుంది, దురదగొండికడుపున తులశమ్మ పుట్టుతుంది" యని జను లాడుకొనెడుసామ్యమునకు గుఱియైనవార లుందురుగాక! సాధారణముగఁ బైనఁ జెప్పఁబడిన సూత్రము వర్తించును. అందుకనియే మనవారు "కులమెఱిఁగిన కోతియైనఁ జేసికొనవలె" నని చెప్పుదురు. బాహ్యసంఘప్రవృత్తి మానవునిజీవితమున కొకవిధమగు నాధారముగను చేయూఁతగను నుండును. అట్టి చేయూతఁగొని మానవుఁడు స్వీయజన్మాంతరసంచితప్రతిభచే మహామహుఁ డగును.

కాని సంఘము ప్రవృత్తియే మానవునిజీవితమును బూర్తిగఁ బోఁతఁబోసినట్టు మార్పుఁజేయు నని చెప్పుటకు వీలులేదు. ఏలనన అట్లంటిమేని మహామహులందఱును సంఘప్రవృత్తివలన నుద్భవించి గొప్పతనము సంపాదించిరని చెప్పవలసి వచ్చును. అట్లు చెప్పిన నసత్యదోషమునకుఁ బాల్పడుదుము. ఎట్లన సంఘము లజ్ఞానాంధకారమగ్నము లై యున్నతఱి వరప్రసాదులగు మహామహులు సూర్యచంద్రాదులభాతి నుదయించి జ్ఞానజ్యోతులఁ గొని వచ్చి ప్రపంచమునెల్లను శోభాయమానముఁ గావించుచున్నారు. అట్టిమహామహు లవతరింపనిది సంఘ మభివృద్ధినొందక తొల్లింటి ప్రాకృతావస్థలోనే యుండుట

సంభవించును. కాని సంఘ మట్లు ప్రాకృతావస్థలో నుండక నిరంతరాభివృద్ధిఁ గాంచుచున్నదని యందఱకుఁ దెలిసినవిషయమే. అట్టిసంఘాభివృద్ధికి మహామహుల యద్భుతకృత్యములును, దివ్యచారిత్రములు నే కారణభూతములని యెఱుంగునది. అట్టిమహామహులు జన్మాంతరసంస్కారవాసనాబలమునఁ దమయందున్న భగవదంశమును బాగుగ గుఱుతించి యనుభవించి ప్రపంచమునకుఁ బ్రదర్శితముఁ గావించి సంఘము నున్నతస్థితికిఁ దేఁగలిగినారు. అట్టిమహాత్ములు సంఘమువలన గొప్పవారైరని చెప్పుట యసత్యమగును కాని అట్టిమహాత్ములు నైతము సంఘములో సభ్యులుగ సంచరించుచు నున్నంతకాలము సమష్టిసంఘశ్రేయము వారికిఁ గూడ నభ్యర్థనీయమగు కామ్యార్థముగ నుండవలెను.

అట్లు గాక మహాత్ములు తమదారిని దామే పోవుచు సంఘశ్రేయమునకుఁ బ్రతికూలు రగుచో సంఘముతో వారికి సంఘట్టనము కలుగక మానదు. అందుకనియే మన నైతికులు కొన్నియెడల "జనవాక్యం తు కర్తవ్యం" అని బోధించి యున్నారు. పాశ్చాత్యదేశములలోఁ గూడ "Vox Populi Vox Dei" "ప్రజావాక్యమే దైవవాక్యము' అనునార్యోక్తి కలదు.

ఆర్యధర్మము ఆత్మజీవితమునకును,
సాంఘికజీవితమునకును సమన్వయము
గూర్ప యత్నించును.

మానవజీవితమునందున్న పై రెండుభాగములకును సరిగ వర్తించు మానవధర్మమును శాసింప మనధార్మికు లెంతేని

పాటుపడిరి. మనశాస్త్రజ్ఞులే కాదు, ప్రపంచమున సర్వదేశముల యందలి ధర్మశాస్త్రజ్ఞులును నిరంతరమును బ్రయత్నము లింపు కొఱకై సల్పుచునే వచ్చినారు; సల్పుచున్నారు. శాస్త్రమునకు ముఖ్యమగులక్ష్య మేమన; మానవుఁడు సంఘమునకు విరోధి కాకుండ సంఘశ్రేయమునకుఁ బ్రతికూలుఁడు గాకుండ స్వీయ భగవదంశమునకుఁ బరిపూర్ణత్వము సిద్ధింపఁజేసికొనుటయు స్వీయక్షేమము నభివృద్ధిఁ జేసికొనుటయునే కాని వేఱుకాదు. ఎన్నిశాస్త్రములు పుట్టినను, ఎన్నిధర్మములు వెలసినను నీపర మార్థమును సాధించుకొఱకే. ఎన్ని ప్రతిష్ఠాపనలు గావింపఁబడి నను నీఫలితము లభించుటకొఱకే.

అంతియకాక మన ధార్మికులు ఆత్మజీవితమునకును సాంఘికజీవితమునకును నొక్కొకదానికిని ద్వివిధములగునర్థ ముల నొప్పికొని యున్నారు. ఆత్మజీవితమునకు మానవుని యొక్క బాహ్యజీవితమును, ఆంతరంగికజీవితమును నను రెండు అర్థముల నంగీకరించి యున్నారు. సాధారణముగ జీవనము జరుగునుపాయమును, భగవదంశము సంపూర్ణముగ సిద్ధిం చెడియుపాయమునుఁ గూడ మానవునికి నభ్యర్థనీయములని మనధార్మికు లాదేశించి యున్నారు. సంఘమునకుఁ గూడ ద్వివిధములగు శ్రేయము లవసరములని మనధార్మికు లంగీకరించి యుండిరి. అవి యేవనఁగా, సంఘముయొక్క యార్థికాభివృద్ధి యనఁగ ధనధాన్యాదిసంపదలును, మానసికాభివృద్ధియుఁ దదుప యుక్తములగు జ్ఞానసంపదయును నని మనధార్మికులు తెల్పిరి. వ్యష్టిపరముగ నవసరమని చెప్పఁబడిన బాహ్య, ఆంతరంగిక జీవితములే సమష్టిసంఘపరముగఁ గూడ నన్వయించును. ఇట్టి వ్యష్టిసమష్టుల రెండింటిశ్రేయములను సంపాదించుటయే.

సమగ్రమానవధర్మపరమోద్దేశమును, ముఖ్యకర్తవ్యమును, ప్రధానలక్షణమును.

## ఆర్యధర్మము ధర్మార్థకామమోక్షయుతము.

ఇట్టి సమగ్రమానవధర్మమును మనశాస్త్రజ్ఞులు ధర్మార్థకామమోక్షయుతముగ నిర్వచించినారు. ధర్మము, అర్థము, కామము, మోక్షము ననునాలుగుభాగములుకల మానవధర్మము సమగ్రమా? యసమగ్రమా, యని విచారించుట యప్రస్తుతము గాదు. ధర్మము మానవుఁ డనుష్ఠింపవలసినవిధులను నిర్ణయించును. అర్థము మానవునకు జీవనమునకుఁ గావలసిన ధనధాన్యసంపదలు లభించువిధమును దెలుపును. కామమన్ననో మానవునిమనమున నుండుకోరికలను, కామ్యార్థములను విశదీకరించును. జ్ఞానము మానవుని నిజభగవదంశమును గుర్తెఱుంగునట్లుఁ జేసి యాతనికి జన్మసాఫల్యముఁ గూర్పఁ బ్రయత్నించును. కావున మానవధర్మమున ముఖ్యాంశములుగ మనవారు విధులను, అర్థసంపదలను, కామ్యవిషయములను, నిష్కామత్వమును జ్ఞానమును గ్రహించిరి.

ఈధర్మార్థకామమోక్షములు పైన నేనువివరించిన వ్యష్టియొక్క భౌతికజీవితమును, ఆధ్యాత్మికజీవితమును, సంఘముయొక్క భౌతికజీవితమును, ఆధ్యాత్మికజీవితమునుగూడ నభివృద్ధి నొందించును. ధర్మార్థములు వ్యష్టియొక్కయు, సంఘముయొక్కయు భౌతికాభివృద్ధికిఁ దోడ్పడును. కామమోక్షములు వ్యష్టియొక్కయు సంఘముయొక్కయు, నాంతరంగికజీవితము నభివృద్ధిఁ జేయును. ధర్మములేనిది అర్థసంపాదనమును, అర్థసంరక్షణమును కష్టకార్యములగును. కామము. మోక్షమును

లేకున్న సంపదలెల్ల నిష్ప్రయోజనము లగును. ఈభావము నింకను విరళముగ విప్పిచెప్పెదను.

ధర్మమనఁగా మానవుఁడు నిర్వర్తింపవలసినవిధులను నిర్ణయించెడు శాస్త్రజాలమే. అర్థముకూడ నొకశాస్త్రమే. ఎట్లన, నర్థమైనను కొన్నివిధుల ననుష్ఠింపనిది లభ్యముకాదు. అర్థమును దుర్వృత్తివలన సంపాదింపక న్యాయమార్గమున సంపాదించి న్యాయమార్గమున వ్యయము గావించుచు సంరక్షించుకొనవలెననుటయే యర్థశాస్త్రముయొక్క యాదేశము. అంతియకాక యర్థశాస్త్రము సంఘముయొక్క యార్థికసంపద యెట్లభివృద్ధిఁ జెందునో సంఘము తద్విషయమున ననుష్ఠింపవలసినవిధు లెవ్వియో కూడ నిర్ణయించును. కావున శాస్త్రజాల మొకవంక మానవుఁ డొనరింపవలసినవిధులను నిర్ణయించును. వేఱొకవంక "కామము" మానవునికి సహజముగనుండు కోరికలస్వభావము, వానియొక్క తారతమ్యములను, మంచిచెడ్డలను వ్యక్తీకరించి యుత్తమజీవితపథమును జూపించును. అట్లే మానవుఁడు సర్వకామితార్థముల ననుభవించి సర్వకామ్యార్థముల స్వభావమునుఁ బూర్తిగ గుర్తెఱింగి యనుభవసంపన్నుఁడై స్వకీయభగవదంశమును దెలిసికొని భగవంతునిలోఁ జేరఁ బ్రయత్నించుటకు "మోక్ష" ముపకరించును. మానవునిభౌతిక జీవిత మేయడ్డంకులును లేకఁ తిన్నగ నెఱవేఱవలయుననిన ధర్మార్థములు రెండును నవసరములు. మానవునియాంతరంగిక జీవిత మభివృద్ధి నొందవలయుననినిఁ గామమోక్షము లవసరములు. ధర్మార్థముల రెండిటికినిజత, కామమోక్షములకు రెండిఁటికిని జత "కామి గాక మోక్షకామి గాఁడు." అను ప్రసిద్ధాభ్యుక్తియొక్క పరమార్థ మిదియే కదా?

## జీవితసంరంభముయొక్క స్వభావము.

కాఁబట్టి మానవజీవితము నొకవంకను కామార్థములు నడిపించును. వేఱొకవంక శాస్త్రములు విధినిషేధముల నిర్ణయించి మానవునికామార్థప్రవృత్తిని స్వచ్ఛందప్రవృత్తిని నడ్డగింపఁజూచును. కామార్థప్రవృత్తిచే సూచితమగు మానవస్వభావమునకును, శాస్త్రమునకును నిరంతరసంరంభమును, సంఘట్టనమును, జీవితమహాయుద్ధరంగమున జరుగుచునే యుండును. ఈసంరంభమునే పాశ్చాత్యశాస్త్రజ్ఞులు "Struggle for Existence" (జీవితసంరంభ) మని పేర్కొనినారు. ఈజీవితసంరంభముయొక్క స్వభావమును, అందు రసమునకుఁ గలసంబంధమును నిరూపించుటయే ప్రస్తుతకరణీయము. ఈజీవితసంరంభమున నెగ్గి కామార్థములకును, శాస్త్రాదేశములకును సామరస్యమును నెలకొల్పి నిర్వర్తితకాములును, సఫలీకృతమనోరథులును నై విజయులైనవారే సిద్ధపురుషులు. సామాన్యమానవు లీసంరంభమున కాలుసేతుల విఱుగఁగొట్టుకొనియో, ప్రాణములఁ బోఁగొట్టుకొనియో నశించుచున్నారు.

## ధర్మశాస్త్రనిరీక్షణము; విధులయొక్క స్వభావము.

మానవజీవితరథమునకు రెండుచక్రము లనఁదగు కామార్థములయొక్కయు, విధులయొక్కయు స్వభావమును, సంబంధమును జర్చించెదను. విధు లనఁగా మానవుఁడు పరులయెడ నడచుకొనవలసిన రీతు లనియే యర్థము. విధు లనంతములు. తల్లిదండ్రులయెడ నడచుకొనవలసినవిధులు, దాంపత్యధర్మమువిషయమున నడచుకొనవలసినవిధులు, బిడ్డలయెడ నడచుకొనవలసినవిధులు, స్నేహితులయెడ నడచుకొనవలసిన

విధులు, గురువులయెడ నడచుకొనవలసినవిధులు, రాజునెడ నడచుకొనవలసినవిధులు, ఇరుగుపొరుగువారియెడ నడచుకొనవలసినవిధులు, సంఘమునెడ నడచుకొనవలసినవిధులు, వ్యాపారమువిషయమునను, అర్థసంపాదనమువిషయమునను నడచుకొనవలసినవిధులు, స్వదేశక్షేమమువిషయమున నడచుకొనవలసినవిధులును, సర్వమానవజాతియెడ నడచుకొనవలసినవిధులు, సర్వభూతకోటియెడ నడచుకొనవలసినవిధులు, తుట్టతుదకు భగవంతునియెడ నడచుకొనవలసినవిధులును ననంతములు. ఈవిధుల నన్నిటిని నిర్ణయించి శాసించుశాస్త్రము లెన్నియేనియుఁ గలవు. సంఘశాస్త్రము, అర్థశాస్త్రము, శారీరశాస్త్రము, ధర్మశాస్త్రము, నీతిశాస్త్రము మొదలగుశాస్త్రము లెన్నియేనిఁ గలవు. ఈశాస్త్రములయొక్క మూలసూత్రము లన్నియు నొకేవిధముగ నుండును. సర్వశాస్త్రములకు సమానములగు సూత్రముల మీఱి వర్తించుశాస్త్రమునకుఁ బ్రమాణాధికార ముండదు. కావుననే శాస్త్రాదేశము సర్వవ్యాప్తిఁ గలిగి యుండవలెననియుఁ, దోడిశాస్త్రములతో సంబంధమును గలిగియుండవలెననియు శాస్త్రజ్ఞులు వలుకుట.

### కామముయొక్క స్వభావము.

ఇఁకఁ గామ్యార్థము లనఁగా నేమి? కోరికలు మానవుఁడు జీవితకాలమునఁ గోరుకొనుచుండు కోరికలే. రుచ్యాహారములు కావలెనని కోరుట, చక్కనిగుడ్డలు కావలెనని కోరుట, చక్కనినగలు, చక్కనిపూవులు, తీయనిపండ్లు, కమ్మని పిండివంటలు, చక్కనిపెండ్లాము, చక్కనిపిల్లలు, సుఖమరణము కావలెనని కోరుటయు మొదలుగాఁగలయవి. కోరికలు లేని

మనుష్య లుండనే యుండరు. బ్రతికినంతకాలము నేవో కోరిక లుండనే యుండును. ఏకోరికలును లేనిస్థితి యేది యున్నదో అదియే ముముక్షుత్వము, ఈశ్వరత్వము. ఏవిధము లయినకోరికలును లేనివాఁ డెవ్వఁడో అతఁడే ఈశ్వరుఁడు. కోరిక లెప్పుడు కలుగునో అప్పుడే యతఁడు మనుష్యుఁ డగును. చచ్చిపోవువఱకును, చచ్చిపోవునప్పుడును గూడఁ గోరికలుండును. స్వర్గమునకుఁ బోవలెనను కోరిక, తనవంశ మాచంద్ర తారార్కమభివృద్ధి నొందవలెనను కోరిక, ఇట్టివెన్నియో మనుష్యున కుండును. "చావుకాలానికి లావుకోరిక" లందురుగదా! విల్లులు (మరణశాసనములు) వ్రాసి భవిష్యత్కాలపుసంగతులనుగూర్చి కట్టుబాటులఁజేసి చచ్చువా రెందఱులేరు? అందులకనియే "తస్మాత్ జాగ్రతజాగ్రత" యనుకథలోని వెట్టివాఁడు జనుల నుద్దేశించి పల్కినశ్లోకములలో

"ఆశయా బధ్యతే లోకః కర్మణా బహుచింతయా,
ఆయుఃక్షీణం న జానాతి తస్మాత్ జాగ్రత జాగ్రత"

యని యుపోద్బోధించెను. అనుక్షణ సన్నిహితమృత్యువులయి యుండియుఁ గూడ మనుజు లూరక కోరికలఁ గోరుకొనుచు నాశాబద్ధులుగ మృతినొందుచున్నారు. కావున మనుష్యత్వమునకుఁ బ్రధానలక్షణము కోరిక లుండుటయే. దీనినే మనవారు కామముగ నిర్వచించియున్నారు.

### కోరికలు వివిధములు.

కోరికలు వివిధములుగ నుండును. కోరికలలోఁ గొన్ని క్షణికానందము నిచ్చునవియుఁ, గొన్ని శాశ్వతానంద మిచ్చునవియు నుండును. కోరికలలోఁ దారతమ్యములును నెచ్చు

తగ్గులును గోచరించుచుండును. ఎట్లనఁగా: వీధినిఁ బోవుచుం డఁగా మనకనుల కెందఱో సుందరులు కనుపింతురు. ఎంత చక్కఁగా నున్నారు! ఎంత బాగుగానున్నారని సంతసింతుము. కాని యిందఱికన్నను మనభార్యలే మన కెక్కువయందముకల వారుగాఁ గనిపింతురే! అదియేమి? వీధినిఁ బోవుచుండఁగా ముద్దుబిడ్డ లెందఱో కనుపింతురు. వారియాటలు చూచినను, వారిమాటలు విన్నను ముచ్చటగానే యుండును. కాని వారి యందఱికన్న మనకడుపునఁ గన్నబిడ్డలయం దెంతతీపియు నంత మమకారమును నెట్లేర్పడును? చటుక్కున నొక్కమాఱు వీధినిఁ బోవుచుండఁ గనుపించినవారివైపు దృష్టిపోయినప్పటి. కిని తిరిగితిరిగి పదేపదే, వారిని గలసికొని, సహవాసముఁ జేసి కొని యాసహవాసముమూలముగా శాశ్వతానందముఁ బొందు టకుఁ దగినవీలుండదు కావుననే ఊరక సంతోషింతుము. మన భార్యాపుత్రాదులవిషయ మట్టిది కాదు. ఏలనన, మనజీవిత ములును వారిజీవితములును ప్రేమసూత్రములచేఁ గట్టఁబడి యున్నవి. నిత్యమును జూచుచు సంభాషించుచుఁ గలసిమెలసి సౌఖ్య మనుభవించుచుండుటవలన మనయానందమునకుఁ జిర స్థాయి యేర్పడుచున్నది. అదియే చిరకాలము పాఁతుకొనియుం టచే శాశ్వతానంద మగుచున్నది. కారణాంతరములవల్ల వియోగ మేర్పడినప్పుడు వీథులవెంటఁబోవుచున్నప్పుడుఁ గని పించెడు సుందరులపైనను, బిల్లలపైనను మనసు లగ్నముకాదు. ఎంతసేపటికిని నాభార్య నాబిడ్డ లనియే మనసు పీకుచుండును. కాఁబట్టి శాశ్వతానందమునకు మానవునకు సహజమైనకామ మును చిరానుభూతియుఁ గారణము లైయున్నవి. కోరికలన్ని ‘టిలో’ నతీతానంద మిచ్చునది భగవంతునిలోఁ జేరవలె నను

కోరికయే. అదియే చిదానందము నొసఁగును. అదియే కామపరి ణామము. దీనినిగూర్చి ముస్ముందు విచారించెదము.

## కామ్యార్థములు భిన్నమగుచో నెట్లు?

కోరికలయొక్క స్వభావమును నిరూపించితిమికదా. ఇఁక విధులనుగూర్చియు, కోరికలకును వానికిని గలసంబంధమును విచారించెదము. ప్రతిమనుష్యునకును కోరికలుండియే తీఱునని గదా యింతవఱకుఁ దేలినది? కాని ప్రపంచముననున్న మనుజు లందఱకోరికలు నొకేతీరుగా నుండునా? ఉండవు. ఒకయింటి లోనే ఒకరికొకవస్తువిష్టము, ఇంకొకరి కింకొకటి యిష్టము. మఱియొకరికి మఱియొకటి యిష్టము. ఇంటిలోనున్న స్త్రీలలోఁ గూడఁ గోరికలలో భేద ముండును. ఒక్కొక్కరిత కొక్కొ క్కరంగుగలవస్త్రము బాగుండును. ఒక్కొక్కరిత కొక్కొక నగపై మోజుండును. ఇట్టులనే ఒక్కొకదేశమందు మొత్తము మీఁదఁ గొన్నిరకములగుడ్డలపైనను, నగలపైనను, తినుబండ ములపైనను, ఆచారవ్యవహారములపైనను నాదరముండును. వేఱొకదేశమున వానిపై నాదరము తక్కువగా నుండును. ఉదాహరణము:—మనఆంధ్రదేశమునఁ గారముపైనను, కాఱు రంగులపైనను, గాఁటువాసనగలపూవులపైనను ఆదరము మెండు. పశ్చిమదేశముల వీనిపై నాదరము తక్కువ. మనదేశ మునఁ జల్లఁదనమన్నఁ బ్రేమసూచకమును, శాంతిసూచకమును నగునర్థమును, ధ్వనియును కలుగుచున్నది. చల్లనితల్లి కడుపు చల్లఁగా, చల్లనికౌఁగిలి యనుపదములయొక్క స్వారస్యము గమనించునది. పశ్చిమదేశములఁ జల్లఁదనమున కంత యాదరము కానరాదు. "Warm embrace, warm welcome, warm blood"

(వెచ్చనికౌఁగిలి, వెచ్చనిస్వాగతము, వెచ్చనినెత్తురు) మొదలగు పదముల ప్రేమసూచకమగు నర్థమువచ్చు సందర్భముల వాడె దరు. శీతోష్ణస్థితులనుబట్టియు, దేశకాలపాత్రములనుబట్టియుఁ, జరిత్రము ననుసరించియు దేశములోనుండు మనుజులయొక్క కోరికలు మాఱుచుండును. గృహవిషయమునను నట్లే.

## శాస్త్రముయొక్క యావశ్యకత.

కాని ప్రపంచమున ననేకప్రకృతులుగల మనుజు లుందురే, అనేకవిధములగు కోరికలఁ గోరుచుందురే, ఆకోరి కలు కోరుమనుజులలో వారిలోవారికి విరోధము సంభవించి నపుడును, ఒకమనుష్యుఁడు కోరు కోరికలలోనే యొకదానికి నింకొకదానికిని విరోధము కలిగినప్పుడు చేయఁదగినది యేమి? లోకమునఁ గొందఱికోరికలు మిగిలినవారికి బాధాకరములుగా నుండును. ఉదాహరణము:—ఒకనికి నరమాంసమనిన రుచి యనుకొందము. వాఁడు నరమాంసము రుచికదాయని రోజున కొకని బలిఁగొనుచుఁ దినెదునెడల నంచఱిగతి యేమికావలెను? ఇంకొకనికిఁ బరకాంతాసంగతి కడుఁబ్రియ మనుకొందము. అట్టివాఁడు కులకాంతలఁ జెఱఁబట్టుచుండఁ జూచి యోర్వఁ గలమా? ఇంకొకనికిఁ గన్పించినవారినెల్లఁ గొట్టుటయుఁ దిట్టు టయు నిష్టమనుకొందము. వానికోరిక నెరవేర్చుటకై మనము దెబ్బలును దిట్లును పడఁగలమా? కాఁబట్టి లోకమున మను ష్యుఁడు కోరుకోరికలు తనకుఁగలమనుజుల బాధింపఁగూడదు. అట్లు బాధింపఁజొచ్చిన మిగిలినవారలు ప్రతీకారము చేయం జూతురు. అట్టిప్రతిక్రియ రాజశాసనమూలముగఁగాని, న్యా యశాస్త్రము మూలముగాఁగాని జరుగును. ప్రకృతవిషయమున

నట్టిప్రతిక్రియనే శాస్త్రములు విధించుచున్నవి. అట్టికోరికల వలన నితరులకు బాధ జనింపకుండుటకై శాస్త్రములు మానవుఁ డనుసరింపవలసినవిధులనునిర్ణయించును. అట్టివిధ్యుక్తమార్గాను సరణమే కర్మమార్గము, కర్మయోగము ననుపేర్లఁ బరఁగు చున్నది. "శాసతీతి శాస్త్రం" అనుసంస్కృతవ్యాఖ్యప్రకారము శాస్త్రమునకు శాసనాధికారము కలదని మనశాస్త్రజ్ఞు లంగీక రించియున్నారు. అట్టిశాసనముల నన్నిటిని క్రోడీకరించి ధర్మ శాస్త్రము, నీతిశాస్త్ర మాదిగాఁగలశాస్త్రముల రచించి "ధర్మ" మనుపేర మానవధర్మమునఁ జొప్పించియున్నారు. ప్రప్రథమ మున ధర్మము పేరొకొనఁబడియుంటచేఁ బ్రతివానికిని ధర్మాచర ణము ముఖ్యమనియుఁ, దనమూలముగ నితరులకు బాధ కలుగఁ గూడదనియు, మనవారు బోధించిరి. శాస్త్రము నైచ్ఛికముగా వదలినచో నెల్లరును శాస్త్రమును మీఱియే సంచరింతురు. కావుననే మనజీవితమున ననుసరింపఁదగినవిధులను నిర్ణయించు కొఱకును, మనకోరిక లితరులను బాధింపకుండుటకును నొక శాస్త్రమును నిర్మించి యధికారరీత్యా మనజీవితముల సామర స్యముఁ గల్పింపఁ జూచినారు. ఈశాస్త్రజాలమునే మనవారు ధర్మార్థకామమోక్షసంయుతమగు మానవధర్మమునఁ బ్రప్రథమ మునఁ జేరొకొనినారు. విధులవిషయమున శాస్త్రనిర్దిష్టమగు ధర్మ మవశ్యాచరణీయము. లేనిచోఁ బ్రపంచమునఁ బరస్పర విరోధమును, వైపరీత్యమును, సంరంభమును సంఘట్టనమును దప్పవు.

### శాస్త్రము కామమును శాసింపఁజాలదు.

విధులనయితే ధర్మము నిర్ణయించి యడ్డగింపఁగలదు గాని మానసికములగు కోర్కుల నడ్డగింపఁగలదా? నాకుఁ బ్రపంచమునకంతకును రాజును గావలెననుకోరిక యున్నదను కొందము. ఏశాస్త్రము న న్నడ్డగించును? మనస్సులోఁ బాలుఁ ద్రావుచో మనల నడ్డగించువా రెవ్వరు? ఆకోరిక ననుసరించి యితరులను బాధింపఁ జొచ్చినయప్పుడే సంరంభము జనించును. అంతవఱకును భయము లేదు. మానసికస్వాతంత్ర్యమును భగవంతుఁడుకూడ నడ్డగింపఁజాలఁడు. అట్టిచో శాస్త్ర మేవిధిని మానసికస్వాతంత్ర్యము నడ్డగింపఁగలుగును? మృత్యువున కేమైన నీపని సాధ్యమగునేమో? ఈశంకకుఁ గూడఁ బూర్వ పక్షమున్నది. ఎట్లన మృత్యుకాలమునఁ గోరిక లున్నచో నాకోరికలఁ దీర్చుకొనుటకొఱకు వేఱొకజన్మ మెత్తవలసియుండునని శాస్త్రము. కావున నిచ్ఛాసామ్రాజ్యమునకు మనస్సు సర్వ సర్వంసహాచక్రవర్తి యనఁదగును. కావునఁ గ్రియారూప మునఁ బరిణమింపని శుద్ధమానసికవ్యాపారములయందెల్ల మనస్సునకుఁ బరిపూర్ణస్వాతంత్ర్యము కలదు. శాస్త్రము మన యిచ్ఛాసామ్రాజ్యముపై నధికారము చలాయింపఁజాలదు.

### శాస్త్రము రసమును, గవిత్వమును నిరోధింపఁజాలదు.

రసమును, రసానుభూతియుఁ, దదాత్మకమగు కవిత్వ మును శుద్ధమానసికవ్యాపారములని చిన్నపిల్లలునై తము గ్రహింపఁగ్లరు. రసికునకు, రసానుభూతియందునను, కావ్యా నందానుభూతియందునను నపూర్వమగుమానసికస్వాతంత్ర్య ము కలదని మనమంగీకరింపక తప్పదు. ఇట్టి మానసికస్వాతం

త్ర్యమునే పాశ్చాత్యశాస్త్రజ్ఞులు "Freedom of the will" అని తెల్పియున్నారు. అట్టిచో, రసమును, రసానుభూతియు, కవిత్వా నందానుభవమును, గావ్యమున వర్ణితములగు భావములును, శాస్త్రబద్ధములును, శాస్త్రబాధితములును గానేరవు. శాస్త్రము నకును రసానుభూతికిని తదాత్మకమగు కవిత్వమునకును జాల దూరము సపతిపోరాటము. శాస్త్రము దేనిని గూడదనునో కవిత్వము దానినిసైతము స్వీకరించుచు మనోహరముగఁ జిత్రించును. శాస్త్రము దేని నవశ్యానుష్ఠేయమని నిర్ణయించునో కవిత్వము దానిని శుద్ధశ్రోత్రియవ్యాపారమని త్రోసివేయును. ఉదాహరణము:—శాస్త్రమునఁ గులకాంతకుఁ బరపురుషునిసం గతి మహాపాతకమనియు, ఘోరనరకాపాదకమనియు నాదే శింపఁబడినది. కాని, రాజరాజనరేంద్రునిఁ భార్యగానుండి సవతి కుమారుఁడగు సారంగధరునివలచి యతనికొఱకై ప్రాణముల సైతముఁ ద్యజించిన చిత్రాంగియు, గొల్లనిభార్య యయ్యు శ్రీకృష్ణునకు హృదయసమర్పణముఁ గావించిన రాధయు, సాహితీప్రపంచవాసులలో ధన్యులు, మృతజీవులు. సాహితీ ప్రపంచవాసుల కుండవలసిన లక్షణములును, గుణములును, ప్రతిభలును వేఱుగ నుండును. అవి గతానుగతికులును శాస్త్ర నియమశృంఖలాబద్ధులును నగుసామాన్యమానవులయెడఁ గన్ప ట్టవు; వారి కూహాతీతము లయియుండును. కవిత్వ మెప్పుడును శాస్త్రమువలె దేశకాలపాత్రములనే యాధారముగఁ గొని వానినే యనుసరించుచు నుండదు. మీఁదుమిక్కిలి కవిత్వము దేశకాలపాత్రముల కతీతమై స్వచ్ఛందసంచారముఁ గావించు చుండును. శాస్త్రదృష్టి యెన్నటికి హ్రస్వదృష్టియే. రసదృష్టియుఁ గవిత్వదృష్టియు దీర్ఘము లైయుండును. కావ్యదృష్టి యతీత

దృష్టి. దీనినిగూర్చి స్థలాంతరమున విపులముగఁ జర్చించియే యుంటిని. ప్రస్తుతవిషయమున కుపకరించుటకుఁ దేలిన దేమనఁగా శాస్త్రమునకుఁ గవిత్వమునకు మొగమెఱుకయే యనియు, శాస్త్రనియమములు కవిని బాధింపనేరవనియుఁ గవి నిరంకుశుఁ డనియునే. అందుచే రసమును తదాత్మకమగు కావ్యమును మానవధర్మమునకు నంగములగు ధర్మార్థకామమోక్షములందు శాస్త్రసార మనఁదగు ధర్మము నాశ్రయించుకొని యుండవని సిద్ధాంతమగుచున్నది.

## రసము అర్థమునాశ్రయింపదు.

సరే, రసము ధర్మము నాశ్రయింపదు. పోనీ, అర్థము నేమైన నాశ్రయించునా? అర్థసంపాదనమునకును, రసానుభూతికినిఁ బ్రబలవిరోధము. ధనార్జనపరుఁడగువానికి రసానుభూతి యుండదు. ఒకవేళ కొంచెమేమైన నున్నచో నది ధనార్జనమునకుఁ జేటు నాపాదించునేకాని సాయము జేయఁజాలదు. "బంగారువంటికోమటి సంగీతముచేత బేరసారము లుడిగెగా" అనుపద్యమే యీహాస్యమును వేనోళ్లఁ జాటుచున్నది. ధనార్జనమునకును,ధనసంరక్షణమునకును,రసభావమునకును జాలవైపరీత్యమును విరోధమునుగలవు. ధనార్జనపరునకు ధనసంపాదనమే యొకపరమార్థ మగుచున్నది. అందు సర్వవిధములగు భావవిశేషములకుఁ దావుచేకూఱిన ధనసంపాదనమునకుఁ జేటువచ్చును. "ఈధనమే, ఈధనమే, ఇహపరసాధన మీధనమే" యని పలవరించెదు. కలిపురుషుఁడే ప్రపంచమున ధనార్జనపరునిరూపమున నవతరించి ప్రస్తుతము భూలోకము నంతయు నవిచ్ఛిన్నముగ నేలుచున్నాఁడు. ఇట్టి కలిపురుషులే

ప్రస్తుతై రోషావాసులు. అందులో నాంగ్లేయులు సాక్షాత్తు కలిపురుషావతారులు. అందుకనియే వారికి ద్రవ్యకాంక్ష మెండు. రసభావము మృగ్యము. ధనసంపాదనమను స్థాయీ భావమును దోహదముఁజేయు విభావానుభావాదులు పిసినిగొట్టుతనము, దురాశ, యన్యాయవర్తనము, పరధనాపేక్ష, యసత్యము, అసూయ, అప్రమాణము, ఈర్ష్య, యేడుపుగొట్టుతనము, నిర్దయ, మొగమోటమిలేమి మొదలగుదుర్గుణములు. ఇట్టి దుర్గుణములపరంపరతోడ రసభావమునకుఁ జెలిమి పొసఁగదు. కావున రసము అర్థము నాశ్రయింపదు.

## రసము మానవసహజమగు కామము నాశ్రయించును.

ఇఁక రసము దేని నాశ్రయింపవలెను? కామము నాశ్రయించునా? విచారింతము. రసము, అనఁగ భావానుభూతి, దేనికి సంబంధించినది? మనుజున కుండుసహజములగు కోరికలవిషయముననే భావానుభూతికిఁ బ్రసక్తి కలుగును. కామ్యార్థము కోరుటలో నొకవిధమగు భావానుభూతి, దానికొఱకుఁ బ్రయత్నించుటలో నొకవిధమగుభావానుభూతి, అది లభ్యమైనప్పు డొకవిధమగు భావానుభూతి, అది చేజాఱిపోవునప్పు డొకవిధమగు భావానుభూతి, తిరిగి యది లభ్యమైనప్పుడు మఱి యొకవిధమగు భావానుభూతి, ఇంక నెన్నియోవిధములగు భావానుభూతుల మనుజుఁ డనుభవించుచుండును. ఆశ, ఉత్కర్ష, సంతోషము, దుఃఖము, శాంతి, శమము మొదలగు భావము లెన్నేని మనుజుఁ డనుభవించుచునే యుండును. జీవితమంతయుఁ గామ్యార్థములతో నిండియుండుటచే భావము లెప్పుడును ననుభూతము లగుచునే యుండును. అందుకనియే

కొందఱు పాశ్చాత్యశాస్త్రజ్ఞులును "Life is a bundle of experiences" జీవితము (భావానుభవములయొక్క సమూహము) అని చెప్పినపలుకులయం దెంతయు సత్యము గోచరించుచున్నది.

## కామము విశ్వవ్యాపి.

జీవితకాలమునఁ గామ్యార్థములఁ గోరనివాఁడును, తన్మూలముగ వివిధభావసంచలనమునకు లోనుగానివాఁడును బ్రపంచమున నరుదుగ నుండును. కేవలధనార్జనపరుఁడై సర్వకామోపభోగముల ధనవ్యయమునకు వెఱచి త్యజించెడు పీనాశియైనను ధనరాసులఁ జూచునప్పుడు సంతోషమును బొందక మానఁడు. నిశ్చలచిత్తుఁడై, సర్వసంగముల వర్జించి, రాగరహితుఁడై యోగనిష్ఠ మెయిఁ దపమొనర్చు యోగీశ్వరుఁడును దివ్యతేజము కనులయెదుటఁ బ్రత్యక్షమగునప్పుడు ఆనందము నొందక మానఁడు. చిత్తవిభ్రమమునొందిన పిచ్చివాఁడును, త్రాఁగి మత్తిల్లి క్రిందఁబడియుండు త్రాగుఁబోతునుగూడ భావసంచలనముఁ బొందుదురుగాని యాభావమిట్టిదియని తమలోఁ దామైనను గుర్తింపనేరకుందురు. చిట్టచివరకు శిశువులుఁగూడ మాతృవదనదర్శనముఁ గావించునప్పుడును, బరిచితులమోము గనుపడునప్పుడును నొకవిధమగు భావము ననుభవించుచునే యుందురు. కాని వారికిఁ గామ్యార్థమును గూర్చినజ్ఞానము లేకుండుటచే భావానుభూతినిఁగూర్చిన స్వజ్ఞానమును లేకుండును. కామ్యార్థమున్న యప్పుడెల్ల భావానుభూతి యగుచునేయుండును. కావున గామ్యమునకును భావానుభూతికిని యవినాభావసంబంధమున్నది. కావుననే భావానుభూతి యనఁదగురసము కామము నాశ్రయించుకొనునని చెప్ప సాహసించుచున్నాము! కామము

లేనివాఁ డెట్లు జగమున నరుదుగ నుండునో అట్లే భావసంచల నముఁ బొందనివాఁడును జగమున నుండుట యరుదు. అందుచే భావానుభూతి, అనఁగా రసము సర్వవ్యాపి యని తేలుచున్నది. రసమునకుఁ దావులేనిచో ట్లుండవు. పిపీలికాదిబ్రహ్మపర్యం తము రసభావము వర్తిలుచునే యుండును. ఎట్లనఁ గ్రిమికీటక ములలోనైతము భావానుభూతి విదిత మగుచున్నది. ఎవరైనఁ గాని యేదియైనకాని యడ్డువచ్చినపుడు భయపడి పాఱి పోవుట నిజప్రాణపోషణమునకై యోరిమితోడను శ్రద్ధ తోడను బాటుపడుట సంతానరక్షణమునకై ప్రాణములనైత మర్పించుటకు సిద్ధముగ నుండుట మొదలగుభావములయను భూతి చీమదోమమొదలు సర్వజంతుకోటియందునను సువ్యక్త ములు. కావున భావానుభూతిలేనిజంతువునైత ముండదు.

ప్రకృతికూడ భావసంచలనము నొందును.
జగదీశచంద్రవసువుగారి నూతనసిద్ధాంతము.

అంతయేల? ప్రస్తుతము భారతీయప్రకృతిశాస్త్రజ్ఞులలో నెల్ల నగ్రగణ్యుఁడగు జగదీశచంద్రవసువుగారు ఇన్నివేలసంవ త్సరములనుండియు మానవునిచే నచేతనములనియుఁ బ్రాణ శూన్యములనియు నెంచఁబడినవృక్షములు, ఱాలు, లోహ ములు, మొదలగు వానియందునను గూడ సంచలనమును భావానుభూతియు విదితములేయని సప్రమాణముగ దిక్ప్రదర్శి తముఁ గావించిరి. భగవదాత్మవినా ప్రపంచమున వేఱువస్తువు లేదని చెప్పిన యుపనిషద్వేదాంతసిద్ధాంతపరిణామము ప్రకృతి శాస్త్రమున శ్రీజగదీశచంద్రవసువుగారినూతనసిద్ధాంతమునందు వ్యక్తమగుచున్నది. సర్వప్రపంచమునకుఁ గర్త యొక్కఁడే

యనియు నతనికి విరుద్ధమగు వేఱుపదార్థము లేదనియు, నతనిచే సృజింపఁబడిన సర్వపదార్థములు నతని తేజముతో నిండియుండు ననియు, నట్టివస్తువు లన్నిఁటియందునను జైతన్య ముండు ననియు, అట్టిచైతన్యబలమున సర్వవస్తువులును బ్రాణులమగు మనయట్ల భావసంచలనముఁ బొందుచునే యుండుననియు, భగవంతునిసర్వమయత, యచేతనములని మనము తప్పఁదలఁచిన వస్తువులపట్లఁగూడ వర్తించుననియు, అచేతనములుగదా యను తప్పుతలఁపున వానిని హింసించిన వానికి బాధకలుగు ననియుఁ దెల్పి "తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహితత్వమ్మును జరపువాఁడు" అనుభాగవతవచనము యొక్కయు "ఆత్మవత్సర్వభూతాని" యను నుపనిషద్వాక్యము యొక్కయుఁ బ్రామాణ్యమును బ్రాముఖ్యమును గ్రూరులును, రాజ్యకాంక్షాపరులును, హింసారతులును, మాంసాశనులును, నాస్తికులును నగుపాశ్చాత్యశాస్త్రజ్ఞులకును పాశ్చాత్యజనులకును వెల్లడించి భారతీయవిజ్ఞానప్రాశస్త్యమును ఘంటాపథముగఁ జాఁటి తన్నుగన్న దేశమునకు ఖ్యాతియుఁ దనకశేషశేముషియును శ్రీవసువు గడించినాఁడు.

## వాల్మీకిరామాయణమునుండి యుదాహరణములు.

మృగములకును, నదులకును, బర్వతములకును, వృక్షములకును, లతలకునుగూడ భావసంచలనమును జైతన్యమును నుండుననుటకు వాల్మీకిరామాయణమున రావణుఁడు కామోద్రేకవశుఁడై సీత నెత్తుకొనిపోవునపుడు అనాథయై విలపించు సీతయొక్క దురవస్థకు మనసులు గరఁగి వాపోవుజంతువుల యొక్కయు నచలప్రకృతులయొక్కయు విలాపమే నిదర్శనము.

ఆదికావ్యమునుండి యీ క్రిందిశ్లోకముల నుదహరింపక మానఁ జాలను:—

శ్లో. ఉత్పన్నవాతాభిహతా నానాద్విజగణాయుతాః,
మా భైరితి విధూతాగ్రా వ్యాజహ్రురివ పాదపాః.

స-౫౨-౩౬.

నలినో ధ్వస్తకమలాస్త్రస్తమీనజలేచరాః,
సఖీమివ గతోచ్ఛ్వాసామన్వశోచంత మైథిలీమ్. ౩౭
సమంతాదభిసంపత్య సింహవ్యాఘ్రమృగద్విజాః,
అన్వధావంస్తదా రోషాత్సీతాం ఛాయానుగామినః. ౩౮
జలప్రపాతాస్రముఖాశ్శృంగైరుచ్ఛ్రితబాహుభిః,
సీతాయాం హ్రియమాణాయాం విక్రోశంతీవ పర్వతాః.
హ్రియమాణాం తు వైదేహీం దృష్ట్వా దీనో దివాకరః,
ప్రతిధ్వస్తప్రభశ్శ్రీమా నాసీత్పాండరమండలః. ౪౦
నాస్తి ధర్మః కుతస్సత్యం నార్జవం నానృశంసతా,
యత్ర రామస్య వైదేహీం భార్యాం హరతి రావణః. ౪౧
ఇతి సర్వాణి భూతాని గణశః పర్యదేవయన్,
విత్రస్తకా దీనముఖా రురుదుర్మృగపోతకాః;
ఉద్వీక్ష్యోద్వీక్ష్య నయనైరాస్రపాతావిలేక్షణాః. ౪౨
సుప్రవేపితగాత్రాశ్చ బభూవుర్వనదేవతాః. ౪౩

పాశ్చాత్యులసిద్ధాంతము. ౧. వర్డ్సువర్తు ౨. టెన్నిసన్.

పాశ్చాత్యులలోఁ గూడఁ గొందఱు కవీశ్వరులు వర్డ్సువర్తుమొదలగువారు ప్రకృతికిఁగూడ స్వతంత్రమగుచైతన్యము కలదని వర్ణించి కావ్యముల రచియించినారు. ఈభావమునే "All the world is a cosmos, a single powerful, mighty, idea."

అని పాశ్చాత్యతత్త్వవేత్తలు వర్ణించినారు. అగును. ఇం దా శ్చర్య మేమి కలదు? జంతుకోటికిని నచలప్రకృతులకుఁ గూడ భావసంచలన మున్నదనుచున్నామే యిందులకుఁ గారణము సర్వప్రపంచమును నడపుచుండు కామమే కాని వేఱుకాదు. ఏదోయొకకోరిక సర్వప్రపంచమును నావహించుకొనియే యుండును. ఈభావమే "ఆశయా బద్ధ్యతే లోకే కర్మణా బహుచింతయా" యనునార్యవచనమునందునను, "One idea, One Reality, One God, and all creation moves towards it", అని "In memoriam" అనుకావ్యమునఁ జెప్పిన టెన్నిసన్ కవివాక్యము నను ధ్వనించుచున్నది. టెన్నిసన్ కవిభావ మేమనఁగ నొకటే భావము, నొకటే సత్యము, నొకఁడే భగవంతుఁడు, సర్వప్రపంచ మును నడపించుచున్నారనియే. సృష్టి యచేతన కాదనియు, భావపూరితయును, సచేతనయు ననియే.

## ఉపసంహారము.

కావున నింతవఱకుఁ దెలియవచ్చిన దేమనఁగాఁ బ్రపం చము సర్వమును గామముచే నడపింపఁబడుచుండుటచే భావ పూరితమనియు, భావాస్పదముఁ గూడననియు, నందుచేఁ బ్రకృతియందు రసమునకుఁ దావులేనిపట్టే యుండదనియు, రసప్రవృత్తికి నేయడ్డును లేదనియు, జన్మాంతరసంచితచిత్తపరి పాకముఁ గలిగినకవికి జగత్తు సర్వమును రసభావోద్దీపకమే యనియు, రసము వినా జగత్తు శూన్యమనియును, కావుననే రసమునకు రసాత్మకమగుకావ్యమునకును మానవధర్మమునఁ గామమే యాశ్రయ మగును.

ఇఁక మోక్షమునకును రసభావమునకును గలసంబంధము నించుక విచారింతము. "మోక్షము" అని మనవారు మానవధర్మమునఁ జేర్చియున్న జీవితభాగమునకు రెండర్థములు కలవు. ఒకటి భగవంతునిలోఁ జేరి యైక్యమై జీవన్ముక్తి నొందవలెనని మానవుని కుండుకాంక్ష. రెండవది యేకోరికలును లేక రాగవిముక్తుఁడై నిశ్చలుఁడై మానవుఁడు పరబ్రహ్మయగు నవస్థ. మొదటియర్థము ప్రకారము మోక్షముఁగూడ నొకకాంక్ష యగును. కామమే యగును. కావున రసభావము మోక్షకాంక్షకుఁ గూడ వర్తించును. మోక్షకాంక్షకలవాఁడు జడునిఁబోలె నూరకుండునా? మోక్షప్రాప్తి నొడఁగూర్చుసాధనములను సామగ్రిని గూర్చుకొని మోక్షకామి తత్సంబంధమైన భావవిశేషములకు లోనగుచు జీవితవీణను మోక్షనాదము నిచ్చునటులఁ బుణ్యము, తపము, జ్ఞానమునను తంత్రుల మ్రోయించుచునే యుండును. ఇఁక రెండవయర్థము గ్రహించినను మానవుఁడు పరబ్రహ్మతో సమమగు నవస్థ ననుభవించునప్పుడు చిదానందము నొందునని మనవేదాంతులంగీకరించినారు. అదియును నొక భావానుభూతియేకదా? కావునఁ బరమార్థము గ్రహించి విచారించిన మానవునియాంతరంగిక జీవితాభివృద్ధికిఁ దోడ్పడు కామమోక్షములు రసాశ్రయములగును. మానవుని భౌతికజీవితాభివృద్ధికిఁ దోడ్పడు ధర్మార్థములు రసమున కాశ్రయములు కాఁజాలవు. కావున రసమునకుఁ బ్రధానముగఁ గామమును గొంతవఱకు మోక్షమును నాశ్రయములగునని చెప్పుటకు వీలగుచున్నది.

## ౨. రసమునకును మానవజీవితమునకుఁ గలసంబంధము.

పైనఁజెప్పఁబడిన ప్రకరణమున రసము ధర్మార్థముల నాశ్రయింపక కామమునే ప్రధానముగ నాశ్రయించుననియు, కొన్ని విధముల మోక్షమునుగూడ నాశ్రయించుననియుఁ దెలిపియుంటిని. ఇప్పుడు కవి యేమిపనిఁ గావించునో, రసభావము వృద్ధినొందుటవలన జీవితమున కేమిలాభమో ఎట్టివికాసమో నిరూపింపఁ బ్రయత్నించెదను. అనంతకోటిజీవరాసులలోఁ గవి యెట్టివాఁడో, యేస్థానమున కర్హుఁడో, రసమువలన నెట్టి ప్రయోజనము సిద్ధించునో తెలుప యత్నించెదను. ముందుగాఁ గొన్ని దుర్వాదములను, విపరీతాభిప్రాయములను గుశంకలను నిర్మూలముగ ఖండించి పిమ్మట కవియొక్క ప్రాశస్త్యమును గూర్చియు రసముయొక్క ప్రయోజనముఁ గూర్చియుఁ బ్రసంగించెదను.

### కావ్యముయొక్క ప్రయోజన మానందజనకత్వ మే.

గతప్రకరణమున రసమునకును ధర్మార్థములకును విరోధమును వైపరీత్యమును గలదని తెలిపితిమి. ఆసిద్ధాంతమును బురస్కరించికొని "కవిత్వమునకు శాస్త్రమునకు సవతిపోరాట మనుచున్నారే. శాస్త్రము ధర్మమును బోధించుననుచున్నారు. కవి నిరంకుశుఁ డనుచున్నారు. వేఱొకవంక శాస్త్రమునకు శాసనాధికారము కలదనుచున్నారు. ఇదియంతయుఁ జూడఁ గవి తాను విచ్చలవిడిగ శాస్త్రములను దిరస్కరించి సంచరించుటయేకాక యితరులఁగూడ శాస్త్రములమీఱి నడచుకొనుఁ డనియు, నధర్మమార్గమునఁ జరింపుఁ డనియు బోధించున

ట్లున్నాఁడు. ఇట్టివాఁ డున్నఁ బ్రపంచమునకు హానిరాదా? భూమియు సంఘమును దలక్రిందులుగావా? జీవితమందలి సామరస్యము చెడదా? ఇది యేమో చిక్కుసంగతిగా నున్నది. మా కేకవిత్వమును వద్దు. మా కేరసముతోడను బనిలేదు. మా జీవితములు చల్లఁగా నేయొడిదుడుకులును లేక వెళ్లిపోయినఁ జాలును. ఎందుల కీబెడందలు. కవిత్వము మానెత్తిమీఁది కేమి బెడఁదఁ దెచ్చిపెట్టునో, వలదు వల" దనుచుఁ దత్తరమున సామాన్యమానవుఁ డడుగుచున్నాఁడు. రసికుఁ డభయహస్త మొసఁగి యిట్టులు చెప్పుచున్నాఁడు:—

"ఓయీ! యేమియు భయము లేదు. రజ్జుసర్పభ్రాంతి యని యిట్టిదానినే మనవేదాంతులు చెప్పుచుందురు. అది యే మన, త్రాడును జూచి పామనుకొని భయమందుటయే. అట్టి రజ్జుసర్పభ్రాంతి చీఁకటిని నడచెడు ప్రతిమనుజునకును, మహా మహులకును సైతము కలుగుచునేయుండును. కాని యది వట్టి భ్రాంతియే. దీపము వెలుఁగునఁ జూచిన వట్టిత్రాడే, ఎంత భయ పడితి మనుచు వారు తమలోఁదామే సిగ్గువడుదురుకదా! అట్లే కవిత్వమాహాత్మ్యమును, రసప్రాశస్త్యమును దెలియనివాఁడ వగుట నీ కిట్టిశంక కలిగినది. దీపమువెలుఁగున, జ్ఞానముబల మున నిజమరసికొనుము. కవి నిజముగ విచ్చలవిడిఁ దిరుఁగు వాఁడా? అతఁ డధర్మమునే బోధించునా? కాదు, కాదు, ముమ్మాటికిని కాదు. అందలిసత్యము నెఱుకపఱచెదనువినుము. కవిత్వదృష్టికిని అనఁగా రసదృష్టికిని శాస్త్రదృష్టికిని భేదమున్నది. ప్రపంచముననున్న వస్తువులనే కవి వేఱుకన్నులతోఁ జూచును. కన్నుఁగలవారుసైతముఁ గాంచలేనిచోద్యము లెన్నో, రహ స్యములెన్నో కవికన్నుల కగుపడును. అట్టి తీక్ష్ణదృక్కులుగల

వాఁ డగుటచేతనే "రవి గాననిచోఁ గవి గాంచకుండునే?" యనునార్యోక్తి కలిగినది. కవి సామాన్యమానవుల కగోచరములగు రహస్యములను దనరసదృష్టిచేఁ గాంచి యనుభవించి, కవిత్వశక్తిచేతఁ గాంచినదానిని సుందరముగా రసముగఁ గవిత్వోచితరీతిని వర్ణించును. ప్రపంచమున నందఱకును జీవితపరమావధియు జీవితపరమార్థమును నొక్కటియే, అది యే దనఁగఁ దన్నుఁదాను తెలిసికొని చేతనైనరీతిని తోడివారలకు సాయముఁజేసి ముముక్షుత్వము నొందఁ గోరుటయే. ఈ విశాలవిశ్వమానవమందిరమున భగవంతుఁడు ప్రతిమనుజున కొక్కొకగది యేర్పఱచినాఁడు. అట్టిగదులలోఁ గొన్ని పై యంతస్థులను, గొన్ని యడుగుభాగమునను నుండును. కొన్ని గదులకుఁ జక్కనిగాలియు వెలుతురును వచ్చును. కొన్నిటి కాసౌఖ్యసంపత్తి యుండనే యుండదు. కొన్ని రంగురంగుల గోడలతోను, అందమైనపటములతోను వచ్చుచుఁ బోవు వారలదృష్టి నాకర్షించుచుండును. కొన్ని చీఁకటికోణములై మసివాఱిన గోడలతోను, పొగతోను నసహ్యము లగును. చూడు మీభవనమున మన కవియుండు గది యేదో? అల్లదే సౌధోపరిభాగమున నొక్కటేగది యున్నదే! అదియే. దానికిఁ జక్కనికిటికీ లున్నవి. వానినుండి నిరంతరము రకరకముల వెలుఁగులును, దేశదేశముల, సీమసీమల గానామోదమును గొనివచ్చువాయువులును నెల్లప్పుడును వచ్చుచునే యుండును. మనకవి యందుఁ గిటికిలోనుండి ప్రపంచమును దనివిదీఱఁ జూచి యానందించుచు, నాయానందపారవశ్యమున నెడతెగని పాటపాడుచు వచ్చిపోవువారి నున్మత్తులఁ జేయుచుండును. ఎందఱో తమతమపనుల నన్నియు మాని యాతనిపాట విను

చున్నారే! చూడుము. ఎల్లరచూపు లతనిపైననే యున్నవే!. అతని మాటలనిన, నతనిపాటలనిన నంతవ్యామోహ మేల కలుగవలెను? ఆవినువారిలో నొకని నడుగుము. ఏమనుచున్నాఁడు?! 'పగలెల్లను పనిచేసిచేసి యలసటచేఁ బోవుచున్న మాకు వీనుల విందుగా నీప్రపంచసౌందర్యమును, నీజీవితానందమును, భగవత్స్వరూపమును వర్ణించుచు మనోహరగానము సేయుచుండ వినుటకన్న నెక్కుడదృష్టమున్నదా? గాలి, వెలుతురనునవి లేక యెల్లప్పుడును పొగచేతఁ గన్నులు పోవున టుండునా ? శాస్త్రులగదులలోఁ గన్నులు మూసికొనియే పనిచేసిచేసి,కొంచెము సేపయినను జల్లనిగాలిలో వెలుతురులో కన్నులపండువగు. నీసమయమున వీనులవిందుగఁ బాడుచుఁ గన్నులఁగట్టినట్లుగ. నానాలోకచిత్రములను మాకవిసోదరుఁడు వర్ణించుచుండఁగా వినుటకన్న నెక్కువ యేమి కావలెను ? అదియేమి? కవి. యేమనుచున్నాఁడు?

శ్లో. కావ్యం కరోమి నహి చారుతరం కరోమి
యత్నాత్ కరోమి యది చారుతరం కరోమి:.
భూపాలమౌళిమణిరంజితపాదపీఠ
హేసాహసాంక, కవయామి, వయామి, యామి.

అతఁ డేదివర్ణించినను అందముగా, మనోహరముగా, ఆనంద జనకముగా నుండును. మనకు దేనియందుఁ బ్రీతికలదో దానినే యతఁ డెంతోసుందరముగా వర్ణించి మన ప్రీతిని వేయిమడుంగు లెక్కువ కావించును. అతనివలననే మాజీవితముల లోని సంసారబాధనంతయు, శ్రమమునంతయు, మఱచి యానంద మనుభవింపఁగలుగుచున్నాము. ఎవరున్నను,ఎవరు పోయి

నను మాకవీశ్వరుఁడు మాకున్నఁ జాలు' ననుచున్నాఁడా! ఆహా! కవిచేయుపనియుఁ గవిమాహాత్మ్యమును నిప్పటికైన నీకు బోధపడినదా? ఇట్టివానినా నీవు మొదట సంశయించితివి? ఇట్టివానినా దుర్నీతిబోధించువాఁడని చేరి సావాసముఁజేయ భయంపడి వెనుదీసితివి? కర్మయనుపొగచేఁ గన్నులుమూసి కొనిపోయినమీకు నానందతేజముఁ జూపించి యానందదృష్టి నిచ్చినవానినేనా, దుర్నీతిపరుఁడను నీలాపనిందపాలుచేసితివి? ఇట్టివానినేకదా మనవారు,

ఉ. మూఁపున వామకుండలము, మోవి నొకించుకమోడ్పు
నందముల్, జూపెడునోరచూపు, సొగసుంబొమ, యొక్కట
నిక్కఁ గన్పడన్,గ్రేఁపులు సొక్కఁ గల్పకముక్రిందఁద్రిభం
గిగ నిల్చి యంగుళీవ్యాపితవంశపూర్తియయి వార్తిలు
మోహనమూర్తిఁ గొల్చెదన్.

అని శ్రీకృష్ణకర్ణామృతమున లీలాశుకయోగీంద్రునిచే వర్ణింపఁ బడిన మురళమోహనుఁడగు శ్రీకృష్ణునిగను;

శ్లో. లోకా నాహూయ సర్వాన్ డమరుకనినదైః
ఘోరసంసారమగ్నాన్
దత్వాఽభీతిం దయాళుః ప్రణతభయహరం
కుంచితం పాదపద్మమ్;
ఉద్ధృత్యేదం విముక్తే రయన మితి కరా
ద్దర్శయన్ ప్రత్యయార్థం
భిభ్రద్వహ్నిం సభాయాం కలయతి నటనం
య స్స పాయా న్నటేశః.

అనుధ్యానశ్లోకమున వర్ణింపఁబడిన ప్రళయోత్సవరతుఁడగు శ్రీనటరాజమూర్తినిగాను, ఆదర్శపురుషులుగను, అధిష్ఠానదేవతలుగాను నిర్ణయించి పూజించిరి? సాక్షాద్దైవమువోలెఁ బూజింపఁదగుకవిని నిష్కారణముగ నీలాపనిందకుఁ బాలు సేసి పాపముఁగట్టికొంటివే? కవియంతటి యుపయోగకారి, బాధానివారకుఁడు, మహాత్ముఁడు వేఱొకఁడీధరిత్రిని గలఁడా? కవి యధర్మమును బోధించుటకు మాఱు ఉత్తమోత్తమధర్మమును లోకోత్తరసౌందర్యయుతమగు లీల వర్ణించును. అతఁడు పెట్టినదే యానందభిక్ష, సౌఖ్యభిక్ష. సౌఖ్యమును, నానందమును లేనిది నీధర్మ మెందులకు? నీయర్థసంపద లెందులకు? అజాగళస్తనములుంబోలె నిరర్థకములు కావే? సర్వసంపదలకును ఫలము దానిననుభవించుటయును సుఖపడుటయును ఆనందమునొందుటయు నేకదా? వెనుకటికి కవి యేమనినాఁడు?

ముక్తి యెద్దిరా,
రక్తి యెద్దిరా?
పాడుడబ్బుసంచులతోఁ
గూడఁబెట్టి యనుభవింపఁ
జూడలేక ప్రాణమైన
వీడెడుదురవస్థయేన?
మనసుగొన్న కన్నియకై
ధనముఁ బ్రాణమైన నిచ్చి
ప్రణయపునిర్వాణమ్మునఁ
దనివిఁగొనుటకాక యెద్ది?

ముక్తి యెద్దిరా
రక్తి యెద్దిరా?

కావునఁ గవిత్వము సర్వార్థములసత్ఫలమును, సర్వశాస్త్రముల సారమును, సర్వజ్ఞానసమన్వయమును నని యెఱింగి నీభ్రాంతి వీడి యుత్తమకావ్యపఠనమువలన రసానుభూతినొంది రసజగత్తున నిచ్చలు సంచరించుచు నానందముఁగనుము. పోయి వచ్చెదను.

## కావ్యమునకును శాస్త్రములకును బరమార్థమున విశేషభేదము లేదు.

రసికునకును సామాన్యమానవునకును జరిగినపై సంభాషణమువలన మనకుఁ గ్రొత్తసంగతులు కొన్ని తెలిసినవి. అవియేవన.—గావ్యమునకును శాస్త్రములకును దృష్టియందు భేదమున్నను పద్ధతులయందు భిన్నత్వమున్నను, రెండును తుట్టతుద కొక్కపరమార్థమునే సంగ్రహించుటకుఁ దోడ్పడుచున్నవి. కావ్యమునకు శాస్త్రమునకుఁ బ్రబలవిరోధ మున్నదనుటకన్న శాస్త్రములు చేయుపనినే సంగ్రహించుపరమార్థమునే, కావ్య మింకొకపద్ధతిని జేసి సఫలము గాంచునని తెలియఁదగును. శాస్త్రమున శాసనముల నేర్పాటుఁ జేయవలె నను కాంక్ష యెక్కువగఁ గన్పించును. కావ్యమునఁ బరమార్థము సుందరముగను, నానందజనకముగను,రసవంతముగను జిత్రింపఁబడును. శాస్త్రము విధినిషేధములమూలమున మానవుని యందుఁ బాపభీతిఁ గలిగించును. కావ్యము రససహాయముతోఁ బుణ్యమునం దాసక్తి గలిగించును. శాస్త్రము నివృత్తిమార్గమును బోధించును. కావ్యము ప్రవృత్తిమార్గమును బోధిం

చును. సర్వశాస్త్రములయొక్కయు, సర్వధర్మములయొక్కయు, సర్వమతములయొక్కయు, సర్వార్థములయొక్కయుఁ బ్రయోజనమును గావ్యము రససాహాయ్యబలమున నతిరమణీయముగను హృదయంగమముగను మనోరంజకముగను వర్ణించి ధర్మానురక్తి మానవునియం దుదయింపఁజేయును.

—పాశ్చాత్యుల మతము. ౧. ఆర్నాల్డు. ౨. వర్డ్స్వర్తు.—

అందుకనియే (Arnold) ఆర్నాల్డను నాంగ్లేయవిమర్శకుఁడు "Poetry is a criticism of life which has the power to sustain, to console and to cheer man with the high ideals of connduct it presents" (కావ్యము జీవితమును విమర్శించి యుత్తమజీవితపథమును జూపించి మానవునకు ధైర్యమును, సంతోషమును, శాంతిని గూర్చునని)యు, వర్డ్స్వర్తు అనుకవి "Poetry is the breath and the finer spirit of all knowledge, (Words worth) (కావ్యము సర్వశాస్త్రములయొక్క సారమును, రమణీయస్వరూపమును నై యున్న)దనియు వ్రాసిరి.

—పూర్వఋష్యాశ్రమములు రసభావపూరితములు.—

ఇట్టిరసభావమే ప్రపంచమును నేకముఖమునకుఁ దెచ్చి లోకకళ్యాణమునకుఁ దోడ్పడునని యిదివఱకే విన్నవించితిని. ఇట్టి రసభావమాహాత్మ్యమునే భారతమున నన్నయ కణ్వాశ్రమము వర్ణించుపట్టున,

సీ. శ్రవణసుఖంబుగా సామగానంబును
    జదివెడిశుకములచదువుఁ దగిలి,
కదలక వినుచుండు కరులయుఁ గరికర
    శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు

కణముల చల్లనిగా డ్వాసపడి వానిఁ
జెంది సుఖంబున్న సింహములయు
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టునీవారాన్న పిండతతులు
కడఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడు
చున్న యెలుకలపిల్లల యొండుసహజ
వైరిసత్వంబులయు సహవాస మపుడు
చూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది.

(భారతము, ఆదిపర్వము. ౪. ఆశ్వాసము.)

అనుపద్యమున వర్ణించియున్నాఁడు. అట్టిరసభావమే పూర్వ పుఋష్యాశ్రమములలో నుండెననియు, అట్టి యాశ్రమముల వలన లోకకల్యాణము నెఱవేఱుచుండెననియుఁ, బులులను మేఁకలను నేకజలాశయమున సుఖముగ నీరుద్రావఁజేయఁగల తపశ్శక్తియు రసభావమును నేఁటినాగరికతయందు మృగ్యమగు చుండినకతమున నే ప్రస్తుతము జీవితసంరంభముఘోరముగను, దుర్భరముగను నున్నదని రవీంద్రనాథఠాకూరుకవితన "Message of the forest" (అరణ్యసందేశ) మనువ్యాసమునందు వ్రాసెను. అట్టిసనాతనరసభావము తిరిగి మనదేశమున శాంతిని నెల కొల్పెడుఁగాక!



# చతుర్థ ప్రకరణము.

## అనంతో వై రసః.

గతప్రకరణమున రసమునకు మానవజీవితమున ధర్మార్థ కామమోక్షములలోఁ గామము ఆశ్రయమగుననియు, కవి యధర్మబోధకుఁడు గాక లోకోపకారియే యనియు నిరూపించితిని. ఈప్రకరణమున రసమెట్లు జీవితమునఁ బ్రవర్తిల్లునో, అది యెట్లనంతవిధముల నొప్పాఱునో తెల్పెదను. రసమనఁగఁ గవి యనుభవించుభావమే యని పూర్వమే చెప్పఁబడినది. అట్లు కవిచే ననుభవింపఁబడు భావములలో నేదైన యొకపద్ధతి గోచరించునా, లేక కవి యడ్డదిడ్డముగ భావముల ననుభవించుచుండునా? రసవిషయమున సహజములగు పద్ధతులుగాని, నియమములుగాని కలవా?

రసమునకుఁ గారణములు కవియొక్క జన్మాంతరసంచిత సంస్కారమును, వస్తుసందర్శనమును నని యొకచోఁ దెల్పియుంటిని. పిమ్మట రసమునకు మానవసహజమగు కామ మాశ్రయమని నిరూపించితిని. ఈ రెండుసిద్ధాంతములకును నేమైన సంబంధ మున్నదా? అనఁగ మానవసహజమగు కామము నేయేపద్ధతుల ప్రకారము రసముగా మార్చి వర్ణించును? కోరికలు రసికునిచేతులలో నెట్టిమార్పులను, నెట్టియవస్థాపరిణామములను బొంది రసస్వరూపముతో బయల్వెడలును? ఇట్టిరసస్వరూపములు మితసంఖ్యాకములా యనంతములా?

## కామమునకు జీవసూత్రమునకుఁ గలసంబంధము

కామము జీవసూత్రముచేఁ గట్టువడియుండును. అనఁగా జీవిత మభివృద్ధినొందుకొలఁదినిగామ మభివృద్ధినొందుచుండును. జీవిత మభివృద్ధినొందువిధముననే కామ మభివృద్ధినొందును. కామముయొక్క పరిపాటి వయఃపరిపాకము ననుసరించియుండును. వయస్సును మీఱినకోరికలు గోరువారు ఎచ్చటనైన నున్నను వా రతీతప్రకృతులై యుందురు. అట్టి యతీత ప్రకృతులు సాక్షాద్వరప్రసాదులు కావున వాదమునకు లొంగరు. జీవియొక్క ప్రాణ మెట్లు బాల్య-యౌవన-కౌమార-వార్ధక్య - జరా - మరణావస్థల నొందుచుండునో అట్లే కామమును బాల్య-యౌవన-కౌమార - వార్ధక్య - జరా - మరణావస్థల నొందుచునే యుండును.

## పాశ్చాత్యమనశ్శాస్త్రసిద్ధాంతములు.

ఈభావముననే పాశ్చాత్యశాస్త్రజ్ఞులు "The Biological aspect of culture"అనుపేరఁబిలచుచు నీభావము ననుసరించిమానవమానసికాభివృద్ధిని వర్ణించి నిరూపించుశాస్త్రమును "Physiological Psychology" యని పెర్కొనుచున్నారు. ఈశాస్త్రసిద్ధాంతమే మన శరీరమును మనస్సును నభిన్నములును, నభేదములును, నవినాభావసంబంధముఁగలవియు ననియు, శరీరములేనిది మనస్సుండనేరదనియు, మనస్సులేనిది శరీరము వివిధకృత్యములను జ్ఞానముతో నొనరింపలేదనియు, అందుచేత శారీరకస్థితి ననుసరించి మన స్సభివృద్ధి నొందుచుండుననియు, మన స్సభివృద్ధి నొందింపవలెనన్న శరీరమును నభివృద్ధినొందింపవలెననియు, అనుకూలశారీరస్థితులను, అనుకూలపరిస్థితులను ననుసరించి

మానవుఁ డభివృద్ధినొందుననియు, సాక్షాద్వర ప్రసాదితుఁడై యభివృద్ధిఁగాంచఁడనియు నే.

## డార్విను పండితుని ప్రపంచపరిణామసిద్ధాంతము.

ఈసిద్ధాంతము ప్రపంచమంతయు నణువునుండి యుద్భవించినదనియు, మానవుఁడు అమీబా యను రూపరహితజీవ వస్తువునుండి వివిధాంతరములఁ గడచి వివిధజన్మములనెత్తి తుట్టతుదకు శాఖామృగమనఁదగు చింపంజీ యనుమర్కటమునుండి జన్మించెనని చెప్పు(Darwin) డార్విన్ పండితుని "Evolution theory" అనఁగ ప్రకృత్యభివృద్ధిసిద్ధాంతమునుదోహదముఁ జేయుచున్నది. పాశ్చాత్యమానసికశాస్త్రము ప్రకారము శిశువులకు మానసికాభివృద్ధి తక్కువయనియు, జ్ఞానము కొంచెమైన నుండదనియు, మాతృవదనదర్శనజ్ఞానముఁ దక్క వేఱు ప్రపంచమును గూర్చిన జ్ఞాన ముండదనియు, మృగప్రాయుఁడై చేఁజిక్కిన దానినెల్ల గ్రహించుచు నుండుననియు, దీనికంతకుఁ గారణము శిశువుయొక్క జ్ఞాననివాసస్థానమగు మెదడు అభివృద్ధినొందక లేతదైయున్నస్థితియం దుంటయును, అవయవము లభివృద్ధినొంది కృత్యముల నెఱవేర్చుకొనఁగల స్థితిలో లేకపోవుటయు నే యనియు, మెదడు గట్టిపడి అవయవములు స్వాధీనములై శరీర సంబంధములగు కృత్యముల నెఱవేర్ప సమర్థములైనంతనే జ్ఞానాభివృద్ధి కలుగుననియు, నట్టిజ్ఞానాభివృద్ధి మానవునిశరీర సౌష్ఠవమును, ఆరోగ్యసంపత్తిని, వయఃపరిపాకమును ననుసరించి యుండుననియు, రోగపీడితుఁడై మంచముఁ బట్టియుండు వానికినిఁ బంచేంద్రియవ్యాపారములు తిన్నఁగా జరగుచుండని

వానికిని, జ్ఞానము కుంటువడియే యుండుననియు నిర్ధారణ యగుచున్నది.

ఇట్టి వయోవృద్ధితోఁబాటు, మానసికాభివృద్ధితోఁబాటు కామముకూడ నభివృద్ధి నొందుచునే యుండును. శైశవమున మాతృవదనదర్శనమును, తల్లిపాలును దక్క నన్యములయెడ శిశువునకుఁ గాంక్షయును గామమును నుండవు. బాల్యమున నాటవస్తువులపైనను, నాటపాటలపైనను, చెలిమికాండ్రపైనను, తోఁబుట్టువులయెడను బాలునికిఁ గామ ముండును. ఇట్లే యౌవనమునఁ క్రీడాసక్తియుఁ గామవికారమును మిక్కుటముగ నుండును. కౌమారమున భార్యపైనను, బిడ్డలపైనను, ధనధాన్యభాగ్యభోగములపైనను మిక్కిలియాసక్తి యుండును. వార్ధక్యమున బిడ్డలయెడను, మనుమలు మనుమరాండ్రయెడను, బంధుగులయెడను, సుఖమునెడను, శాంతియెడను మమకారము మిక్కుటముగ నుండును. జరయందు భగవద్భక్తియుఁ, జిత్తశాంతియు, సుఖమరణముపై నాసక్తియు నెక్కువ యుండును. మరణకాలమున సర్వేంద్రియపటుత్వము దప్పుటచేతఁ బునః శైశవావస్థ సంభవించును.

**మానవుని సప్తావస్థలనుగూర్చి షేక్స్పియరు కవి యభిప్రాయము.**

ఈభావమునే షేక్స్పియరుమహాకవి "As you like it" అను నాటకమున "The seven stages of man" (మానవునిసప్తావస్థలను) వర్ణించుపట్టున వార్ధక్యము నిట్లు వర్ణించియున్నాఁడు:—

"Last scene of all
That ends this strange eventful history,
Is second childishness and were oblivion,
Sans teeth, sans eyes, sans taste, sans every thing."

(తిరిగి శైశవావస్థ సంభవించ, సర్వమును శూన్యముగ నుండి పండ్లు వినా, కన్నులు వినా, రుచి వినా, సర్వము వినా మానవుఁడు జీవితయాత్రఁ జాలించును) అని పైపద్యము యొక్క భావము.

## శ్రీశంకరాచార్యుల యభిప్రాయము.

ఈభావమునే శంకరాచార్యులవారు భజగోవిందశ్లోకములలో నిట్లు వర్ణించినారు.—

బాలస్తావత్క్రీడాసక్తః తరుణ స్తావత్ తరుణీసక్తః,
వృద్ధస్తావత్ చింతాసక్తః పరే బ్రహ్మణి కోఽపి న సక్తః.
వయసి గతే కః కామవికారః క్షీణే విత్తే కః పరివారః,
శుష్కే నీరే కః కాసారః జ్ఞాతే తత్త్వే కః సంసారః.

పైశ్లోకములభావము వయఃపటుత్వ మున్నంతకాలమును క్రీడాసక్తి కాంతానురక్తి మొదలగుకామవికారము లుండు ననియే. అట్టివయసు గతించినచోఁ గామవికారమేడది? విత్తము క్షీణించినవానికడఁ బరివారమును, నీరమెండిపోయిన కాసారమును, తత్త్వజ్ఞానము తెలిసినపిదప సంసారమును నెక్కడుండును? కావున కామము వయఃపరిపాకము ననుసరించియు, శరీరపటుత్వము ననుసరించియు వర్ధిల్లుచుండుననియుఁ దేలుచున్నది.

## మనోవికారములు శరీరస్థితి ననుసరించును.

కావున శరీర మెన్ని వికారములకు లోనగుచుండునో మనస్సుగూడ నన్నివికారములకు లోనగుచునే యుండును. ఇట్టివికారము లన్నియు నాయావయోవిశేషములకుఁ జెందుచుండును. ఒకొ్కకవయస్సునకుఁ దగినకామములును,

తదనుగుణములగు భావములును కలుగుచు, ననుభూతము లగుచుండును. వయోధర్మముల ననుసరించియే రసప్రవృత్తియు వర్ధిలుచుండును.

## ఆర్యధర్మమునందలి ఆశ్రమపద్ధతుల ప్రయోజనము.

ఈభావమును బురస్కరించుకొనియే మనయార్యధర్మజ్ఞులు మానవజీవితమును నాశ్రమముల క్రింద విభాగముఁ జేసినారు. అట్టియాశ్రమములు నాలుగు. బ్రహ్మచర్యాశ్రమము, గృహస్థాశ్రమము, వానప్రస్థాశ్రమము, సన్యాసాశ్రమమును ననునవి. ఏయాశ్రమమునకుఁదగినయాహారనియమములు శారీరకపద్ధతులుఁ, గామ్యార్థములు, భావములు మొదలగువానిని మనధర్మజ్ఞులు వేర్కొనియున్నారు. వయస్సును మించినబుద్ధులును కోరికలును కూడదని ధర్మజ్ఞులు నిషేధించినదానిలోని పరమార్థము వయస్సునకును, కామమునకును భావానుభూతికిని గలసంబంధము సూచించుటయే. బ్రహ్మచర్యాశ్రమము బాల్యావస్థయే. దాని కనుగుణములగు క్రీడాసక్తి విద్యానురక్తి తెలియనితనము, పసితనపుటానందము, మొదలగుభావవిశేషము లనుభూతము లగుచునే యుండును. గృహస్థాశ్రమమున నున్నవానికి బాధ్యతలును అనుభవములును మెండు. భార్య, బిడ్డలు, బంధుగులు, స్నేహితులు మొదలగువారెందఱో యనుదినము మనతోఁ గలసిమెలసి వర్తించుచుందురు. అందుచేఁ దదనుభవానుగుణములగు భావవిశేషము లెన్నియో మానవుని సంచలింపఁజేయుచుండును. వానప్రస్థాశ్రమమున నున్న మానవునకు సంసారబంధములు వీడుచువీడుచు, భగవద్భావము కుదురుచుఁ గుదురుచు నుండును. అందుచేఁ

దదనుగుణములగు సంశయమును, సంచలనమును, ఆశయు, జిజ్ఞాసయు మానవుని సంచలింపఁ జేయుచునే యుండును. తురీయాశ్రమమగు యత్యాశ్రమమున మానవుఁడు సర్వ బంధములఁ ద్రెంచికొని, రాగవిముక్తుఁడై, శాంతియుతుఁడై భగవద్భావముచేఁ బూర్తిగ నావహింపఁబడినవాఁడై నిశ్చలుఁడై ధ్యానతత్పరుఁడై భగవంతునిలో నైక్యమగుటకు వేఁచి యుండును. అందుచేఁ దదాశ్రమానుగుణములగు శాంత భావమును చిదానందమును మానవుని వశముఁ జేసికొనును. వీరప్రసాదులగు శంకరాచార్యులవంటివారు బ్రహ్మచర్యముననే తురీయాశ్రమమగు యత్యాశ్రమమును గ్రహించి జ్ఞానమయులై బ్రహ్మతో నైక్యము నొందిరి. అట్టివారు వయసును మించిన శక్తిగలుగు మహామహులు. సామాన్యులందఱకును ఆశ్రమపద్ధతియుఁ దదనుగుణములగు కామ్యార్థములును, భావానుభూతియు లభ్యమగుచునే యుండును. కావుననే మనధర్మము సమగ్రమును సర్వభావసముపేతమును సర్వరసోపేతమును నైయున్నది. అట్టిభావములన్నియుఁ బూర్తిగ ననుభవించిన యతనిజీవితమే సఫలమైనదిగా నెంచఁబడుచున్నది.

## మానవుని యభివృద్ధినిగూర్చిన భిన్నాభిప్రాయము. ప్రాచ్యదేశవాసులయభిప్రాయము.

ఇంతవరకును శైశవమునుండి మానవుఁ డభివృద్ధినొందుచున్నాఁడని సామాన్యజను లెల్లరు నొప్పికొనఁజెల్లు సిద్ధాంతముఁ గావించితిమి. కానికొందఱుకవులును, వేదాంతులును మనము అభివృద్ధి యనియెంచెడు నది నిజమగు నభివృద్ధి కానేరదనియు, శిశువు భగవదంశసంభూతుఁడగుటచేఁ బూర్వజన్మజ్ఞానము కలిగి

యుండుననియు, జన్మమెత్తిన కొన్నాళ్లవఱకును భగవదంశ మును కలిగియే యుండుననియు, వయస్సు వచ్చినకొలఁది విచారములచే బద్ధుఁడై క్రుంగుచు భగవంతునికి దూరుఁడగు చున్నాఁడనియు, శైశవావస్థయే జీవితమునన్నెల్ల నుత్తమమగునవస్థ యనియు వర్ణించినారు. భారతీయులలో శిశువులకు మూఁడు మాసములవఱకు భగవదంశము, పూర్వజన్మజ్ఞానము నుండు నని యొకమతమును, భూమిపై జన్మించి దాదిచే జలమునఁ గడగఁబడిననిమేషముననే పూర్వవాసనమఱచిపోవునని వేఱొక మతమును కలవు. బర్మాలోని పుంగీలనువారు శిశువు జన్మించి నప్పు డేడ్చెదరఁట. కారణ మది స్వర్గసీమనుండి ఈపాడుభూలోకమునఁ బడినదనియేనఁట. అంతియగాక మనుజుఁడు మృతుఁ డగునప్పుడు సంతసించెదరఁట. కారణ మతఁడు నిజనివాసమగు భగవన్నిలయమున కేఁగు ననియే నఁట.

పాశ్చాత్యులయభిప్రాయము.
౧ వర్డ్సువర్తుకవి యభిప్రాయము.

ఆంగ్లేయకవివరుఁడగు వర్డ్స్వర్త "Ode on the Intimations of Immortality" "అమరత్వసూచనాప్రశస్తి" యను శైశవస్మృతిగీతమున నీభావమునే ఈ క్రిందిపద్యముల వివరించి నాఁడు.—

Our birth is but a sleep and a forgetting,
The soul that rises with us, our life's star,
Hath had elsewhere its setting,
And cometh from afar :
Not in entire forgetfulness,

Not in utter nakedness,—
But trailing clouds of glory do we come
From God who is our home
Heaven lies about us in our infancy
Shades of the Prison-house begin to close
upon the growing boy
But he beholds the light and whence it flows
He sees it in his joy
The youth, who daily farther from the east
Must travel still is Nature's priest,
And by the vision splendid
Is on his way attended
At length the man percieves it die away
And fade into the light of Common day.

... ... ... ... ... ... ...

Thou whose exterior Semblance doth belie
Thy soul's immensity,
Thou best Philosopher, who yet dost keep
Thy heritage, thou eye among the blind
That deaf and silent read'st the eternal deep
Haunted for ever by the eternal mind,—
Mighty prophet ! Seer blest !
On whom those truths do rest
Which we are toiling all our lives to find
In darkness lost, the darkness of the grave
Thou over whom thy immortality
Broods like the day, a master over a slave
A presence which is not to be put by;

... ... ... ... ... ... ...

Thou little Child yet glorious in the night
Of heaven born freedom on thy beings height
Why with such earnest pains dost thou provoke
The years to bring the inevitable yoke,

Thus blindly with thy blessedness at srife?
Full soon thy soul shall have her earthly freight
And custom tie upon thee with a weight
Heavy as frost and deep almost as life.

పై సిద్ధాంతములలో నేది సత్యమో యేది కాదో విమర్శించుట యప్రస్తుతము. రెండును భావనావిశేషములే యగును. కాని యొకటిమాత్ర మొప్పుకొనక తప్పదు. అది యేమన నెంత పాపభూయిష్ఠమైనను గానిండు; ప్రపంచము. మానవుఁడందు శిశురూపమున జన్మించి జీవించునంతకాలమును జీవసూత్రములచేఁ గట్టుపడియే యుండును. అంతవఱకును నవస్థాపరిణామభేదములకు లోనగుచునే యుండును. ఇట్టి యవస్థాపరిణామభేదములసముదాయమే జీవితము.

## కామము మానవజీవితక్రమము ననుసరించును.

మానవజీవితక్రమము ననుసరించి కామమును నవస్థాపరిణామభేదములకు లోనగుచునే యుండును. తన్మూలముగ భావములును నవస్థాపరిణామములకులోనగుచుండును. అనఁగా రస మనంతముఖములఁ బ్రసరింపుచు ననంతవ్యాప్తిఁ గలిగి యుండు ననుటయే యగును. అది యెట్లు సంభవించునో సోదాహారణముగఁ జర్చించెదను.

మానవునిచిత్తవృత్తులును వికారములును శరీరస్థితుల ననుసరించి యుండును.

## ఉదాహారణములు.

ఉదహారణము. రోగముతోఁ దీసికొనుచున్న వానికి సర్వజగమును చిరాకు గలిగించునదిగను నసహ్యముగను నుండును. కామెరరోగము కలవానికి జగమంతయుఁ బచ్చఁగాఁ గను

పించును. ఇఁక శరీరసౌఖ్యముకలవానికి సర్వజగమును సంతోష మయముగాను, సంతోషకరముగాను గన్పట్టును. సుఖముగఁ గడుపునిండ భుజించి హాయిగ హంసతూలికా తల్పమునఁ గూరుచుండి సరసపుష్పఫలసమన్వితమగు నుద్యానము వంకఁ జూచుచున్న వానికిఁ బ్రపంచ మానందమయముగను, సౌఖ్య మయముగను గన్పట్టునుగదా? తలనొప్పిగ నున్నవానికి నెంత మధురగానమైనను తలనొప్పి నెక్కువఁజేయును. అట్టిబాధ లేని వాని నెట్టిసామాన్యగానమైనను గరఁగింపఁజాలును.

## చిత్తవృత్తు లనంతములగుటచే రసములనంతములు.

చిత్తవృత్తులు శారీరకస్థితుల నాశ్రయించుకొనునటుల భావములును, రసమును జిత్తవృత్తుల నాశ్రయించుకొనును. ఎట్లనఁగా మనుష్యునిచిత్తవృతి యెట్లుండునో వానిభావము లును నట్లేయుండును.ఉదాహరణము; వివాహకాలమున శుభ మున నెల్లరును నోలలాడుచు నానందపరవశులై యుండుసమ యమున వారికెట్టి విచారభావములును నుండవుకదా! అంతి యకాదు, ఎన్నిచిక్కులైనను, ఎన్నివిచారములైనను నాసమ యమున వారిమతుల కెక్కనేయెక్కవు.విచారమగ్నులైయున్న వారికి, అనఁగా పుత్రవియోగముచేతనో, దారవియోగము చేతనో కృశించువారికి నెట్టిశుభవార్తయైనను పెడచెవిఁబడి నీరసమై పోవునుగదా? మనుచరిత్రమున గృహోన్ముఖుఁడై పలవ రించు ప్రవరాఖ్యునికి దివ్యసుందరవిగ్రహయగు వరూధినిసౌం దర్య మేమైన నచ్చెనా? నచ్చలేదు? అతఁ డట్టియెడ నుడివిన పలుకులలో నెంత సత్యమున్నదో కనుఁడు. "అనాశ్వాసిత దుఃఖితే మనసి సర్వ మసహ్యమన న్నెఉంగవే?" యని పల్కిన

మాటల యర్థమును మననముఁగావించిన సత్యము గోచరించును గదా?

కావున రసమును, భావములును మానవునిచిత్తవృత్తుల ననుసరించియుండును. దుర్మార్గున కేవస్తువుఁ దిలకించినను దుష్ట భావములే తలలెత్తుచుండును. సన్మార్గవర్తనున కేవస్తువుఁ గాంచినను సద్భావములే కలుగుచుండును. సరియే. మానవప్రకృతులును, చిత్తవృత్తులును ననంతవైవిధ్యము కలిగియుండును గదా! అట్టిచో భావములును, రసమును ననంతవైవిధ్యముకలిగి యుండక మానునా! ప్రపంచమున నెన్నికోట్లభిన్నప్రకృతులు, మిశ్రప్రకృతులు, విపరీతప్రకృతులు, అతీతప్రకృతులు కలరో, అన్నివింతభావములును, విపరీతరసములును, వర్తిలుచునే యుండును. రసములు తొమ్మిదియే యని మనలాక్షణికులు తెల్పునది యంత శుద్ధసత్యము కాదు. సృష్టియు, మానవప్రకృతియు నెట్లనంతములో భావమును రసమును నట్టులే యనంతములు. ఈభావమునే రసవేత్తలు "అనంతో వై రసః" యని నిర్వచించిరి.



# పంచమప్రకరణము.

## భావములు భావనాశక్తి.

ఇంతవఱకుఁ గావ్యము రసాత్మకమనియు, రసము కవి యొక్క భావానుభూతియే యనియు, నట్టిరస మనంతవ్యాప్తిఁ గలదగుటచే రసము లనంతము లనియు, నాలంకారికులచేఁ జేర్కొనఁబడిన నవరసము లనునవి యుదాహరణమాత్రములే యనియు, భావము లనంతములును నసంఖ్యాకములును నగుటచేఁ దదనుభూతియు ననంతవ్యాప్తిఁ గలిగియుండుననియు, సిద్ధాంతముఁ గావింపఁగలిగితిమి. ఇప్పుడు రసమునకుఁ బట్టుఁ గొమ్మలును ఉపాధులును బ్రాణాధారములును నగు భావముల ప్రశంసఁ గావించి పిమ్మట భావములను గావ్యమున రూపవంతములుగను, శక్తిఁగలవిగను, నేకత్వముగలవిగను నిర్మించు శక్తియగు భావనాశక్తినిగూర్చి ప్రసంగించెదను.

భావములయొక్క యాలంకారికనిర్వచనము నిదివఱకే తెల్పియుంటిని. గ్రహణసౌలభ్యమునకై తిరిగి దాని నిచట నుదాహరించెదను.

సుఖదుఃఖాదిభిర్భావైర్భావ స్తద్భావభావనమ్.

“దృష్టిగోచరములగు వస్తువుల దర్శనమువలన జనించు సుఖదుఃఖాదివికారములచే హృదయ మావేశమునొందు నవస్థయే భావము. ఇయ్యది భావనయను పదమునుండి జనించినది. సువా

సనగల పుష్పము ఇతరవస్తువులకు సైతము తన వాసన నొసఁగు రీతియే భావమునకు వర్తించును."

పై నిర్వాచనముయొక్క తాత్పర్య మిట్లు చెప్పనగును. కన్నులకు గోచరించు వస్తువుల దర్శనమువలన మానవునకు సంతోషముగాని, దుఃఖముగాని జనించును. అట్లు జనించిన సుఖముగాని, దుఃఖముగాని హృదయము నావేశించినచో నాయవస్థ భావ మగును. అట్టి భావావేశమువలన మిగిలిన ప్రపంచమంతయు భావానుగుణమగు రూపమును దాల్చునెడ నయ్యది భావన యగును. అట్టి భావనయొక్క విజృంభణమే భావనాశక్తి యగును. కావున భావము శారీరికవికారము మాత్రమేగాక మానసికవికారముఁగూడనని యీనిర్వాచనము తెలుపుచున్నది. అనఁగా, భావము శరీరమునుమాత్రమేగాక మనస్సునుగూడ వశముఁ జేసికొని వికారమునకుఁ బాల్సేయును.

## భావములయొక్క స్వభావమును జన్మప్రకారమును గూర్చిన భిన్నసిద్ధాంతములు.

"భావము లేప్రకారము జనించును? వాని స్వభావ మేమి" యను ప్రశ్నకు సమాధానము నరయుదము. భావముయొక్క జన్మమునకుఁ గారణము మనోవికారమా? లేక శరీర సంబంధమగు వికారమా? మన శాస్త్రజ్ఞులు, అనఁగ నలంకారికులు భావము మనోవికారమును శారీరకవికారమును గూడ నగు ననిరి. కాని శరీరవికారము జనించి మానసికవికారముగఁ బరిణమించునా ? అను ప్రశ్నమునకు సమాధానము విస్పష్టముగఁ జెప్పరైరి. దృష్టిగోచరములగు వస్తువుల సందర్శనమున సుఖదుఃఖములు గల్గు ననుచున్నారే అవి యెట్టివి? శరీరసంబంధ

మయినవా? లేక మనసంబంధమయినవా? ఈప్రశ్నమునకు సమాధానముఁ జెప్పవలయు నన దీర్ఘమగు మనశ్శాస్త్ర సంబంధమయిన చర్చకుఁ గడంగవలసియుండును. అయ్యది యప్రస్తుతమును విశేషప్రయోజనరహితమును నగుటచే సంగ్రహముగ సూచించి మన విషయమున కనుకూలించు నంతవఱకుఁ దెల్పెదను. వస్తువును గాంచినతోడనే జనించు సుఖదుఃఖములు మానసికములేయని మామతము. శరీరసంబంధములైన సుఖదుఃఖములు బాధయు, హాయియు మాత్రమే యగును. అట్టి బాధయు హాయియు నింద్రియవ్యాపారములకు సంబంధించిన వగుటచే శారీరకసుఖదుఃఖము లనఁ జెల్లును. భావమువలన ముఖ్యముగ మనస్సునకే సంక్షోభము గలుగును. మనస్సంక్షోభము కారణముగ శరీరముగూడ క్షుభించిన క్షుభించుంగాక! అట్లగుటయు సహజమే. శాస్త్రసమ్మతమును గూడ. ఎట్లన, మనశాస్త్రముయొక్క ప్రధాన సిద్ధాంతము ననుసరించి శరీరమునకు బాధ గలిగినచో మనస్సునకును బాధ గలుగును. మనస్సునకు బాధ గలిగినచో శరీరమునకును బాధ గలిగియేతీరును. మనస్సును శరీరమును నేకప్రాణయుతములే. భిన్నవ్యక్తులు గావు. అందుచే నొకదానికి బాధ గలిగిన రెండవదానికిఁగూడ బాధ గలిగియేతీరును. అట్లగుటంజేసి మనస్సంబంధమగు వికారము లన్నియు శారీరసంబంధములగు వికారములుగఁ బరిణమించునని సిద్ధాంతము. మతిభ్రమము నొందిన పిచ్చివాఁడు వికారములగు చేష్టలు గావించుట మనము నిత్యముఁ జూచువిషయమే. మతి తిన్నఁగా నుండువారు అట్టి వికారచేష్టలకు లోనుగారు. కావుననే

దృష్టిగోచరములగు వస్తువుల దర్శనమువలన జనించు సుఖ దుఃఖాదిభావములు శరీరమును గలఁతపెట్టుచుండునని నమ్మఁదగి యుండును. సంతోషము సగముబల మనియు మనోవ్యాధికి మందు లేదనియు జనులనుకొనుమాటలు ఈరహస్యమును స్ఫుటముగ బోధించుచున్నవి. భావములు శారీరకవికారములుగ జన్మించి మానసికవికారములుగఁ బరిణమించునని యభినవ పాశ్చాత్త్యుల సిద్ధాంతము, ఈసిద్ధాంతమును 'జేమ్సు లాంగ్ సిద్ధాంత' మందురు.

## పాశ్చాత్యమతము. జేమ్సులాంగ్ సిద్ధాంతము.

ఈ పేరఁ బరగు భావములనుగూర్చి వా రొకవింతసిద్ధాంత మును గావించినారు. మనకు జనించు భావములు మానసిక వికారములగుటకుఁ బూర్వము శరీరసంబంధములగు వికారము లుగ జన్మించి యాశరీరవికారము తగ్గిపోయినపిదప మానసిక వికారములై చిరస్థాయినొందఁగలవని వీరిమతము. ఉదా:— సింహము మనుజునిపైకి దుముక వచ్చుచున్న దనుకొనుఁడు. మనుజుఁడు భయపడి పరువెత్తును. ఇచ్చట భావము భయము. మనస్సులో భయముఁ జెందుటవలన మనుజుఁడు పరువెత్తు చున్నాఁడా? లేక పరువెత్తినపిదప భయము ననుభవించు చున్నాఁడా ? జేమ్సులాంగ్ సిద్ధాంతప్రకారము వస్తువును దర్శించినతోడనే శారీరకవికారము జరిగియే తీఱును. సింగ మును గాంచుటతోడనే మనుజుని మనోవ్యాపారము ఒక్క మాఱుగ స్తంభించిపోయి యతఁడు కారణము తెలియకనే పరువెత్తసాఁగును. అట్లు కొంతదూరము పఱువెత్తి యేల పరు వెత్తుచుంటినా యని వితర్కించుకొని కారణ మరసి తన్నుఁ

దఱుముకొని వచ్చుచున్నది సింగమని గ్రహించి భయభ్రాంతుఁడగునని జేమ్సులాంగల్ మతము. ఈమతమునకు అనేకములగు పూర్వపక్షములు గావింపంబడినవి. వారితో మనకుఁ బనిలేదు.

వస్తువును గాంచినతోడనే మృగములరీతి నేవో చేష్టలకు లోనయి మనుజుఁడు భావమును బిమ్మట మానసికముగ ననుభవించు ననుసిద్ధాంతము మనుజుఁడు మృగములనుండి జన్మించుననియుఁ, దత్కారణముగ మృగసహజములగు చేష్టనే ముందుగఁ బ్రదర్శించుననియుఁ బిమ్మట మృగములకన్నఁ దన మెదడు ఎక్కుడు దట్టముగను నెక్కుడుఁ జమత్కారముగను సృజింపఁబడియుంటచే వానికన్న నెక్కుడు తెల్విగలవాఁడయి యామృగము లనుభవింపని మానసికవికారమునుగూడఁ దా ననుభవించి మానవసహజమగు జ్ఞానమును వ్యక్తముఁగావించు ననియు డార్విన్ సిద్ధాంతమున కనుకూలముగాఁ జెప్పఁబడినది.

## ఆర్యసిద్ధాంతముయొక్క పరమార్థము.

మన మన్ననో ప్రపంచమంతయు భగవంతునిచే సృజింపంబడెననియు, భగవంతుని తేజమును ఆత్మయు మనయందును వస్తువులయందును సయితముఁ గలదనియుఁ, దత్కారణమున మనము వస్తువులఁ గాంచినతోడనే భగవద్దత్తమగు నాత్మబలమువలనను, జ్ఞానమువలనను, వస్తువులయం దంతర్గర్భితములయియున్న గుణవిశేషములను, భగవత్తేజమును నవలోకించి చుట్టము లొకరినొకరు చూచుకొనుతోడ నేసుఖదుఃఖాది భావములకు లోనగుదురో అట్లే సుఖదుఃఖాదిభావములకు లోనగుదుము. మనకును వస్తువులకును గల చుట్టరికము భగ

వంతునిచే మనమును వస్తువులును గూడ సృజింపఁబడుటచే సంభ వించినది. ఏకోదరన్యాయము వర్తించుచున్నది. దూరదేశా గతుఁడగు సోదరునిఁ గాంచినతోడనే ప్రేమ మొక్కసారిగ ననుభూతమగుచున్నదే. రక్తసంబంధము బహుసూక్ష్మముగ ననుభూత మగుచుండును. కొన్నియెడలఁ దల్లిబిడ్డలు ఎడఁ బాటు ననుభవించి ఒకరిమొగముల నొకరు గుర్తింపఁగా లేనంత మాఱిపోయినను మాతృసహజమగు పాలపొంగు జనించి వారల కుండు రక్తసంబంధమును ఎఱుకపఱచునని మన మెఱిఁ గిన సంగతియే. పిట్టలు, జంతువులు, క్రిమికీటకాదులు, వేయేల? సర్వప్రాణులును ఇట్టి రక్తసంబంధమును అనుభవిం చుచు వేనియొక్క రక్తసంబంధుల నవి గుర్తెఱుంగుచుఁ బొర పాటుఁ జెందకయే సుఖదుఃఖముల ననుభవించును. వేయిపిట్ట లున్నను జ్ఞానమంతగా లేనిదయ్యు మగపిట్ట తనతోడిది యగు నాఁడుపిట్టనే సాయంకాలము గూటిలోఁ జేర్చుకొని సుఖమను భవించునే, వేఱొకపిట్టను జేరనీయదే? వేయిదూడ లున్నను బశువు దనదూడనే వెదకికొని పాలుచేఁపునే. ఈవికారములకు ఈయనిర్వాచ్యసంబంధమునకుఁ గారణము భగవద్దత్తదివ్యజ్ఞాన ముదక్క నన్యము గాదు. భగవంతుని సృష్టివైచిత్ర్యమే యిట్టి రహస్యసంబంధములకెల్లఁ గారణము. ఇట్టి దివ్యసూత్రమే సృష్టియం దరాజకము లేకుండ శాంతిని స్థాపించి తుష్టిని సర్వ ప్రాణులకుం బ్రసాదించుచుండును.

## ప్రకృతికిని మనుజునకును గల రహస్యసంబంధము.

అట్లే ప్రకృతికిని మనకును రహస్యసంబంధము గలదు. అట్టి రహస్యసంబంధమును గుర్తించినవాఁడే రసికుఁ డగును..

ప్రకృతియు భగవంతునిచే సృజింపఁబడినదనియు నందును భగ వంతుని తేజము గలదనియు గ్రహించి యనుభవించినవాఁడే రసికుఁడగును. అట్లు గ్రహించినవానికిఁ జూచినతోడనే యే శరీరవికారమును నక్కఱలేకయే సుఖదుఃఖాదిభావములు జనిం చుచునే యుండును. అట్టులనే జంతువుల విషయమునఁగూడ. ముద్దులొలుకు నావుదూడలనుగాని, గంభీరముగ నుండి మిగుల బలసిన యాఁబోతులనుగాని, రౌద్రరసస్ఫూర్తిని విడంబించు సింహామునుగాని, పడగ విప్పి యాడు నాగుఁబామునుగాని, జూచినతోడనే యొకరకమగు భావము మనల నావేశించును. కావున భావమునకుఁ గారణము భగవద్దత్తవిజ్ఞానమును, (అనఁగా మనశ్శక్తి) మనకును జరాచరప్రకృతికిని గల రహస్య సంబంధమును, నని గ్రహించునది. అందుచే మనవారు విభావ మను పేరఁ బిలిచిన మానసికవికారమే ముందనియు, మానసిక వికారమును బాహ్యముగఁ బ్రదర్శించు ననుభావము వెనుక వచ్చుననియుఁ జెప్పుట. విభావములు మూలకముగ భావము మనస్సునకుఁ దట్టి యనుభావములుమూలకముగఁ బ్రదర్శితము లగును. కావుననే మనశ్శక్తియు జన్మాంతరసంచితరసహృదయ మును లేనిది భావము జనింపదు. శరీరవికారములు భావమును గలిగింపఁజాలవు. భావము మనస్సున ననుభూతముగానిది పైకి ప్రదర్శింపఁబడ నేరదని మామతము. విభావములు ముందు, అను భావములు పిమ్మట.

## భావన యన నేమి?

భావములయొక్క జన్మప్రకారమును సూచించితిమి. భావము మనస్సు నావేశించినతోడనే సర్వప్రపంచమును దదను

గుణమగు రూపమును దాల్చియున్నట్లు గన్పట్టును. అదియే భావనయని మనలాక్షణికులు వివరించిరి. పుష్పము సుగంధమును వెదఁజిమ్ముటవలన దారిని బోవువారికి దానివాసన యనుభూతమగుచుండును. అట్లే సుఖదుఃఖాదిభావములయొక్క వాసన యితరవిషయములకునయితము వర్తిల్లుచుండును. ఎట్లనఁగా:— దుఃఖముచే నావేశింపఁబడిన మనుజునకుఁ బ్రపంచము సర్వమును దుఃఖపూరితముగ నున్నట్లే గోచరించుచుండును. అది యొక యున్మాదమే కావచ్చును. ఒకవికారమే కావచ్చును. కాని అట్టిది మానవునకు సహజముగ ననుభవములోనుండు నవస్థలలో నిదియే. తన భావమును మనుజుఁడు ప్రకృతి కారోపించును. తాను సంతోషముగనున్నఁ బ్రకృతియంతయు సంతోషముగ నున్నట్లే భావించుచుండును. తాను విచారముగనున్నఁ బ్రపంచము సర్వమును విచారమున మునింగియున్నట్లు భావించును. ప్రపంచము నిజముగ నట్టి సుఖదుఃఖములకు నేతదవసరముల లోనగునో కాదో చెప్పుట యప్రస్తుతము. గ్రహణీయాంశము మానవుఁ డట్లు భావించునా? భావింపఁడా ? యనునవి మానవునకుఁ బ్రకృతి యాభావమును ననుభవించునట్లుగను దదనుగుణమగు రూపమును దాల్చియున్నట్లుగను గనఁబడుటయే ముఖ్యమగు విషయము. భావపూరితు లయినవార లనేకులు అట్లు భావించియున్నారు. అది యున్మాదమే కానిండు. అట్టి యున్మాదమే భావన యగును. అట్టి యున్మాదమునకు రసికుల చరిత్రలయందును భావపూరితు లగువారి చరిత్రలయందును అనేకదృష్టాంతములు చూపవచ్చును. కాంతావిరహముచే స్రుక్కి యేకవర్షప్రవాసశిక్ష ననుభవించుచు

రామగిర్యాశ్రమములపొంతఁ ద్రిమ్మరుచున్న యక్షునకు భావావేశముననే కదా;

శ్లో. ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతః క్వ మేఘః,
సందేశార్థాః క్వ పటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః
ఇత్యౌత్సుక్యాదపరిగణయన్ గుహ్యకస్తం యయాచే
కామార్తా హి ప్రకృతికృపణాశ్చేతనాచేతనేషు.

అనుశ్లోకమున వర్ణింపఁబడినయట్లు చేతనాచేతనముల విషయమయిన జ్ఞానము నశించెను ? ఇత్యౌత్సుక్యాత్ అనుపదముననే యీభావము ధ్వనించుచున్నది. కాంతావిరహాముచే నార్ద్రీభూతమనస్కుఁడై మాసముల నెట్లో కడపుచు విచారమున మునింగియున్న యతనికి ధూమజ్యోతిస్సలిలమరుత్తులయొక్క కలయికమాత్రమేయయి ప్రాణశూన్యమయియున్న మేఘము—ప్రాణయుతముగను జేతనముగలదిగను నయి మానవులయొక్క ప్రణయసందేశమును గొనిపోయి ప్రియురాంద్రకు విన్నవింప సమర్థతఁ గలిగినట్లుగను గన్పట్టుట భావావేశముమూలముననేకద? భావౌత్సుక్యము గల్గినవారు పూర్వాపరములును సత్యాసత్యములును బరిగణింపరు. కామార్తులు సహజముగఁ గృపణులగుటచేఁ జేతనాచేతనములయెడ విశేషము తర్కముఁ గావింపక భావమును విప్పిచెప్పుచుందురు. భావనయే ప్రధానాంశము.

## జీవితమున భావనయొక్క ప్రయోజనము.

అట్టిభావనలేనిచో ప్రపంచమున మహాత్కార్యములు జరుగుట దుర్లభము. మనుజుఁ డెప్పుడును, దనవలె నితరులును భావపూరితులై యుందురని గ్రహింపనిచో, నమ్మనిచో, నితరు

లతో సాంగత్యము చేయుటగాని, యితరులకుఁ దనభావమును విప్పి చెప్పుటగాని, యితరులను సత్కార్యాచరణమునకుఁ బురికొల్పుటగాని యసంభవము. ఎదుటివాఁడు మంచివాఁడు గాఁడనియు, నతని స్వభావమునకును దన స్వభావమునకును నేసంబంధమును లేదనియుఁ దనకును నితరులకును నేసంబంధమును లేదనియుఁ దా నొరులకుఁ జెప్పునదియు, నొరులు దన వలన వినఁదగునదియు, నేమియు లేదని నమ్మువాఁడు కార్యోత్సాహముఁ జూప నశక్తుఁడై, నిర్వీర్యుఁడై, యైకమత్యమునకు నభ్యంతరముఁ గల్గించువాఁడై, ప్రయోజనరహితుఁడై కీడునే యాపాదించుంగాని, మే లెన్నఁడును జేయఁజాలఁడు. భావనఁ గలిగినవాఁ డెప్పుడును ముందుచూపే చూచుచు నెట్టికార్యమును నిర్వహించుటకైన సాహసించును.

## భావనాశక్తి యననేమి?

పైనఁ జెప్పఁబడిన భావనయొక్క విజృంభణమే భావనాశక్తి యగును. ఏప్రభావమువలన మానవుఁడు మానసికములగు తనభావములు ప్రకృతియందుఁ బ్రతిబింబితము లగుచున్నట్లుగాని, ప్రకృతియం దాకృతిఁ దాల్చినట్లుగాని భావించి యనుభవింపఁగలఁడో ఆశక్తియే, ఆప్రభావమే భావనాశక్తి యనఁబరగును. భావనాశక్తియొక్క స్వభావమునుగూర్చియు, దానియొక్క ప్రయోజనములనుగూర్చియు విచారణ గావింతము. భావనాశక్తియొక్క స్వభావ మత్యద్భుతము. భావనాశక్తిబలమున కవి యనేకములగు భావముల రూపసహితములుగఁ గాంచి యనుభవించి యితరులకుఁగూడ నాభావములను రూపసహితములుగఁ బ్రదర్శింపఁజాలును. ఈభావనాశక్తియొక్క

స్వభావమునుగూర్చి శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వతత్త్వవిచారమున బహువిపులముగను, చక్కఁగను మనసున కెక్కునట్లుగను వ్రాసినారు. వారు సర్వతోముఖముగను సోదాహరణముగను జర్చించిన విషయమును మితముగ సూచించి విడిచెదను.

"భావనాశక్తి యనఁగా విషయముల మనసులోఁ బ్రతిబింబించునట్లు చేయు సామర్థ్యము. ఒక్క ప్రతిబింబించుట యననేల? ప్రత్యక్షముగ నవతార మెత్తునట్లు చేయుట. చూడుఁడు. సీత, ద్రౌపది, సావిత్రి, దమయంతి మొదలగు స్త్రీలు కవికల్పనలకుం జేరినవారయ్యును మనకుఁ జరిత్రముల లోని స్త్రీలకంటెను మఱియు మనము నిత్యమును జూచుచు, వాదాడుచునున్న యిరుగుపొరుగు భాగ్యశాలినులకన్నను నెన్నియోమడుంగులు సత్త్వముం దాల్చినవారై స్ఫురించుచున్నారుగదా! చూడంబోయిన పాండవులు, దుర్యోధనాదులు, రామభరతులు మొదలగు మనస్సృష్టిమానవులు మిథ్యలా, మనమె మిథ్యలా? ఈతీరున కృత్రిమములనై తమ మూర్తిభవింపఁజేయువారే మహాకవులు" అని వ్రాసియున్నారు.

### భావనాశక్తి భగవద్దత్తమే కాని వేఱుకాదు.

భావనాశక్తి భావములను ప్రతిబింబించునట్లు చేయవలెనన్నను, వానిని ప్రత్యక్షముగ నవతార మెత్తునట్లు చేయవలెనన్నను కవి యాభావములఁ బూర్ణముగ ననుభవించి వాని యొక్క మూర్తులను, ప్రతిబింబములను మనోదృష్టిచేఁ గాంచి యుండవలెను. అట్టి మనోదృష్టిచే విషయముల ప్రతిబింబములను, భావముల మూర్తులను గాంచని కవి యితరులకు వానిని

ప్రత్యక్షములుగఁ బ్రదర్శింపఁజాలఁడు. *ఇట్టి దృష్టిబలము దివ్య ప్రభావమేగాని యన్యము గాదు. అభ్యాది భగవద్దత్తమేగాని యన్యమార్గలబ్ధము గాదు. భావనాశక్తి గలవారిని చూచి నేరిచికొనుటవలన వచ్చెడుపని కాదు. జన్మతో రావలసినదే. అందుకనియే "కొయ్యలరీతినో, మహర్షులచందంబుననో నిర్వి కారస్థితి నుండువారు పద్దెములు వ్రాయనేర్తురుగాని కవులగుట యసంభవము. ఏవృత్తాంతమునైనఁ జూచునట్లు వర్ణింపవలయు నన్న దానియొక్క స్థితిగతులను నందలి పాత్రముల సుఖదుఃఖ ములను రోమరోమమునకుఁ దానే మనఃపూర్వకముగ నను భవించినందప్పు తద్రూపముగ నభినయింప నెవరికిని దరముకా" దనియు, భావనాశక్తి నుద్దీపింపఁజేయునది ప్రకృతిభావతైక్ష్ణ్య మే యనియు, రెడ్డిగారు వచించుట. ఇట్టి భావతైక్ష్ణ్యము కార్యోత్సాహముఁగలిగినవారియందునను వీరయుగముల జన్మ మునొంది పవిత్రకార్యసంఘటనోత్సాహముఁ గలిగిన మను జులయం దెక్కువగ నుండుననియు నక్కారణముననే వీరం యుగములనాఁటి కవిత్వము భావనాశక్తి నమితముగఁ బ్రద ర్శించుననియు, దేశచరిత్రము ననుసరించి జనులలో శౌర్యము హెచ్చుగ నున్నపుడు కవులకు భావనాశక్తి యెక్కువగ నుండు ననియు, శౌర్యము క్షీణించునపుడు భావనాశక్తి క్షీణించి పాండిత్యమును తత్ప్రసాదలబ్ధమగు నూహాశక్తియు మెండుగ నుండుననియు రెడ్డిగారు నిరూపించిరి. ఇందెంతయు సత్య మున్నదని యెల్లరు నంగీకరింపక తప్పదు. అది యెట్లో ఆంధ్ర కవిత్వచరిత్రమును వర్ణించునపుడు సోదాహరణముగఁ దెల్పె దను.

## భావనాశక్తియొక్క స్వభావము.

ప్రస్తుతము భావనాశక్తియొక్క స్వభావమును నది గొవించు కృత్యములును వివరింపఁబడును. భావనాశక్తి మనుజునియొక్క భావములపై నాధారపడియున్నదని యిదివఱకే తెలుపంబడియెను. భావములయొక్క విజృంభణయే భావనాశక్తి యగును. భావములు లేనట్టియు, జడుఁ డగునట్టియు, మృగప్రాయుఁడగు మనుష్యుఁడు భావనాశక్తిఁ గలిగియుండఁడు. భావములయొక్క ప్రకృతిని విజృంభణమును నడ్డగించి నిర్వికారులై సమాధియం దుండు యోగీశ్వరులకు భావనాశక్తి తక్కువగ నుండునుగాక. సాధారణముగ శరీరవ్యాపారములకు లోనగుచు రాగద్వేషాదుల ననుభవించు ప్రతిమానవునకును గొంచెముగనో గొప్పగనో భావనాశక్తి యుండును. అట్టి భావనాబలమే యాతని జీవితమును నడపించుచుండును. ఇంతవఱకుఁ దేలిన దేమనఁగా? భావనాశక్తి భావముల నాధారముగఁ జేసికొని యుండుటచే మానవుని చిత్తవృత్తి ననుసరించునదియే. భావన యెప్పుడును మనస్థ్సితినిబట్టియే వృద్ధినొందుచుండును. సుఖముగ నున్నవాని భావన యెంతయు సౌఖ్యమును, సంతోషమును బ్రదర్శించుచుండును. విచారమున మునిఁగియున్నవాని భావన యెప్పుడును విచారసూచకముగనే యుండును. క్రోధపరవశుఁడై యున్నవాని భావన యెప్పుడును గ్రోధరసమునే వెడలఁగ్రక్కుచుండును. ఇట్లే మిగిలిన చిత్తవృత్తులంగూర్చియు నెఱుంగునది.

—{ భావనాశక్తి చిత్తవృత్తుల ననుసరించుచు నియమితమార్గములనే చరించును. }—

భావన చిత్తవృత్తి ననుసరించి వృద్ధినందునని యంగీకరించినచో వేఱొకవిషయమునుఁగూడ నంగీకరింపవలసివచ్చును. అది యెద్దియన, మానవునకు సాధారణముగ నొక్కొక్క సమయమున నొక్కొక్కభావము ఆవేశించియుండుకతనఁ దద్భావముల కనుగుణములగు వస్తువిశేషములును, వస్తులక్షణములును, గోచరించుట సహజము. ఏపనిమీఁదఁ బోవువాఁడు ఆపనికి సంబంధించిన విషయములపైననే దృష్టియుంచునేకాని, యూరక చోద్యముఁ జూచువానిపగిదిఁ, దిరునాళ్లు దర్శింపవచ్చువాని పగిది నసంగతవిషయములపై దృష్టిఁ బోవనిచ్చునా? అట్లే భావావేశము గలిగినవాఁడు దద్భావానుగుణములగు వస్తువులనే, గుణములనే, విషయములనే వెదకుకొనుచుండును. అన్యవిషయములపై మనసుఁ దగులనీయఁడు. కావుననే భావదృష్టి యెంతయుఁ బరిమితదృష్టియే. అనఁగా వస్తువుయొక్క సర్వగుణములను సర్వవిశేషములను విచారింపక భావానుగుణములగు—అనఁగా భావావేశమునఁ దాత్కాలికముగ మనస్సుకిఁ దట్టు విషయములను విశేషములను, గుణములను మాత్రమే గ్రహించుననియు నన్వయించుకొనునది.

—• భావనాదృష్టికిని శాస్త్రదృష్టికిని గలభేదము. •—

శాస్త్రకారుని దృష్టి యట్టిది గాదు. శాస్త్రకారుఁడు ఏదేనివిషయమును బరిశీలించుచో ఆవిషయమును సాంగోపాంగముగ విమర్శించి దాని లక్షణముల నన్నియు గ్రహించి సర్వతోముఖపాండిత్యమును, సంపూర్ణవిజ్ఞానమును వెల్లడింపఁ

బ్రయత్నించును. శాస్త్రకారునికి విషయముపై భావసంబంధ మగు నభిమాన ముండదు. అతనికున్న యభిమానమెల్ల విషయ మును గ్రహింపఁగోరుటయే. భావకున కట్లుగాదు. భావనచేయు విషయముపై నతనికి నభిమానము మెండు. అందుచే నతఁడు దన యభిమానమును అనుసరించి తన కవసరమయిన విషయ మునే, తన మదికింపగు సంగతులనే, తన చిత్తవృత్తికి నను గుణములగు విశేషములనే యరయుంగాని సంపూర్ణపాండిత్య ప్రకర్షకై పెనంగులాడఁడు. భావనాబలమునఁ గవికి భావమున కనుకూలములును, బ్రధానములును నగు గుణములుమాత్రమే గోచరించును. అట్టివానినే యాతఁడు వర్ణించును. అంతియే కాని యూరక శుష్కప్రలాపముఁ గావింపఁడు. ఈవిషయ మును గొంచెము విమర్శించి నిజమగు భావనాశక్తికిని భావనా శక్తియని మనవారు—అందును ముఖ్యముగఁ బండితులు తప్పఁ దలంచు నూహాశక్తికిని భేదము నరయుదము.

## భావనాశక్తికిని నూహాశక్తికిని గలభేదము మితభాషిత్వము.

భావనాశక్తిగల కవి సహజముగ మితభాషి. తాను వర్ణించు విషయమును దనయొక్క చిత్తవృత్తికిఁ దన్నావేశించుకొని యుండు భావనకు ననుగుణమగు రీతిని వర్ణించును. అంతియే కాని, సంపూర్ణసౌందర్యముకొఱకుఁగాని, సంపూర్ణప్రతిభా ప్రకర్షముకొఱకుఁగాని ప్రయత్నింపఁడు. ఈవిషయమునఁ గావ్యవర్ణనాపద్ధతులలో భావనాశక్తిగల కవులకును నూహా శక్తిగల కవులకును భేదము విచారింపఁదగును. భావనాశక్తి గల కవులకు విషయమున నేవోకొన్ని లక్షణములుమాత్రమే

పరిస్ఫుటములుగ గోచరించును. చూడుఁడు. కొందఱుస్త్రీలకు మొగమే యందముగ నుండును. కొందఱకుఁ జక్కని కన్ను లుండును. కొందఱకుఁ జక్కని ముక్కు లుండును. కొందఱ కేచక్కఁదనమును లేకున్నను మనస్సు నాకర్షింపఁగల తీవియు హొయలును వాలకమును మందహాసమును నుండును. భావనా శక్తి గలిగి రసికుఁడగు కవి యాయావ్యక్తికిఁ బ్రత్యేకవిలక్ష ణము లనందగు నవయవసౌందర్యవిశేషములనే వర్ణించునుగాని యూరక ప్రపంచముననున్న సౌందర్యలక్షణము లన్నియు, వర్ణింపఁబూనఁడు. అట్లు వర్ణింపఁబూనిన హాస్యాస్పదుఁ డగును. "సీతమ్మకు ముక్కు సొగసు, రుక్మిణమ్మకుఁ గన్నులు సొగసు, కావున నీయమ్మముక్కును నాయమ్మకన్నులును దీసి బ్రహ్మ దేవుఁడు వేఱొక పెద్దమ్మను సృజించెను. కావున నీమూఁడవ యమ్మ సీతారుక్మిణులకన్న రెండింతలు సొగసుకత్తియ యని వ్రాయువారికి శిల్పముయొక్క తెలుంగుచువాసన యేమాత్ర మైనఁ దెలియుననివచింపనౌనా?" అని శ్రీ రెడ్డిగారు ప్రశ్నించు టలో నట్టివర్ణనముయొక్క వెకిలితనము పూర్తిగ వెల్లడియగు చునేయున్నది. అందుచే భావమునకును, అనఁగా నాభావము నకు నాశ్రయమగు పాత్రమునకును, ప్రత్యేకప్రాణమును ప్రత్యేకసౌందర్యమును, ప్రత్యేకగౌరవమును, ప్రత్యేకవిల క్షణతను నొసఁగఁగల సౌందర్యవిశేషములే వర్ణనీయములు గాని, యన్యములు గావు. అందుచే భావనాశక్తిగల కవి మిత భాషియని మేము మున్ను వచించియుంట.

—◉ ఊహాశక్తిగల కవులకు మితభాషిత్వము సున్న. ◉—

ఊహాశక్తిగల కవు లట్లుగాక విషయమునందుఁ బ్రత్యేకముగ నభిమానము లేనివారగుటచే శాస్త్రకారుని రీతిఁ బ్రపంచముననున్న సంగతులనన్నియు వర్ణనీయవిషయములతో సరిపోల్చి చూచి యయ్యది సర్వలక్షణసమేతమనియు, సంపూర్ణసౌందర్యవిలసితమనియు, వర్ణింతురు. ఇట్టివర్ణన స్వభావవిరుద్ధమనియు, రసాభాసకారణమనియు వేఱుగఁ జెప్పనక్కఱలేదు. కవి విషయమునందు అభిమానము గలవాఁడైనచో విషయమున కనుకూలించు గుణములనే వర్ణించి సంతసముఁ బొందును. చూడుఁడు—మన కడుపులఁగన్న బిడ్డలు మన కంత ప్రేమాస్పదులుగ నుండుటకుం గారణము వారు తోడివారలకన్న నందముగ నుండిరనియా? లేక మన కడుపునఁ బుట్టి వారి వన్నెచిన్నెలచే మన మనస్సుల కైవసముఁ గొనుచుందురనియా? కారణము తప్పక స్ఫురించును. మనకును వారికిని గల రక్తసంబంధముకతన వారికై మనకుఁ గల యనురాగముకతన వారియొక్క వన్నెచిన్నెలు తమంతటఁ దామే మిగిలినవిషయములతోఁ బ్రసక్తియు నవసరమును లేకుండఁగనే యానందము నొసఁగుచుండును. అందువలన మనము వారి నెడఁబాసియుండునపుడు వారియొక్క ప్రత్యేకములగు వన్నెచిన్నెలే మనమనస్సుల నిరంతరముఁ గలఁతపెట్టుచు వారిని జ్ఞప్తికిఁ దెచ్చుచుండును. కావ్యవిషయమునను నిట్లే!

—◉ తిక్కనమితభాషిత్వమున కుదాహరణములు. ◉—

చూడుఁడు. కవి మితభాషి యనుటకుఁ దిక్కనియుదాహరణము. అభిమన్యుని మరణమునకై పరితపించుచు శోకించు నర్జునుని విలాపమును దిక్కన యెట్లు వర్ణించెనో?—

క. "అన్నగుమోమును నత్తెలిఁ
గన్నులు నవ్వెడఁదయురముఁ గన్నారంగాఁ
గన్నను బ్రదుకుదుఁ గానక
యున్నను బ్రాణంబులెట్టు లుండఁగనేర్చున్."

భావనాశక్తియుతుఁడగు తిక్కనకవిబ్రహ్మకును శోకసంక్షోభితమనస్కుఁడగు నర్జునునకును నభిమన్యుని యాకృతి సర్వమును జ్ఞాపకమునకు రాక యతని నగుమోమును తెలిఁగన్నులును, వెడఁదయురమును మాత్రమే జ్ఞప్తికివచ్చుచున్నవి. ఈవర్ణన మెంతయు సహజమనుటకు సందియ మున్నదే? తండ్రికిఁ జూచుతోడనే ముద్దుఁగొలుపు నవ్వుమోమును, హృదయభావనైర్మల్యమును సూచించు తెలిఁగన్నులును, శూర సహజమగు వెడఁదయురమును మాత్రమే యర్జునుఁడు మనస్సునకుఁ దెచ్చికొనినాఁడు. అర్జునునిచే నట్టిపలుకులఁ బలికించిన తిక్కన భావనాశక్తియు, నౌచిత్యగ్రహణశక్తియు నెంతపొగడ్తకుం దగినవి!

ఈపద్య మూహాశక్తిచేఁ గల్పింపఁబడినదనుటకు సందియము లేదు. ఆలోచించి, ఆలోచించి, అభిమన్యుని సౌందర్య మెట్లుండెనా యని వితర్కించి వితర్కించి పిమ్మటఁ జెప్పినయట్లున్నదిగాని శోకరస మొక్కుమ్మడి పెల్లువెల్లువఁగ నుదయింపఁ దత్తరంగములచే సంక్షోభితమగు మనస్సుగల యర్జునుఁడు చెప్పినయట్లు లేదుకదా! అప్రధానములును, ఆలోచనాబలము ననే మనసునకుఁ దట్టు విషయములనుమాత్రమే వీరు వర్ణించిరి. దీనికిఁ గారణము వీరికి తద్భావసాక్షాత్కారము లేమియే, అభిమన్యునిశౌర్యరసోపేతమగు మూర్తిని గన్నులఁ గాంచకుంటయే,

అనఁగ భావనాశూన్యతయే. ఆంధ్రకవులలో నెల్ల భావనాశక్తి ప్రదర్శకమగు మితభాషిత్వమునఁ దిక్కనయు, వేమనయు ముఖ్యులును నీడులేనివారును. వారు వర్ణించు మూర్తినిఁ గన్నులఁగాంచినపిదపనే, అనఁగ విషయసాక్షాత్కార మైనతరు వాతనేవర్ణింతురు. అందుకనియే వారి వర్ణనములయందు నఖ శిఖాదిపర్యంతవర్ణనము గన్పట్టదు. రెండుమూఁడుమాటలలోఁ ప్రధానలక్షణములను వర్ణించి మన కన్నులయెదుటఁ దాము వర్ణింపఁదలఁచిన విషయముయొక్క మూర్తిని బరిస్ఫుటరీతిని సాక్షాత్కరింపఁజేతురు. తక్కుంగలవారో యట్టి భావనాశక్తి లేమి నూహాపోహములఁ గావించి యప్రధానవిషయముల జాబితాలను సమర్పించి మూర్తిని సాక్షాత్కరింపఁజేయఁజాల కున్నారు. చూడుఁడు. ద్రోణాచార్యకల్పితమై పాండవవీరుల కెల్లరకు నభేద్యమై ధర్మరాజునకుఁ బ్రాణభీతిఁ గొల్పిన పద్మ వ్యూహమును భేదించుటకై సాహసించి వ్యూహమున జొఱఁ బడిన యభిమన్యుని శౌర్యమును, ధైర్యమును, గాంభీర్యమును, మహోత్సాహమును దిక్కన యెట్లు వర్ణించినాఁడో!

ఆ. మెఱుఁగు మెఱసినట్లు మెఱపించి యరదంబుఁ
గర్ణికారకేతుకాంతిఁ జెలఁగ
నంపగముల గురుని నలయించి కడచి యిం
ద్రుజుని కొడుకు మొగ్గరంబు సొచ్చె:

"మెఱుఁగు మెఱసినట్లు" అని వర్ణించుటలో నభిమన్యుఁ డెంత వేగముతో నెల్లరకు దుర్నిరీక్ష్యుఁడై, ఎల్లరకన్నుల మిరు మిట్లు గొలిపి శౌర్యరాశియై పద్మవ్యూహమును భేదించుకొని పోరెనో యాతెఱంగు సువ్యక్తమై కన్నులఁగట్టినట్లుండి యభి

మనుష్యుని శౌర్యము కౌరవవీరుల నెట్లు కన్నుల మిఱుమిట్లుఁ గొలిపించెనో యట్లే మనలఁగూడ గన్నుల మిఱుమిట్లుఁ గొలిపి స్తంభితులఁ గావించుచున్నది. అట్టి మితవర్ణనాశక్తి భావనాబలమునను, విషయసాక్షాత్కారమువలనను, కవిసహాజమగు దివ్యప్రభావమువలనను లభ్యము కావలసినదేకాని యూహాశక్తివలనను, పాండిత్యబలమునను లభ్యము కాదు. అందుకని "జన్మనా జాయతే కవిః" యనుసూత్రమును పాఠకులకుఁ దిరిగితిరిగి, పదేపదే, విన్నవించుట. "అధిప భీష్మభానుఁడస్తమించె"యనుమాటలలో భీష్ముని మహాప్రతాపమును, నతని గాంభీర్యమును, నతనిపడుటవలన జనించిన మహాద్విచారమును సర్వమును వర్ణించిన తిక్కన యమేయకవితాప్రభావము సర్వలోకసంభావ్యమకదా!

## శాఫో కవయిత్రి.

పాశ్చాత్యకవులలో నెల్ల శాఫో యను గ్రీకుదేశపు కవయిత్రి యీామితభాషణమును, నీసంగ్రహావర్ణనాశక్తిని విశేషముగఁ బ్రదర్శించినది. ప్రణయస్వభావమును నామె వర్ణించిన విధంబుఁ గాంచుఁడు.—

Love is so strong a thing
The very gods must yield
When it is welded fast
With the unflinching truth.
Love is so frail a thing
A word, a look will kill
Oh lovers, have a care
How ye do deal with love

నిశ్చలసత్యముతో జతఁగూడిన
నెంతో శక్తివంతంబగు ప్రేమము
దేవతలైనను దాని ఘాటికిని
లోఁబడిపోవలసినవారే,
చపలము వికటము సుండీ ప్రేమము
చంపెడు నొకమాటే యొకచూపే,
కావున జాగ్రత కాముకులారా!
యేవిధిఁ బ్రేమల మెలఁగెదరో!

ప్రణయముయొక్క శక్తిని నామె యెట్లు వర్ణించినదో? ప్రేమమును సత్యమును జతఁగూడిన దేవతలైనను లొంగి పోయెద రనిన దానియొక్క శక్తిని వేరె వర్ణింపవలయునా? ప్రేమయొక్క చపలస్వభావము నామె యెట్లు వర్ణించినదో? ఒకమాటే, ఒకచూపే చంపెడునన్నచోఁ బ్రేమయొక్క చాపల్యము వేఱె వర్ణింపవలయునా? ఒకచూపునకు భ్రమసియే, యొకమాటకు మురిపెము నొందియే, యెందఱు ప్రణయినీ జనులు బ్రేమోపహతులగుట లేదు? ప్రణయభావస్వభావమును, ప్రణయినీజనుల చిత్తవృత్తియొక్క వైచిత్ర్యమును నెంత క్లుప్తముగాను నెంత హృదయంగమముగాను వర్ణించినది! అందుకనియే యీమెకవిత్వమును విమర్శించుసందర్భమున (Theodorewatts-Dunton) తియోడరువాట్సు డంటును అను నాంగ్లేయవిమర్శకుఁడు.నుడివిన వాక్యముల నిటఁ బొందుపఱుపక మానఁజాలను.—"Never before these songs were sung, and never since did the human soul, in the grip of a fiery passion utter a cry like hers; and, from the executive point of view, in directness, in lucidity, in that high, imperious-

Verbal economy which only nature can teach the highest artist, she has no equa, and none worthy to take the place of second.|" "అంతకుఁ బూర్వ మిట్టిపాటల నెవ్వరును పాడియుండ రైరి. అంతకుపూర్వ మెన్నండును ప్రచండభావవశమై మానవుని యాత్మ యిట్టి యాక్రందన మొనర్పదయ్యెను. శైలివిషయమును విచారించినను బ్రత్యక్షవర్ణనమునందును వైశద్యమునందును మహత్తరశక్తి గలిగినదియుఁ గవికి జన్మతః లబ్ధముగాఁ దగునట్టిదియు నగు మితభాషణమునందునను నీకవయిత్రి యసమానయు నద్వితీయయు నని చెప్పకతప్పదు."

భావనాశక్తిగలకవులు మానవస్వభావము ననుసరింతురు.

కావున భావనాశక్తిఁ గల కవి తచ్ఛక్తివలన భావానుగుణములగు విశేషములనే తాను గాంచి యితరులకు వర్ణింపఁ గలుగుననియుఁ దేలినది. మనుజుల స్వభావము దీనికి సరిపోవుచున్నది. చెప్పలేదా శాఘో;—

'చపలము వికటము సుండీ ప్రేమము
చంపెడునొకమాటే, యొకచూపే'

అని? మనుజుల స్వభావ మేమన, నేయొక్క తీవినో యేయొక్క సొగసునో, యేయొక్క పల్కుతీయందనమునో, యేయొక్క మందహాసమునో, యేయొక్క నడకసొబగునో కని— భ్రమించి, తద్వ్యామోహముచేఁ దపించుచుఁ గొట్టుకాడుచుండుటయే. అంతియేకాని విమర్శకులరీతి భావముయొక్క సర్వపరిణామములను, సర్వతోముఖవ్యాప్తిని, ననుభవించిన పిదపఁ దద్భావమునకు వశుఁడగుననుట మనుజస్వభావజ్ఞానము

లేమియే. కావున భావనాశక్తి విషయమును సంగ్రహముగను క్లిష్టముగను భావప్రకటనమునకవసరము,నుచితమును నగునట్లు గను వర్ణించి, విషయమును బ్రత్యక్షముగఁ గన్నులయెదుట సాక్షాత్కరింపఁజేయఁగలుగును. ఊహాశక్తి యట్లుగాక విషయముయొక్క గుణభేదములను విశేషములను నూహాబలము నను బాండిత్యబలమునను వర్ణించి విషయమును బ్రత్యక్షముగ సాక్షాత్కరింపఁజేయఁజాలదు. అట్టిశక్తిగలవా రెంతవఱకును జాబితాలఁ దయారుచేయఁగల్గినవా రేకాని ప్రాణవంతములగు మూర్తులను బ్రత్యక్షముగఁ బ్రదర్శింపఁజాలరు. మూర్తిని తా దర్శించిన కవియే దానిని బ్రదర్శింపఁగలఁడుగాని యూరక యాముదపు దీపముల వెలుంగునవాయుసంచారము లేని చీఁకటి కోణములఁ బూర్వకవికృతకావ్యముల వ్యాఖ్యానసాహాయ్యముతో గుడ్డిపాఠము గావించు పండితంమన్యులు బ్రదర్శింపం గలరే? ప్రాణప్రతిష్ఠఁ జేయుటకు వైద్యునకును, జీవతత్వము బాగుగ నెఱింగిన జీవశాస్త్రజ్ఞునకును సాధ్యమగునే? ప్రాణము నకు వీర్య మాధారమనియు, వీర్యమునకు రక్త మాధారమ నియు సిద్ధాంతముఁ గావింపంగల వైద్యులును, జీవశాస్త్రజ్ఞులును ఆరక్తమును వీర్యముఁ గావించి, యావీర్యముతో నొక ప్రాణిని సృష్టింపఁగలరా? అట్టి ప్రాణప్రతిష్ఠ శాస్త్రాతీతము, మనుష్యాతీతము. అది భగవంతునికే సాధ్యము. అట్లే కావ్యమునఁగూడ విషయమునకు మూర్తిని, బ్రాణమును నొసంగుటకుఁ గావ్యలక్షణములను గవిసమయములను బూర్వకవిరచితకావ్యములను బాగుగఁబాఠముఁగావించిన పండితులకు సాధ్యమగునే? ప్రచండభావావేశమునకు లోనయి భానుకరతప్తశరీరునిభంగిఁ దపించుచు నార్తిచేఁ గావ్యరచనకుఁ గడంగి తాను

వర్ణింపందలంచిన మూర్తిని గన్నులఁ గాంచి వర్ణించెడు కవి బ్రహ్మకే చెల్లుంగాని యన్యులకుం జెల్లునే? అందులకనియే.

"కవిర్బ్రహ్మా కవిర్విష్ణుః కవిర్దేవో మహేశ్వరః
కవి స్సాక్షాత్ పరం బ్రహ్మ తస్మై శ్రీకవయే నమః''

యని కవిస్తోత్రముఁ గావించుట.

## జన్మనా జాయతే కవిః.

"జన్మనా జాయతే కవి" యనుమాట సత్యము. "జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః" యనున్యాయము ననుసరించి మనవారు—అనఁగా లాక్షణికులు కర్మణా=కర్మ చేత: అనఁగాఁ గావ్యపఠనము చేతను,లక్షణగ్రంథపఠనము చేతను సత్కవి యగునని భ్రమించుచున్నారు. జన్మతో శూద్రుఁడై కర్మాచరణమువలన బ్రాహ్మణుఁ డగునని చెప్పిన యార్యవచనము కావ్యవిషయమునఁ దలక్రిం దవుచున్నది. కవి పుట్టుకతోడనే కవియై పుట్టును. పుట్టుకతోడనే కవి సహజమగు భావనా శక్తితోఁ బుట్టును. ఎట్లనః సింహము పుట్టుకతోడనే తనజాతి స్వభావమును లక్షణమును నగు మత్తేభహననకాంక్షఁ గలిగి యుండినట్లు, నాగుఁబాము పుట్టుకతోడనే తోఁకఁద్రొక్కినవెంటనే పడగవిప్పి బుస్సుమని కఱవ నుద్యమించునట్లు, అగ్ని రవులు కొనుతోడనే సర్వవస్తువులను దహించి భస్మముఁ జేయఁగల్గునట్లు. కావునఁ గవి సామాన్యమానవుఁ డనియుఁ గావ్యరచన ధీశక్తి ప్రదర్శకమనియుఁ జమత్కారజనకమనియు భావించువారికిఁ గావ్యస్వరూపమును గవిప్రభావమును దెలియవని చెప్పసాహ సించుచున్నాము. అట్టిసాహసమునకుఁ బండితశ్రేష్ఠులు గినియక.

వాదమునందలి సత్యమును గ్రహించి కావ్యపరమార్థమును గుర్తెఱింగిన నంతియే చాలును.

{ పాశ్చాత్త్యుల సిద్ధాంతము. వర్డ్స్వర్త్ భావనాశక్తి యేకత్వమును, నూహాశక్తి యనేకత్వమును సూచించును. }

ఊహాశక్తికిని, భావనాశక్తికిని పాశ్చాత్యవిమర్శకులు వేఱొక భేదవిశేషమును సూచించిరి. అదెట్టిదన భావనాశక్తి విషయమును ఒక్కటిగ నుపలక్షించును. ఊహాశక్తి విషయమును వివిధవిభాగములు గలదిగ నుపలక్షించును. ఈభావమును 'వర్డ్స్వర్త్'ను కవి తన విమర్శనవ్యాసముల వివరించెను. దీని భావ మేమనఁగా, భావనాశక్తిగల కవి విషయములయందు అనఁగా వస్తువుయొక్క గుణవిశేషములయందుఁ గల యేకత్వమునే దర్శించి దానిని ఏకప్రాణముగల వస్తువుగనే వర్ణించును. భావనాశక్తిఁగల కవి కుప్పతెప్పలుగఁ బడియున్న రాలగుట్టల యందును, నడ్డదిడ్డముగఁ బెరిఁగియున్న యటవీవృక్షముల యందును, గిచగిచ,—కిలకిల—కలకల—మని యొక నియమమును రీతియు లేని పక్షిసమూహముల గానములయందును, రసమును, సౌందర్యమును, జీవమును గ్రహించి యనుభవింపఁ గలుగును. అట్టికవికి నెట్టి భిన్నగుణములుగల వస్తువునందైనను బరిస్ఫుటమగు రసమును, సౌందర్యమును, భావవిశేషమును గన్పట్టుచునే యుండును. అట్టికవికి నసహ్యమును, సౌందర్య రహితమును, జీవశూన్యమును నగు వస్తువు ప్రపంచమునఁ గన్పడనేకన్పడదు. అట్టికవి వస్తువుయొక్క విశేషములనన్నియుఁ లోహకారుఁడు లోహమును గరఁగించి యొకయచ్చునఁ బోఁత

పోయునట్లు పోఁతఁబోసి యప్రధానవిషయములను విసర్జించి ప్రధానగుణములే మూర్తీభవించి ప్రాణవంతమగు రూపముఁ దాల్చునట్లు వర్ణించును. ఊహాశక్తిగల కవి యన్ననో యట్టి భిన్నత్వాతీతమగు నేకత్వమును, రసమును, సౌందర్యమును జీవమును గ్రహించి యనుభవించి వర్ణింపంజాలక యూహాలఁ బన్ని వస్తువుయొక్క విశేషణముల నొకదానివెంటఁ నొకటిఁ జేర్కొనుచు వస్తువుయొక్క మూర్తిని సాక్షాత్కరింపఁజేయ లేకుండును. ఇతఁడు ప్రాణప్రతిష్ఠఁ జేయఁగల కవి బ్రహ్మ కాఁడు. భావనాశక్తియుతుఁడగు సత్కవి ప్రాణప్రతిష్ఠ జేసిన విగ్రహమునకు నీయూహాశక్తిగల కవి నగిషీఁజెక్కి యలంకారముల నొడఁగూర్పఁ బ్రయత్నించును. కాలుసేతులకుఁ దొడవులును, వస్త్రాద్యలంకారములను గూర్చి, వివిధావయవములకు నాభరణములను గూర్చి యాభరణములును, దొడవులును; నలంకారములును దక్క మూర్తియొక్క సొగసుఁగాని, నిసర్గసౌందర్యముఁగాని, జీవశక్తిగాని, తేజముఁగాని గనుపింపకుండఁజేసి చింపిరిగుడ్డల బరువుతోఁ దలయూడించు గంగిరెద్దులయట్టి యాకృతులను నీయూహాశక్తిఁగల కవి వర్ణించును.

## భావనాశక్తిగలకవి యాకృతిని, నూహాశక్తి గలకవి వస్తుగుణవిశేషములను వర్ణించును.

భావనాశక్తిఁగలకవి యాకృతిని నిర్మించుటకై ప్రయత్నించును. ఊహాశక్తిఁగల కవి వస్తుగుణవిశేషముల వివరించుటకై త్రొక్కిసలాడును భావనాశక్తిఁగల కవి వస్తుగుణముల కతీతమై సామాన్యమానవశాస్త్రదృష్టి కగోచరమై దివ్యప్రభతో వెలుఁగుచు వస్తువునకు జీవమును దేజమును నొసఁగు చైతన్య

మును దర్శించి, దాని మహత్త్వమును గుర్తెఱింగి దాని ప్రభావము ననుభవించి, దానియొక్క తేజము గని, స్తంభితుఁడై, తెలివి నొందినపిదపఁ దాను గాంచిన యాదివ్యమూర్తిని, చైతన్యమును, ప్రాణవంతముగను తేజస్సహితముగను వర్ణించును. అట్టిమూర్తులు మఱవరానంత పరిస్ఫుటాకృతులఁగలిగి మన కన్నులయెదుటఁ దాండవించుచునే యుండును. ఊహాశక్తిఁగల కవు లట్టి దివ్యచైతన్యమును గాంచలేక యూరక పైపై మెఱుఁగులఁ బచరించుటతోడనే తృప్తిఁ జెందుదురు. ఈసత్యమును గ్రహించియే 'వర్డ్సువర్తు'కవి తన కావ్యముల ననవసరవర్ణనములకుఁ దావీయక విషయముయొక్క చైతన్యమునుమాత్రమే ప్రకటము గావించుచుండెను. ఈ సత్యమును గ్రహింపఁజాలకుండిన యప్పటి యాంగ్లేయవిమర్శకులు 'వర్డ్సువర్తు' యొక్క కావ్యశైలి పేలవమనియు నలంకారశూన్యమనియు నాక్షేపించిరి. కాని కాలమే వారి వాదదౌర్బల్యమును, వర్డ్సువర్తుకవియొక్క ప్రతిభను సమర్థించినది.

తియోడర్ వాట్సుడంటను పండితునిమతము.
సర్వస్వతంత్రభావనాశక్తికిని పరిమితభావనాశక్తికిని గలభేదము.

**Encyclopædia Brittanica** (ఆంగ్లేయవిజ్ఞానసర్వస్వము) అను గ్రంథమున కవిత్వ మనువిషయమై యమూల్యమగు వ్యాసరత్నమును రచించిన **Theodorewatts-Dunton** (తియోడర్ వాట్సుడంటన్) అను విమర్శకశేఖరుఁడు భావనాశక్తివిషయమున నింకొక విభేదమును సూచించినాఁడు. అతఁడు భావనాశక్తి **Absolute Imagination, Relative Imagination** అను రెండు

విధములుగ నుండునని సూచించినాఁడు. Absolute Inagination అనఁగా సర్వస్వతంత్రమగుభావనాశక్తి Relative Inagination అనఁగాఁ గవియొక్క చిత్తవృత్తి ననుసరించుచు కవియొక్క స్వభావముచే పరిమితమగు భావనాశక్తి. సర్వస్వతంత్రభావనాశక్తి యఖండశక్తియుత మైనది. దాని నేనియమములును బాధింపనేరవు. భావసామ్రాజ్యమున దానికి సర్వస్వతంత్రాధికారము కలదు. అట్టి భావనాశక్తి కవియొక్కస్వభావముచేతఁ గూడఁ గట్టుపడియుండదు. అట్టిభావనాశక్తి తఱచుగ నాటకములయందే ప్రదర్శిత మగుచుండును. అట్టి భావనాశక్తి నిజముగఁ బరకాయప్రవేశవిద్యవంటిది. తత్ప్రభావముచేఁ గవి తాను వర్ణింపఁదలఁచికొనిన పాత్రమునందు లీనుఁడై పోవును. అట్లు లీనుఁడై పోయినకవి యాపాత్రమునఁ దనయొక్క భావమున కనుగుణముగఁగాని,తన చిత్తవృత్తి కనుకూలముగఁగాని, తన యూహానుసారముగఁగాని వర్ణింపఁజూడఁడు. మఱి యాపాత్రముయొక్క స్వభావ మెట్లు నడచునో యట్లే వర్ణించును. ఆపాత్రముయొక్క మూర్తిని సాక్షాత్తు కన్నులదర్శించి యాపాత్రముయొక్క చేష్టాదికములను, సంభాషణమును తాను గాంచినట్లే తాను విన్నయట్లే వర్ణించును. ఆపాత్రము వర్ణించునపుడు కవి తన వ్యక్తిని, స్వభావమును సంపూర్ణముగ వదలినవాఁడై, పాత్రమునందు లీనుఁడై, పాత్రహృదయగహ్వరాంతరమునఁ బ్రవేశించి, తానే పాత్రమై పాత్రము పల్కుంచుపలుకులనే పలుకుచుఁ, జేయుచేష్టలనే వర్ణించి ప్రదర్శించును. అట్టిశక్తిఁగల కవి సిద్ధునివంటివాఁడు. యోగబలమున సిద్ధుఁడు దేవతాస్వరూపముల నెట్లు గాంచి యనుభవించునో యట్లే స్వతంత్రభావనాశక్తిఁగల కవికూడ

తాను వర్ణింపఁదలఁచిన విషయములను దివ్యశక్తిచేత స్ఫుటముగఁ గాంచి, యనుభవించి వర్ణించును. అట్టిదివ్యశక్తి కవికి జన్మతః లభ్యమౌనని యిదివఱకే విన్నవించియుంటిని. అట్టి దివ్యశక్తి మున్ను భారతయుద్ధప్రకారమును ధృతరాష్ట్రుని కెఱింగించుటకై యుద్ధరంగమున సర్వత్ర జరగుచున్నవిషయముల కన్నులారఁ గాంచి వర్ణింపుమని సంజయునకు వేదవ్యాసుఁ డొసంగిన దివ్యదృష్టివంటిది. పుట్టుగ్రుడ్డియైన ధృతరాష్ట్రునకు శ్రీకృష్ణుఁడు తనవిశ్వరూపము దర్శించుటకై యొసఁగిన దివ్యదృష్టివంటిది. అట్టిదివ్యదృష్టిబలమున నే రవి గాంచలేని వాని నెల్లఁ గాంచఁగలుగుట. అట్టిదివ్యదృష్టిబలమున నే సామాన్య కవులు గాంచలేని విషయముల నీస్వతంత్రభావనాశక్తిఁగల కవి వర్ణింపఁగలుగుట. అట్టి స్వతంత్రభావనాశక్తిని నాటకరచనాశక్తియనియు, దివ్యదృష్టియనియు గ్రహింపఁదగును. ఇట్టిశక్తి నాటకములయందును కథాభాగము విశేషముగాఁగల పురాణములాదిగాఁగల మహాకావ్యములయందును నప్పుడప్పుడు ప్రదర్శితమగుచున్నది. అది యొకతపస్సిద్ధివంటిదని చెప్పుటచే నయ్యది సర్వదా యనుభూతము కాదనియుఁ, దపస్సు సిద్ధించిన వేళల మాత్రమే లబ్ధమగుననియు గ్రహించునది. కవి కట్టిదివ్యదృష్టి మెఱుఁగు మెఱసినయ ట్లెప్పుడో లభ్యమై యితరసమయముల మాయమైపోవుచుండును. మఱియు నాటకకర్తకుఁగూడ నీపరకాయప్రవేశము సర్వదా సాధ్యముకాదు. అతఁ డేదో యొకపాత్రమం దే లీనమైనమనస్సుగలవాఁడగును.అట్టి పాత్రము యొక్క స్వభావమందైనను నెప్పుడో యొకప్పుడు లీనుఁడై స్వవ్యక్తి వశించినవాఁ డగునుగాని మిగిలినవేళలను స్వభావము మీఱి చరింపఁజాలక తనయూహాప్రకారమే పాత్రముయొక్క

స్వభావముచు వర్ణించుచుండును. ఇట్టి నాటకరచనాశక్తి ఎచ్చటనో కొన్నిరంగములనే ప్రదర్శితమగుచుండును. అట్టి నాటకపుఁబట్టులయందుఁ గవి యనవసరవాగ్వ్యయముఁ గావింపక పొల్లుమాటనైనఁగాని, పొల్లుఅక్షరమైనఁగాని రానీయక యథాశ్రుతమును, యథాదృష్టమునునగు పలుకులను రీతులను వర్ణించును. సాధారణకవు లెల్లరును భావనాబలమున నిట్లుండునని యూహించి యాప్రకారము వర్ణింతురు. వారికి దివ్యదృష్టి యంతగా లేనికారణమున నూహాపరిమితములును నూహాచింతితములును నగు పలుకులును మూర్తులును ననుభవైకవేద్యము లగుచుండును. దివ్యదృష్టిగల కవుల పలుకు లట్టి దివ్యదృష్టిప్రదర్శితమగు పట్టుల ననితరతుల్యములును, ననితరసామాన్యములును, కేవలోపజ్ఞాసూచకములును నై యాశ్చర్యముఁ గొలుపుచు "ఔరా, ఈకవివక్క నన్యు లెవరైన నీవర్ణనఁ జేయఁగలరే? యీభావముల వ్రాయఁగలరే? ఈభావ మితనిసొమ్మేకాని యితరులది కాదు ఈభావము రచించినవాఁ డితఁడే గాని ఇట్టివాఁడు పుట్టలేదు, పుట్టఁబోఁడుకూడ" ననుతలఁపుల మనలో నుదయింపఁజేయును.

## సర్వస్వతంత్రభావనాశక్తి కుదాహరణములు.
## ౧. షేక్స్పియరుమహాకవిరచితమగు హామ్లెటు నాటకము.

ఇట్టి దివ్యదృష్టిసూచకమగు భావనాశక్తికి వాట్సుడంటనుపండితుఁ డొకయుదాహరణము నొసఁగినాఁడు. అయ్యది షేక్సుపియర్ (Shakespeare)అను నాంగ్లేయకవిశేఖరునిచే రచింపఁబడిన(Hamlet) హామ్లెట్ అను నాటకమునుండి కైకొనఁబడి

నది. హామ్లెట్ అను రాచకుమారుని తండ్రి మరణించెను. అతఁడు మరణించినవిధ మనుమానాస్పదముగ నుండెను. రాకుమారునకుమాత్రము తన తండ్రిమరణము మిక్కిలి మనోవేదనను గలిగించెను. తన పినతండ్రి వెంటనే రాజ్యము స్వాధీనముఁ జేసికొని సింహాసన మధిష్ఠించి యన్నభార్యను సతిగాఁగూడఁ గైకొనెను. ఈసంగతులనన్నియు విని హామ్లెటురాకుమారుఁ డత్యంతవిషాదసంక్షుభితమనస్కుఁ డయ్యెను. ఇట రాకుమారుని సంగతి యిట్లుండఁగాఁ గోటగుమ్మముకడఁ గావలియుండు పహరా జవానులకు వరుసగా మూఁడురాత్రులు ప్రతిరాత్రియందున్నను రెండుజాములవేళకు చనిపోయిన హామ్లెటురాజు నిజాకృతితోఁ గన్పడెనఁట. కన్పడినతోడనే యాకావలివాండ్రు భయభ్రాంతులైరఁట. వారలలో ధైర్యవంతుఁ డొకఁ డెట్టకేలకు నాఁటిరాత్రి యారాజుయొక్కయాకృతినిగని దాని కేమైన కోరిక లుండెనో కనుఁగొనవలెనని పలుకరింపఁబోవఁగా నయ్యది ప్రత్యుత్తర మీయకుండ నేఁగెను. అంత నాకావలివాండ్రు మఱునాఁడు హామ్లెటురాకుమారునికడ కేఁగి యతనితో జరిగిన సంగతియెల్లఁ దెలిపిరి. తెలుపునవసరమున వారి కీక్రింది సంభాషణము జరిగెను:—

"కావలి:—అయ్యా, మూఁడురాత్రులనుండియు మాకుఁ గనిపించుచునేయున్నది.

రాకుమారుఁడు:—ఆభూతముయొక్క యాకృతి యెట్లుండెను?

కావలి:—అచ్చముగ హామ్లెటురాజుగారి యాకృతియే మహాప్రభూ!

రాకుమా:—అట్లైన నేను దానిఁ జూచియుండవలసినది..

కావలి:—మీరు తప్పక భయభ్రాంతు లయ్యెడివారే!

రాకుమా:—నిజము. నిజము. ఆయాకృతి చాలసే పుండెనా!"

ఇచ్చట కావలివాండ్రు రాజుయొక్క భూతాకృతిని గాంచి భయపడియున్నవా రగుటచే రాకుమారుఁ డాభూత మును తాను గాంచియుండవలసినదని చెప్పినప్పుడు తమవలెనే యతఁడును భయపడియుండునని తలఁచి యాభావమును "మీరు తప్పక భయభ్రాంతు లయ్యెడివారే" యనిరి. తోడనే సామాన్యకవి యెవ్వఁడైనను హామ్లెటురాకుమారునిచే "ఏమి, నేనా, భయభ్రాంతుఁడ నగుదునా? లోకములు తల్లక్రిందులు గావే! నేనే భయపడినచో! నేనెన్నటికిని భయపడియుండను. మీరు పిఱికివా రగుటచే నేనును మీవలెనే భయపడియుందు నని తలఁచితిరిగాని నేను భయపడుదునే? ఎంతమాటాడి తిరి!" ఇత్యాద్యాక్షేపణాపహాసపూర్వకమగు దీర్ఘప్రసంగముఁ జేయించెడివారే. కాని హామ్లెటురాకుమారుని యంతరాత్మ యందుఁ బరకాయప్రవేశవిద్యచేఁ బ్రవేశించిన షేక్స్పియరు మహాకవికి హామ్లెటుమనసులో నున్నభావము విస్పష్టముగఁ గన్పడెను. హామ్లెటురాకుమారుఁడే షేక్స్పియరుచే తనమనో భావము నెఱుకఁగావించెను. హామ్లెటున కప్పుడు వారితో వాదాడ సమయము కాదాయెను. అతఁడు వారివలన నను మానాస్పదమగు పితృమరణవృత్తాంతమును వినఁగోరి తన్ను చింతాంబుధి విడిచి స్వర్గమున కేఁగిన తండ్రి యాకృతిని గని యాతఁడు చెప్పదలఁచిన పలుకుల వినుట కుత్సాహముకల వాఁడై యుండెను. అట్టి హామ్లెటువృత్తాంతము యావత్తును వినకపూర్వమే వారితో శుష్కవాదము గావించుచు కాలము

వృథాపుచ్చుచు తనమనస్సునందలి తృష్ణ నాఁపికొనకుండ యూరకొనునా? అందుకనియే హామ్లెటు వారితో వాద ముపసంహరించుటకై కావలివాండ్రమాటనే యొప్పికొని తరువాత ప్రశ్నము వైచెను. "నిజము, నిజము." అని కావలివాండ్రమాటల హామ్లెటు బదులుచెప్పుటయే యిందులకుఁ దార్కాణము. కావలివాండ్రతో వాదుసల్పకుండుటకై వారిమాటలనే యొప్పికొని తలయూఁచి హామ్లెటు తరువాతి ప్రశ్నము నడిగెను. "ఆహా! ఎట్టి దివ్యదృష్టి? ఎట్టి సందర్భశుద్ధి? ఎట్టి యౌచిత్యగ్రహణము? రవి గాననిచోఁ గవి కానకుండునే" యను నార్యోక్తి యిట్టి సందర్భమున నుపయోగింపఁజెల్లదే. సామాన్యకవుల కెల్లరకు గోచరింపని హామ్లెటు రాజకుమారహృదయాంతర్గతభావము భావనాశక్తియుతుండగు షేక్స్పియరు మహాకవి కద్దమునఁ జూచినదానియట్లు నెంత విస్ఫుటముగను, నెంత సత్యముగను, నెంత శుద్ధముగను, నెంత యనన్యపరతంత్రముగను గన్పించెను? ఎట్టి పరకాయప్రవేశప్రభావము?: ప్రపంచమందలి నాటకకర్తలలో నిట్టి సర్వస్వతంత్రభావనాశక్తిఁ గలవా రరుదుగ నుందురు. షేక్స్పియరైనను నిట్టియద్భుతశక్తి కొలఁదిసందర్భములలోనే యుపయోగింపఁగలిగెను. ఇంకఁ గొన్నియుదాహరణముల నొసఁగకమానఁజాలను.

## ౨. షేక్స్పియరుకృతమగు నొతెల్లోనాటకము.

ఒతెల్లోయను మూరుదేశపువీరుఁ డొకఁడు డెస్డిమోనా యను గ్రీకుకన్యను, జమీఁదారుని కొమరితను గాంధర్వవివాహమునఁ గొని యామెతో నమితసౌఖ్య మనుభవించుచుండఁగా అయాగోయను దుష్టుఁ డొకఁడు చూచి యోర్వ

లేక కుతంత్రముఁ బన్ని డెస్డిమోనాతోడ కాసియోయను నుద్యోగియుని నేదో తనయుద్యోగమునుగూర్చి ప్రసంగింప నియమించి యొతెల్లోను బిలిచికొనివచ్చి యాసంభాషణము నందలి డెస్డిమోనావాక్యముల కెల్ల నపార్థములఁగల్పించి డెస్డిమోనాకును కాసియోకును రహస్యసంబంధ ముండెననియు చెప్పి, పిమ్మటఁ దన భార్యద్వారా యొతెల్లో డెస్డిమోనాకుఁ బ్రేమసూచకముగా నొసఁగిన చేతిరుమాలును రహస్యముగ దొంగిలించి దానిని కాసియోకోటుజేబులో నతనికిఁ దెలియకుండఁ బెట్టించి, ఆరుమాలు కాసియోకు డెస్డిమోనా యిచ్చెననియు, నయ్యది కాసియోకోటుజేబులో నుండుననియు నొతెల్లోకుఁజెప్పెను. ఒతెల్లో యీర్ష్యాగ్రస్తుఁడై కాసియోను జంపి, యాతని జేబులో నున్న రుమాలును సంగ్రహించి, పిదప నిజమందిరమున కేఁగి భార్యను తిట్టి, యవమానించి, ఘోరముగ తలదిండులతోఁ జావమోఁది చంపెను. పిమ్మట నీసమాచారము రాజునకుఁ దెలియఁగా నతఁడొతెల్లోను బట్టుకొనుటకై భటులను బంపెను. వారు వచ్చులోపల నయాగోభార్యవలన నయోగోదుస్తంత్రము సర్వమును నెఱింగి, నిష్కారణముగ నీర్ష్యాపిశాచగ్రస్తుఁడై పవిత్రశీలయగు భార్యాతిలకమును, నేపాపమెఱుంగని కాసియోను జంపినందులకును, తనకొఱకై యయాగోచేతిలో దుర్మరణము నొందిన యయోగోభార్యమృతికిని, విభిన్నహృదయుఁడై బిట్టువగచి కడ కుపాయమున నాత్మహత్యఁ గావించికొని తన మనోవేదనను, దుర్భరజీవయాత్రను నంతమొందించెను. అతఁడు పొడుచుకొని చచ్చుటకుఁబూర్వము చెప్పినపల్కులలోఁ వీనిని బరికింపుఁడు:—

"Not easily jealous, but being wrought
And perplexed in the extreme."

"సాధారణముగ నీర్ష్యాగ్రస్తుఁడను గాకుండినను, వారునువీరును నూఱిపోసిచెప్పుటచే, మనసు పూర్తిగ వికలము నొందినవాఁడనై యిట్టిపనిఁ గావించితి"నని చెప్పెను. పై మాటలలోని "wrought" అనుశబ్దము షేక్స్పియరునకే తట్టఁదగినది. ఆమాటలోని కఱకుఁదనము వాగతీతము, అనుభవైకవేద్యమే.

"The marvellous timber of the word wrought"

"అని వాట్సుడంటను గావించిన వ్యాఖ్యాన మెంతయు నుచితమును సత్యమును భావప్రకాశకము నై యున్నది. ఒక్క మాటలో నొతెల్లోహృదయమును అంపపుకోఁతఁ గోయుచున్న విచారముల క్రౌర్యమును, కఱకుఁదనమును, నొతెల్లోయొక్క దుర్భరవేదనయు, మరణావస్థయు, యాగోయొక్క దుశ్చరితమును, డెస్డిమోనాపొందిన దుర్మరణముయొక్క భయంకరత్వమును, నొతెల్లో గావించిన క్రౌర్యముయొక్క యన్యాయమును, నతనికి రానున్న పాటును, వాగతీతములగు నితరభావములను సర్వము ననిర్వాచ్యమగు రీతిని సూచింపఁగలిగినాఁడు. ఆహా! శబ్దసిద్ధియన నిట్లేకదా యుండఁదగును?

## 3 షేక్స్పియరు కృతమెక్బెత్ నాటకము.

మెక్బెత్ అను నాటకమున నొకసందర్భమున నిట్టియద్భుతపరకాయప్రవేశశక్తి ప్రదర్శిత మగుచున్నదని కొందఱు విమర్శకులు తలఁచినదానిని డంటక్ పండితుఁడు పూర్వపక్షముఁ జేసెను. మెక్బెత్ అనునతఁడు రాజ్యకాంక్షాపరుఁడై తన్నుఁ బోషించు తండ్రివోలెఁ దనకు నండరైయుండిన డంకక్ అను

స్కాట్లండు దేశపు రాజును భార్యయొక్క దుర్బోధమువలనను తాను రాజు కాఁగలఁడని చెప్పిన మంత్రకత్తెల మాటల నమ్మి ద్రోహచిత్తుఁడై తన మందిరమున కతిథిగ రావించి యర్ధరాత్రమున సుఖసుప్తుఁడై యున్నవానిని జంపనేగి ధైర్యముచాలక మరలివచ్చెను. తోడనే మహాశక్తిస్వరూపిణి యనఁదగు నతని భార్య యతనినిఁ దూలనాడి యతని పిఱికితనము నపహసించి యతని కరముల నున్న ఖడ్గమును దాను గయికొని నిద్రారతిం జొక్కియున్న రాజును జంపనేగెను. వేఁగి యేకారణముననో యాతనిఁ జంపక మరలివచ్చి భర్తతో నీక్రిందిమాటలఁ దాను రాజును జంపకుండుటకుం గల కారణమును నివేదించెను.

**For, had he not looked like my father, I had done the deed.**

(అతఁడు నాతండ్రియాకృతిని గన్పట్టకుండినచో నాతనిని దప్పక చంపియుండెడిదాననే.)

ఈపలుకులు కవియొక్క దివ్యప్రతిభను ననితరసామాన్య కవితాశక్తిని సూచించునని కొందఱు అభిప్రాయపడిరి. కాని— వాట్స్డంటన్ అనుపండితుఁడు అయ్యది పై యుదాహరణములఁ బ్రదర్శితమయిన యత్యద్భుతభావనాశక్తిని బ్రదర్శించుట లేదనియు, నంతకన్నఁ గొంచెముతక్కువరకపు భావనాశక్తినే ప్రదర్శించుననియు, దానికిఁ దార్కాణముగ నిట్టిసందర్భమే ఒక యరబ్బీకథయందు వర్ణితమయినదనియుఁ, గావున నయ్యది యనితరకవిదుర్లభమగునంత తీక్ష్ణమగు భావనాశక్తిని బ్రదర్శించుట లేదనియు విమర్శించెను.

## కాళిదాసకృత శకుంతలావర్ణనము.

ఇట్టి యత్యద్భుతపుశక్తిని కాళిదాసును భవభూతియుఁ దిక్కనయు నచ్చటచ్చటఁ బ్రదర్శించిరి. చూడుఁడు!

సౌందర్యరాశియు, 'కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్' అను వచనమునకు లక్ష్యమయినట్టియు, సహజలావణ్యవతియునగు శకుంతలను గాంచినతోడనే దుష్యంతమహారాజు. 'అయే! లబ్ధం నేత్రనిర్వాణమ్' అనుపలుకుల నాపెయెడఁ దనకుఁ గల యభిలాషము, నభిమానము, నాశ్చర్యమును, సంతోషమును, నొక్కమాఱుగ ధ్వనించునట్లు మాట్లాడినారు. అన్యకవు లన్ననో కాళిదాసునివలెఁగాక లేనిపోని యుపమోత్ప్రేక్షాసహితమగు విపరీతభావములనేవో మన నెత్తిన కొట్టియుండెడివారే! 'త్వమేవాహం త్వమేవాహం త్వమేవాహం నసంశయః' అను వాగ్దేవ్యనునయమునకుఁ బాత్రుఁడైన కాళిదాస మహాకవి సామాన్యకవులఁబోలె విపరీతాలంకారములతో దుష్యంతుని భావమును వర్ణింపక తాత్కాలికముగదుష్యంతుని యాత్మచే నావహింపఁబడినవాఁడై దుష్యంతునిహృదయాంతరాళమున ధ్వనించుచుండిన పల్కులను నట్టిసందర్భమునఁ దాను వర్ణించెను. 'అయే' యను మాటవలన దుష్యంతుని స్తంభితునిఁ జేసిన యాశ్చర్యభావమును, 'లబ్ధం' అనుమాటవలన నతఁడు పొందిన మనస్సంతోషమును 'నేత్రనిర్వాణమ్' అనుమాటవలన శకుంతలయొక్క యలౌకికాద్భుతలావణ్యమును, దద్గ్రహణమును నొక్కమాఱుగ ధ్వనించుచున్నది. ధ్వనిసిద్ధియన్న నిట్లుకదా యుండవలయును?

## భారతమునుండి యొకయుదాహరణము.

చూడుఁడు. భారతమున దుర్యోధనుఁడు భీమునిచేఁ దొడలు విఱుఁగఁగొట్టఁబడినవాఁడై యశ్వత్థామ-యుపపాండవులను, ధృష్టద్యుమ్నుని, శిఖండిని వేయేల? పంచపాండవులును, కృష్ణుఁడును, సాత్యకియును, ద్రౌపదియుం దక్క పాండవసైన్యమును సర్వమును నాశముఁ గావించివచ్చిన వార్త యతని నోటనే వినినవాఁడై ప్రాణంబులు విడుచుటకుఁ బూర్వము "అమ్ముప్పుర మొగంబులఁగలయంగనుంగొని మీరు కృతకృత్యులరు. సుఖులరై యుండుఁడు. పునర్దర్శనంబు త్రిదివంబున నయ్యెడుంగాక. వగలు మాని పొం డనిపలికి ప్రాణంబులు విడిచిన వార లవ్వసుమతీపతిఁ గౌఁగిలించుకొని వలగొని వచ్చి మరలి చూచుచు నరదంబు లెక్కి యరిగిరి." ఈవాక్యము నందలి 'మీరు కృతకృత్యులరు. సుఖులరై యుండుఁడు' అను మాటలలో గన్పట్టు నార్తి యనుభవైకవేద్యము. 'పునర్దర్శనంబు త్రిదివంబున నయ్యెడుంగాక' యనుమాటలవలన దుర్యోధనునకును, దిక్కనకును ఏకసమయమునందే స్వర్గము కన్నులఁ గట్టినట్లు మనకును దోఁచుచునేయున్నది. 'మరలి చూచుచు' అనుమాటవలన నశ్వత్థామాదుల మూర్తులును వారియొక్క విచారమును, నొక్కపెట్టున మనల నావహించుచుండును. ఆహా! దుర్యోధననిర్యాణరంగము తిక్కనకనులయెదుటఁ గట్టి యుండనిచో నాతఁ డిట్లు వ్రాయఁగల్గియుండునా? భారతమున నిట్టిపట్లు ఎన్నెనియుంగలవు? వాని నన్నింటిని నుదాహరింపఁ బూనుట గ్రంథవిస్తరభీతిచే మానుకొంటిని.

కావున నాటకరచనకు సంబంధించిన భావనాశక్తి కొంచెకయెడలఁ గవియొక్క భావమునకును, జిత్తవృత్తికిని అందరానిదై సాక్షాత్పరకాయప్రవేశప్రభావమువలననే వర్ణింపఁదగినదై యుండునని తిరిగి విన్నవించుట. మిగిలిన కావ్యములలోఁ గవి తన చిత్తవృత్తికిని స్వభావమునకును ననుకూలములగు భావములనే వర్ణించుచు నొక్కొక్కప్పుడు భావనాబలమునఁ బాత్రములయొక్క స్వభావమును దన మనస్సున కందినంతవఱకు వర్ణించును.

## రూపకల్పనవిషయము. కేవలకల్పనము సాధ్యమా?

ఇచ్చట రూపకల్పనవిషయమయి రెండుమాటలఁ జెప్పెదను. కొందఱు కవులు అసహజములును, బ్రపంచసామాన్యములుగానివియు నగు మూర్తులను వర్ణించియున్నారు. ఉదాహరణము—పదితలల రావణుఁడు, యోజనాయతములగు బాహువులు గల కబంధుఁడును మొదలగు రూపములు: ఇవి సాక్షాద్దృష్టములా? సర్వస్వతంత్రభావనాశక్తిప్రదర్శకములా? లేక యూహామాత్రకల్పితములా? అను ప్రశ్నములకు సమాధానము విచారింతము. ఇయ్యవి యూహామాత్రజనితములే యని పాశ్చాత్యశాస్త్రజ్ఞుల యభిప్రాయము.

## పాశ్చాత్యశాస్త్రజ్ఞులవాదము.

There is nothing like pure imagination. An object of pure imagination is a myth" అని పాశ్చాత్యమనశ్శాస్త్రజ్ఞులలోఁ గొందఱు వాదించుచున్నారు. కేవలకల్పనమనునది యబద్ధమనియుఁ, బుక్కిటిపురాణమనియుఁ బై వాక్యముల యర్థము. అనఁగాఁ గవికల్పితమూర్తులన్నియు నెంతవిపరీతములుగ నున్న

ను, నెంత యపూర్వములుగ నున్నను బ్రకృతియందలి యే వస్తువుయొక్క విశేషముల నేకొన్నింటినో గయికొని వాని యాధారమువల్లనే కల్పింపంబడినవి కాని, కేవలము సృష్టములు గావని వీరి వాదము.

పాశ్చాత్యకవుల యభిప్రాయము, ౧. షేక్స్పియర్.

కాని, వారలలోఁ గవీశ్వరులు దీనికిఁ బూర్వపక్షముగా వ్రాసిరి. చూడుఁడు.

"The luntic, the lover, and the poet
Are of imagination all compact;—
One sees more devils than vast hell can hold,—
That is, the madman the lover, all as frantic,
Sees Helen's beauty in a brow of Egypt
The poet's eye, in a fine frenzy rolling,
Doth glance from heaven to earth, from earth to heaven;
And as imagination bodies forth
The forms of things unknown, the poet's pen
Turns them to shapes, and gives to airy nothing
A local habitation and a name.
(Shakespeare's A' Midsummer Nights Dream Act V.)

పై వాక్యములనుబట్టి కవి యెట్లు కేవలకల్పనాసామర్థ్యము గలిగియుండునో స్పష్టమగుచున్నది. పిచ్చివాఁడు ప్రపంచమున నెల్లెడలఁ దయ్యములను, భూతములను గాంచునట్లును, ప్రియుఁడు కోఁతిరూపుఁగల్గి నల్లమొద్దువలెనే యున్న ప్రియురాలిని రంభయంత లావణ్యముఁ గలదానినిగాఁ గాంచునట్లు కవి తన దృక్కులను భూమినుండి యాకాశమువఱకును నాకాశమునుండి భూమివఱకును బ్రసరింపఁజేసి, భావనాశక్తిచే నప

రూపములగు మూర్తులను గాంచి, వాని కాకృతి నొసంగి నిరామయమగు శూన్యత కొకయూరును పేరును గల్పించి వర్ణింపఁగలుగునని షేక్స్పియరుమహాకవి భావనాశక్తియొక్క యైంద్రజాలప్రభావమును, కవియొక్క మహత్త్వమును గూడ వర్ణించినాఁడు.

## ౨. కోలరిడ్జి.

కోలరిడ్జి (Colaridge) అను నాంగ్లేయకవి లా నొకరాత్రి కలలోఁ గాంచినవిషయమును 'Kbla Khan' అను కావ్యశకలమున వర్ణించెను. అయ్యది యేప్రయత్నము లేకుండనే నిద్దురమంచమునుండి లేచుచునే కావ్యరూపమున వెలువడెను. అయ్యది కేవలకల్పనయే యనియు నట్టి దీప్రపంచమున నెచ్చటను గని విని యుండనంత యపరూపమును నపూర్వమును నని యాంగ్లేయసాహిత్యవిశారదు లెల్లరు నేకగ్రీవముగ నంగీకరించిరి. ఇట్టి దాంగ్లేయవాఙ్మయమున నద్వితీయమనియు, కోలరిడ్జి యత్యద్భుతదృష్టిని బ్రదర్శించెననియు, నీయొక్క కావ్యశకలమువలననే యతని కీర్తి యాకల్పాంతస్థాయిఁ గాంచఁగలదనియు నాంగ్లేయపండితుల యభిప్రాయము. అట్టి కేవలరూపకల్పన యసంభవము కాదు. విషయసాక్షాత్కారముఁ బడసిన కవులు మూర్తులను బ్రత్యక్షముగఁ గాంచి వర్ణింతురు. అట్టి మూర్తులు కేవలరూపకల్పనలేగాని కవియొక్క చిత్తవృత్తి కేమాత్రమును సంబంధించియుండునవి కావనియు భారతీయవాఙ్మయ చక్రవర్తులందఱకును సువ్యక్తమే. ఈవిషయము మహత్తరమైనది. అందుచేఁ గేవలకల్పనాసామర్థ్యము కవికి

దుర్లభమును, నసంభవమును కాదని సూచించి ఈచర్చ ముగించి వేఱొక విషయమునుగూర్చి ముచ్చటించెదను.

### స్వాభావికాస్వాభావికవిషయములన నేవి?

ఇఁక స్వాభావిక, అస్వాభావికవిషయములకు సంబంధించిన వివాదాంశముల రెంటిని సూక్ష్మముగ సూచించి భావనాశక్తిప్రశంసను ముగించెదను. స్వాభావికము లననేమి? అస్వాభావికము లననేమి? ప్రకృతియందు మన స్థూలదృష్టికి గోచరము లగునంతవఱకే వస్తువులు స్వాభావికములా? తద్విపరీతములుగ నున్న నస్వాభావికములా? పంచతంత్రము, బృహత్కథ మొదలగు పురాతనకథలయందుఁ బక్షులు, మృగములు మానవవాక్కుల సంభాషణను గావించినటుల వర్ణింపఁబడియున్నది. ఈపద్ధతి కొంచెము స్వభావవిపరీతముగ నున్నను గేవలసత్యవిదూరమును నస్వాభావికమును గాదనియు, నిట్టివర్ణనము బాల్యావస్థయందు మానవులకు సహజముగ నుండు చపలస్వభావమును దత్ఫలితముగఁ బిల్లలు జంతువులతోడను అచేతనములతోడను మాట్లాడుటను గ్రహించి, యాభావమునే విస్తరించి వేఱువిధముగ మార్చి యట్టి బాల్యచాపల్యము మానవునియందు వయసు వచ్చినపిదపఁగూడ నుండుననియుఁ, దత్కారణమునఁ బిట్టల మాటలును, జంతువుల పల్కులును మానవుఁడు విని వాని యర్థమును గ్రహించుటకు వీలగుననియు శ్రీయుత రామలింగారెడ్డిగారు యుక్తియుక్తముగ సమర్థించిరి.

ఇట్టి స్వభావవిపరీతవర్ణనములయం దెల్లను బరస్పరవైరుధ్యము లేకుండ రచింపఁగల్గిన కవి ప్రతిభాశాలియే యనందగును. స్వభావవిపరీతమగు విషయములను—అనఁగా మానవ

సహజములుగాని విషయముల వర్ణించునపుడు కవి యొకనియమము పాటింపవలెను. కొంతసేపు విషయము స్వభావాతీతముగను అలోకసహజముగను నున్నట్లు వర్ణించి, వెంటనే యింకొకచోట దానికి స్వాభావికములును లోకసహజములును నగు గుణవిశేషములను గల్పించి వ్రాయఁజూచుట యౌచిత్యభంగహేతువు. పరస్పరవైరుధ్యము లేనంతవఱకు నెట్టి స్వభావాతీతవిషయవర్ణనమైనను నెట్టి యలౌకికసహజరూపకల్పనమైనను బొసఁగుననియు రసాభాసహేతువులు గావనియు విన్నవించుచున్నాను.

## సారాంశము.

కావున నింతవఱకుఁ దేలిన దేమనఁగా? కావ్యము రసాత్మకమనియు,రసము భావానుభూతియే యనియు, అట్టి భావానుభూతి భావనాశక్తియను నింద్రజాలమహిమచే లబ్ధ మగుననియు నే. ఈభావనాశక్తియొక్క మహిమను నెంతవర్ణించినను వర్ణింపవలయుననియే యుండును. ఎన్ని యుదాహరణములు చూపినను నింకను గావలయుననియే యుండును. అందులకనియే యమేయభావనాశక్తియుతులగు కవులు మితభాషణముచే విషయమును వర్ణించినట్లు ప్రతిభాశూన్యుఁడనగు నేను మితభాషణమువల్ల సూచించుటతోమాత్రమే తృప్తి నొందెదను. భావనాశక్తి కవికిమాత్రమే సొమ్ముగను, బలముగను, అండగను నుండి యతనికిఁ గావ్యనిర్మాణవిషయమునఁ గృష్ణసారథ్యముం బోలె సహాయకారినై యుండునని తెల్పి యింతటితో నీప్రశంసను ముగించెదను.

# షష్ఠప్రకరణము.

## భావప్రకటనము.

### ౧. శైలివిషయము.

కావ్యము రసాత్మకమనియు, రసము భావానుభూతియే యనియు, నట్టి భావానుభూతి భావనాశక్తియను నైంద్రజాల ప్రభావముచే జనించుననియు నింతవఱకుఁ దెలిసికొంటిమి. కావ్యాత్మయగు రసమునుగూర్చియు, ప్రాణమగు భావనాశక్తిని గూర్చియు విచారించితిమి. ఇప్పుడాకావ్యాత్మయుఁ, గావ్య ప్రాణమును నెట్టిస్వరూపము దాల్చునో సూచించెదము. అనఁగా, కావ్యముయొక్క బాహ్యస్వరూప మెట్లుండవలెనో యను సంగతిని విచారించెదము. కావ్యపదార్థ మనందగు భావములకును వాని స్వరూపమనందగు శైలికిని సంబంధ మేమి కలదో విచారింతము.

### పదార్థమునకు స్వరూపమునకుఁ గల సంబంధము

రసస్వరూపచర్చ యను ప్రకరణమున నీవిషయమును గొంతవఱకుఁ జర్చించియే యుంటిని. అచ్చట వస్తువునకును గుణవిశేషణములకును నభిన్నత్వమును నవినాభావసంబంధమును వర్తించునని సోదాహరణముగ నిరూపించితిని. కాని యిట చర్చనీయాంశము వస్తువుయొక్క గుణవిశేషములు మానవ కల్పితములా, లేక వస్తువునం దంతర్గర్భితములా? యనునదియగు

టచే జర్పఫలితము వేఱురూపముఁ దాల్చినది. ఇచ్చట నావిషయము నే వేఱుదృష్టితోనవలోకించి చర్చించెదము. పదార్థమును దానియొక్క స్వరూపమును భిన్నములుగావనియు, నేకమేయనియు, వస్తువున్నపుడు దానికిఁ బ్రత్యేకస్వరూప ముండియే తీఱవలయునవియు, వస్తువునకును స్వరూపమునకు నవినాభావసంబంధమున్నదనియు నట్లు ప్రతివస్తువునకు నుండు ప్రత్యేకస్వరూపమును కనుంగొని వర్ణించువాఁడే నిజమగు కవియనియు నిచ్చటఁ దెలుపుచున్నాము. ఒక చిన్న యుదాహరణము నిచ్చెదను. ఒక తాలగుట్టను గాంచుఁడు. అం దెన్నేని తా ళ్లుండునుకదా? ఒకతాతికిని నింకొకతాతికిని సంపూర్ణమగు పోలికయు, స్వరూపమునందు సంపూర్ణమగు నైక్యమును నుండదుకదా? ఒక్కొక్క తాతికి నొక్కొక్క ప్రత్యేకస్వరూప ముండును. ఆప్రత్యేకస్వరూపము కన్నులఁగాంచిన ప్రతివానికిని గోచరింపకమానదు. మనము చూచినను జూడకపోయినను నేతాతియొక్క స్వరూపమాతాతికి నుండ నేయున్నది. మనము ఏదో ప్రసక్తివలన దానిని గాంచుటయు, దాని స్వరూపమును గుర్తెఱుంగుటయు, దానిని వర్ణించుటయు సంభవించుచున్నది. వస్తువుయొక్క స్వరూపమును గుణవిశేషములను వర్ణించుటకొఱకు మనము నిమిత్తమాత్రుల మగుచున్నాము. శాస్త్రకారుఁడు వస్తువున కుండు ప్రత్యేకస్వరూపమును బ్రధానముగా వర్ణింపక ముఖ్యములగు గుణవిశేషములను మాత్రమే పేర్కొనును. శిల్పియన్ననో, రసికుఁడు నన్ననో, వస్తువుయొక్క ప్రత్యేకస్వరూపమును బ్రధానముగ గ్రహించి వర్ణించును. వస్తువును దాని స్వరూపమును నభిన్నములని తిరిగి హెచ్చరించుచున్నాను. ఎట్లనఁగా, తాతియందున్న పదార్థమగు నణుసముదాయము ఏదోయొక యా

కృతినే యున్నదిగాని, నిరాకారముగ లేదు. పదార్థమున్నచో నాకారము తప్పక యుండితీఱవలయును. ఆకృతిలేని పదార్థములును, పదార్థములేని యాకృతులును బ్రకృతియందు దుర్లభములు. నిరాకారత ఒక్క వాయువునకును నద్వైతపరబ్రహ్మభావమునకును వర్తించును. తుట్టతుదకు వాయువులకుఁగూడ నొకవిధమయిన రంగున్నటులఁ బ్రకృతిశాస్త్రజ్ఞులు కన్నులకుఁ దార్కాణముగఁ జూపించుచున్నారు. పరబ్రహ్మముసంగతి కొంచెము వాగతీతము. ఏలనన, భగవంతుఁడు నిరాకారుఁడని నమ్మువారు కొందఱును, సాకారుఁడని కొందఱును నమ్ముచుందురుగావున నీవిషయమునుగూడ నిదమిత్థమని తెల్పుటకు వలనుపడదు. కావునఁ దేలినవిషయ మేమనఁగాఁ, బ్రతివిషయమునకును బ్రత్యేకమగు నాకృతి యుండుననియే. అయ్యది గ్రహించి వర్ణించుటయే కవియొక్క కృత్యము.

## భావములయొక్క ప్రత్యేకస్వరూపమే పదజాలము.

ఇట్లే ప్రతిభావమునకును బ్రత్యేకస్వరూప ముండునని మామతము. భావములకుఁ బ్రత్యేకస్వరూపము పదము లేయని యెఱుఁగునది. ఎట్లనఁగా పేరులేని వస్తువుండనేరదు. 'పిల్లి' యనుపదమువలనఁ బిల్లియను పదార్థమునకు సంబంధించిన భావమును బిల్లియను బదార్థమును రెండును స్మరణకు వచ్చుచున్నది. కావునఁ బదము విషయమునకును, విషయసంబంధిభావమునకును సంజ్ఞారూపమున నున్నది. ఈసంజ్ఞలు విషయపరిజ్ఞానము సులభముగ నలవడుటకును, శాశ్వతముగ నుండుటకును, సర్వత్ర వ్యాప్తిఁ గాంచుటకును మానవునిచేఁ బ్రప్రథమమున నేర్పఱుపంబడి దేశకాలపాత్రాదుల నను

సరించి భిన్నదశల నొంది యనేకభాషలుగఁ బాఁదుకొనిపోయి నది. ఇట్టిభాషలలోఁ గొన్ని వ్రాఁతఁగలవిగను, గొన్ని వ్రాఁత లేక వాఙ్మాత్రవ్యవహారము గలవిగను నున్నవి. ఈవిషయ మిట్లుండె. ప్రకృతము మనకుఁ గావలసిన విషయ మేమనఁగాఁ బ్రతిమాటయుఁ బైన వివరింపఁబడిన కారణము ననుసరించి యొకయర్థమునకును బదార్థమునకును సంజ్ఞారూపముగ నుండు ననియే. కావునఁ బ్రతిమాటయు నొక్కొక్కయర్థము నొసఁగ సమర్థమై యుండును. ఏతావతా ప్రత్యర్థమును బదములవలన సూచింపఁబడవలె. ననియే స్పష్టమగుచున్నది. మాటలచే సూచింపంబడని యర్థమును, నర్థమును సూచింపని మాటలును మృగ్యములు. కాని—కుశాగ్రబుద్ధులు వేఱొక ప్రశ్నము నడుగుదురు.

## అనుకరణముల విషయము.

అర్థము నొసఁగని మాట లేదందురే! అనుకరణముల సంగతి యేమి? అని ప్రశ్నింతురు. 'కొక్కొరుకో' యనుమాట కర్థ మేమి? 'బౌబౌబౌ' అనుట కర్థమేమి? కఱకఱ—గఱగఱ-ఉహూహూ—అహహా మొదలగు ననుకరణముల సంగతి యే మందురు? వాని కేమియర్థము నీయఁగలరు? అని ప్రశ్నము గల్గుచున్నది. దానికి సమాధానముఁ దెల్పెదను. ఈయనుకర ణములు మిగిలిన పదములవలననే యర్థమునకు సంజ్ఞారూపము గనే యున్నది. మానవవ్యవహారమున వీనికి రూఢియగు ప్రసక్తి కల్పింపంబడియే యున్నది. 'కొక్కొరొకో' యను మాఁత ఒక్కకోఁడివిషయముననే వాఁడుచున్నారేమి? మానవ వ్యవహారమునఁ గొక్కొరొకోయను ననుకరణము కోఁడివిషయ

మునసే రూఢిగ వాడఁబడుచున్నది. 'ఉహుహూ'యని చలిచే వడఁకునప్పుడే యందుముగాని, యెండవేఁడిమిచేఁ దపించుచున్నపు డందుమా? 'అహహా'యని యాశ్చర్యము కలిగినవేళలనే, కొంచెముహాయి జనించినవేళలనే యనుకొందుముగాని, యితరసమయముల ననుకొందుమా? కలకల, గలగలయను ననుకరణములను గలకుతనము సూచించుటకే వాడుదుముగాని మార్దవము సూచించుపట్ల వాడుదుమా? వెన్నను,మంచి నీళ్లను, పాలను కలకల-గలగల నములువారుగాని, నములుదురని చెప్పువారుగాని లేరుగదా ? కావున ననుకరణములకు స్వభావమును మానవవ్యవహారమును ననుసరించి రూఢియగు సంజ్ఞార్థము గలదని యెలుంగునది. అందువలనఁ బ్రతిమాటయు నర్థము నీఁజాలుననియుఁ, బ్రత్యర్థమును మాటలకు వశమై యుండుననియు, నర్థమును దత్సంజ్ఞారూపకమగు పదమును, ఆయియును దత్స్వరూపమునుంబలె నేకవ్యక్తిఁ గలవై యవినాభావసంబంధముతో వర్తించుచుండును. ఈరహస్యము శైలీవిషయమున నవశ్యగ్రహణీయము. ఎట్లనఁగాఁ బ్రతిమాటయు నొక్కొక్కయర్థము నీఁజాలినపుడు ఒక్కమాటను మార్చి వేఱొకమాటను వాడినచో నర్థము వేఱగుట దప్పదు.

### పర్యాయసమానార్థకపదముల విషయము.

ఈసందర్భమును మన దేశములోని భాషాసాంప్రదాయమును బండితసమయములును నొక్కింత యాక్షేపింప నవసరమొదవుచున్నది. మన దేశమున సమానార్థకము లనుపేరఁ జాల పదముల నడ్డుపిడ్డముగ నుపయోగించుట యాచార మగుచున్నది. దానికిఁ గారణము మనవారు విషయపరిజ్ఞాన మల

పడుటకుఁ బూర్వమే యమరకోశ, ఆంధ్రనామసంగ్రహాది నిఘంటువులను గ్రుడ్డిపాఠముగ వల్లెవేయుటయే. ఈనిఘంటుల యందుఁ బదములచే సూచితములగు ప్రత్యేకార్థముల విషయము మఱుఁగుపఱచి నిఘంటుకారులు ఒక్కొక్కయర్థమునకు ననేకపదముల సంజ్ఞారూపకములుగఁ జేర్కొనినారు. ఆ నిఘంటువుల గ్రుడ్డిపాఠముఁ గావించువారు భాషారహస్యమును గ్రహింపలేక యొకయర్థమునే పలుమాట లీయఁగలవని భ్రమసి యొకమాట కింకొకటి పర్యాయపదములుగ నుండఁగలదనియు నొకమాటకు బదులు నిఘంటువునఁ బర్యాయపదములుగఁ జేర్కొనఁబడిన మాటలలో దేనినైనను నుపయోగించినఁ దప్పు లేదనియు, నందువలన నర్థము భేదింపదనియుఁ దప్పుఁదలఁచుచున్నారు. ఒక్క స్త్రీయను నర్థమునకుఁ బర్యాయపదములుగ మనవా రెన్నిపదములను వాడుట లేదు. ఈ పర్యాయపదముల ఘోష శ్రవణకఠోరముగఁ బరిణమించుచున్నది. ఒక్కొక్క యర్థమునకే పలుమాటల వాడుటవలన నాయర్థముయొక్క సొంపు చెడుటయేకాక యాపర్యాయపదముల కుండు ప్రత్యేకార్థమునకుఁగూడ నాభాసత్వము గలుగుచున్నది.

కావున భాష యనఁగా అర్థద్యోతకశబ్దసముదాయమని గ్రహించునది. పైన నొకవస్తువునకును వేఱొకవస్తువునకును సంపూర్ణమగు రూపసామ్యమును, పూర్తియైన పోలికయు నుండుట యసంభవమనియు, నేవస్తువురూప మావస్తువునకెట్లు ప్రత్యేకముగ నుండునో, అట్లె యేమాటయొక్క ప్రత్యేకార్థ మామాటకే యుండుననియు, రెండుమాటలకు నర్థము

విషయమున సంపూర్ణైక్యభావ ముండుట యబద్ధమనియుఁ, బదముల ప్రత్యేకార్థములను గ్రహింపకుండ వానిని వాడుట రసాభాసత్వహేతువనియుఁ జెప్పియుంటిమి. కావున నిప్పుడు ప్రత్యేకించి తెల్పెడి దేమనఁగా నేమాట యర్థ మామాట కెట్లు సిద్ధమును రూఢియో యట్లే యేభావముయొక్క పద జాల మాభావమునకు రూఢిగనే యుండును. అట్టి రూఢ్యర్థ ములను రూఢిపదజాలములను వదలి పైపై మెఱుఁగుల కాస పడి పర్యాయపదము లను పేరిట పదముల విచ్చలవిడిగఁ బ్రయో గించుట పొసఁగని పద్ధతియని సూచించును. కావున భావము. యొక్క స్వరూపమును దర్శించి యనుభవింపనియట్టివాఁడు దానినిఁ బదముల వర్ణింపఁజాలఁడు. భావముయొక్క ప్రత్యేక స్వరూపమును గుర్తెఱుంగక యిచ్చవచ్చినట్లు పదజాలంబు నుపయోగించిన స్ఫుటమును, రుచిరమును, రూఢియైనదియు నగు నర్థముఁగాని భావస్వరూపముఁగాని సిద్ధింపక యేమియుఁ దెలియని బాలురు పిచ్చిగీతల గీయ వానివలన నెట్టి పరిస్ఫుట సుందరాకృతులు వెలువడునో యట్టి విలక్షణశూన్యములగు నాకృతులే వెలువడఁగలవు.

ఏభావమున కాశైలియే. ఒకభావముయొక్క శైలి మార్చి వేఱొకశైలినివర్ణించుట. రెండు లోపములను జేయుట. అవి యేవన. ఒకటి భావములును శైలి (అనఁగఁ బదజాలము) యును నేకవస్తువుగాక రెండు భిన్నవస్తువులని భ్రమించి, భావములకును భాషకునుఁ గల యభేదమును గ్రహింపక పోవుట; రెండు వస్తువునకుఁ గల ప్రత్యేకస్వరూపముఁబోలి

భావమునకు బ్రత్యేకస్వరూప మనందగు ప్రత్యేకశైలిని అనఁగా ప్రత్యేకపదజాలమును గుర్తింపలేకపోవుట. కావున భావములును శైలియు నేకవస్తువే, రెండు కావు. ఏభావమున కాశైలియేగాని ఒకభావమునకే రెండుశైలు లుండవు. శైలి మాఱినపుడెల్ల భావములు మాఱుచునేయుండుననియు, ఒకని శైలినిమార్చి మనము వేఱుశైలిలో నతని భావమును జెప్పఁ జూచుట యసంభవమగుమాటయనియు మనపండితులు గ్రహించిపరుల గ్రంథములలోని పదముల నిచ్చవచ్చినట్లు దిద్దుచు, వాని యర్థమును జెడఁగొట్టుచు, సొంత'కపిత్థము'ల నందు దూర్చుచు, 'అహోమూలచ్ఛేదీ తవ పాండిత్యప్రకర్షః' అనుమాటలకు లక్ష్యమగుటకో యన్నట్లు మూలముయొక్క యర్థమును భ్రంశముఁజేయుచుఁ, దమయొక్క తెలివిమాలినతనమును భాషా రహస్యజ్ఞానముయొక్క లేమియు వెల్లడింపకుందురుగాక.

ఈలోపమే యచ్చటచ్చటఁ గొన్నివిమర్శనములనైతము గానవచ్చుచున్నది. "ఈగ్రంథమున భావములు బాగుగ నున్నవి. శైలిమాత్రము బాగుగ లేదు. ఇది మంచిశైలి, ఇది చెడ్డశైలి" యను విమర్శనారత్నముల నప్పుడప్పుడు మనము తిలకించుచునే యున్నాము. భావములు బాగుగనున్న నాభావముల సంజ్ఞా రూపకమగు శైలి (పదజాలము) ఎట్లు బాగుండదు? శైలి బాగుగ లేకున్న భావముమాత్ర మెట్లు బాగుండఁగలదు? ప్రతిపదమును నర్థమునే సూచించు నప్పుడు పదజాలము బాగుండనిచో నర్థమును బాగుండదు కదా? అట్లే భావము బాగుగ ననుభూతమైనచో దానియొక్క ప్రత్యేకసంజ్ఞారూపక మగు శైలియు బాగుండిరమే తీఱునుగదా! కావున నిట శైలి బాగుగ లేదన్న భావములు బాగుగ ననుభూతము కాలే దన్న

మాట. ఇంక భావములు బాగుగ లేవుకాని, శైలిమాత్రము చాలబాగుగ నున్నదని యనుదాని భావమును నిట్లే. భావములు బాగుగ నుండక శైలిబాగుగ నున్నదనుమాటలవలన అర్థమున కును పదములకు మైత్రి లేదనియైన చెప్పవలెను; లేక యర్థము తెలియకుండ కవి పదములను పిచ్చిపిచ్చిగా వాడినాఁడనియైనఁ జెప్పవలెను.

ఇట్లైనను భావ మనుభూతము కాలేదనియుఁ,గవి గ్రుడ్డి వానివలెఁ గన్నులుగల ప్రయోజనము ననుభవింపనివాఁడై, పిచ్చివాని రీతి నసంబద్ధప్రలాపములను జేయుచున్నాఁడనియు సిద్ధాంతముఁ జేయవచ్చును. ఈభావమునే పాశ్చాత్యలాక్షణి కులు "There is nothing like a good style or fad style but there is only style." అనుపలుకుల వివరించియున్నారు.

## శైలి కవిస్వభావసూచకము.

భావములు మానవుని చిత్తవృత్తుల నాశ్రయించికొని వాని ననుసరించి వర్తించుచుండునని భావముల గూర్చి ప్రశం సఁజేసినపుడు దెలిసికొంటిమి. మానవునియొక్క అనఁగా కవి యొక్క చిత్తవృత్తిప్రకారము భావములు జనించుచుండునని యు, నట్టిచిత్తవృత్తి మాఱిన భావములును వేఱురూపముఁ దాల్చుననియునిదివఱకే తెలిసికొంటిమి. ఒక్కొక్కకవియొక్క చిత్తవృత్తి యొక్కొకతీఱున నుండును. అందువలన నొక్కొక కవియొక్క భావము లొక్కొకరూపముఁ గలవిగ నుండును. మానవుని చిత్తవృత్తులు శరీరస్థితుల ననుసరించి యనేకవిధము లుగ నుండుననియు, నందువలన భావము లనంతవిధములైన వనియుఁగూడ నెఱింగితిమి. అట్టిభావములలో నొకదాని నొకటి

సంపూర్ణముగఁ బోలియుంట యసంభవమనియు, నేభావము యొక్క ప్రత్యేకస్వరూప మాభావమునకే చెల్లుచు నాభావమునే సూచించునుగాని, వేఱుభావములకు వర్తించి వేఱు భావముల సూచింపదు. అట్లే ఒకమనుష్యునిచిత్తవృత్తి యింకొకని చిత్తవృత్తిని సంపూర్ణముగఁ బోలియుండదు. ఏమనుష్యునిచిత్తవృత్తియు స్వభావమును నామనుష్యునకే ప్రత్యేకముగ వర్తించుచు నితరులకుఁ జెల్లకయుండును. చిత్తవృత్తులును, స్వభావమును నొకమనుష్యునకును వేఱొకమనుష్యునకును గల భేదమును సూచించును. ఏమనుష్యునియొక్క స్వభావ మామనుష్యునియొక్క విలక్షణత్వమును ప్రత్యేక వ్యక్తిని సూచించును.

ఇఁక శైలి స్వభావము నెట్లు సూచించు నందురా, సమాధానముఁ జెప్పెదను. భావములయొక్క సముదాయమే స్వభావ మగును. ఏల ననఁగా భావములు చిత్తవృత్తుల నాశ్రయించుకొని యుండునని మన మిదివఱ కెఱింగితిమిగనుక ఒక్కొక్కమనుష్యుఁడు వెలివుచ్చు భావములనుబట్టియే యాతని స్వభావమును గుర్తెఱుంగవచ్చును.

## ముఖపరీక్షాశాస్త్రము (Physiognomy)

ముఖలక్షణముఁబట్టి సాధారణముగ మనుజునియొక్క స్వభావము నూహింపఁజూచుట మానవసహజమే. ఎప్పుడును మొగము ముడుచుకొనియుండువానిని జూచిన నతఁడు కోపస్వభావముఁ గలవాఁడని మన మూహింతుము. ఎప్పుడును కలకలలాడు నగుమొగముఁ గలవానిని జూచిన నతఁడు సంతుష్టస్వభావము గలవాఁడును,మంచివాఁడును నానందమయుఁడును

నని యూహింతుము. ఇట్లే సాధారణముగ వివిధముఖలక్షణ ములఁబట్టి మానవుని మనోభావముల నెఱుంగు శాస్త్రము కూడఁ గలదు. దాని నింగ్లీషుభాషయందు "Physiognomy" యందురు. అట్లే భావములవలనను మనుజుని స్వభావము బయల్పడుచుండును. చెడుస్వభావముఁ గలవాఁ డెప్పుడును చెడుతలంపులను తలంచుచుఁ, జెడుకోరికలఁ గోరుచుఁ, జెడు మాటల మాటలాడుచునే యుండును. కొందఱు పైకి నొక తీరునఁ గన్పడుచు లోపల నొకతీరుగ నుండుచుఁ బయోముఖ విషకుంభములఁ బోలియుందు రదియు గొంతవఱకు సత్యమే. అందుకనియే Physiognomy అను ముఖపరీక్షాశాస్త్రమునకు సంపూర్ణమగు ప్రామాణ్యము లేదు. కాని భావముల విషయ మన్ననో అట్లు కాదు. ఏలనన మానవుఁడు భావముల ననుభవింపకుండ నొక్కనిముసమైన నుండఁజాలఁడు. ఎప్పుడును నేదోయొక భావ మతని నావేశించియే యుండును. నిద్ర పోవునప్పుడుఁగూడ నతని భావములు స్వప్నరూపముగ నతని నావేశించియుండుననియుఁ గూడ కొందఱిసిద్ధాంతము. జాగ్ర దవస్థయందున్న ప్రతిమనుజుఁడును భావములకు వశుఁడై యుండును. భావములకును మానవుని మనస్సునకును నభిన్న అవినాభావసంబంధము కలదు. భావముల ననుభవింపని మన స్సుండదు. మనస్సుచే ననుభూతములు కానట్టి భావము లుండఁ జాలవు. ఈభావము లన్నియు నేదో యొకరీతిని గలసిమెలసి వర్తించుచుండినచో నదియే స్వభావ మగును.

## శైలి కవియొక్క ప్రత్యేకస్వభావమును సూచించును.

అట్టి స్వభావము ప్రతిమనుష్యునకును ప్రత్యేకముగా నుండును. ఎవ్వని స్వభావము వానిదే. ఒకని స్వభావము పూర్ణముగ నింకొకని స్వభావమును బోలియుండదు. ప్రతి మనుష్యుని స్వభావమునకును బ్రత్యేకమగువ్యక్తియు, విలక్షణమును, స్వరూపమమును నుండును. అట్టివిలక్షణత్వమును, ప్రత్యేకవ్యక్తిని, ప్రత్యేకస్వరూపమును శైలి యెట్లు చూపింపఁ గలదు? శైలి యనఁగాఁ బదజాలమును బదముల కూర్పును నని యిదివఱకు దెల్పితిమి. అట్టిపదములలోఁ బ్రతిదియు నేదేనొక యర్థము నొసఁగుననియు, నేదేనొక భావమునకు సంజ్ఞారూపముగ నుండుననియు, నాభావముయొక్క ప్రత్యేక స్వరూపమును బ్రదర్శించుననియు నిదివఱకే దెల్పితిమి. భావముల సముదాయమే స్వభావమయినప్పుడు భావములయొక్క సంజ్ఞారూపమును బాహ్యస్వరూపమును ననఁదగు పదముల కూర్పు(శైలి) భావములయొక్క సముదాయమగు స్వభావము నెట్లు సూచింపకుండును? సూచించియే తీరునని యెఱుంగునది. అట్టి స్వభావమును సూచించుటలో శైలి స్వభావముయొక్క సర్వములను లక్షణములను, విలక్షణములను, ప్రత్యేకత్వమును, సర్వమును పూర్ణముగ వ్యక్తముఁ గావించును. అందుకనియే శైలి స్వభావసూచక మని తెల్పుట. మానవుని స్వభావము యొక్కవాగ్రూపమే శైలి. మానవుని స్వభావము ఏమనుష్యున కామనుష్యునకుఁ బ్రత్యేకముగ నుండునుగాన తద్వాగ్రూప మగు శైలియుఁ దత్ప్రత్యేకత్వమును జూపించును. అందు

కనియే ఆంగ్లేయవిమర్శకులు "The style is the man" అని పల్కుట. (శైలియే మనుష్యుఁడని పైమాటల భావము.)

ఒకనిశైలినివ్రాయ నింకొకనికి సాధ్యముకాదు.

శైలి మానవుని ప్రత్యేకస్వభావమును సూచించునది యగుటచే నొకనిశైలి యింకొకనికి రాదు. ఇంకొకనిశైలిలో వ్రాయవలెననిన నాతఁడై పుట్టి, యాతని భావముల నను భవించి, యాభావములఁ బ్రత్యేకస్వరూపమగు శైలిలో వ్రాయ వలెనుగాని వేఱువిధమునఁ గాదు. తిక్కనవలె వ్రాయవలె నన్నను, కాళిదాసునివలె వ్రాయవలెనన్నను, షేక్స్పియరువలె వ్రాయవలెనన్నను, తిక్కనయవతారమునుగాని, కాళిదాసు నవతారమునుగాని, షేక్స్పియరు నవతారమునుగాని, తాల్చి వ్రాయవలెను. వెనుకటికి, పులినిజూచి నక్క వాఁతఁబెట్టు కొనిన నక్క పులి యయ్యెనా? కాలేదు. ఒడలుమాత్రమే కాలెను. నక్కపులి కావలెనన్న పులియొక్కబలము,క్రౌర్యము, పౌరుషము మొదలగు పులిలక్షణము లన్నియు నలవడవలయు నేగాని చారలు కనుపించున ట్లొడలు కాల్చుకొన్నంతమాత్ర మున నే నక్క పులి యగునా? అట్లే తిక్కనయొక్క పదముల కూర్పుల నేవో కొన్నిఁటిని, కాళిదాసుని యుపమల నేవో కొన్నిఁటిని షేక్స్పియరుయొక్క మాటల నేవోకొన్నిఁటిని దొంగిలించికాని యనుకరించినంతమాత్రమున నెవ్వఁడైనను తిక్కనగాని, కాళిదాసుగాని, షేక్స్పియరుగాని యగునా? కాఁడు. అట్టివాని వ్రాఁతలయందుఁ దిక్కనశైలిగాని, కాళిదా సుని శైలిగాని, షేక్స్పియరుని శైలిగాని కనుపింపదు. ఇంకఁ గనుపించునదేమి? అట్టి వ్రాఁతకాని యజ్ఞతయు, బుద్ధిహీన

తయుఁ, బ్రతిభాశూన్యతయు, భావశూన్యతయుమాత్రమే. ఇట్టివారినే కాళిదాసమహాకవి పరప్రత్యయనేయబుద్ధులని నిరసించెను.

## అనుకరణ మాత్మహత్యయే యగును.

అనుకరణ మాత్మహత్య యనఁదగునని యాంగ్లేయులు పల్కుదురు. "Imitation is Suicide." ఇం దెంత సత్య మున్నది? స్వప్రతిభ శూన్యమగుటయు, పరుని ప్రతిభ లబ్ధము గాకుండుటయుఁ దక్క శైలివిషయమున నితరుల ననుకరించుటవలన నన్యప్రయోజనములు సిద్ధింపవు. ఆత్మప్రతిభను మనము చేతులారఁ జంపికొనుచు నితరుల ననుకరించుచుందుము గనుకనే యనుకరణ మాత్మహత్య యగునని చెప్పుట. కావునఁ బ్రతిభాశాలురు పరుల ననుకరించుటలో తమ శక్తిని ప్రతిభను నాశనముఁ గావించికొని "అనుకరణ మాత్మహత్యయే" "మూఢఃపరప్రత్యయనేయబుద్ధిః" అనువచనములకు లక్ష్యములు కాకుండుటకుఁ బ్రార్థించెదను.

## ఉదాహరణములు.

శైలి మానవస్వభావసూచక మనుట కుదాహరణములఁ గోరుట,ముంజేతికంకణముఁ జూచుట కద్దము కావలెనని కోరుట వంటిదియే యగును. ఇట్టి శుద్ధసత్యమున కుదాహరణములనవసరములు. ఏదీ, తిక్కన వర్ణించినట్లు యుద్ధమును శౌర్యవీర్యగాంభీర్యాదిరసముల వర్ణించిన యాంధ్రకవి నింకొక్కని జూపుఁడు. ఏదీ, భవభూతి వర్ణించినట్లు కరుణరసము వర్ణించిన కవిని వేఱొకనిని జూపుఁడు. శౌర్యరాశియై, మనుమసిద్ధినృపాలుని మంత్రియై, వీరాగ్రేసరుఁడై ఖడ్గతిక్కనమహాయోధునకు

సోదరుఁడై వీరయుగమున జన్మించి, మనుమసిద్ధికిని కాటమ రాజునకును పంచలింగాల క్షేత్రమున జరిగిన మహాయుద్ధమును, బ్రహ్మరుద్రయ్య పద్మనాయకాదివీరాగ్రేసరు లెదిరిపక్షమున నిలిచిపోరుచుండ వీరాధివీరుఁడును సోదరుఁడునునగు ఖడ్గతిక్కనతోఁ గూడి కదనమున పాల్గొనిన తిక్కనకవియోధ వీరరసమును వర్ణింపవలెఁగాక తక్కొరులకుఁ జేతనగునే? నాటకమున శృంగారవీరరసములదక్క నన్యముఁ బ్రధానరసముగ వర్ణింపఁదగదని శాసించిన లాక్షణికనియమమును బూరికిఁగొనక స్వచ్ఛందరసప్రవృత్తిని నిరోధింపక, "ఏకో రసః కరుణ ఏవ" యనినమ్మి,సమకాలికపండితాపహాసములకు వెఱఁగొందక "కాలో హ్యాయం నిరవధిర్విపులాచ పృథ్వీ"యని ఘోషించిస్వాతంత్ర్య ప్రతిభఁ గనఁబఱచి "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" యను నార్యోక్తిచే శాశ్వతస్థాయిగాఁ గీర్తింపఁబడిన భవభూతికే శ్రీరాముని కరుణరసభరితమగు చరిత్రమును నాటకముగ వర్ణించుటకుఁ జెల్లెనుగాని తక్కొరులకుం జెల్లెనే? శృంగారరస మూర్తియై, రసికశిఖామణియై, సరస్వతీదేవ్యవతారమై వాక్సిద్ధి కలిగిన కాళిదాసకవికిఁ గాక యన్యులకు శృంగారరసము నంత చక్కఁగా వర్ణింప సాధ్యమయ్యెనే? ఒకచేత నగ్నిహోత్రమును నింకొకచేత మంచుగడ్డను బట్టిన మనుజునిరీతి "ఇదం బ్రాహ్మ్యమిదం క్షాత్రం" అని పల్కిన పరశురామునిరీతి హాస్యరసమును విషాదరసమును నొక్కరీతి నొకదాని వెంబడి రెండవదానిని వర్ణించి, హాస్యరసభరితనాటకములను, విషాదాంతనాటకములనుగూడ రచించి కీర్తిఁబడయుట యొక్క షేక్స్పియరునకుఁ గాక యన్యుల కెల్లఱకుం జెల్లెనే? కావున నుదాహరణము లనవసరములని విన్నవించుట. నీళ్లు ఎట్లు పల్లమెఱిఁగి పాఱు

చుండునో అట్లే వివిధరసములును వాని కనుగుణములగు కవి హృదయములఁ బాఱుచుండును. చవిటినేల నెంత బలముచేసి నను నెన్నిరకముల యెరువులఁ గట్టినను పంట పండునే? దుర్గంధమును, క్రిమికీటకాదులును జన్మించునుగాక. అంతియే. అట్టి రసములు ఆయారసముల కనుకూలముకాని హృదయమున ప్రవహింపనేరవు. అట్టి హృదయక్షేత్రము లెన్నికావ్యముల పఠనమువలననైనను, ఎన్ని లక్షణగ్రంథముల పఠనమువలననైనను రసవంతములగు కావ్యఫలముల నీఁజాలవు. మునేఁడిపండ్లువోలెఁ జూచుట కింపై నోటఁ బెట్టుకొన్న విషప్రాయములుగ నుండు ప్రబంధముల నీజాలునేమో?

## కావ్యమున శయ్యారీతు లప్రధానములు.

ఈరసరహస్యము నెఱుఁగని లాక్షణికులు కొందఱు "రీతి రాత్మా కావ్యస్య"యనియు, "అదోషౌ, సగుణౌ, సాలంకారౌ, శబ్దార్థౌ, కావ్యమ్" అనియు వచించియున్నారు. తత్ఫలితముగ రీతులును, వృత్తులును, నలంకారములును కావ్యముల మిక్కిలిగ్గైనవి. శయ్యారీతులును, రసవృత్తులును, నలంకారములును నున్నయంతనే రసవంతమగు కావ్య ముద్భవించునే? "అంగడిలో నన్నియు నున్నవి.అల్లుని నోటశని యున్న"దన్నట్లు, రీతులు, వృత్తులు, అలంకారము లాదిగాఁగల బాహ్యచిహ్నములే మిగిలి, కావ్యాత్మయగు రసము మాయమైపోయినది. అగుఁగాక, రస మిట్టి పైపైవన్నె లుపచరించుటవలనఁ గలుగునే? అయ్యది కవిహృదయాంతర్గతభావోద్రేకమువలన జనింపవలెను. అట్టి భావోద్రేకము ప్రతిభాశాలురకే జనించునుగాని నీచులకును, ద్రోహాత్ములకును గలుగనేరదు. "He who would not be frustrate of his hope to write well hereafter in laudable

things, ought himself to be a true poem; that is, a Composition and pattern of the best and honourable things; not presuming to sing high praises of heroic men or famous cities, unless he have in himself the experience and the practice of all that which is praiseworthy" పై వాక్యముల రచించిన (Milton) మిల్టన్ కవి యుత్తమకావ్యరచనకుఁ గడంగునతఁ డుత్తమగుణాఢ్యుఁడై యుండఁదగుననియు, మహద్విషయములఁ గూర్చి వ్రాయువాఁ డట్టి మహత్త్వము ననుభవించి మహత్త్వము గలిగినవాఁడై యుండవలెననియు నిరూపించిన వాక్యములయం దెంత సత్యమున్నది! భావగాంభీర్యమును, హృదయవికాసమును లేక యూరక లక్షణగ్రంథములలోని రీతులు, వృత్తులు, అలంకారములు మొదలగుకావ్యవిషయములఁగూర్చి చదివి, వానినౌచిత్యమును, ప్రతిభయును లేకుండ వర్ణించినంతమాత్రమునఁ గవు లగుదురా? నగలును, నాణెములును, చీనిచీనాంబరములును తగిలించి యలంకరించిన జాతిబొమ్మను గౌఁగలించికొనిన నెంత కామోద్దీపకమగునో; రసానుభవము లేనిదియు, నట్టి యలంకారాదికములు మిక్కుటముగ గలదియు నగుకావ్యమును నంతే యానందజనక మగును. ఏలక్షణనియమములననుసరించుటవలనఁ గాళిదాస-తిక్కనాదిమహామహులు కవిశేఖరు లైరి! "క్రియాసిద్ధిస్సత్త్వే భవతిమహతాం నోపకరణైః." అను నార్యోక్తి యెంతయు సత్యమ కదా! క్రియాసిద్ధిగల మహాసత్త్వులకు నుపకరణము లక్కఱయే లేదుగదా! అట్టి మహాసత్త్వమును క్రియాసిద్ధియును లేనివారు నట్టి యుపకరణములే శరణ్యములని నమ్మి పరమార్థమును గోలుపోవుచున్నారు.

## అలంకారము లవసరములా? రామలింగారెడ్డి గారివాదము.

రీతులసంగతి యటుండనిచ్చి యలంకారముల సంగతి కొంచెము విచారించెదము. అలంకారము లనేమి? అవి యెన్నివిధములు? అవి యవసరములా? అనవసరములా? ఏవి ముఖ్యములు, ఏవి ముఖ్యములు కావు? అను నీవిషయములకు సమాధానము నరయుదము. మనుజునకు నగలు నాణెములు వస్త్రము లావిగాఁగలయవి యెట్లు అలంకారములై యంద మొసఁగునో, అట్లే కావ్యమునకును కొన్ని యలంకారము లుండునని చెప్పఁబడుచున్నది. అట్టి యలంకారములు కావ్యమునకు భూషణములవంటివై యందమును గూర్చును. కావ్య నశే వాని నలంకారములని లాక్షణికులు నిర్వచించియున్నారు. అట్టి కావ్యాలంకారములు ద్వివిధములు—అర్థాలంకారములు శబ్దాలంకారములు నని. అలంకారము లవసరములా, అనవసరములా? అర్థాలంకారములు ముఖ్యములా, శబ్దాలంకారములు ముఖ్యములా? అనువిషయమును గూర్చి చాలవివాదము చెల రేఁగినది! అర్థాలంకారము లనఁగ, నర్థమునకు సంబంధించిన యలంకారములు; ఉపమోత్ప్రేక్షాదులు. శబ్దాలంకారము లనఁగ యమకానుప్రాసాదులు. శ్రీయుత రామలింగారెడ్డిగారు మన యాంధ్రభాషలో నీయలంకారములఁ గూర్చి విమర్శించి సహజముగ, నప్రయత్నముగ వచ్చు నలంకారములను మిత ముగ వాడవచ్చుననియు, నట్టియర్థాలంకారములను కవి తాను వర్ణించునప్పుడొక్కింతయెక్కువగ వాడినను దోషములేదనియు నాటకపు పట్టులయందును, రసాస్పదములగు పట్టులయందును

ననఁగా కథలోని స్త్రీపురుషులు మాటాడునప్పుడు పాత్రోచిత ములైన కొన్నింటమాత్ర ముపయోగింపఁదగుననియు, కాని భావములు మహోజ్జ్వలములుగ రేఁగునపుడు ప్రకృతమునందే యవధానముంచుట మంచిదనియు, నట్టితరుణముల నలంకార ములు సాధారణముగ నసంబద్ధప్రలాపములే యనియు, శబ్దా లంకారము లంతగా ముఖ్యములు కావనియు శ్రీ రెడ్డిగారి మతము. కుయుక్తులచేతను, దీర్ఘాలోచనముచేతను, శ్లేషాదుల సాయముచేతను బలవంతముగ నీడ్చి తెచ్చిన యలంకారములను విసర్జించిన నెంతయో బాగనియు, నట్టి విపరీతాలంకారరచనకుఁ బ్రేరేపకము వావశూన్యతయే యనియు, హృదయము భావ పూరితమై యున్నప్పుడు సాదృశ్యములపైకి దృష్టి చనదనియు శ్రీ రెడ్డిగారు సోదాహరణముగ నిరూపించిరి.

వీరి సిద్ధాంతమును బూర్వపక్షము సేయుటకై మన్మిత్రు లగు శ్రీకురుగంటి సీతారామయ్యగారు "అలంకారతత్త్వవిచా రము" అను గ్రంథమున నలంకారము లావశ్యకములని సిద్ధాం తముఁ జేయఁజూచిరి. ఆ గ్రంథమును విమర్శించుచు శ్రీ రాయ ప్రోలు సుబ్బారావుగారు శ్రీసీతారామయ్యగారి వాదము నాక్షేపించి శ్రీ రామలింగారెడ్డిమతమునే సమర్థించిరి.

### { శబ్దార్థాలంకారముల తారతమ్యము. పూర్వాలాక్షణికమతము. }

కాని, యిచ్చట నొక చిన్న తమాషా యున్నది. అది యేమనఁగా:—అలంకారము లావశ్యకము లనినచో. శబ్దా లంకారములనుకూడ నొప్పికొనవలసివచ్చుచున్నదనియు, నట్టి శబ్దాలంకారములను మనలాక్షణికు లప్రధానములని నిరసించిరి

కావున వానికి మనము ప్రాధాన్యము నొసంగఁదగదనియు, నందుచే నలంకారము లనావశ్యకములన్నచో శబ్దాలంకారముల సంగతి చల్లఁగా దాఁటవేసి మఱుఁగుపఱచవచ్చుననియు, సహజములును, నప్రయత్నముగ వచ్చునవియు నగు నర్థాలంకారములకు మాత్రము తా వుండియే తీఱుననియు, అందుచే నలంకారము లనావశ్యకములని చెప్పుట సులువైన మతమని వీరు భ్రమించుచున్నారు. దీనికిఁ దార్కాణముగ శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు మమ్మట పండితరాయ లిరువురయొక్క కావ్యవిభజనము నాధారముగఁ గొని, ధ్వనిప్రధానకావ్యములుత్తమోత్తమములనియు, ధ్వనికన్న వాచ్యమగు నర్థమే ప్రధానముగఁ గల కావ్యములు ద్వితీయములనియు, నర్థచమత్కృతి ప్రధానముగఁగల కావ్యము లధమములనియు, శబ్దచమత్కృతి ప్రధానముగఁ గలకావ్యములు కావ్యములు కానేకావనియు, నట్టి వధమాధమములనియుఁ బండితరాయలు శాసించెను. మమ్మటాచార్యులు అర్థచమత్కృతి ప్రధానముగాఁ గల కావ్యములను శబ్దచమత్కృతి ప్రధానముగాఁ గల కావ్యములను నేకగౌరవార్హములుగ భావించి రెంటిని నధమములని నిరసించెను.

## అలంకారము లనావశ్యకములు. శబ్దార్థాలంకారములు సమానగౌరవార్హములే.

మాఁమతము మమ్మటాచార్యుని మతమే. ఏలననఁగా:— అలంకారము లనునవి యనావశ్యకములు గనుకను, సహజసుందరమగు నాకృతు లలంకారములులేకనే భాసిల్లును గనుకను, కావ్యవిషయమునఁగూడ నలంకారము లనావశ్యకము

లనియు, సహజమాధుర్యమును సహజసౌందర్యవర్ణనాపటిమ గల కావ్యముల నలంకారములకు నవసరములే యనియు సిద్ధాంత మగుచున్నది. కావ్యమునకు సహజమాధుర్యమును, స్వభావసౌందర్యమును నాపాదించు శక్తియు లక్షణమును నెద్ది? అనువిషయమును తరువాత జర్చించెదను. ప్రస్తుత మనావశ్యకములగు నలంకారములలోఁ గొన్నిఁటి నంగీకరించి కొన్నిఁటి నంగీకరింపకపోవుటకుఁ దగిన కారణము లేవియో నిరూపించి నాకుఁ దోఁచిన యభిప్రాయము నొసంగెదను. 'పండ్లూడఁగొట్టుకొనుట కేతాయిమైననేమి' అన్నట్లు స్వారస్యముఁ జెడఁగొట్టుట కర్థాలంకార మైననేమి, శబ్దాలంకార మైననేమి? ఒకటి మేనత్తమామల బిడ్డలై వేఱొకటి కాలేదా? రసమున కాభాసము గల్గునట్లు వర్ణింపఁబడిన రెండును రోఁత జనింపఁజేయును. ఇఁక రసమును బోషించుటకు మితముగ వాడినయెడల రెండును బనికివచ్చును.

## శబ్దాలంకారములకుఁ గొన్నియుదాహరణములు.

.... చూడుఁడు. పోతనామాత్యుని భాగవతము బహుళసంఖ్యాకములగు శబ్దాలంకారములచే నిండియుండినను నంత నింపునింపుచున్న దేల? భాగవతమున విష్ణుస్తోత్రముఁ జేయుచోట్ల పారవశ్యమున పోతన యెన్ని శబ్దాలంకారముల వాడలేదు? ఆపద్యములు మనకు నిరంతరము సంతోషమును, ఆనందమును గూర్చుట లేదా? నిసర్గముగ నర్థాలంకారము చేసికొన్న మహాపుణ్యమును లేదు, శబ్దాలంకారము గావించిన మహాపాపమును లేదు. రెండును పాపపుణ్యముల విషయమున సమానములే. శబ్దాలంకారములు రసమును పోషించిన వసుటకు భక్తగీతము

లనఁదగు రామకర్ణామృత-కృష్ణకర్ణామృత-గీతగోవింద-భాగవత కావ్యములనుండియుఁదుదకు భారతమునుండియుఁగూడ నెన్నేని యుదాహరణములఁ జూపింపవచ్చును. చూడుఁడు! గజేంద్ర మోక్షణమున గజేంద్రుని మొఱ నాలకించి భక్తునిఁ గాచుటకై యెరికిం జెప్పక యేఁగు శ్రీవిష్ణుమూర్తిని గాంచి లక్ష్మీదేవి,

"అడిగెద నని కడువడిఁ జను
నడిగిన దను మగుడ నుడువఁ డని నడయుడుఁగున్
వెడవెడఁ జిడిముడి తడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడునెడలన్."

అని పోతన వర్ణించిన పద్యపు నడకయందునను, యమకమను శబ్దాలంకారమువలనను శ్రీలక్ష్మీదేవియొక్క మనస్సులోని తత్తరమును, నలజడియు, నాందోళనమును, నింక నితరము లగు భావములును నెట్లు సందడించుచున్నవో! ఏదీ ఈపద్య భావమును మార్చి యాశబ్దాలంకారము దీసివైచి యద్దాని భావమును పూర్తిగ వేఱుపదములఁ జెప్పి మెప్పింపుఁడు. భారతమున నభిమన్యుని మృతికై జాలిఁజెందుచు నర్జునుఁడు,

ఉ. హాయను ధర్మరాజతనయా యను నన్నెడఁబాయ నీకుఁ జ
న్నే యనుఁ దల్లి నేఁడు జనునే యనుఁ గృష్ణుఁడు వీఁడె వచ్చె రా
వే యను నొంటిబోవఁ దగవే యను నేగతిఁ బోవువాఁడ నే
నో యభిమన్యుఁడా యనుఁ బ్రియోక్తుల నుత్తరఁ దేర్పవే
యనున్.

అని విలాపించిన పద్యమునందలి శబ్దాలంకారము వెగటుపుట్టించుచున్నదా! సంస్కృతభక్తిగీతములనుండి యుదాహరణముల

నెన్నేని యీయాయవచ్చును. గ్రంథవిస్తరభీతిచే స్థాలీపులాకన్యాయమునే యనుసరించితిని. కావున మితముగను, నౌచిత్యమున కనుగుణముగను, వాడిన శబ్దాలంకారములును నర్థాలంకారములును గూడ సమానముగ రసమునకు దోహద మొనగూర్పఁగలవు. మితమును, నౌచిత్యమును గుర్తెఱుఁగక పిచ్చిగా వాడిన రెండును రోఁత జనింపఁజేసియే తీఱును! కావున శబ్దాలంకారముల విషయమున మనవారీయన్యాయముఁ గావించుట తప్పని నావిజ్ఞప్తి. వెనుకటి కొక యమ్మ "అల్లునితలకు నెయ్యి లేదు, అల్లునితో వచ్చినయతని తలకు నూనెయు లే"దనఁగఁ జమత్కారియగు నాయల్లుని స్నేహితుఁ డావెను "అమ్మా, ఆరునెలలనుండి యుబ్బసమురోగముతోఁ జచ్చిపోవుచున్నాను. లేదనుకాఁడికి నాకును నెయ్యియే లే దనవమ్మా" అని బ్రతిమాలి పరిహసించెనఁట. ఆపరిహాసమును రసికులీసందర్భమున యథోచితముగ నన్వయించికొందురుగాక.

## ధ్వనివిషయము.

"అనలంకృతీ పునః క్వాఽపి"అను మమ్మటుని పల్కుల నాధారముగఁ గొని కావ్యము లేయలంకారములు లేకున్నను సహజసౌందర్యమువల్లను, భావభరమువల్లను, రసబంధురత్వమువల్లను నింపు నింపుననియు సోదాహరణముగ సిద్ధాంతముఁ జేయవచ్చును. అనలంకృతములై, శాకుంతలములోని శ్లోకచతుష్టయము, భవభూతియొక్క కరుణరసప్రధానములగు శ్లోకములును, తిక్కనయొక్క రసబంధురపద్యసహస్రంబులును రసికుల చిత్తముల రంజింపఁజేయుట లేదే? ఉదా

హారణముల సాహితీపరిచయులే వెదకికొందురుగాక. ఇఁక ధ్వనివిషయము కొంచెము సూచించెదను.

రాజుగారి పెద్దభార్య పతివ్రత యనఁగనే రాజుగారి చిన్నభార్య లంజ యను నర్థ మెట్లు స్ఫురించుచున్నదో అతీరే ధ్వని యందురు. అనఁగా మాటలవలన ప్రత్యేకముగఁ జెప్పఁబడక పోయినను వానిచే సూక్ష్మముగ సూచింపఁబడు భావమే ధ్వని యగుచున్నది. ఎట్లన మనము రాజుగారి చిన్నభార్య లంజయని ప్రత్యేకించి చెప్పకపోయినను అట్టియర్థము స్ఫురించు చునేయున్నది. ఉదహారణము కొంచెము మోఁటుగ నున్నను భావమును సులభముగను, కొట్టవచ్చినంత ప్రత్యక్షముగను దెల్పున దగుటచే గ్రహింపఁబడినది. పాఠకులు మన్నింతురు గాక. ఈధ్వనికి వ్యంజన యను నామాంతరముగూడ వ్యవహారమున నున్నది.

## ధ్వని త్రివిధము ౧. శబ్దధ్వని.

ఇట్టిధ్వని త్రివిధము—శబ్దధ్వని, అర్థధ్వని, భావధ్వని యని శబ్దమువలననే అనఁగా శబ్దముల కూర్పువలననే వాని యొక్క నాదమువల్లనే యర్థము స్ఫురించినచో నయ్యది శబ్దధ్వనియనఁబరఁగును. చూడుఁడు. పెద్దనమనుచరిత్రలోని హిమవత్పర్వతవర్ణనమున,

చ. అట జని కాంచె భూమిసురుఁ డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్వన
స్ఫుటనటనానురూపపరిఫుల్లకలాపికలాపజాలమున్
గటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్."

అనుపద్యమున "అంబరచుంబిశిరస్సరజ్ఝరీపటలముహుర్ముహు

ర్లుత దభంగతరంగమృదంగనిస్వనస్ఫుటనటనానురూప పరిఫుల్లక లాపికలాపజాలముఁ” అనుపదముల కూర్పుననే వాని యక్షర ధ్వనివలననే గంగాతరంగ సంఘట్టనకోలాహలము ధ్వనింపఁజేసినాఁడు.

## ౨. అర్థధ్వని.

ఇఁక అర్థధ్వని యనఁగా నొకయర్థమువలనఁ బ్రత్యేకముగ వాచ్యముకాని వేఱర్థములు స్ఫురించుటయే. ఈయర్థధ్వనియే మన కావ్యముల విరివిగ వాడఁబడుచున్నది. కావున దీని కుదాహరణములను వెదకుపని పాఠకులకే వదలివేయుచున్నాను.

## 3. భావధ్వని.

ఇఁక భావధ్వనిసంగతి కొంచెము సోదారణముగఁ జెల్పెదను. ప్రత్యేకముగ శబ్దముచేతనుగాని, అర్థముచేతనుగాని సూచింపఁబడని వేఱు అర్థము భావముచేత మొత్తముమీఁద సూచింపఁబడిన నయ్యది భావధ్వని యందురు. ఇట నొక భావము వాచ్యముగ నుండి వేఱొకభావమును మొత్తము మీఁద ధ్వనింపఁజేయును. చూడుఁడు. ఈ క్రిందిభావగీతమున నీభావధ్వని యెట్లున్నదో?

“వీణెచేజారిపడిపోవు వ్రేళ్లు శ్రుతుల
నింపుగా మీటి రాగ మొప్పింపకుండె
గొంతు బొంగురువోయెడు నెంత ఛించు
కొంచుఁ బాడిన నీవు గాన్పించవేమి?
హాయిలో మున్గి మాయమైపోయినావొ,
పరవశత నొంది భక్తుని మఱచినావొ

దేవ! నాకింక నెపుడు నీదివ్యదర్శ
నమ్ము నిచ్చెదు? నాపాట కంత మెపుడు?

ఇచట భావ మేమన, భక్తుఁడు వీణ వాయించివాయించి గొంతు బొంగురువోవునట్లు పాడిపాడి, భగవంతుఁడు ప్రత్యక్షము గామికి వగచుచున్నాఁడు. ధ్వనితమగు వేఱొక భావము భక్తుని హృదయము భగవంతుని దర్శనమునకై తపించితపించి, ప్రార్థన గావించి కావించి, భగవద్దర్శనమును బొందఁజాలక పోవుటయే. వాచ్యమగు భావము పాటకుఁడును, వైణికుఁడును నగు భక్తునికి స్థూలముగ వర్తించును. వ్యంగ్యముగ ధ్వనించు భావము పాటతోడను, వీణెతోడను సంబంధములేని భక్తుని హృదయార్తికి సూక్ష్మముగ వర్తించును.

ఇట్టి త్రివిధమగు ధ్వనియే కావ్యమునకుఁ బ్రాణమని మన లాక్షణికులలో రసికవర్గమువా రంగీకరించిరి. ధ్వనియొక్క ప్రాధాన్యమును మనవారిలో మొట్టమొదట నుద్ఘోషించినది "ధ్వన్యాలోకన" కర్తయగు నానందవర్ధనుఁ డను రాజరసికుఁడే. తరువాత నెల్లరు నతని వాక్యములఁ బ్రమాణములుగ నంగీకరించిరి. పాశ్చాత్త్యులలోఁగూడ Suggestion(ధ్వని) ప్రధానమని మ్యాలర్మే, పాల్ వెర్లెయిన్ మొదలగు రసజ్ఞు లొప్పికొనిరి. కవులును ధ్వనిని మిక్కిలిగ పాటించియేయున్నారు.

## శైలిగుణములు. అరవిందుని మతము. ౧. తుష్టి.

అరవిందయోగి కావ్య మాధ్యాత్మికశక్తిప్రదర్శక మనియుఁ గావ్యానందము బ్రహ్మానందమే యనియు, నట్టిబ్రహ్మానంద మలవడుటకుపూర్వము కావ్యము వివిధపరిణామముల నందు ననియు, నట్టికావ్యపరిణామములు బుద్ధి, అంతఃకరణ, చిత్తము,

ఆత్మ మొదలగువానిని, వానివానియొక్క శక్తిని, అధికారమును ననుసరించి రంజింపఁజేయుననియు, నట్టికావ్యానంద పరిణామముల ననుసరించి శైలియు చతుర్విధములుగ నుండి కావ్యమును బోషించుచు శబ్దసిద్ధిగఁ బరిణమించుననియు, నట్టి కావ్యశైలి తుష్టిఁ గూర్చునదియుఁ, బుష్టిఁగూర్చునదియుఁ,గాంతి గూర్చునదియు, బ్రహ్మానందముఁ గూర్చునదియు నను నాలుగు తరగతులుగ ప్రయుక్తమగుచుండుననియుఁదెల్పి శైలివిషయమున తుష్టి, పుష్టి, కాంతి, బ్రహ్మానందము లనుపదముల కర్థమేమో సోదాహరణముగఁజర్చించియున్నాఁడు. ఆభావములను నాంధ్రపద్యోదాహరణములతోడ వివరించెదను.

"శైలితుష్టి" యనఁగా అర్థమునకు మాటకును గల సాధారణమైత్రియే. ఇందు విషయసాక్షాత్కారముగాని, పదసాక్షాత్కారముగాని యుండక, పదములకును నర్థములకును వచనమునఁబలె సామాన్యమైత్రిమాత్రమేయుండి విశేషోత్తేజకమగు ప్రభావమేమియు లేకుండును. ఇయ్యది బుద్ధిని మాత్రమే రంజించును. ఉదాహరణము.

క. కోపము నుబ్బును గర్వము
నాపోవని యునికియును దురభిమానంబును ని
ర్వ్యాపారాత్వము నను నివి
కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా! (భారతము).

క. కరయుగములు చరణంబులు
నురము లలాటస్థలంబు నున్నతభుజముల్
సరిధరణి మోపి మ్రొక్కినఁ
బరువడి సాష్టాంగమండ్రు బరమమునీంద్రుల్.

## ౨. పుష్టి.

"శైలిపుష్టి" యనఁగా భావమును గంభీరముగను, సాలంకారముగను, శక్తియుతముగను వర్ణించుట. ఇచ్చటను గూడ సాక్షాత్కారబలిమి తక్కువగనే యుండును. కాని పదగుంభనము, అలంకారములు, శబ్దధ్వని మొదలగునవి భావమునకుఁ బుష్టియు, బలమును నొసంగి యహంకారమును రంజించును. ఉదాహరణములు

ఉ. ఊహకలంగి జీవనపుటోలమునన్బడి పోరుచుస్ మహా
మోహలతానిబద్ధపదముక్ విడిపించుకొనంగలేక సం
దేహము నొందు దేహిక్రియ దీనదశన్ గజ ముండె భీషణ
గ్రాహదురంతదంతపరిఘట్టితపాదఖురాగ్రశల్య మై.

సీ. కడుబెట్టిదంబగు గాలిచేఁ దూలిన
కమనీయసాలభూరుహముపోల్కిఁ
బ్రబలకిరాతమార్గణములఁ ద్రెళ్లిన
రాజితవన్యవారణముమాడ్కిఁ
గల్పాంతవాయుసఖస్ఫురణంబున
నివిరిపోయిన మహార్ణవముకరణిఁ
గాలపర్యయమునఁ దూలి మేదినిమీఁదఁ
బడిన పూర్ణేందుబింబంబుపగిది

ధరణిఁ బడియుండియును నొప్పుఁదలుగకున్న
యన్నరేశ్వరుఁ గనుఁగొని యడలునెడల
తోడమేనులుదూలఁగఁ దొట్రుపడుచుఁ
జేరియాతనిచుట్టు నాసీనులైరి. (భారతము శల్యపర్వము)

## 3. కాంతి.

"శైలికాంతి" భావసాక్షాత్కారమును మెఱుఁగుఁ గాంచినయట్లనుభవించి, తత్సాక్షాత్కారలబ్ధమగుభావమును స్మరణమువలనను, భావనాబలమునను మనసు రంజించునట్లు వర్ణించిన నాశైలి కాంతిఁగల దగును. ఇట సాక్షాత్కార మున్నది కాని కవియొక్క వ్యక్తి పూర్తిగ లీనమై విస్మృతము కాలేదు. ఉదాహరణము.

"ఓలిశృంగంబు లెత్తిన కేలుగాఁగ
నిర్ఝరంబుల పెను మ్రోఁత నిగిడిబొరయ
గిరులు జనకరాజాత్మజపరిభవంబు
జగము లెఱుఁగ నాక్రోశించుపగిదిఁ దోఁచె."
(భాస్కరరామాయణము.)

"కూటికడవను బుజముపై నిడు
వాట మదియొక మురువుగులుకఁగ
పాటపాడెను పాటలాధరి
చెట్లుచామలకె
పాటపాడెను చెట్లుచామలు
కోటిచెవులను గ్రోలియలరఁగ
తాటివనముననాగిచంద్రుఁడు
తాను చెవియొగ్గక."
(గురజాడఅప్పారావు లవణరాజుకల.)

ఇట్టియపూర్వకాంతివిలసితములగు పద్యములు భారత భాగవతముల నెన్నేనిఁ గలవు. కావున వానినుండి యుదాహ రింపలేదు.

## ౪. బ్రహ్మానందజనకత్వము.

ఇఁక బ్రహ్మానందము నిచ్చు శైలి యెట్టిదనఁగా? భావ సాక్షాత్కారముఁ గలిగి భావమున లనుఁడై పోయిన కవినోట యమృతమువోలె, శివుని శిరమునుండి భువికి దిగు గంగా నిర్ఝరిణివోలె నప్రయత్నముగ, నిరలంకారముగ, ప్రకృతి మధురముగఁ, దనంతటఁదానే, కవి యనునతఁడు లేనట్టిరీతినే, వెలువడు పదజాలమే, భావమే, యిట్టి బ్రహ్మానందమే యాత్మను గురించి పవిత్రముఁ జేయును. ఇట్టి బ్రహ్మానందజనకములగు పద్యములు. భారతభాగవతములఁ బెక్కుచోట్ల నున్నవి. కాని, యీ బ్రహ్మానందముఁ దిరముగ నేకస్థాయిని నుండుట యరుదు. సాధారణముగఁ గాంతి, పుష్టి మొదలగు కావ్యశైలి గుణములతోఁ గలసిమెలసి వర్తించును. సర్వస్వాతంత్ర భావనా శక్తిని గూర్చియుఁ గవియొక్క దివ్యదృష్టిని పరకాయప్రవేశ ప్రభావమును సూచించు పద్యములఁ గొన్నింటిని గతప్రకరణమున నుదాహరించితినే, అవియన్నియు నీ బ్రహ్మానందజనక శైలి కుదాహరణములే యని యెఱుంగునది. ఇంక రెండు మూఁ డుదాహరణముల నొసఁగెద:—

సీ. కుప్పించి యెగసినఁ గుండలంబులకాంతి
గగనభాగం బెల్లఁ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక యుదరంబులోనున్న
జగముల వ్రేఁగున జగతి కదలఁ
జక్రంబుఁ జేపట్టి చనుదెంచురయమునఁ
బైనున్న పచ్చనిపటము జాఱ

నమ్మితి నాలావు నగుఁబాటుసేయకు
మన్నింపుమని క్రీడి మఱలదిగువఁ
గరికి లంఘించు సింహంబుకరణి మెఱసి,
నేఁడు భీష్ముని జంపుదు నిన్నుఁ గాతు
విడువు మర్జునయంచు మద్విశిఖవృష్టిఁ
దెఱలి చనుదెంచు దేవుండు దిక్కునాకు.

(భాగవతము.)

మ. అలలేలే! కతిశాంతమై విమలమై యంతంతకుం జూడఁ గాం, తులకిల్లె మెఱుఁగాఱు నాసరసి నేదో దూదిపాన్పం దు ము, ద్దులమూటై పవళించుచొంటి నటు లెందుర్ బోదువానీలరే, వెలుఁగా కన్నులవ్రాల నట్టె దిగిరావే పట్టి ముద్దాడెదర్. (పాటిబండ అప్పారావు.)

3. చూడఁజూడ నీరూపము
సుందరమై యొప్పు దేవ!
సొక్కిసొక్కి నీవలపున
సోలి పరవశతఁగందును!
వినఁగవినఁగ నీనామము
వీనులవిందౌను నాథ!
చనఁగచనఁగ నీజాఁడల
సౌఖ్యముమునుముందె తోఁచుఁ
దలఁపఁదలఁప నీలీలలఁ
దనువు పులకరించు స్వామి!
వలచివలచి దేవ! నిన్నె
వంత లెల్ల మఱచిపోతి.

౮. ఆడవె! ఆడవె!
అన్నులమిన్నా
ఆడవె లేనడు
మల్లలనాడక్
ఆడెడు నీనడు మందముఁగాంచిన
నల్లాడవె ప్రేమను లోకంబుల్.
పాడవె! పాడవె!
భామామణిరో
పాటలాధరము
బాగులుఁగుల్కఁగ
వలపుఁజిల్కు నీపాటల విన్నన్
బరవశగాదే ప్రకృతి యెల్లన్.
చూడవె! చూడవె!
సుందరవదనా
సోఁగకన్నులన్
సోలఁగఁ బ్రేమము.
సొంపులొల్కనిన్ జూచినంతనే
చుక్కలునై తముసోలవెప్రేమన్.

ధ్వనిప్రధానములగు నుత్తమోత్తవకావ్యముల నిట్టివి యుదాహరణము లెన్నేనిఁ గలవు. ఇచ్చినకొలఁది, నుదాహారణములు కావలెననియే యుండును. "As if increase of appetite grows by what it feeds on" తిన్నకొలఁదిని యాఁకలి యెక్కువ

యగుచుండును. అని షేక్స్పియరు పలికిన పలుకులయం దెంత సత్యము కలదు? భావసాక్షాత్కారమును, శబ్దసిద్ధియును, నిట నభిన్నములై, యభేదములై, యవినాభావసంబంధము కల విగుచు నేకార్థప్రతిపాదకములై, బ్రహ్మానందజనకములై యిట్టి నిరలంకృతధ్వనిప్రధానసహజమధురపద్యములు జన్మించుట కవకాశము నొసఁగుచున్నవి.

## సారాంశము.

కావున శైలియొక్క సౌందర్యమును పోషించునది యలంకారములుగాక సాక్షాత్కారబల మనియు, నట్టి సాక్షాత్కారబలముఁగలిగినవారికి "క్రియాసిద్ధిః సత్త్వే భవతి మహతాం నోపకరణైః" అన్నట్లుగ నలంకారములును, రీతులును, వృత్తులును ననవసరములనియు, నట్టి సాక్షాత్కారము లేనివా రెన్ని యలంకారములఁ గూర్చి వ్రాసినను వారి కవిత యెరువుసొమ్ములు పెట్టుకొన్న పేరంటాలువలె, గంతలబొంతలఁ దగిలించికొన్న గంగిరెద్దువలె, సకలభూషణాలంకృతమైన జాతిబొమ్మవలె, హాస్యాస్పదముగను, రసాభాసకరముగను, నిర్జీవముగను మాత్రమే యుండును. శైలియొక్క స్వభావమును నడిపించెడునది కవియొక్క చిత్తవృత్తియుఁ, జిత్తసంస్కారమును, రసభావమును, సాక్షాత్కారమును, శబ్దసిద్ధియునేగాని, యట్టి పైపై మెఱుఁగులగు నుపమోత్ప్రేక్షాద్యలంకారములు కావనియు, రసమే, కవియొక్క ప్రతిభయే, శైలిపై నధికారు లనియుఁ దిరిగి యొకమాఱు పాఠకులకు హెచ్చరించి యీ ప్రశంసను ముగించుచున్నాను.

## ౨. ఛందోవిషయము.

కావ్యము రసాత్మకము. రసము భావానుభూతియే. భావములు శబ్దసూచితంబులు. శబ్దము లక్షరసముదాయములు. అక్షరములలో ప్రతిదానికిని నాదము, ధ్వని కలదు. కావున తర్కరీత్యా, నాదము నొసఁగు నక్షరముల కలయిక యగుటచే శబ్దమునకును నాదము కలదు. శబ్దముల సముదాయమే భావమగుటచేత శబ్దములకు ధ్వని యుండుటవలన శబ్దసముదాయమగు భావమునకును ధ్వని కలదు. భావమే రసమగుటచేతను, రసమే కావ్యమగుటచేతను రసమునకును రసముద్వారా కావ్యమునకును నాదము, ధ్వనియు నుండితీరును. అక్షరములను, అర్థములను, భావములను నాశ్రయించినదగుటచే నీనాదము శుద్ధసంగీతనాదమంత నిశితముగ నుండదు. కాని, యంతకన్న నెక్కుడు విచిత్రవిశాల వ్యాప్తిఁ గలదిగను, వైవిధ్యము గలదిగను నుండును.

## కావ్యమునకుఁ బద్య మవసరమా?

ఈఅక్షర, భావార్థముల నాశ్రయించికొనిన నాదము యొక్క గతియే, నడకయే ఛందస్సు. ఈచంధస్సుయొక్క నియమబద్ధస్వరూపమే పద్యము. కావునఁ బద్యమును ఛందస్సును కావ్యమున నవసరములని చెప్పకతప్పదు. ఈఛందస్సు నియమసహితమా? అట్లైన నానియమము లెట్లు కల్పింపఁబడినవి? ఆనియమము లవసరముగ ననుష్ఠింపఁదగినవా? అట్టినియమముల తత్త్వమును పరమార్థమును నెట్టిది? ఛందోనియమములు పరిమితసంఖ్యాకములా? అను ప్రశ్నల నీసందర్భమున విచారింపవలెను. ఒక్కొకప్రశ్నమున కెంతయైన వ్యాప్తి యున్నది.

కాన సమాధానముల నూరక సూచించెదను. ఛందస్సు నియమసహితమనియు, నాదము నియమసహితము కానిచో గందరగోళముగ నుండుననియు, సృష్టియంతయు నియతికృతనియమబద్ధమయినట్లే ఛందస్సుఁగూడ నియమబద్ధమై యుండుననియు, నట్టిఛందములు ప్రస్తారభేదముల ననుసరించి యనంతములుగ నుండుననియు సంస్కృతలాక్షణికుల మతము. ఇందులకుఁ దార్కాణముగ వాల్మీకివదనమునుండి శ్లోకము ఛందోబద్ధమగు ననుష్టుప్ శ్లోకరూపమున నప్రయత్నముగ వెలువడెననియు, నట్టి యనుష్టుప్ ఛందముయొక్క ప్రస్తారములే యనంతములగు ఛందము లగుననియుఁ జెప్పుదురు. కాని వారిలోనే కొందఱు ఛందోబద్ధముగ నున్నను, లేకపోయినను సరే, రసాత్మకముగ నున్నగద్యమైనను సరే కావ్యమగుననియుఁ, గవిత్వము గద్యకవిత్వము పద్యకవిత్వము నని ద్వివిధములుగ నుంటచే కావ్యమునకు పద్యము ముఖ్యమును నవసరమును కాదనియు రసముమాత్రమే ముఖ్యమనియుఁ జెప్పుచున్నారు.

## పాశ్చాత్యవిమర్శకులమతము. వాట్సుడంటర్ పండితుని సిద్ధాంతములు.

పాశ్చాత్యవిమర్శకులలో నీఛందోవిషయమగు చర్చ చాలమందిచేఁ జేయఁబడినది. అరిస్టాటిల్, వర్డ్సువర్తు మొదలగువారు పద్యము కావ్యమునకు ముఖ్యము కాదనియు, అలంకారమాత్రమే యనియు వాదించిరి. జాన్సన్ కాలరిడ్జి, షెల్లీ, వాట్సుడంటర్, సెయింట్సుబరీ మొదలగువారు పద్యము ముఖ్యమనియుఁ గావ్యమునకు ప్రత్యేకవైలక్షణ్యము నాపాదించు గుణములలో పద్యమును ఛందస్సును ప్రధానములును

నవసరములు నని వాదించిరి. వాట్సుడంటన్ పండితుఁడు "కవిత్వ" మనువ్యాసమున కవికల్పితపద్యఛందోగతి కతీత మగు ప్రకృతిఛందోగతి (Rhythm of Nature) యున్నదనియు, నయ్యది పిట్టల కలకలమునందును, సముద్రతరంగములధ్వని యందును, వాయునాదముల యార్భాటములందునను ధ్వనించు చుండుననియు నట్టి ప్రకృతి ఛందోగతిపద్యమునకును, గద్య మునకునుగూడ కలదని వాదించిన యీవాక్యములు సరసులకు గ్రాహ్యములు:—

Perhaps it may be said that deeper than all rhythms of art is that rhythm which art would fain catch the rhythm of nature; for the rhythm of nature is the rhythm of life itself. This rhythm can be caught by prose as well as by poetry, such prose, for instance, as that of the English Bible. Certainly the rhythm of verse as its highest, such, for instance, as that of Shakespear's greatest writings, is nothing more and nothing less than the metre of the energy of the spirit which surges within the bosom of him, who speaks, whether he speaks in verse or in impassioned prose. Being rhythm, it is of course governed by law, but it is a law which transcends in subtlety the conscious art of the metricist and is only caught by the poet in his most inspired moods, a law, which being part of nature's own. Sanctions, can of course never be formulated but only expressed as it is expressed in the melody of the bird, or in the inscrutable harmony of the entire bird-chorus of a thicket, in the whisper of the leaves of the tree and in the song or wail of wind and sea. Now is not this rhythm of nature represented by that "Sense rhythm" which prose can catch as well as poetry ?

అట్లయ్యుఁ బద్యఛందమునకును ప్రకృతిఛందస్సు నాధారముఁ జేసికొన్న గద్యఛందమునకును నిసర్గమగు భేదము కలదనియు, గద్యఛందమున వ్రాయునతఁడు పద్యఛందము వ్రాయఁబోయి రెంటికిం జెడినవాఁ డగుననియు వాదించినాఁడు వాట్సుడంటను పండితుఁడు.

కాని, ప్రపంచసాహిత్యమును విచారించితిమేని ఎల్ల దేశములను పద్యము ముందు పుట్టి గద్యము తరువాతఁ బుట్టి నట్లు స్పష్టమగుచున్నది. హృదయభావము నిశితముగ నున్న పుడు ఆక్రందనమునకు నీడువచ్చు పద్యమే మొదట వెలువడు ననియుఁ, బిమ్మట నాలోచన ముదిరినతరువాత గద్యము వెలువడుననియు సర్వసాహిత్యముల చరిత్రములును వ్యక్తముఁ జేయుచున్నవి. ఈభావమునే వాట్సుడంటను పండితుఁడు జన్మతః కవియగువానికి నాదరూపనాదభరితమగు Emphasis of Sound) పద్యమే ముందు స్ఫురించుననియు, నట్లు కానియత నికి అర్థభారయుతమగు(Emphasis of sense)గద్యమే స్ఫురించు ననియుఁ గవియైనవాఁ డెప్పుడును పద్యముననే వ్రాయు ననియుఁ జెప్పినాఁడు. ప్రపంచమున ఛందస్సు లేకుండ కావ్య ముల వ్రాసినవా రెవ్వరును నింతవఱకు లేరు. అమెరికాదేశ స్థుఁడగు వాల్టువిట్మన్ (Walt Whitman) అనునతఁడుమాత్ర మిందులకు మినహాయింపు. గద్యరచయితలను కవులని పిలుచుట యాదరభావముననేగాని, సత్యము విచారించి యట్లుపిలుచుట దగునని నమ్ముటవలనఁ గాదు. గద్యము గద్యమే, పద్యము పద్యమే. దేని సొంపు దానిదే, దేని గౌరవము దానిదే. ఒక దానిలో నొకదాని నిఱికించుట పాడఁగని మతము.

## అక్షరమాత్రాచ్ఛందములకుఁ గల సంబంధమును, తారతమ్యమును.

ఛందోరూపము లమితసంఖ్యాకములని యిదివఱకే తెల్పియుంటిని. ఛందస్సునకు బీజము నాదమే. అట్టినాదము ద్వివిధావస్థలతో నొప్పుచున్నది. అక్షరములను శబ్దములను నాశ్రయించికొనిన ఛంద స్సక్షరఛంద స్సగుచున్నది. అయ్యది గురులఘుభేదములపై నాధారపడియున్నది. ఇఁక సంగీతమునకు సంబంధించిన ఛందస్సు మాత్రలయొక్క సంఖ్యపై నాధారపడియున్నది. గురులఘువుల భేదము మనదేశమున విద్యార్థులకు సైతము తెలియునుగాన దానిని గూర్చి చర్చించను. ఇఁక మాత్ర యనఁగా నిమేషకాలమును రెప్పపాటుకాలమున నుచ్చరింపవీలగు నాదపరిమితియే. కాన కవితయం దీమాత్రాఛంద స్సుపయోగింపఁబడుచున్నది. మాత్రాఛందస్సునకును, అక్షరఛందస్సునకును నొకరకమగు సమన్వయముఁ జేసి మాత్రాచ్ఛందస్సును కావ్యమున జొప్పించి యంగీకరింపవచ్చును. ఒక్కొక గురువునకు రెండులఘువులు సరివచ్చును. లఘు వొక్కమాత్రకు సరియగును. కావున గురువునకు రెండుమాత్ర లగును. మనవారు గణమన మూఁడక్షరముల సముదాయ మనుచున్నారు. అట్టిగణములు మూఁడు లఘువులకుఁ దక్కువగాకుండను, మూఁడుగురువుల కెక్కువగాకుండను నుండును. అందుచే గణము మూఁడుమాత్రలకు తక్కువగాకుండను, ఆఱుమాత్రల కెక్కువ గాకుండను నుండును. కావున మాత్రల సంఖ్యనుబట్టి ప్రాయికముగ మూఁడుతరగతుల గణము లేర్పడును. అవి యెట్టివనః—రూపక-

జంపె-చాపుతాళగణములు. రూపకగణమునకు మూఁడుమాత్ర లుండును. "చాపు" గణమునకు నాలుగుమాత్ర లుండును. "జంపె" గణమున కైదుమాత్ర లుండును. "త్రిపుట" గణము రూపక-చాపుగణములు వరుసగానున్న వానియొక్క కూడికయగును. అనఁగ నేడుమాత్ర లుండును. కాని మొదట రూపకగణమును, తరువాత చాపుగణమును నుండవలెను. మూఁడుగురువులు గల మగణము రెండు రూపకగణము లగును. ఈపద్ధతి ననుసరించియే మనపూర్వు లిట్టిమాత్రా ప్రధానము లగు ఛందోరీతులను రూపకము, జంపె, త్రిపుట, చాపు మొదలగు పేర్లనే పిలుచుచుండిరి. అట్టిరూపకమునే పగడాల దండ యనియు, త్రిపుటనే ముత్యాలసరమనియు, జంపెనే ద్విపదయనియు, చాపునే జయదేవవృత్తమనియుఁ గొందఱు పిలుచుచున్నారు. ఇంద్ర, సూర్య, చంద్రగణములకును నను గుణములగు మాత్రాప్రధానములైన ఛందోరీతు లున్నవి. పై ఛందోరీతులయొక్క ప్రస్తారములును నమితములుగ నుండును. ఇట్టి మాత్రాఛందములు పద్యముయొక్కయు, పాటయొక్కయు లక్షణములనుగూడఁ గలిగియుండును. అందువలన పద్యముల సొమ్మగు నర్థవ్యాప్తియు, వైవిధ్యమును, పాట సొమ్మగు గతివైభవమును, నడకసొంపును, హాయియును, నీగాన కవితల లభ్యమగును. ఔచిత్యము నెఱింగి, యేఛందోరీతి నుపయోగించినను కావ్యమున నంగీకరింపవచ్చును. కొన్ని యుదాహరణముల నొసఁగి ముగించెదను.

౧. రూపకము. చిన్నవోయె ముద్దుమోము
కన్నులంట నీలుగాలు

వన్నె తఱఁగి వాడె మేను
కన్నె యేలనే?

౨. చాపు. చిలుకలు కొఱికిన పండొక్కటి నా
చేతులఁ బడె నో దేవా
తెలియునెట్లు తీయనిదో విసమో?
తినకుండఁగ నో దేవా?

3. త్రిపుట. చల్లగాలులు సాగియలలుగ
జల్లుజల్లున రాల్చె పూవుల
నుల్ల మలరెను ఆఁకలొక్కటె
బడబవ లెనడ లేఁ

౪. జంపె. పాడవే కోకిలా
పాడవే యింపుగా
ప్రాణము ల్లాయిచే
పరవశమ్మొందఁగా
పాటఁబాడవె తీయఁగా

కోకిలా

పాటఁబాడవె తీయఁగా.

మిగిలిన ప్రస్తారభేదము లన్నిఁటి కుదాహరణముల నొసంగుట పాఠకుల బుద్ధిచాకచక్యము ననుమానించుటయే యగును. కావున నట్టిపనిని మానెదను.

## సారాంశము.

కావున నింత దీర్ఘచర్చచేఁ దేలిన దేమనఁగా, కావ్యము రసాత్మకమనియు, రసము భావానుభూతియే యనియు,

భావము లనంతములగుటచే రసము లనంతములనియు, భావము యొక్క స్వరూపములగు శైలు లనంతములనియు, భావము యొక్క నాదరూపమగు పద్యరీతి కావ్యమునకు ముఖ్యమనియు, నట్టి పద్యరీతు లనంతములనియును గ్రంథవిస్తర భీతిచే నుదాహరణముల నెండుగ నీయనందులకు పాఠకులు మన్నించి యాలోపమును దామే సవరించుకొందురుగాక.

## పద్యము ముందా? గద్యము ముందా?

పద్యము ముందా? గద్యము ముందా? అనువిషయమును విచారించి నిర్ధారించుటకు ముందు పద్యరచనకును గద్యరచనకును బ్రేరకములగు మానవస్వభావవిలక్షణములను పరిశీలింపవలయును. పద్యరచనను బ్రేరేపించునది భావౌత్సుక్య మనియే యిదివఱకు నిరూపించియుంటిమి. భావౌత్సుక్యము గలవారు కామార్తులఁబోలి ప్రకృతికృపణు లగుటచే దీర్ఘవిచారములఁ బ్రొద్దుపుచ్చక, మీమాంసల పొంతఁబోక, దుర్గమతర్కసిద్ధాంత మహారణ్యప్రదేశంబులఁ జొఱక, పౌర్వాపర్యముల విచారింపక కొందొకయెడఁ జేతనాచేతనవిషయజ్ఞానశూన్యు లగుచుఁ గూడ నోటికి వచ్చినయట్లు, బుద్ధికిఁ దోఁచినట్లు, కలము పోవునటులఁ బద్యము లల్లుచుఁ దమ హృదయతాపమును శమింపఁజేసికొందురు. కవికి జన్మాంతరసంస్కారము ముఖ్యమని గతప్రకరణముల విన్నవించియుంటిమి. అట్టి ప్రాక్తనసంచిత కవిత్వశక్తిగల కవి ప్రకృతిని జూచిన నొకనిముసమేనియు నూరక యుండఁజాలఁడు. ఏదేని యొకవిషయముపై నాతని మనసు తగులకపోదు. అట్లు మనసు దగిలిన విషయము నాతఁడు ముందు పద్యమున వర్ణించునా? లేక గద్యమున వర్ణిం

చునా? అనునదియే విచారణీయాంశము. కవియొక్క మానసికావస్థకును, గద్యరచయిత మానసికావస్థకును జాలభేదము గలదు. ఆకారణముననే పద్యస్వభావమునకును గద్యస్వభావమునకును ఎంతేని భేదము కలదు. ఆభేదమును దన్మూలకారణమగు మానసికావస్థావిశేషములను కొంచెము విచారింతము.

## సహజకవిస్వభావలక్షణములు.

కవియన నెట్టివాఁడు? ప్రపంచ మాతని కనుల కెట్లు గోచరించును? ఈప్రశ్నకు యుగయుగములను, తరతరములను, దత్కాలస్వభావమువల్లను, అప్పటి కవుల సంస్కారవిశేషమువల్లను, పరిణతమగు నన్వయమే సమకూర్పఁబడుచున్నది. కొన్నియుగములఁ గవి సర్వశాస్త్రపారంగతుఁడగు పండితుఁడని భావించిరి. కొన్నియుగముల నాతఁడు శాస్త్రపరిచయము లేక సహజముగ స్వతస్సిద్ధముగ నాకసమునఁ దిరుగాడుచుఁ బుష్పశాఖల నెక్కి మధురముగ గానముసేయు పక్షికులము భోలెఁ గవిత్వముఁ జెప్పునని భావించుచుండిరి. మామతమునఁ గవియనఁగ సహజకవియే యగుటచే సహజకవితాప్రేరకమగు మానసికావస్థనే వర్ణించెదను.

## ౧. స్వాతంత్ర్యము—పోతనకవి.

సహజకవికిఁ బ్రపంచము సర్వము విశుద్ధముగను అద్భుతముగను భగవన్మయముగను గన్పించుచునే యుండును. సహజకవిమనము వెన్నవలె మెత్తనై యుండును. సహజకవి ఆడంబరరహితుఁడై వినయసంపన్నుఁడై నిజమనోరథమునందే లక్ష్యముగలవాఁడై యుండును. చూడుఁడు. 'హాలికులా' యని

శ్రీనాథునిచేఁ బరిహసింపఁబడిన పోతనామాత్యుఁ డొసఁగిన ప్రత్యుత్తరమును.

ఉ. బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకం,
గూళల కిచ్చియప్పడుపుఁగూడు భుజించుటకన్న సత్కవుల్
హాలికులైననేమి? గహనాంతరసీమలఁ గందమూల కౌ
ద్దాలికులైననేమి? నిజదారసుతోదరపోషణార్థమై.

సత్కవిత్వసిద్ధియనఁ బరమార్థమునే లక్ష్యముగాఁ గలిగిన వారు 'బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకం, గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజింప'నొల్లక నిజదారసుతోదర పోషణార్థము హాలికులును గందమూలకౌద్దాలికులును నగుటకుఁగూడ సంశయింపరు. ఏయవస్థయం దున్నను వారికిఁ గావ్యపరమార్థమే లక్ష్యముగా నెప్పుడును గన్నులఁగట్టుచుండును. నిరంతరకావ్యపరమార్థసన్నిధిని గలిగిన కవులు దూషణ భూషణతిరస్కారంబులకును, రాజసత్కారంబులకును,సంపదలకును ఆశించి కావ్యపరమార్థమును ద్యజింపనొల్లరు.చూడుఁడు! భారతీసాంత్వనముఁ గావించుచుఁ బోతనామాత్యుఁడు దెల్పిన వాక్యములు,—

ఉ. కాటుకకంటినీరు చనుఁగట్టుపయిం బడ నేలయేడ్చె దో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల యోమదంబ! యో
హాటకగర్భురాణి! నినునాఁకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ.

అంతియేగాక పోతన పలికిన యీవాక్యములనుగూడ గమనింపుఁడు.—

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరమువాసి కాలుచే
సమ్మెటవ్రేటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

కావుననే పోతనయెడ 'సహజపాండిత్య' బిరుదము అన్వర్థమయినది. సహజకవి యాడంబరరహితుఁడగుటచే నితర ప్రయోజనముల నర్థింపక కావ్యపరమార్థమునందే లక్ష్య ముంచి మనోగతభావమును వెల్లడించును.

## ప్రాపంచికాద్భుత పరిజ్ఞానము. వాట్సుడంటన్ పండితుని మతము.

సహజకవి ప్రపంచము సర్వమును భగవన్మయముగ-నద్భుత తేజోవిలసితముగ - నపూర్వముగ - ననంతశక్తియుతముగ - మానసోత్తేజకముగఁ—గనుంగొనును. నిజముకూడ నంతేకదా! ప్రపంచమున నున్న ప్రతిజీవికిని ఈ జీవిత మహానాటక మొక విచిత్ర ప్రదర్శనముగఁ గాన్పించును. పుట్టుక రహస్యము, గిట్టుట రహస్యము, ఏరికిని దురవగాహము. యుగయుగములనుండి ఎడతెగక పాఱుచువచ్చుచుండిన యీమహాకాలప్రవాహమువలె మన మేతీరమున నుండి కొట్టుకొనివచ్చి యేతీరమును బట్టి తుద కేతీరమునకుఁ గొట్టుకొనిపోయెదమో యేరికిని దెలియదుగదా? అట్లయ్యును జీవితమహానాటక మెల్లరకును విచిత్రముగను అద్భుతానంద జనకముగను నుండుచునే యున్నది. మానవసహజములగు నవస్థావిశేషమ్ములును దత్సంబంధములగు ననురాగబంధములును, జీవయాత్ర కడనఱకుఁ గొనసాగించుటకుఁ గారణము లగు

చున్నవి. ఈప్రపంచవైచిత్ర్యములు, ఈసంఘనియమములు, ఈయాచారములు జీవితవ్యవహారవైచిత్ర్యములు ప్రకృతిశోభావిశేషములు మృగచేష్టావిశేషములుఁ గాలస్వభావము మొదలగునవి యన్నియుఁ జక్కఁగఁ బరిశీలించువానికిని-ఏమియుం దెలియనివానికిని గూడ నద్భుతము జనింపఁజేయును. సర్వముఁ దెలిసినవాఁ డీయద్భుతమును గని ప్రపంచబంధము లస్థిరములు, మిథ్యలును అని భావించి, క్రమేణ వానిని వదలించుకొని యోగసిద్ధి నొందును. ఏమియుఁ దెలియనివాఁ డీయద్భుతమును గని స్తంభితుఁడై భగవల్లీలావిశేషంబుల కచ్చెరువడి యనేకవిధములఁ బలువరించును. ఇట్టి పలువరింతలే వానివాని జన్మాంతరసంచితసంస్కారసంతప్తములై నిప్పులనుండి వెలువడి ప్రకాశించు బంగారుకణికలట్లు సత్కావ్యము లగును. ఈయద్భుతమునే థియోడర్ వాట్స్ డంటన్ పండితుఁడు "Aylwin or the Renaiscence of wonder" ఎయిల్విన్ అను నవలయందును,అద్భుతపరిజ్ఞానమను వ్యాసమునందునను విమర్శించి సహజకవికిఁ బ్రపంచము అద్భుతముగ నుండుననియు, ఇట్టి ప్రపంచాద్భుతమే సహజకవిత్వమునకుఁ బ్రేరకమనియు, ఇట్టి ప్రపంచాద్భుతత్వపరిజ్ఞానమువలననే కవి స్థూలదృష్టికి నగోచరములును అతీతములును నగు విశేషణముల నవలోకింపఁగలఁడనియుఁ దెల్పెను. ఈభావమునే మనవారు రవి గాననిచోఁ గవి గాననుండునే? అనువాక్యమును దెల్పియున్నారు. కవియొక్కయద్భుతశక్తిని మనవారు అలౌకికమని భావించిరి. అనఁగా లోకాతీతమయి సృష్టియందలి మర్మములను భేదించుకొనిపోయి సత్యమును గ్రహించి యితరులకుఁ బ్రదర్శింపఁగలదనియే యిమాటల తాత్పర్యము. ఇట్టి యద్భుతశక్తి కవిని

వశముఁగొని యుత్తుఁతలూఁగించునపుడు ఆతఁడు పద్యరూప మునఁ బలువరించునో? గద్యరూపమున విచారణసేయునో? అని తర్కింపందగు. కవియొక్క స్వభావము కల్మషరహితమును నిష్కపటమును నగుటచే శిశుస్వభావమునుబోలినదై యుండు ను. సహజకవియందు శిశులక్షణము లెన్నేనియుఁ గానవగును. శిశువు అద్భుతమగు విషయము నేదేని గాంచినతోడనే కెవ్వున కేకవేయును; కలకలనవ్వును; కొండొకయెడ వలవల నేడ్చును. కవియు నట్లే కొన్నియెడల ఆశ్చర్యవిభ్రమాన్వితుఁడై హాహా కారము సలుపును. కొండొకయెడ మందహాసముఁ గావించును. ఇంక నొకప్పుడు విచారపూరితహృదయుఁడై కన్నుల నీరునించి పలవించును. కవిమనము నావహించుకొన్న ఆశ్చర్యభావము యొక్క ప్రస్తారభేదములు పద్యమున వ్యక్తమగునంత స్ఫుట ముగ గద్యమున వ్యక్తములు గావు.

### పద్యగద్యరచనలయందుఁ గలభేదము.

ఇందులకుఁ గారణము విచారింతము. పద్యరచనను ప్రేరేపించునది యొక దివ్యశక్తియని యెఱుంగునది. అది సామాన్యబుద్ధి కతీతమైనది. ఆలోచన కందనిది, తర్కమునకు లొంగనిది, మీమాంసచేఁ దేలనిది, శాస్త్రశృంఖలలచేఁ గట్టు వడనిది, అయ్యది యొక యలౌకికప్రతిభ. ఇట్టి యలౌకికప్రతిభఁ గల కవియొక్క మనస్సు వెన్నవోలె మెత్తనిదియు, శిశువు యొక్క మనస్సువోలె నిష్కల్మషమును నగుటచే విషయ మును జూచుతోడనే వేఁడితాఁకిడిని గరంగిపోవు వెన్నవోలె గరఁగి శిశువుయొక్క మనస్సువోలె, అద్భుతాశ్చర్యములచే కల్లోలిత మగును. తోడనే కవికి మనస్సు వికసించును. కవి

యొక్క గాత్రము విశ్వవీణానాదములో మిళితమై మనోహర రాగాలాపమును గావించును. అట్టి మనోహరరాగాలాపనమే పద్య మగును. అట్టిరాగాలాపనము విశ్వవీణానాదమును జెవులాఱ వినని వానికి సాధ్యము కాదు. అట్టి విశ్వవీణానాదశ్రవణము మనస్సు వికసించినయనంతరముగాని కవికి లబ్ధము కాదు. అట్టిమనోవికాసము కవియొక్క మనోనైర్మల్యము ననుసరించి యుండును. కావున పద్యరచనను బ్రేరేపునది భావౌత్సుక్యమును విశ్వవీణానాదశ్రవణమును, మనోనైర్మల్యమును నని యెఱుంగునది. వచన మన్ననో యట్లు గాదు. వచన మెంతవఱకును వ్యాకరణజ్ఞానమును, ఆలోచనను, పదప్రయోజనమును, పూర్వోత్తరసందర్భమును,తర్కమును నాధారము జేసికొనును. ఇందులకు పద్యముయొక్క గతికిని, వచనముయొక్క గతికినిగల భేదమే కారణము. పద్యము భావముయొక్క గతి ననుసరించునది యగుటచే పదములు కర్తృకర్మక్రియల వరుసఁ దప్పకుండునట్లుగ రావు. భావోత్సుకతవలన నేపదము ముందు దట్టిన నాపదమే, అయ్యది కర్తయైనను సరే, కర్మయైనను సరే, క్రియయైనను సరే, విశేషణమైనను సరే, కడకు ప్రత్యయమైనను సరే ఆపదమే ముందు ప్రయోగింపఁబడును. ప్రయోగింపఁబడు ననుమాటయే తప్పు. నిజముగఁ బ్రయోగించువాఁ డొకఁడున్నాఁడా? ఛాయాగ్రహణయంత్రమున నద్దముపై మానవుని ప్రతిబింబ మెట్లు దిగునో అట్లే ఆపదము తనంత తానే దిగును. వచనమున నట్లు గాదు. వచనరచయిత పూర్వోత్తర సందర్భములఁ జక్కఁగ విమర్శించి య్యాలోచనాబలమున నే మాట ముందు రాఁదగునో, యేమాట వెనుక రాఁదగునో విచారించి వ్యాకరణనియమములు దప్పకుండ,కర్తృకర్మక్రియల

వరుసఁ దప్పకుండ వాక్యమును రచించును. వచనరచయిత భావౌత్సుక్యమును ప్రధానముగాఁ గొనఁడు. అర్థసందర్భమునే లక్ష్యముగా గ్రహించును. కావున పద్యరచయితకును, గద్య రచయితకును గల భేదమును సూచించితిని. ఒకఁడు సిద్ధపురుషుఁడు; తన హస్తబలిమిని తన దివ్యప్రజ్ఞను గుర్తింపనేరక దివ్యశక్తిచేఁ బట్టినదెల్ల బంగారు గావింపఁగల యమ్మేయప్రతిభాశాలి. వేఱొకఁడు ఆలోచనాబలమును జ్ఞానసంపత్తియును గలిగి చేఁజిక్కిన పరికరములతో జ్ఞానసౌధము నిర్మింపఁజూచువాఁడు ఒకని వాగ్ధాటియు దివ్యగానమును ఆకాశగంగాప్రవాహముయొక్క ధాటిని మఱపింప శక్తిఁగల్గియుండును. వేఱొకని వాగ్ధోరణి శిష్యునికి విద్యఁగఱపు గురుని వాగ్విశేషమునుఁ బోలియుండును. ఒకని శక్తి యలౌకికము. ఇంకొకని శక్తి పౌరుషేయము.

## పద్యమే ముందు పుట్టెననుటకుఁ గారణములు.
## ౧. మానవజీవితచరిత్రరహస్యము.

పద్యరచయితకును గద్యరచయితకును గల భేదమును గ్రహించిన మనకుఁ బ్రపంచసాహిత్యచరిత్రమునందుఁ బద్యము ముందు పుట్టినదా? గద్యము ముందు పుట్టినదా? అను ప్రశ్నకు సమాధానము వెంటనే స్ఫురింపఁగలదు. చరిత్రనుబట్టి చూచిన మానవులు మొట్టమొదట ఆలోచనాబలము తక్కువఁ గలిగియుండిరనియు, భావౌత్సుక్యమునే యెక్కువ గలిగియుండిరనియుఁ దెలియుచున్నది. జాతులయొక్క పరస్పరసంఘట్టనము వలన విజ్ఞాన మభివృద్ధి నొంది, యాలోచనాశక్తి యతిశయించి, భావమునకు స్థానభ్రంశము సంభవించుచున్నది. పురా

తనకాలమునం దన్ననో మానవులు పవిత్రభావోద్రేక పూరితులై, నిర్మలమానసులై, సృష్టిసర్వమును భగవన్మయ ముగనే భావించి, భక్తియుతులై జీవితపరమార్థమును గ్రహింపఁగలిగిరి. ఈవాక్యములకు ప్రాచీనమానవసంఘములలో నెల్ల నగ్రస్థానము వహించిన భారతీయార్యుల చరిత్రయే తార్కాణము. భారతీయవిజ్ఞాననిధియును భారతీయనాగరకతాపేటికయును నని చెప్పఁదగిన వేదములును పురాణములును నిందులకుం దార్కాణములు. వానియం దెచ్చటఁ జూచినను నాలోచన కందని యపూర్వగాథలును, తర్కమునకు వశముగాని యద్భుతప్రాపంచికరహస్యములును, సామాన్యమనుష్యానుభవమునకు విపరీతముగఁ దోఁచు గాథలును, సామాన్యమానవబుద్ధికిఁ దోఁపని వింతవింత యూహలును, నతిశయోక్తులును మిక్కుటముగఁ గన్పించును. దీని కంతటికిని కారణము ప్రాచీనభారతీయుల యాత్మనైర్మల్యమే, శైశవస్వభావమే, ప్రాపంచికాద్భుతపరిజ్ఞానమే, పంచభూతాత్మకమగు నీప్రపంచము కల్లకపటమిసుమంతయు నెఱుంగని ప్రాచీనభారతీయులకు నద్భుతజనకమును దివ్యతేజఃప్రదర్శకమును, భగవన్మయముగను గన్పించెను. తోడనే వారు మంత్రగానము సల్పిరి. ఆమంత్రగానము మొట్టమొదట ఛందోబద్ధమగు ఋక్కులరూపమునఁ జేయఁబడెను. అయ్యది పోనుపోను పద్యవృత్తరూపములఁ బరిణమించెను; వేదముయొక్క షడంగములలో ఛందస్సు ఒకటిగా గ్రహింపఁబడుటయే పై యూహలకు నిశ్చితమగుదార్కాణము. ఇంతియేగాక భారతీయులలో నెల్ల నాదికవి యనఁదగు వాల్మీకి వ్యాధనిహతమైన క్రౌంచమును గాంచినతోడనే శ్లోకరూపమునఁ దనశోకమును వెలిపుచ్చినవిధమే పై సిద్ధాంతమును

మఱింత దృఢపఱచుచున్నది. ప్రపంచమున నన్నిజాతుల సాహిత్యచరిత్రమునందును పైసత్యమే నిర్ధారితమగుచున్నది. సాధారణముగఁ బ్రపంచమున మానవులెల్లరు ననాగరకస్థితి నుండి నాగరకస్థితికి వచ్చుచున్నారని సిద్ధాంతము కలదు. ఆసిద్ధాంతమును బురస్కరించుకొని యనాగరకజాతుల సాహిత్యమును బరిశీలించితిమేని ఛందోబద్ధములగు పాటలును పదములును నెక్కువగఁ గన్పించుచున్నవి. అనాగరకజనులు సాధారణముగ సంస్కారశూన్యులగుటచే నాలోచనమును తర్కమును పూర్వాపరవిమర్శనమును నెక్కువగఁ జేయఁజాలరు. వారికి నాగరికులకుంబలె తలలు నూర్చునూహలును, కొంపలుఁ దీయు తెలువులును నరుదు; సత్యమునందు వారి కభిలాష మెండు. హత్యఁ జేసినవాఁడు సాధారణముగఁ దన నేరమును తత్క్షణ మొప్పికొని దానికింగల కారణమును నిర్భయముగఁ జెప్పి న్యాయాధిపతితీర్పునకు వెఱవక నిర్భీకచేతస్కుఁడై, దైవముఖమునుఁజూచి, సత్యముపై నాధారపడి, కర్మఫలము ననుభవింప సంసిద్ధుఁడై యుండును. ఇప్పటివా రన్ననో, చేసిననేరముఁ గప్పిపుచ్చుటకై న్యాయవాదుల నుపయోగించి, నోటికి రాని యసత్యముల నెన్నియేని ప్రమాణపూర్వకముగఁ జెప్ప వెనుతీయరు. అనాగరకులకు ప్రపంచమునఁ గల యద్భుతముల యెడను విపరీతములయెడను భక్తి మెండు. ఇందులకు దయ్యములయందును, భూతములయందును, శక్తులయందును, మంత్రశాస్త్రములయందును, వారికిఁ గల భక్తియే ప్రబలకారణము. అట్టిభక్తిని మనవనాగరకులు—'మూఢభక్తి'యని నిరసించిన నిరసింతురుగాక! అయ్యదియే వారి పవిత్రతకును సౌశీల్యమునకును, సద్గుణసంపత్తికిని, ముఖ్యకారణమును నాట

పట్టును, నని భావింపఁదగును. కన్నులఁ జూచినదే సత్య మనియు, దృష్టిగోచరములుగాని వన్నియు నసత్యములనియుఁ బలుకు.మన నవనాగరకసిద్ధాంతులు, తమయజ్ఞానమును దెలిసి కొనఁజాలకున్నారు. భగవంతుఁడు అనంతశక్తియుతుఁడనియు భగవచ్ఛక్తికి లోనుగాని విషయమును, వస్తువును, బ్రపంచ మున నేదియును నుండఁజాలదనియు, పరిమితజ్ఞానులగు వీరికిం దట్టుట లేదు.

## ౨. షేక్స్పియరుకవియభిప్రాయము.

ఈసందర్భమున ఆంగ్లకవిశేఖరుఁడగు షేక్స్పియరు హ్యామ్లెట్ నాటకమున హ్యామ్లెట్ రాకుమారునిచే నతని మిత్త్రుఁడును హేతువాదియును నగు హారేషియో యనునతనికిఁ జెప్పించిన యీ క్రిందిపలుకుల గంభీరభావమును అపూర్వరహ స్యమును గ్రహింతురుగాక!

"There are more things in heaven and earth Horatio,
Than are dreamt of in your philosophy."

"హారేషియో, స్వర్గమర్త్యలోకముల నీతర్కసిద్ధాంత ములకుఁ గలలోనైన నందని విశేషము లెన్నియేనియుఁ గలవు. "సుమా'అని పై మాటల యర్థము. ఇట్టి ఆశ్చర్యభావముఁ గలవా రగుటచేతనే యనాగరకులు తర్కసింద్ధాంతములకు వశులు గాక, భావోద్రేకపూరితులై, తమకుఁ దోఁచిన సంగతులను తమకుఁదట్టిన యూహలను తమ్ము నావేశించికొనిన భావములను పద్యరూపముననే, ఛందోబద్ధములగు గానరూపముననే వెల్ల డించి, ఎన్నటికిని ఏరికిని మఱువరానంత శాశ్వతమునఁ దమ కీర్తిని ప్రతిష్ఠించి సాహితీసేవకులకుఁ గృతజ్ఞతాపాత్త్రులైరి ప్రపంచమున నెచ్చటఁ జూచినను పద్యమే ముందు రచింపఁ

బడినది. నాగరతయు విజ్ఞానమును నభివృద్ధి నొందినకొలఁది వచనరచన యతిశయించి పద్యమునకుఁ బదభ్రంశము సంభవించినది. కావునఁ బద్యమే ముందు గాని, గద్యము కాదు!

## చమత్కారజనకమగు నింకొకసిద్ధాంతము.

కాని, ఆంగ్లేయభాషలో "Poetry begins where prose ends" అనుసిద్ధాంతము కలదు. ఆసిద్ధాంతము ప్రకారము వచనసాహిత్యాంతమున పద్యకవిత్వ ముద్భవించునని తేలుచున్నది. కాని, పై రెండు సిద్ధాంతములకును గల విరోధాభాసత్వము నామమాత్రముననేగాని, నిజముగ లేదనియు విచారణానంతరము తెలియఁగలదు. Poetry begins where prose ends (వచనసాహిత్యాంతమున పద్యకవిత్వ ముద్భవించును.) అనుసిద్ధాంతముయొక్క భావమేమనఁగా; వచనసాహిత్యపరమావధి జ్ఞానోపదేశమే. జ్ఞానోపదేశముఁ గావించినతోడనే వచనసాహిత్యపరమార్థము సిద్ధించిన దగును. భావోద్రేకము కలిగించుట కావ్యముయొక్క పని. భావోద్రేకము గలిగించుటయే కవిత్వముయొక్క ముఖ్యకర్తవ్యము. కవిత్వమున జ్ఞానోపదేశ మంత ప్రధానవిషయము కాదు. వచనసాహిత్య మేవిషయము ప్రధానముగా గ్రహించునో పద్యకవిత్వము దానిన ప్రధానమని త్రోసిపుచ్చును. పద్యకవిత్వమేవిషయము ప్రధానమని భావించునో దానిని వచనసాహిత్యము తగినరీతిని నిర్వహింప సమర్థము కాదు. వచనసాహిత్యము నిర్వహింపఁజాలక వదలినపనిని పద్యకవిత్వము అవలీలగ నిర్వహింపఁగలుగును. పద్యకవిత్వము వచనసాహిత్యముకన్న నెక్కుడు భావోద్దీపకమును, ఆత్మవశీకరణమును ననియే పై సిద్ధాంతముయొక్క భావము కాని, వచన

సాహిత్యము ముందుపుట్టి పద్యకవిత్వము తరువాత పుట్టినదని కాదు. ప్రపంచసాహిత్యచరిత్రలయం దెల్లెడలను పద్యకవిత్వమే ముందు ప్రభవిల్లి ప్రజల వశీకరణము గావించికొని తత్తమముఁ జేసినపిదపనే వచనసాహిత్య ముద్భవించి జ్ఞానోపదేశమునకుఁ గడంగెనని తెలియుచున్నది. కావున నెన్ని చెప్పినను పద్యమే ముందుకాని, గద్యము కాదు.

## భాషాతత్త్వము.

### జీవద్భాషలకును పురాతనభాషలకును గలసంబంధము.

భాష యనఁగా నేమి? అర్థము నొసఁగు మాటల కూర్పు. అర్థమే భావ మనఁబడును. భావమునకును భాషకును నవినాభావసంబంధము కలదు. అర్థము నీయని మాటయు, మాటల కలవిగాని యర్థమును గగనారవిందము లనియు, అనుకరణములకుంగూడ వ్యవహారము ననుసరించి నిశ్చితార్థ ముండుననియు, నిదివఱకు గ్రహించియే యుంటిమి. అర్థద్యోతకశబ్దసముదాయమే భాష.

### జీవద్భాషాస్వభావము.

భాషయన నేమో తెలిసినది. జీవద్భాషయనఁగ నేమో యింక నెఱుంగవలెను. మానవునిచే నిత్యవ్యవహారముల నుపయోగింపఁబడుచుండుకతన జీవించునదియే జీవద్భాష యగును. జీవద్భాష మానవుని జీవితమును, దానియొక్క పరిణామభేదములను, జీవితరహస్యములను, మానవుల యాచారవ్యవహారములకు సంబంధించిన విశేషములను, వారికుండు నాగరకతాలక్ష్యములును సర్వము నద్దమునందువలెఁ బ్రతిఫలింపఁజేయును. అద్దమున 'మన మొగములు మనము చూచుకొని

యెన్నెన్నివిధములఁ ద్రిప్పికొనుచుఁ, జిట్లించుకొనుచు, దిద్దికొనుచు, మార్పులను జెందుచుండ నట్టి మార్పులన్నియుఁ బ్రతిఫలించుచుండునో, యట్లే మానవజీవితమునందుఁ గల్గు మార్పులన్నియుఁ, బరిణామభేదము లన్నియు, విశేషములును వికారములు నన్నియు జీవద్భాషయందుఁ బ్రతిబింబితము లగుచుండును. కావున జీవద్భాష ప్రజాజీవితదర్పణమని గ్రహింప నొప్పును.

### పురాతనభాషల మృతభాష లనఁజెల్లదు.

జీవద్భాషలకును బురాతనభాషలకును నెట్టిసంబంధ మని ప్రశ్న ముదయింపవచ్చును. కొన్నిభాషలు జీవద్భాషలనియు, మఱికొన్ని మృతభాషలనియు నాగరకసాహిత్యవేత్తలు పల్కుచున్నారు. మృతభాష లనఁగాఁ బ్రస్తుతము నిత్యవ్యవహారము లేక గ్రంథస్థములుగమాత్ర మున్న భాషలనియే వీరి యభిప్రాయము. ఈయభిప్రాయ మెంతయుఁ దప్పని మాతలంపు. ఏలనన నిత్యవ్యవహారములకుఁ గాలపరిమితియు, రూఢియు లేవు. ఎన్ని వేలసంవత్సరములు భాషకు జీవితపరిమితిగ నిర్ణయింపఁ దగునో యెవ్వరును జెప్పఁజాలరు. 'కాలో హ్యయం నిరవధిః' అని భవభూతి యుద్ఘోషించుచుండ భాషాజీవితమునకుఁ బరిమితిఁ గల్పింపఁజూచుట సాహసమే యగుంగాని యన్యము కానేరదు. అనేకవేలయేండ్లు వ్యవహారమున నుండి, విశ్రుత వాఙ్మయము గలిగియుండి, నేఁటికిని సహృదయహృదయానందముఁ గూర్పఁగల సంస్కృతము, గ్రీక్, ల్యాటిన్ మొదలగు భాషలను మృతభాష లనుటకంటెఁ బొరపాటు వేఱొకేదియు నుండదు. అదియునుంగాక—వ్యవహారమునకు రూఢిన్ని, నిర్ణ

యింపంజాలము. పండితజనులవలని వ్యవహారమా? పామరుల వలని వ్యవహారమా? సాహిత్యమునందలి వ్యవహారమా? లేక నిత్యజీవితమునందలి వ్యవహారమా? అను ప్రశ్నమునకు సమాధాన మిచ్చుట మిగులఁ గష్టము. కావునఁ బూర్వకాలము వ్యవహారములనుండి విశ్రుతవాఙ్మయముఁ గల్గి నేఁడును పండితజనులచే వ్యవహరింపఁబడుచున్న సంస్కృతాదిభాషలను మృతభాష లనుటకన్నఁ బురాతనభాష లనుట సమంజసము. వ్యవహారమును వాఙ్మయమును లేక బొత్తుగా నశించిపోయిన మాగధీపైశాచాదిభాషలకే మృతభాషలను నామము సెల్లఁ దగు. సంస్కృతాదిభాషలు పురాతనభాషలే యగు. పురాతన భాషలు సలక్షణములై యవస్థాభేదములకు లోనుగాక, మహా పర్వతములుంబోలె నచలములై, యేకస్థాయి నేలోపము లును జెందక, ఱాతఁ జెక్కఁబడిన బొమ్మలట్లాకల్పాంతచిరస్థాయి త్వము నొందును.

—{ జీవద్భాషలు జీవసూత్రబద్ధములై కించిల్లోపస హితమగు నవతచే విలసిల్లుచుండును. }—

జీవద్భాష లన్ననో జీవసూత్రబద్ధములు. జీవి యెట్లు బాల్య యౌవన కౌమారవార్ధక్యాద్యవస్థాభేదములకు లోనగు చుండునో, అట్లే జీవసూత్రబద్ధమగు నేజీవద్భాషయు ననేక విధములగు నవస్థాభేదములకు లోనగుచుండును. ఇందుల కుదాహరణము:—వివిధజనులచే నుపయోగింపఁబడు భాష వివిధరీతుల నుండి సంస్కారవిషయమున ననేకభేదములు కల్గి యుండులే యని యెఱుంగందగు. పసిపిల్లలు పలుకు ముద్దు మాటలకును, బాలురు పల్కు బిలిబిలిపల్కులకును, విద్యా

గంధములేని సామాన్యజను లాడు మోటమాటలకును, సాహిత్యసంస్కారముఁ గలిగి పదిమందిలోఁ దిరుగనేర్చిన పండితులు వాడు ప్రౌఢపదప్రయోగములకును, పండ్లూడి నోటమాట తిన్నఁగ నుచ్చరింపఁజాలక పల్కు ముదుసలిపల్కులకును సంస్కారమున నెంత యంతరమును వ్యత్యాసమును గలదో సహృదయులకే యెఱుక. జీవద్భాషయం దిట్టిసంస్కారవిభేదసూచకములగు విశేషము లెన్నియేనియుం గన్పట్టుట కవకాశము గలదు. మఱియు జీవద్భాష జీవసూత్రముల ననుసరించి లోపసహితయై యుండును. వెలుంగునకుఁ జీకటియుంబోలె, నెండకు నీడయుంబోలె గుణమునకుఁ గించిల్లోపమును దోడుగ వర్తించునని జీవరహస్యవేత్తలకు విదితము. లోపరాహిత్య మొక్క పరమేశ్వరుని విషయముననే చెల్లఁదగినదగుటచే, మానవు లెల్లరును లోపసహితులే యగుటచే లోపసహితములగు మానవులచే వ్యవహారింపంబడు జీవద్భాష లోపరహితముగాక లోపసహితమే యగు. జీవద్భాష—వివిధతరులతాశోభితమై నవనవకుసుమాలంకారభూషితమై నానావిధఫలసమృద్ధమై నిత్యశోభఁ గలిగి వెలుఁగువనముంబోలె నొప్పారుచు, మానవుని జీవితమునందు నిత్యమును బొడకట్టు విశేషములతోడను, నద్భుతములతోడను, రసప్రవృత్తులతోడను నెంతయు విలసిల్లును. అందువలననే జీవద్భాష కఠిననియమములకు లోనుగాక యథేచ్ఛముగ నడచుచుండును. కావునఁ బురాతనభాషలట్లాకల్పాంతస్థాయిత్వము జీవద్భాషలకలవడుట యసంభవము. ప్రాణికోట్ల కెట్లు జీవచ్యుతి కలుగునో యట్లే జీవద్భాషలకును గొన్నియెడలఁ జ్యుతి కల్గుట సహజము. జీవద్భాషలు జీవితసూత్రము ననుసరించి దినదినాభివృద్ధిఁ గాంచు

చుండును. నవనవాలంకారశోభల విలసిల్లుచుండును! నవతయే జీవద్భాషలకు ముఖ్యలక్షణము; నవతయే ప్రాణికింగూడ ముఖ్య లక్షణము. ప్రాణికి దినమున కొకక్రొత్తశోభ యెట్లమరునో యట్లే జీవద్భాషకును దరతరములకును శతశతాబ్దములకును నూతనశోభ లలవడును.

### పురాతనభాషలకు చిరస్థాయిత్వమే ముఖ్యలక్షణము.

పురాతనభాషల కన్ననో, యట్లుగాక యవస్థాభేదము లకును, నవతకును నెడమీాయని చిరస్థాయిత్వమే ముఖ్యలక్షణ మగుచుండును. కావున, నింతవఱకుఁ దేలిన దేమనఁగా:— పురాతనభాషలు లోపరహితములై యాకల్పాంతచిరస్థాయి త్వము నందును. జీవద్భాషలు నవతతో నొప్పాఱుచుఁ గించి ల్లోపసహితముగఁగూడ నుండును—పురాతనభాషలయొక్క సౌందర్యము లోపరాహిత్యమునందును నేకాగ్రతయందును వ్యక్తమగుచున్నది. జీవద్భాషల సౌందర్యము నవతయందును బ్రాణిసహజమగు జీవకళయందును వ్యక్తమగుచున్నది. పురా తనాధునాతనభాషలన్నిఁటికిని సౌందర్యప్రతిపాదనమే పరమా వధి. కాని—వానిచే నవలంబితములగు పద్ధతులందు మాత్రము భేదము కన్పట్టును.

### పాశ్చాత్యసాహిత్యవిమర్శనమునందలి క్లాసికల్ రోమాంటిక్ మతసిద్ధాంతములు.

ఈవిషయమునే పాశ్చాత్యసాహిత్యవిశారదులు క్లాసి కల్, రోమాంటిక్ అను సాహిత్యపద్ధతుల తారతమ్యచర్చ యందు విపులముగఁ దర్కించియున్నారు. క్లాసికల్ అను పద మునకుఁ బురాతనము అని యర్థము. రోమాంటిక్ అనుపద

మునకు నవ్యమనియే యర్థము. వారి మతప్రకారము క్లాసికల్ రోమాంటిక్ పద్ధతుల రెంటికిని సౌందర్యప్రతిపాదనమే పరమావధి. కాని—క్లాసికల్ పద్ధతి లోపరాహిత్యమును, నియమమును నాశ్రయించుకొని సౌందర్యము నాకల్పాంతస్థాయిగా నొనర్పఁ బ్రయత్నించును. రోమాంటిక్ పద్ధతి జీవసూత్రము నాధారముగఁ గొని యథేచ్ఛముగ సంచరించుచు, నియమబద్ధముగాక, జీవకళతో నవతతో నొప్పుచుండును. దేని యందము దానిది. ఈవిషయమును గ్రంథాదిని లాక్షణికరామణీయకకావ్యవిమర్శనవిభేదములఁ జర్చించుపట్టున విపులముగ విశదీకరించితిమి. కావున నేతద్విషయముపైఁ బునర్విమర్శనము చర్వితచర్వణం బగు.

**{ సంస్కృతము స్వాతంత్ర్యమును నవతను నిషేధింపలేదు. భవభూతి కాళిదాసుల మతము. }**

పురాతనభాషయగు సంస్కృతభాషకును జీవద్భాషయగు నాంధ్రమునకును నట్టిదియే సంబంధము. సంస్కృతమున లక్షణమునకును లోపరాహిత్యమునకును నెక్కువ ప్రాధాన్య మొసఁగఁబడినదనుటకు ఛందోవ్యాకరణాదులు వేదమున కుపాంగములుగ గ్రహింపఁబడుటయే యిందులకుఁ దార్కాణము. కాని—యట్టి ఛందోవ్యాకరణాది నియమబద్ధమగు సంస్కృతమునైతము కాలక్రమానుగతములగు మార్పుల నంది కొన్నియెడల నియమములు మీఱి యథేచ్ఛముగ సంచరించుచు-భవభూతి.

శ్లో॥ యే నామ కేచిదిహ నః ప్రథయన్త్యవజ్ఞాం
జానన్తి తే కిమపి తాన్ ప్రతి నైష యత్నః,

ఉత్పత్స్యతేఽస్తి మమ కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధిర్విపులా చ పృథ్వీ.

అనుశ్లోకమునఁ జెప్పినరీతిని 'నిరంకుశాః కవయః' యను సాహిత్యసూత్రమున నిర్వచింపఁబడురీతిని స్వాతంత్ర్యపథమునే త్రొక్కెను. నవత నిసర్గదూష్యము గాదనుటకుఁ గాళిదాసు మాళవికాగ్నిమిత్రమునః—

శ్లో. పురాణమిత్యేవ న సాధు సర్వం
న చాపి కావ్యం నవమిత్యవద్యం
సంతః పరీక్ష్యాన్యతరత్ భజంతే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః.

అనిచెప్పిన శ్లోకమే ప్రబలమయిన తార్కాణము;

కవికులతిలకుండగు కాళిదాసుని మత మేమనఁ 'గావ్యమున బుద్ధిమంతులు గుణదోషములనే విమర్శించి గ్రహింపఁ దగుఁగాని, 'యిది క్రొత్త, యిది ప్రాఁత' యను తర్కము చేయం దగ'దనియే. అట్లనుటలోఁ గావ్యముయొక్క నవత నిసర్గదూష్యము గానేరక యితరగుణములతోడి సాంగత్యమువలన గుణముగనో లోపముగనో పరిణమించును.

## ఆంధ్రపండితుల విపరీతవాదము.

ఈవిషయమయియే చెప్పవలసివచ్చిన దనఁగా, కొందఱు సాహిత్యవిమర్శకులు 'రసము యావత్తు సౌందర్యముయావత్తు, సంస్కృతాదిపురాతనభాషలయందు కలదుగాని యిప్పటి భాషలలో నేమున్నదయ్యా?' అందురు. వీరి యభిప్రాయము సంస్కృతాదిపురాతనభాషలయందే రసమునకుఁ దావు గల దనియు, నాంధ్ర మాదిగాఁగల భాషలకు గౌరవమును రస

ప్రతిపాదనశక్తియు లేవనియు నట్టి శక్తి యలవడవలయునన్న నీభాషలు సంస్కృతమునే యాశ్రయింపవలయుననియు, నందుచే సంస్కృతసాహిత్యనియమములును సంస్కృతకవిసమయములును నాంధ్రభాషయందు సర్వత్ర ప్రభుత వహించుననియు నయియున్నది. ఇందు సత్యము కొంచెమున్నను నసత్యము మెండుగ నున్నది. సంస్కృతమునకుఁ గల గౌరవము అందలి కావ్యముల గుణాతిశయమువలనను, భాషాప్రాశస్త్యమువలనను, గల్గినదిగాని కేవలప్రాచీనతవలనఁ గల్గినది గాదు. అదియునుంగాక సంస్కృతమున నున్న కావ్యములు సర్వమును గుణవంతము లనియు, నేలోపమును లేనివనియుఁ జెప్ప నెంతటి వెఱ్ఱియయినను సాహసింపఁడు. దేశకాలపాత్రములవలనను, రాజపోషణములవలనను ఈ రెండింటికన్నను మేలిమడుంగు లెక్కువగఁ గవుల నిస్తంద్రస్వతంత్రప్రతిభావిశేషములవలనను, సంస్కృతసాహిత్యము పేరును, వాసియుఁ గాంచినది. కాని కాలక్రమేణ సంస్కృతమును క్షీణించి కుకవుల నాశ్రయించి యాలంకారికనియమశృంఖలాబద్ధమయి స్వచ్ఛందసంచార మొనర్పంజాలక సూర్యుని వెలుఁగుఁ జూడఁజాలక శాత్రులమ్మాత్రము సూక్ష్మదృష్టిఁ గలిగి సంచరించు మార్జాలాదులభంగి స్వాతంత్ర్యతేజమును గని వెఱఁగందుచు నాలంకారికకల్పితకారాగారముల నంధకారముతోఁ జెలులాడుచుఁ దృప్తినొంది, క్షీణించి క్షీణించి, 'కరికరిభిద్గిరిగిరిభిత్కరిభిద్గిరిభి' త్తనునట్లు చిత్రకవిత్వపు మిణుగురుల మెఱుంగులకుఁ గనులు సెదఱి కవిసమయములను జీవనప్రాయములుగ గ్రహించి బ్రదుకుచు శల్యావశిష్టమయినది. నవకవితాప్రాచుర్యమున సొంపుమిగులు సంస్కృతకావ్యవధూటిని మన

వారు పాణిగ్రహణముఁ జేసికొనఁజాలక శృంఖలాబద్ధయు. శల్యావశిష్టయు నగు నీయర్వాచీనసంస్కృతకావ్యజీవచ్ఛవము లను వలచి, తత్సాంగత్యమునఁ జొక్కి మత్తిల్లి, సలక్షణముగ సంస్కృతసాహిత్యమును జదివి తద్రసమును సౌందర్యమును ననుభవించెదమనియు, నట్టి యనుభవమంతయు నాంధ్రమునఁ జొన్పించి యాంధ్రభాషను సంస్కృతమంత దానిని జేతు మనియుఁ బలుకు మన పండితుల పల్కులు ప్రగల్భమాత్ర ములై యున్నవి.

ఆంధ్రసాహిత్యమున స్వాతంత్ర్యమును నాంధ్రత్వమును నభ్యర్థనీయములుగాని సంస్కృతపారతంత్ర్యము కాదు.

ప్రపంచమున స్వాతంత్ర్యేచ్ఛ పెల్లువెల్లువగ వ్యాపించు చున్న యీకాలమున సంస్కృతపారతంత్ర్యమును నాంధ్ర భాషాభిమానులు ఇచ్ఛగింపఁజాలరు. ఆంధ్రభాషకుస్వాతంత్ర్య మును బ్రత్యేకజీవనమును గలవనియు, నాంధ్రభాషకుఁగల విల క్షణతయే యాంధ్రకవులకావ్యకల్పనల కాధారభూతమనియు, నూరక సంస్కృతపద్ధతుల ననుకరించుట బానిసలకు సహజ మగు పారతంత్ర్యమును వెలికిఁ జూపించుటయే యగుంగాని తన్మాత్రమున నాంధ్రభాషకు స్వతస్సిద్ధముగ లేని గౌరవము రాఁజాలదు. ఎవరియింట వారు నివసించుచుఁ జుట్టపక్కముల భాతి రాకపోకలు సల్పుచున్నప్పుడే చుట్టరికంపు పెంపు సొంపునింపుఁగాని యూరక యొకయింటివారు వేఱొకరియింట దేబెతిండిఁ దినుచు నూడిగము సేయుచు నుండ నిట్టి చుట్టరి కము ముచ్చటగను సౌఖ్యప్రదముగను నుండఁజాలదుగదా!

అట్లే ఆంధ్రభాషయు స్వతంత్రశక్తిఁ గలిగి ప్రత్యేకవిలక్షణము లతో సహజసౌందర్యముతో నొప్పిన నొప్పుగుఁగాని యూరక సంస్కృతమున కూడిగము సలుపుచు నామె యొసఁగు దానములనుగాని, యెరవుసొమ్ములనుగాని, ధరించి కులికినచో నట్టి యెరవుసొమ్ములన్నియు బరువుచేటే యగుంగాని యాంధ్రము నకు వన్నెయు వాసియుఁ దేఁజాలవు. ఆంధ్రమునకుఁ బ్రత్యేక విలక్షణత గలదు. ఆంధ్రులకుఁ బ్రత్యేకచరిత్ర గలదు. ప్రత్యేక నాగరికమును గలదు. భారతీయయువతులలో నాంధ్రయువతి ప్రత్యేకసౌందర్యముతోను, ప్రత్యేకాలంకరములతోను శోభిల్లుచుండును. ఆంధ్రవీరుల కార్యోత్సాహమును పరాక్రమమును స్వాతంత్ర్యానురక్తియు జగత్ప్రసిద్ధములు. ఇఁక నాంధ్ర దేశమునందలి పుణ్యతీర్థములును, దివ్యస్థలములును, బ్రకృతి శోభావిశేషంబులును, నాంధ్రనగరముల వైభవమును, ఖండాంతరవాసుల పొగడ్తలఁ గూడ నందినవి. అట్టిచో నిన్నింటఁ బ్రాశస్త్యము వహించిన యాంధ్రుల భాషమాత్రము పారతంత్ర్యావస్థ యేల ననుభవింపవలయునో దురూహ్యమవు చున్నది. భారతదేశమం దున్న వివిధజాతులకుఁ బరస్పరసంబంధమును, సంయోగమును గూర్చుచున్నది సంస్కృతభాషయే యగుంగాక! ప్రాచీనభారతీయనాగరికత యెల్ల సంస్కృతము నంద యిమిడియుండుంగాక, అంతమాత్రముననే యాంధ్రత్వము నశింపవలయు ననుట పొసంగని మతము. ఆంధ్రుల సహజప్రతిభ నేఁడు భాషాముఖమున వ్యాప్తి నందుట యెల్లరకును నభ్యర్థనీయమే. ఈభావమును బురస్కరించుకొనియే— అనఁగా నాంధ్రకావ్యములందలి యాంధ్రత్వమును బట్టియే యాంధ్రసాహిత్యముయొక్క బాగోగులను విమర్శింతము.

## త్రివిధాంధ్రకవులు ౧. స్వతంత్రాంధ్రకవులు.

ఆంధ్రకవులు ముత్తెగలకుం జేరుదురు ఎట్లనఁగా భావముల విషయమునను, భావ విషయమునను సంస్కృతపారతంత్ర్యము నంగీకరించుట కొల్లక సంపూర్ణాంధ్రవిలక్షణత్వమునే ప్రతిపాదింపఁజేసిన యాంధ్రకవులును, భావముల విషయమునను, భాషావిషయమునను, సంపూర్ణముగ సంస్కృతపారతంత్ర్యము నంగీకరించి యాంధ్రస్వాతంత్ర్యము 'నాఁకటికింగొనిపోయి' కర్ణాటకిరాటకీచకుల'కమ్మినవారును, భాషావిషయమునఁగాని భావముల విషయమునఁగాని యేదేని యొకవిషయమున నాంధ్రత్వమును బోషించుచు వేఱొకవిషయమున సంస్కృతసాహాయ్యము నంగీకరించి సమానప్రతిపత్తిఁ గల బంధువులభాతి నాంధ్రమునకును సంస్కృతమునకును బాంధవ్యముల గల్పించినవారును నను మూఁడుతెగలకుం జెంది యున్నారు. యక్షగానములను జంగముకథలను పదములను ఏలపాటలును మొదలగు ప్రత్యేకాంధ్రవిలక్షణతను సూచించు కావ్యముల రచించినకవులు మన కెంతయు వంద్యులు. వీరి వలననే యాంధ్రత్వము నేఁటివఱకును జీవించి నశింపక, యేకధారగాఁ బ్రవహించుచు దినదినాభివృద్ధిఁ గాంచుచున్నది. నేఁటివఱకును బొబ్బిలికథయును, కాంభోజరాజుకథయును, బాలనాగమ్మకథయును, పలనాఁటివీరచరిత్రమును, ధర్మాంగదచరిత్రమును, కామమ్మకథయును మొదలగునవి యాంధ్రజనుల హృదయముల వశముఁ గావించుకొనురీతిని గావ్యప్రబంధనాటకాదులు గావించుకొనఁజాలవు. నేఁటివఱకును యక్షగానములును వీథిభాగవతములును ఆంధ్రజనులకు నమితా

నందాద్భుతరసములఁ గూర్చును. ఆంధ్రులకుఁ గల ప్రత్యేక నాగరకతాచిహ్నము లన్నియు జాతివిలక్షణము లన్నియు నీ కథలయందును, వీథినాటకములయందును, ఏలపాటలయందును, భక్తిగీతములయందును, పదపవాంద్ర పోకిరిపదములయందును, కోలాటపుఁ బాటలయందును, వినోదకథావళులందును వ్యక్తమగు రీతిని సంస్కృతసాహిత్యమర్యాదల ననుసరించి రచియింపఁబడిన కావ్యప్రబంధాదులయందు వ్యక్తము గాదు. పై గ్రంథములయందుఁ బెక్కెడల సంస్కారచ్యుతిఁ గల్గెడుఁ గాక, లోపము లుండుఁగాక, ఛందోభంగ మొదవెడుఁగాక, అట్టి లోపము లన్నియు, సంస్కారచ్యుతి యెల్లను, ఛందోభంగము లెల్లను,గుణాధిక్యముక్రింద దీపముక్రింది నీడయుంబోలె, వంకరతలపాగఁ జుట్టుకొని ముదుకబట్టలు కట్టుకొని సంస్కారరహితములగు సంభాషణములు కావించుచు మోటుమానిసిచందమున నరుగుదెంచు రెడ్డివీరుని హృదయాంతరాళమున నడఁగి రగులుచుండు ప్రతాపాగ్నియుంబోలె, తాళగుట్టలయొక్క తీరు తెన్ను లేని సుందరాకారముంబోలె, శ్రుతియు, లయయు, రాగమును లేకపోయినను నవ్యక్తమధురమయిన పక్షులకలకలనినాదమునుంబోలె, నవ్యాజానందమును గూర్పంజాలును.

## ౨. సంస్కృతస్నేహాభిలాషులు.

ఇఁకఁ బురాణాదిగ్రంథరచయితలును గొందఱు కావ్యరచయితలును భాషావిషయముననో లేక భావముల విషయముననో యేదేనియొక్కవిషయముననే సంస్కృతసాహాయ్యమునుఁ గొని యాంధ్రమునకును సంస్కృతమునకును సరిసమానప్రతి

పత్తిఁగలసంబంధబాంధవ్యములను గల్పించి యాంధ్రమునకు నలువురితో రాకపోకలు సేర్పఱచిరి. ఇందులకు భారతమును రామాయణమును, భాగవతమును మిగిలిన పురాణాదులును, జక్కని యాంధ్రభాషను ననువదించిన తిక్కనభాస్కరయెఱ్ఱనపోతనాదులును, దమ ప్రబంధముల నచ్చటచ్చట నాంధ్ర నాగరకతావాసనలఁ జొప్పించి యాంధ్రత్వమును బోషించిన జక్కననారాయణామాత్య పెద్దనతిమ్మనరామకృష్ణాదులును మన వందనములకుం బాత్రులు. వీరు కొండొకయెడ నాంధ్రదేశమునకు సంబంధించిన కథలనుగాని యాంధ్రభాషామర్యాదల సూచించు నానుడులగాని చక్కఁగాఁ గావ్యముల ననువదించి స్తుతిపాత్రు లయిరి.

## 3. సంస్కృతదాసులు.

మూఁడవతెగకుం జేరిన ప్రబంధకవులు ఆంధ్రసామ్రాజ్యక్షీణదశయందుఁ గావ్యరచనకుఁ గడంగినవారగుటచే స్వాతంత్ర్యబీజము లన్నియు నశించినకతనఁ బారతంత్ర్యమునే శరణ్యముగఁగని బ్రదుకుచు సాహిత్యమునుగూడ సంస్కృత కావ్యనియమములను కవిసమయములను సంస్కృతభాషామర్యాదలను ననువదించి నే నాంధ్రుఁడ నని చెప్పుకొనుట గౌరవలోపమని భావించినకతన నేమోగాని యాంధ్రత్వమును నాంధ్రజాతిలక్షణములను నాంధ్రుల నాగరకతావైలక్షణ్యమును గావ్యములఁ బొందుపఱుపక క్షీణదశనొందిన సంస్కృత వాఙ్మయమువందలి యస్వతంత్రాధమకావ్యములనే లక్ష్యములుగఁ గయికొని, 'బోఁగియు బోగియు రాఁచికొని బూది రాల్చి'నట్టుల నీరసకావ్యములను మహాప్రబంధము లనుపేరిటఁ

గుప్పలుతిప్పలుగ నాంధ్రసాహిత్యసీమను వెదఁజల్లినారు. అవి రేఁగుకంపలుంబోలె నాంధ్రసాహిత్యసీమల నల్లుకొని ఆంధ్రభాషావ్యవసాయమును జేసి కావ్యఫలములఁ గామించనెంచు వారికి తీఱరానికష్టములఁ గల్గించుచున్నవి.

—{ ఆంధ్రత్వమే యాంధ్రసాహిత్యమునకు జీవమును గౌరవమును నొసంగును. }—

కావునఁ బ్రస్తుత మాంధ్రసాహితీశ్రేయోఽభిలాషులకు ముఖ్యకర్తవ్య మేమనఁ దరతరములనుండియు, శతశతాబ్దములనుండియు నిరంతరధారగఁ బ్రవహించుచున్న యాంధ్రనాగరకతాస్రవంతిని నాంధ్రసాహిత్యసీమను బ్రవహింపఁజేసి తత్ప్రవాహజలసాహాయ్యమున నాంధ్రసాహిత్యసీమను జక్కఁగ వ్యవసాయముఁ గావించి యాంధ్రులకుఁ బుష్టియుఁ దుష్టియు, శాంతియు, దాంతియు, వన్నెయు, వాసియుఁ దెచ్చు కావ్యఫలములఁ గాయించుటయే యగును. ఆంధ్రసాహిత్యసీమను నాఁటుకొని పెరిఁగి పెద్దవిగాఁగల విజాతీయకావ్యతరులతాదుల నాటించి వానిచే సజాతీయవిజాతీయ సారసమృద్ధములగు కావ్యఫలములఁ గాయించుటయును మేలగును. ఇందులకు నన్యభాషాసంస్కారమును నన్యసాహిత్య పరిచయమును నవసరములే యగును. కాని యట్టిది యెల్లను నాంధ్రత్వమునకు వైరుధ్యమును, మూలచ్ఛేదమును, వినాశమును, నాపాదింపక, మీఁదుమిక్కిలి యాంధ్రత్వమునుబోషించి యాంధ్రసాహిత్యమునకు నిఖిలసాహిత్యప్రపంచమున నితరసాహిత్యములతోఁబాటు సమానస్థానముఁగూర్చి యాంధ్రులకు నలుగురితో సంబంధబాంధవ్యములను రాకపోకలను గల్పింపఁ

దగును. అట్టిసంబంధబాంధవ్యములును రాకపోకలును ఆంధ్రులును ఆంధ్రసాహిత్యమును దమ స్వాతంత్ర్యముఁ బోషించుకొను నంతకాలమును బ్రవర్ధిల్లునేగాని, పారతంత్ర్యావస్థను వర్ధిల్ల నేరవు. కావున నాంధ్రత్వమే యాంధ్రసాహిత్యమునకు జీవగఱ్ఱవంటిది. అట్టి జీవగఱ్ఱ నూతఁగాఁ గొనక నడచు నాంధ్రసాహిత్యము కాలానుగతములుగ సంప్రాప్తించు నొడిదుడుకులకును నెగుడుదిగుడులకును తలవ్రొగ్గుచుఁ గాలొగ్గుచు నడచుచు సహజమగు రాజఠీవిని, నొయారంపు నడలఁ గోల్పోయి వక్రగతిని కుంటిముదుసలిరీతిఁ జరింపవలసివచ్చును. ఆంధ్రత్వమే ప్రధానలక్షణముగాఁ గల యాంధ్రసాహిత్యవధూటి నిజవైలక్షణ్యముతో సహజసౌందర్యముతో నచ్చంపు ఠీవితో యథేచ్ఛముగ సంచరించుచు నిఖిలసాహితీకల్యాణమంటపమున నుచితస్థానము నలంకరించును గావుత!!!

ఓం తత్సత్.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1931.